# ఇలియాస్ జ్యోత్స్న



# కోడాల కోడాల కొడుకు పెళ్ళామా




# కోడాల కోడాల కొడుకు పెళ్ళాము

(ఆంధ్రభూమి వారపత్రిక సీరియల్)

## యాస్ జ్యోత్స్న




నవజ్యోతి పబ్లికేషన్స్
ఏలూరు రోడ్ విజయవాడ 2




# KOODAALA KOODAALA - KODUKU PELLAMA

(Serialised in Andhra Bhoomi Weekly)

By

ILIAS JYOSTNA

First Edition :
May'91.

894 : 8133

Printers :
Progressive Printers,
VIJAYAWADA - 520 002

Cover Design
T. V. Prasad
VIJAYAWADA-520 002.

PUBLISHERS :

NAVAJYOTHI PUBLICATIO

ELURU ROAD : VIJAYAWADA - 520 002

Price :
Rs. [illegible]-00

కోడా

యుగ

స్తున్న సమయ
సిన ఒక మహ
కి సారథ్యం వహి

వ్యక్తి శ్రేయస్సుకు
సంక్షేమం దాసోహమంటున్న

కర్కశత్వం, కాఠిన్యం, దౌ
కత్వం, పంచశిఖలై మారణ హోమ
కరుణ, భూతదయ, స్నేహం, ప్రేమ
కొనసాగుతుంటే...

అప్పుడు...ప్రకృతి విలయతాండవం చేస్తుంది... సృష్టి
గీతాన్ని ఆలపించడానికి స్వరాన్ని శృతిచేసుకుంటుంది... మృత్యుఘో
ఒక వైపు...మంగళవాద్యాలు ఒక వైపు। జీవిత చరమఘట్టమొక వైపు..
నవ్యజీవితానికి నాందీప్రస్తావనమరొక వైపు.

కట్టెల కంకితమైపోయిన కట్టెనుంచి లేస్తున్న పొగలొక వైపు ...
రెండు జీవితాలనేకం చేసేవివాహవేదిక నించి లేస్తున్న అగ్నిశిఖలొక
వైపు। అక్కడొజీవితం ముగిసిపోయింది ... ఇక్కడ నూతన జీవితం
ప్రారంభమైంది।

"విష్ యూ ఎ హ్యాపీ మారీడ్ లైఫ్!" "థ్యాంక్యూ శ్యాం!"
అన్నాడు పవన్ తన మిత్రుడు శ్యాంకు కరచాలనం చేస్తూ. "ఖండాలా

...లు

...న్నాడు

...ాడు పవన్.

... చూసి చిరునవ్వు

..."

...తూ సమాధానం ఇచ్చింది

...ంటే హాయిగా ఊపిరిపీల్చుకుంది

... జీవితంలో ఇకమీదట అనుక్షణం

... భర్తగా పొందటం ఎంత అదృ

... భవిష్యత్తులోకి అడుగుపెడ్తోంది తను.

...పెట్టుకుని నిశ్చింతగా కళ్ళుమూసుకుంది

...యి దాటాక కారువేగం మరింత పెంచాడు పవన్.

...ధ్యాహ్నం పన్నెండు గంటలకల్లా ఖండాలా చేరుకుంటాం."

...మీటర్‌కేసి చూసి చిన్నగా నవ్వింది స్నిగ్ధ-

"ఏమిటీ తొందర?"

"ఖండాలా చేరితేనే కదా మన హనీమూన్ ప్రారంభమయ్యేది." అన్నాడు పవన్.

స్నిగ్ధ బుగ్గలు ఎరుపెక్కాయి-

"పొద్దున రిజిస్ట్రార్ ఆఫీసులో సంతకాలు పెట్టేపుడు నెర్వస్‌గా ఉన్నావు కదూ?" అడిగిందామె కాసేపాగి.

"జీవితంలో మొట్టమొదటిసారిగా నాకంటూ ఏదైనా కావాలని కోరుకున్నాను. నా కోరిక ఫలించక జీవితాంతం నీకు దూరంగా ఉండిపోతానేమోనని చివరిదాకా భయపడుతూనే ఉన్నాను...

"నాకు మాత్రం మనపెళ్ళి తప్పకుండా జరుగుతుందని తెలుసు." అంది స్నిగ్ధ పవన్ చేతిని ప్రేమగా పట్టుకుంటూ.

"స్నిగ్ధా!"

"ఊఁ"

"ఖండాలా నించి తిరిగివచ్చాక నేను హైదరాబాదుకి బయల్దేరాలి. అవకాశం చూసుకుని అమ్మకు మన విషయం చెప్తాను..." అంటూ ఆగిపోయాడు పవన్...

స్నిగ్ధ మొహంలో చోటుచేసుకుంటున్న దిగులు గమనించి అన్నాడతను— "అదేమిటీ అపుడే అలా అయిపోయావు. నేనిప్పటికిపుడు హైదరాబాదుకి వెళ్ళిపోతున్నావా?...మనం ఈ కొన్నిరోజులు ఖండాలాలో ఎంత హాయిగా గడపొచ్చొ ఆలోచించు డియర్! ఛీర్ అప్..."

ముందుకు వొంగి టేప్‌రికార్డర్ ఆన్ చేసాడు పవన్.

కారు స్పీకరులో గులాం అలీ గజల్ వినిపించసాగింది.

కిటికీలోంచి బయటకు చూస్తూ కూర్చుంది స్నిగ్ధ.

దూరంగా కొండలు కనిపిస్తున్నాయి. ఖండాలా చేరుకోవాలంటే ఆ కొండలమీదుగా ఘాట్‌రోడ్డులో వెళ్ళాలి. ఖండాలా అందమయిన హాలిడే రిసార్ట్. సీనరీ బావుంటుందని తరచూ హిందీసినిమా షూటింగ్‌లు జరుగుతుంటాయి అక్కడ.

శ్యాంసుందర్ ఏర్పాటుచేసిన కాటేజిలో తనూ పవన్ ఒంటరిగా ఉండబోతున్నారు....ఆ ఆలోచనకే మనసు పులకరించింది స్నిగ్ధకి....!

కారు సడన్‌గా బ్రేక్ పడటంతో ఉలిక్కిపడిందామె.

"ఏ...ఏమయింది?"

ఏమో అని పెదవి విరిచి సెల్ఫ్‌లాగాడు పవన్.

కారు స్టార్ట్ కాలేదు...

అలా రెండు మూడుసార్లు సెల్ఫ్‌లాగినా కారుస్టార్ట్ కాకపోవటంతో తలుపుతెరుచుకుని కారుదిగాడు పవన్. అతడు కారుబోనెట్ కేసి నడుస్తుంటే స్నిగ్ధ కూడా కిందకు దిగింది.

పవన్ బోనెట్ తెరవగానే దట్టమయిన ఆవిరిపైకి లేచింది. రెండడు

గులు వెనక్కు వేసి పొగలు కక్కుతున్న ఇంజన్‌కేసి చూస్తూ నిలబడ్డాడ తను.

"రేడియేటర్‌లో నీళ్ళన్నీ ఇగిరిపోయాయి...ఈ అడవిలో నీళ్ళెక్కడ దొరుకుతాయి?" అంటూ చుట్టూ కలయచూసాడు.

స్నిగ్ధ కూడా పరిసరాలు చూస్తూ నిలబడింది.

"దగ్గర్లో చెరువొకటుండాలి!" అంది చటుక్కున.

"చెరువా!?"

"ఈరోడ్డు మీద తిన్నగా వెళ్తే...కుడివైపుకి..." అంది స్నిగ్ధ అస్పష్టంగా.

ఒక్క క్షణం ఆమెకేసి అదోలా చూసి అప్రయత్నంగా ముందుకి కదిలాడు పవన్.

అతడు నడచివెళ్తున్న వైపు చూస్తూ నిలబడింది స్నిగ్ధ...షుమారు వందగజాలు నడచివెళ్ళి రోడ్డుమలుపు దగ్గరాగి ముందుకి చూసాడు పవన్. అంతలో గిర్రున వెనక్కి తిరిగి పరుగులాంటి నడకతో స్నిగ్ధను చేరుకున్నాడు.

"యూ ఆర్ రైట్! అక్కడో చెరువుంది!" అని కారుడిక్కీ తెరచి అందులోని ఖాళీ పెట్రోల్ క్యాన్ అందుకున్నాడు.

"త్వరగా వచ్చేస్తావు కదూ?" అడిగింది స్నిగ్ధ తనని దాటి వెళ్తున్న పవన్‌ని.

"ఎంతో దూరంలేదు...పది పదిహేను నిమిషాల్లో వచ్చేస్తాను..." అని గబగబ మూడు అడుగులు ముందుకు వేసి ఠక్కున ఆగిపోయాడు.

వెనక్కి తిరిగి స్నిగ్ధకేసి ఆశ్చర్యంగా చూసాడు-

"అద్సరేకానీ...దగ్గర్లో చెరువుందని ఎలా తెలుసు నీకు?"

అతడి ప్రశ్న అర్థంకానట్టు అయోమయంగా చూసింది స్నిగ్ధ.

"ఇంతకుముందు ఎప్పుడయినా ఇక్కడికి వచ్చావా?" రెట్టిస్తున్నట్టు అడిగాడు.

లేదన్నట్టు తల అడ్డంగా తిప్పింది స్నిగ్ధ.

"మరింత కరెక్టుగా ఎలా చెప్పగలిగావు?" చిరునవ్వుతో అడిగాడు పవన్.

ఏమో అన్నట్టు పెదవి విరిచిందామె.

"ఫన్నీగర్ల్!" అంటూ ఆమె భుజంమీద తట్టి వెనక్కి మళ్ళాడ తను.

పవన్ వెళ్ళాక కారుకానుకుని నిలబడింది స్నిగ్ధ. ఎండ ఎక్కువగా ఉంది. కానీ సన్నగా గాలివీస్తోందని కార్లో కూర్చోకుండా బయటే నిల బడిందామె.

ఏదో ఆలోచిస్తూ రోడ్డుకి ఎడమవైపున్న బంజరు పొలంకేసి చూసింది స్నిగ్ధ.

బంజరుపొలం నడుమ పూర్తిగా ఎండిపోయిన దేవదారు వృక్ష మొకటి కనబడింది.

ఆ ఎండిన మానుకొమ్మమీద నిశ్చలంగా కూర్చుని ఉంది ఒక రాబందు!!

దుఃఖంలో కృశించిపోయినట్టున్న దేవదారు వృక్షం మీద రాబందు అలా కూర్చొని ఉండటం చూసిన స్నిగ్ధమనసులో ఆలోచన ఒకటి మెద లింది...! వెంటనే కారువెనక తలుపుతీసి ఎయిర్ బ్యాగ్‌లోంచి తన కేమెరా బయటకు తీసింది.

ఈఫోటో తన అల్బమ్‌లో వెరైటీసబ్జెక్ట్ అవుతుందనుకుంటూ కెమెరా ఫోకస్ చేసింది.

ఊహూఁ...అక్కడ్నించి కంపోసింగ్ కుదరడంలేదు. దగ్గర్నించి "లో" ఆంగిల్ ప్రయత్నించాలి అనుకుంటూ రోడ్డుదిగి పొలంలోంచి ముందుకి నడిచింది-

చెట్టు దగ్గరకు చేరుకుని మంచి ఆంగిల్ సెలెక్ట్‌చేసి కెమెరా 'క్లిక్' చేసి "బ్యూటిఫుల్" అనుకుంది స్నిగ్ధ.

కెమెరా 'క్లిక్' అనడం తనకు వినిపించిందన్నట్టు తల వంకరగా తిప్పి స్నిగ్ధకేసి చూసింది రాబందు.

వెంటనే ఆటోమాటిక్ వైండింగ్‌చేసి మళ్ళీ క్లిక్‌చేసింది స్నిగ్ధ.

రెక్కలు టపటపలాడిస్తూ పైకి ఎగిరింది రాబందు.

అలా పైకి ఎగిరిన రాబందు చెట్టు చుట్టూ తిరిగి స్నిగ్ధమీదకు వచ్చింది.

చిన్నగా కేక పెట్టి కిందకు వొంగిందామె.

నెమ్మదిగా లేస్తూ రాబందు ఎగిరిన వైపు చూడబోయింది స్నిగ్ధ. కానీ...

రాబందు చుట్టూఎగిరి మళ్ళీ ఆమె మీదకే వచ్చింది తిరిగి.

ఈసారి కూడా తప్పించుకోబోయిందికానీ ఆమె భుజానికి రాసుకుంటూ ఎగిరిందా రాబందు.

కెవ్వున అరచి మొహం పక్కకి తిప్పుకుందామె.

రాబందు తనని అటాక్ చేస్తోంది!!

మళ్ళీ ఆ రాబందు తనకేసి వస్తుందేమోనని భయంగా చూసింది స్నిగ్ధ...

కానీ, రాబందు వెనక్కి తిరగలేదు.

పైట సర్దుకుంటూ లేచి నిలబడి ఎగిరిపోతున్న రాబందుకేసి చూసింది స్నిగ్ధ.

రాబందులు పిరికివి...ఎవర్నీ అటాక్ చేయవు...మరి ఈ రాబందు ఇలా ఎందుకు చేస్తోంది?

అప్రయత్నంగా కెమెరా పైకెత్తి ఎగిరిపోతున్న రాబందుకేసి ఫోకస్ చేసి మరోసారి క్లిక్ చేసింది స్నిగ్ధ.

అపుడు కనబడిందామెకు దూరంగా ఉన్నగుట్ట.

గుట్టమీద పాడుబడిన ఇల్లొకటి ఉంది. రాబందు ఎగిరి వెళ్ళింది అటు వైపే.

స్నిగ్ధ నిలబడ్డచోటునించి గుట్ట రెండు ఫర్లాంగులు దూరం ఉండవచ్చు...

పవన్ వచ్చేలోగా ఒకసారి అక్కడదాకా వెళ్ళివస్తే?

నెమ్మదిగా ముందుకి కదిలింది స్నిగ్ధ...

గుట్ట దగ్గరకెళ్తుంటే దానిపైనున్న ఇల్లు చిన్నదికాదని పెద్దభవనమని తెలిసింది.

అలాంటి భవనం ఆ ప్రాంతంలో ఎవరు కట్టించారో? ఎందుకు కట్టించారో? అందులో ఎవరుండేవారో.

ఆలోచిస్తూ పొలంలోంచి ముందుకి నడవసాగింది స్నిగ్ధ. అలా ఎంతసేపు నడిచిందో పట్టించుకోలేదు. ఎండతీవ్రతని కూడా గమనించలేదు.

పొలందాటి గుట్టదగ్గరం చేరుకుని తలపైకెత్తి చూసింది. భవనం ఒకవైపునించి పూర్తిగా కూలిపోయి ఉంది. బీటలుపడ్డ గోడల్లోంచి చిన్న చిన్న చెట్లు పెరిగి ఉన్నాయి.

ఆ భవనంలోపల ఏముందో చూడాలన్న కుతూహలం కల్గిందామెకు...కాని పైకి వెళ్ళేముందు రెండుమూడు మంచి ఆంగిల్స్ నించి ఫోటోలుతీయాలి...లైటింగ్ పర్ఫెక్ట్‌గా ఉంది. రిజల్టు బావుంటే ఫోటోగ్రఫీ కాంపిటీషన్‌కి పనికి వస్తుంది.

కెమెరా వ్యూఫైండర్‌లో చూస్తూ జాగ్రత్తగా ఫోకస్‌చేసి క్లిక్ చేసింది స్నిగ్ధ.

సరిగ్గా కెమెరా క్లిక్ చేసినపుడు వ్యూఫైండర్‌లో ఒక గమ్మత్తు జరిగింది!!

శిధిలంలా ఉన్న ఆ భవనం...

ఒక్కక్షణం...ఒకే ఒక్క క్షణం...

జీవంతో కళకళలాడుతున్నట్టు కనిపించింది!!

కొత్తగా కట్టించిన రాజమహలులా మెరిసిపోయింది!!

బీటలు లేవు...కూలిన గోడలులేవు!!

ఇల్యూషన్! 'మిథ్యామకి!'

అంతే!! అంతవరకూ ఎండలోపడి నడుస్తూ గుట్టమీదున్న ఆ భవనం గురించి ఏవేవో ఊహించుకుంది తను. ఒకపుడు ఆ భవనం ఎంత వైభవంగా ఉండేదో అనుకుంది. ఆ ఆలోచనలే ఈ భ్రాంతిని కలిగించాయి. మెంటల్ ట్రిక్!

నవ్వుకుంటూ గుట్టపక్కకి వెళ్తూ కెమెరా ఎక్స్‌పోజర్ చెక్ చేసుకుని వ్యూఫైండర్‌లోకి చూస్తూ మళ్ళీ క్లిక్ చేసింది.

ఓ గాడ్!! ఈసారి మళ్ళీ!!

చటుక్కున తలెత్తి పైకి చూసింది స్నిగ్ధ.

ఎదురుగా పాడుబడ్డ భవనం మాత్రమే ఉంది?

కానీ...

ఒక్కక్షణం క్రితం కేమెరా క్లిక్‌చేసినపుడు రంగువెలసిన గోడల స్థానంలో లేతాకుపచ్చరంగుగోడలు...నగిషీ చేసిన ద్వారబంధాలు, మిల మిల మెరుస్తున్న గాజుతలుపుల కిటికీలు ప్రస్ఫుటంగా చూసింది తను.

ఇది కూడా మెంటల్ ట్రిక్కేనా?

కెమెరా పైకెత్తి వ్యూఫైండర్‌లోకి చూస్తూ మళ్ళీ క్లిక్‌చేసింది స్నిగ్ధ.

ఆశ్చర్యం!!

ఈసారి కిటికీదగ్గర ఎవరో నిలబడి తనని రమ్మంటున్నట్టుగా భ్రమ కలిగింది.

ఖచ్చితంగా అది భ్రమే...

లేదా...గతాన్ని చూపించే అద్భుతమైనశక్తి ఏదో తన కెమెరాకి ఉండి ఉండాలి.

కెమెరాకేసి పరిశీలనగా చూసిందామె.

నో! ఇంపాసిబుల్! ఆ కెమెరాతో లోగడ ఎన్నో ఫోటోగ్రాఫ్స్ తీసింది తను. పైగా ఫోటోగ్రఫీలో ఇల్యూషన్‌కి స్థానం లేదు...తనకు ఫోటోగ్రఫీలో కేవలం ఆసక్తి ఉండడమే కాదు... ప్రొఫెషనల్ ఫోటోగ్రాఫర్‌లా గుర్తింపు కూడా ఉంది.

ఆ మహత్మ్యం కెమెరాలో లేదు!...

గుట్టమీదున్న భవనంలో ఏదో ఉంది...పైకి వెళ్ళి ఒకసారి చూస్తే?

వెనక్కి తిరిగి రోడ్‌కేసి దృష్టి సారించింది స్నిగ్ధ. కారు దగ్గర పవన్ కనబడలేదు...గుడ్! పవన్ నీళ్ళు తీసుకుని వచ్చేలోగా ఒకసారి గుట్టమీదకు వెళ్ళి రావచ్చు తను.

ఎదురుగా ఉన్న కాలిబాట గుట్టమీదకు వెళ్ళే ఎగుడుదిగుడు మెట్ల దాకా ఉంది. గబగబ అటుకేసి నడుస్తుంటే కాలికి చిన్నరాయి తగిలి ముందుకి తూలి వెంటనే తమాయించుకుంది స్నిగ్ధ...

ఎందుకో కళ్ళు తిరిగినట్టనిపించి మెట్లమీదే కూర్చుని కళ్ళుమూసుకుంది.

నెమ్మదిగా లేచి...

మెట్లెక్కసాగింది.

మెట్లెక్కుతుంటే ఎందుకో అనిపించింది.

తను అక్కడికి రావడం అది మొదటిసారికాదని!

అంతకు ముందు తనిక్కడికి ఎన్నోసార్లు వచ్చింది.

ఆ ఆలోచన విచిత్రంగాతోచింది? నిజానికి ఆమె ఎపుడూ అక్కడికి రాలేదు.

నడకవేగం పెంచి గబగబ మెట్లన్నీ ఎక్కి భవనం గుమ్మందగ్గ రాగిపోయింది స్నిగ్ధ.

లోపలికి తొంగిచూస్తే అంతా చీకటి! ... బయట బాగా ఎండగా ఉండటంవల్ల కాబోలు భవనంలోపల అంతాచీకటిగా ఉన్నట్టనిపిస్తోంది... చీకటికి అలవాటు పడాలని ఒక్కసారి కళ్ళు గట్టిగా మూసుకుని భవనంలోకి అడుగుపెట్టింది.

అలా అడుగు పెట్టగానే... ఆమె నాసికాపుటాలకి దుర్భరమైన దుర్గంధం తాకింది. ఒక్కడుగు వెనక్కివేసి తమాయించుకుంది స్నిగ్ధ... చీరకొంగు ముక్కుకి అడ్డంపెట్టుకుని కాసేపు అక్కడే నిలబడిపోయింది.

ఏమిటా దుర్వాసన? శవాలు కుళ్ళుతున్నట్టు?

తను నిలబడ్డ గదిని కలయచూసింది స్నిగ్ధ...మసకచీకట్లో సరిగ్గా కనబడటంలేదు కానీ, అదో పెద్ద హాలు అని అర్థమయింది. నెమ్మదిగా అడుగు ముందుకువేసింది...ఆమె అడుగుల చప్పుడు హాల్లో విచిత్రంగా ప్రతిధ్వనించింది.

ఆ హాలు మూలలో అస్పష్టంగా చిన్నగుట్ట అగుపడిందామెకు ... దాని కవతల వైపునించి వెలుతురు।

సందేహిస్తూ అటుకేసి నడిచింది స్నిగ్ధ.

దగ్గరకెళ్ళాక అర్థమయింది. ఆ గట్టు కవతల కిందకువెళ్ళే మెట్లున్నాయని. వెలుతురు అక్కడ్నించే వస్తోంది.

అంటే?

హాలుకింద భాగంలో ఎవరయినా ఉన్నారా? కాకపోతే పైన అంత చీకటిగా ఉన్నప్పుడు కిందనించి వెలుతురు ఎలా వస్తోంది?

స్నిగ్ధ ఆ గట్టుకేసి కదిలి వెళ్తుంటే...

'కిచు...కీచు!' అని అరుస్తూ రెండు గబ్బిలాలు ఆమె చెంపను తాకి పైకి ఎగిరాయి।

చిన్నగా అరచి అరచేతులతో మొహం కప్పుకుని వెనక్కి తగ్గింది. స్నిగ్ధ. చెంపమీద గబ్బిలాలు తాకినచోట మంటపుడుతుంటే తడిమి చూసుకుంది. చెంప గీసుకుని పోవడంతో కొంచెం రక్తం కారుతోంది.

చీరకొంగుతో చెంపవత్తుకుంటూ మెట్లకిందకు చూసింది స్నిగ్ధ... కిందఎవరో ఉన్నారన్న అనుమానం బలపడింది ఆమె మనసులో.

ఇరుకుగా ఉన్న ఆ రాతిమెట్లు దిగి నెమ్మదిగా కిదింకి చేరుకుందామె.

విశాలమయిన భూగృహమది।

భూగృహం నడుమ పదడుగుల విగ్రహం ఒకటి ప్రతిష్టించి ఉంది.

ఎత్తయిన గబ్బిలం ఆకారం మోకారిల్లి కూర్చుంటే దాని మీద సవారీ చేస్తున్న గూనివాడి శిలావిగ్రహం అది। ఆ గూనివాడు నగ్నంగా ఉన్నాడు।...కుడిచేతిలో విషసర్పం ఒకటి వేలాడుతోంది.

మరో చేతిలో రక్తం కారుతున్న మనిషి తల।

కన్నార్పకుండా ఆ విగ్రహాన్నే చూస్తూ నిలబడిపోయింది స్నిగ్ధ. అలాంటివింత విగ్రహాన్ని అంతకు ముందెపుడు చూడలేదామె. అయినా... విగ్రహం మొహంలోకి చూస్తుంటే కొత్తగాలేదు. విగ్రహం కళ్ళు తనకేసే చూస్తున్నట్టున్నాయి.

"దర్శనానికి వచ్చావు కదూ!"

ఉలిక్కిపడి వెనక్కి తిరిగింది స్నిగ్ధ...

తనకు రెండే రెండడుగుల దూరంలో నిలబడి ఉందో అమ్మాయి! తెల్లచీరకట్టుకుని జుట్టు విరబోసుకుని— పదిటిమీద కాసంత తిలకం దిద్దుకుని ఉంది. ఎక్కడ్నించి వచ్చిందా అమ్మాయి.

"నేను కాత్యాయునిని!" గుర్తుపట్టలేదా అన్నట్టు అంది ఎదురుగా నిలబడ్డ అమ్మాయి.

కాత్యాయని! ఎవరో తెలుసా తనకు?

"భయపడకు...నేను కూడా భక్తురాలినే." అంది కాత్యాయని. అంటే? తను కూడా భక్తురాలా? ఎవరికి?

స్నిగ్ధ ఆలోచనలు పసిగట్టినట్టు చిరునవ్వు నవ్వింది కాత్యాయని. విగ్రహంకేసి నడిచి ఒక్కసారి ప్రణమిల్లి లేచి నిలబడింది...

"కరకింకర భక్తురాలిని నేను" అంది కాత్యాయని" గర్వంగా! కరకింకర?

స్నిగ్ధ నిలబడ్డ చోటునించి కదల్లేదు. కాత్యాయని విగ్రహం ముందు మోకరిల్లినట్టు తనుకూడా...నో ... అతికష్టం మీద నిగ్రహించుకుంది.

"కరకింకర కళ్ళలోకి చూడు" అంది కాత్యాయని...

అప్రయత్నంగా తలెత్తి చూసింది స్నిగ్ధ...

ఒక్కక్షణం అలా చూడగానే...ఆ కళ్ళు ఆకుపచ్చరంగు కాంతితో తళుక్కుమని మెరిసాయి.

"కరకింకర నిన్ను భక్తురాలిగా స్వీకరిస్తాడు! అంది కాత్యాయని ఆనందంగా.

కరకింకర కళ్ళలోకి చూస్తూ తలతిప్పుకునే పరిస్థితిలో లేను స్నిగ్ధ...ఇంకాసేపు అలాగే చూస్తే తన మనసు ఆలోచనలు వశం తప్పుతాయి అనిపించి అతి కష్టంమీద తలతిప్పుకుంది...

"కరకింకర దగ్గరకి వేళకానివేళ వచ్చావు ... ఈ ఆలయంలోకి వచ్చేపద్ధతి కూడా ఇది కాదు...అందరూ ఉన్నపుడు మరోసారి వస్తావు కదా అపుడు నేనే ఉపదేశం ఇస్తాను" అంది కాత్యాయని.

అంటే తనని ఇప్పుడు వెళ్ళమంటుందా కాత్యాయని?

"ఇపుడు వెళ్ళిపో అనడం లేదు. వెళ్ళిరమ్మంటున్నాను. అంది కాత్యాయని.

ఆశ్చర్యంగా ఆమెకేసి చూసింది స్నిగ్ధ. తన మనసులోని ప్రతీ మాట ఎలాతెలిసిపోతోంది కాత్యాయనికి!

అక్కడ్నించి కదిలి మెట్లకేసి నడవబోయింది స్నిగ్ధ...

"ఆగు..."

ఆగి వెనక్కి తిరిగి చూసింది స్నిగ్ధ...

కరకింకర విగ్రహం పాదాల దగ్గరున్న మట్టికుండలోంచి నల్లటి దారం ఒకటి బయటకు తీసింది కాత్యాయని...ఆ దారాన్ని కళ్ళకద్దుకుంటూ స్నిగ్ధకేసి వచ్చిందామె.

"వచ్చినందుకు కనీసం ఈమరుల మాతంగి కట్టించుకుని వెళ్ళు. కరకింకర ప్రసన్నుడవుతాడు." అంటూ ఆ దారం స్నిగ్ధ మణికట్టుకి కట్టింది కాత్యాయని...

కాత్యాయని అలా దారం కడ్తుంటే స్నిగ్ధ చేతికి ఆమె చేతులు తగిలాయి.

ఆ స్పర్శ...చల్లగా...మృతదేహాన్ని తాకినట్టుగా అనిపించింది. ఒళ్ళు జలదరించింది స్నిగ్ధకి.

ఇక ఒక్కక్షణం కూడా అక్కడ ఉండదలచుకోలేదు స్నిగ్ధ...

"అటు కాదు...ఇట్నించిరా..." అంటూ స్నిగ్ధ చెయి పట్టుకుని కరకింకర విగ్రహం వెనక వైపునించి ఆ భూగృహంలోంచి బయటకి దారి తీసింది కాత్యాయని.

కాత్యాయనిని అనుసరిస్తున్న స్నిగ్ధకి తను ఎటు వెళ్తోందో అర్థం కాలేదు...కాత్యాయని తననెటు తీసుకు వెళ్ళింది?...కాస్సేపయ్యాక ఒక చోట ఆగింది కాత్యాయని...ఎదురుగా ఒక చీకటి సందు.

"తిన్నగా వెళ్తే ఒక తలుపు కనిపిస్తుంది. అది తెరుచుకుని బయటకు వెళ్ళవచ్చు. వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళిపో" అందామె ఆజ్ఞాపిస్తున్నట్టు. చీకట్లో తడుముకుంటూ ముందుకు నడిచింది స్నిగ్ధ. కొంత

దూరం నడిచాక ఒక చిన్న తలుపు కనిపించింది. తలుపు తెరవబోతుంటే తలమీద ఎవరో కొట్టినట్టు అనిపించి అప్రయత్నంగా వెనక్కి తిరిగి చూసింది స్నిగ్ధ...

స్నిగ్ధ...

అంతే!...

'కీచు' 'కీచు' అంటూ ఎక్కడి నుంచీ ఎగిరివొచ్చి ఆమెను చుట్టు ముట్టాయి గబ్బిలాలు...గబ్బిలాలు ... ఈగలు ముసిరినట్టుగా ... గబ్బిలాలు! చీమలు చుట్టిముట్టినట్టు...గబ్బిలాలు అకాశం ఈనిందా అన్నట్టు... వచ్చి పడ్డాయి ... గబ్బిలాలు! భయంతో పై ప్రాణాలు పైకే పోయాయి స్నిగ్ధకి ... బిగ్గరగా అరచి తలుపు తీయబోయింది ... కానీ ఎంత ప్రయత్నించినా గడియ రావడంలేదు... గబ్బిలాలు ఆమె మీదికి...మీది మీదికి దాడిచేస్తున్నట్టు వచ్చేస్తున్నాయి! వాటి నుంచి తప్పించుకోవాలంటే తలుపుతీసుకుని బయటికి వెళ్ళాలి ... లేదా, ఇందాక వచ్చిన చోటికే వెను దిరిగి వెళ్లాలి,..

కాత్యాయని కోసం చూసింది స్నిగ్ధ...

కానీ...అక్కడ కాత్యాయని లేదు...

పైగా...గుంపులు గుంపులుగా వస్తున్న ఆ గబ్బిలాలు అటునుంచే ఎగిరివస్తున్నాయి ... ఒకటో రెండో కాదు... వందల సంఖ్యలో వస్తున్నాయి...

ఇక లాభం లేదు...వాటి నుంచి తను తప్పించుకోలేదు...

బిగ్గరగా అరుస్తూ కిందకు ఒరిగింది స్నిగ్ధ.

... ...

... ...

నెమ్మదిగా కళ్లుతెరిచి చూసింది...

కళ్ళు చెదిరేట్టు ఎండపడ్తోంది మొహం మీద...

చుట్టూ కలయజూసింది అయోమయంగా...

గబ్బిలాలేవీ?...

తను ఇక్కడికి...బయటికి ఎలా వచ్చింది...

నెమ్మదిగా తలెత్తి భవనంకేసి చూసింది...

అసలు తను లోపలికి వెళ్ళిందా! అంతలో ... ఆమె భుజం మీద ఎవరిదో చెయిపడింది. ఉలిక్కిపడి వెనక్కు చూసింది. పవన్!

"ఇక్కడేం చేస్తున్నావ్ స్నిగ్థా!... కారు దగ్గర కనబడకపోతే కంగారుపడ్డాను" అన్నాడు పవన్ ఆమె పక్కన కూర్చుంటూ...

అలా పక్కనే పవన్‌ని చూడగానే ఎంతో రిలీఫ్‌గా అనిపించింది. స్నిగ్ధకి...

"పవన్... ఈ భవనంలో ఏదో అద్భుతం ఉంది...లోపల ఆలయం ఉంది...కరకింకర ఆలయం..." అంటూ అతని చెయ్యి పట్టుకుంది

ఆమెకేసి అదోలా నవ్వుతూ చూసాడు పవన్...

"స్నిగ్థా...ఏమయింది నీకు? ఏమిటి నువ్వు చెప్తున్నది? జరిగిందంతా క్లుప్తంగా చెప్పింది స్నిగ్థ.

ఆమె మాటలు విని నవ్వేశాడు పవన్.

"పవన్...నేను జోక్ చెయ్యడం లేదు...కావాలంటే ఈ కెమెరా క్లిక్‌చేసి చూడు... సరిగ్గా క్లిక్ చేస్తున్నపుడు వ్యూ ఫైండర్లో భవనం మరోలా కనిపిస్తుంది. అంది గబగబ...

ఆమె చేతులోంచి కేమరా అందుకున్నాడు పవన్. భవనంకేసి ఫోకస్‌చేసి క్లిక్ చేశాక, స్నిగ్థకేసి తిరిగాడు.

"కనబడిందా?" అడిగింది స్నిగ్థ ఆతృతగా—

"నాకేమీ కనిపించలేదు. అయినా ఒకటి చెప్పు...కొత్తగా పెళ్ళయిన అమ్మాయ్ భర్తను ఆటలు పట్టించడం మీ వంశంలో ఆచారం ఏదైనా ఉందా?" అడిగాడు పవన్ నవ్వుతూ.

అతడి వేళాకోళం మాటలు పట్టించుకోలేదు స్నిగ్ధ.

"పవన్...నీకేమీ కనిపించలేదా."

లేదన్నట్టు తల అడ్డంగా తిప్పాడు పవన్.

అతడి చేతిలోంచి కెమెరా లాక్కుని భవనంకేసి వ్యూఫైండర్ లోంచి చూసింది. నెమ్మదిగా బటన్‌మీద వేలుపెట్టి క్లిక్‌చేసింది ... ఒక్క క్షణ ఆగి ఆటోమాటిక్ వైండింగ్‌చేసి మళ్ళీక్లిక్ చేసింది.

ఆమె మొహంలోని భావాలు అర్థంచేసుకుంటూ అన్నాడు పవన్-

"పద స్నిగ్థా వెళ్దాం...ఇక్కడ మిలాకిల్స్ ఏమీలేవు. ఏదో ఊహించుకున్నావు ... అంతే." అని ఆమె భుజం చుట్టూ చెయివేసి వెనక్కి తిప్పాడు.

బంజరు పొలంలోంచి రోడ్డుమీద నిలబెట్టి కారుకేసి నడిచారిద్దరూ.

• • •

కారు ఘాట్‌రోడ్డు దాటి ఖండాలా చేరుకుంటుంటే మళ్ళీ అంది స్నిగ్థ-

"ఆ భవనంలో ఏదో అద్భుతం ఉందనే అనిపిస్తోంది పవన్. మనం లోపలికివెళ్ళి చూసి ఉంటే బావుండేది."

"డోంట్ బీ ఛైల్డిష్ స్నిగ్థా! ఇంకా దాని గురించే ఆలోచిస్తున్నావా." అన్నాడు పవన్ నవ్వేస్తూ.

ఆ తర్వాత ముభావంగా ఉండిపోయింది స్నిగ్థ.

తన మాటలు నమ్మడం లేదు పవన్. తేలిగ్గా కొట్టిపారేస్తున్నాడు. తను అన్ని విషయాలు ఎంతో ప్రాక్టికల్‌గా చూస్తుందని పవన్‌కి తెలుసు అయినా చిన్నపిల్లతో మాట్లాడినట్టు ఉందతని ధోరణి.

ఖండాలా మాల్‌రోడ్డు చివరన శ్యాంసుందర్ ఏర్పాటుచేసిన కాటేజిముందు కారాపాడు పవన్. కిందకు దిగుతూ చౌకీదారుని పిలిచి డిక్కీలోని సామానుదింపమన్నాడు. స్నిగ్థ కారులోనే కూర్చుని ఉండటం చూసి-

"ఏమయింది" అని అడిగాడు దగ్గరకెళ్తూ.

"ఏమీ లేదు" అంటూ కిందికి దిగి నెమ్మదిగా కాటేజిలోకి నడిచింది స్నిగ్థ.

• • •

చౌకీదారు కారులోని సామాను లోపలికిచేర్చి వెళ్ళాక సూట్‌కేస్ లోంచి టవల్ తీసుకుని బాత్‌రూంకేసి బయల్దేరింది స్నిగ్థ.

ఆమె చెయిపట్టుకుని ఆపాడు పవన్.

"కోపమా?"

"లేదే-నాకు కోపం దేనికి?"

"కోపం కాకపోతే అలక!...నీ మాటలు నమ్మలేదనే కదూ?" అడిగాడు పవన్.

"ఛ-అదేం కాదు..." అంది స్నిగ్ధ అస్పష్టంగా.

"ఓ కె ... మనం దాని గురించి తర్వాత మాట్లాడుకుందాంలే కాని-నువ్వు స్నానం చేసిరా లంచ్ చేసి బయటకు వెళ్ళివద్దాం-" అన్నాడతను ఆప్యాయంగా.

స్నిగ్ధ బాత్‌రూంలోకి వెళ్ళి గడియవేసుకుంది.

షవర్‌కింద నిలబడి చన్నీళ్ళస్నానం చేస్తుంటే ఎంతో హాయిగా అనిపించింది.

పవన్ ఎంత సెన్సిటివ్!

పైకి ఏమీ చెప్పకపోయినా తన మనసు బాధపడిందని అర్థం చేసుకున్నాడు. పవన్ తన మాట నమ్మడంలేదని తను అనవసరంగా బాధపడింది. అసలు అతడి స్థానంలో ఎవరున్నా అలాగే అనుకుంటారేమో. తన దగ్గర ఆధారం ఏముందని?

ఆధారం?

ఆధారం ఉంది. కెమెరాలో?

కెమెరాలో నెగిటివ్ డెవలప్ చేస్తే తనకాధారం దొరుకుతుంది. తను భవనం బయట చూసింది నిజమేనని నిరూపించవచ్చు... ఆ భవనం లోపల చూసింది కూడా నిజమే కావచ్చు.

ఒంటిమీద సబ్బురుద్దుకొనడం ఆపేసి ఆలోచిస్తూ ఉండిపోయింది స్నిగ్ధ.

వెంటనే బయటకువెళ్ళి పవన్‌తో ఆ మాట చెప్పాలని బలంగా తోచింది. కానీ అంతలో తమాయించుకుని తల విదిలించుకుంది స్నిగ్ధ... ఒకవేళ ఫోటోగ్రాఫ్‌లో ఏమీ ఉండకపోతే? మరోసారి ఫూల్ అవుతుంది తను.

స్నానం ముగించి వొంటినిండా టవల్ చుట్టుకుని బెడ్‌రూంలోకి వచ్చింది స్నిగ్ధ. రౌండ్‌బెడ్ మీద కూర్చుని జుట్టు బ్రష్ చేసుకుంటుంటే పవన్‌వచ్చి ఆమెపక్కన కూర్చున్నాడు. కెమెరాలో రీలు గురించి ప్రస్తావించకూడదని నిశ్చయించుకుని రిలాక్స్‌గా మాట్లాడింది స్నిగ్ధ.

"పవన్! ఐ యామ్ సారీ...ఏవో ఆలోచనల్లో పడిపోయి నీతో సరిగ్గా మాట్లాడటం లేదు..."

"డోంట్ బీ ఫన్నీ! సిల్లీగర్ల్!" అంటూ ఆమెను దగ్గరకు తీసుకున్నాడు.

అంతలోనే ఆమెను వెనక్కి జరిపి ప్రేమగా ఆమె కళ్ళలోకి చూసాడు.

మన పెళ్ళయిందని నాకింకా నమ్మకం కుదరడం లేదు." భుజం మీద చెయివేసి మరోచేత్తో ఆమె మొహాన్ని తనకేసి తిప్పుకున్నాడు పవన్. స్నిగ్ధ కళ్ళుకిందకివాలిపోతుంటే ముందుకి వొంగి ఆమె పెదాలను చుంబించాడు.

స్నిగ్ధ తనువు పులకరించింది.

ముద్దంటే ఇంత బావుంటుందా? అతడ్ని పెనవేసుకుని అలాగే ఉండిపోవాలనిపించిందామెకు. అరనిమిషంసేపు ఇద్దరూ అలాగే కూర్చుండిపోయారు.

"థ్యాంక్యూ ఫర్ ద కిస్!" అన్నాడు పవన్ ఓరగా ఆమెకేసి చూస్తూ.

స్నిగ్ధకు సిగ్గుముంచుకుని వచ్చింది-

చటుక్కున అరచేతుల మధ్య మొహం దాచుకుంది-

'స్నిగ్ధా!' పిలిచాడు పవన్.

"ఊఁ" చేతులు జరపకుండా సమాధానమిచ్చింది.

"నీ చేతికి ఈ దారం ఏమిటి?" అడిగాడతను.

మొహంమీదనించి చేతులు జరిపేస్తూ కుడిచేతి మణికట్టుకి కట్టిన నల్లదారంకేసి ఆశ్చర్యంగా చూసుకుంది స్నిగ్ధ!

కాత్యాయని కట్టిన దారమది?

కరకింకర భక్తురాలు? కాత్యాయని.

అంటే? అంటే?

స్నిగ్ధ గుండె వేగంగా కొట్టుకోసాగింది.

ఆమె వెర్రిచూపులు పవన్‌ని కలవరపెట్టాయి–

## 2

స్నిగ్ధ చెయ్యిపట్టుకుని నల్లదారంకేసి పరిశీలనగా చూసాడు పవన్ "సర్‌ప్రైజింగ్!" అన్నాడతను.

"పవన్! ... అయితే నేను చూసిందంతా వాస్తవమే కదూ? కాత్యాయని...కరకింకర ఆలయం...ఇవన్నీ..."

"స్నిగ్ధా! ప్లీజ్...ట్రైటురిలాక్స్!" అన్నాడు పవన్ ఆమెఆలోచన ల్లోకి వెళ్ళిపోతోందని గమనించి.

ఆమెను దగ్గరకు తీసుకుంటూ మళ్ళీ అన్నాడు–

"డియర్! ఆ సంఘటన గురించి మరీ సీరియస్‌గా ఆలోచిస్తున్నావ్ నువ్వు."

"కానీ పవన్..." అని ఏదో అనబోయి ఆగిపోయింది...

"చెప్పు స్నిగ్ధా...ఎందుకు ఆగిపోయావు?"

"ఏం లేదు..." అంది స్నిగ్ధ అన్యమనస్కంగా.

స్నిగ్ధమూడ్ మళ్ళీ పాడవుతోందని అర్థంచేసుకున్నాడు పవన్. ఆమె మాటలు నమ్మకపోతే పూర్తిగా అప్సెట్ అయిపోతుంది.

"ఒక పని చేద్దామా స్నిగ్ధా!"

ఏమిటన్నట్టు అతడికేసి చూసిందామె.

"మనం బొంబాయికి తిరిగి వెళ్తున్నపుడు మరోసారి ఆ భవనం దగ్గర ఆగి లోపల ఏముందో చూద్దాం!...నువ్వన్నట్టు నిజంగానే అక్కడే

దయిన ఆలయం ఉండేమో!... అన్నాడు పవన్ ఆమె కళ్ళలోకి చూస్తూ.

స్నిగ్ధ కొంచెం రిలాక్స్‌అయింది.

పవన్ ఆమె మణికట్టు మీద దారం ముడి విప్పబోయడు. స్నిగ్ధ చెయి వెనక్కి లాగేసుకుంది-

"పవన్!...ఉండనీ...ఆ దారం తీయద్దు!"

ఏదో అనబోయి మనసు మార్చుకున్నాడు పవన్-

"ఓ.కె...ఉండనీ...ఇక ఈడిస్కషన్ ఆపి బయటకి ఎక్కడ కయినా వెళ్ళివద్దాం-కాస్త ఛేంజ్‌గా ఉంటుంది. అంటూలేచి నిలబడ్డాడు పవన్.

స్నిగ్ధ కూడా నెమ్మదిగాలేచి డ్రెస్సింగ్‌రూంలోకి వెళ్ళింది. తెల్ల జీన్స్, వొదులుగాఉన్న నీలం రంగు షర్టు తొడుక్కుని 'మోడ్'గా తయారయి బెడ్‌రూంలోకి వచ్చింది. అప్పటికి పవన్ కూడా బట్టలు మార్చుకుని రెడీగా ఉన్నాడు-ఇద్దరూ కాటేజి డైనింగ్‌రూం కెళ్ళి వంటవాడు నాయరు వడ్డిస్తే లంచ్ ముగించారు.

కాటేజి బయటకు వచ్చేపటికి చౌకీదారు కారు శుభ్రంగా కడిగి పోర్టుకోలో నిలబెట్టాడు. పవన్‌తోపాటు కారెక్కింది స్నిగ్ధ.

స్నిగ్ధకిపుడు రిలాక్స్‌గా ఉంది. హాయిగా హనీమూన్‌కని వచ్చి అనవసరమయిన భయాలతో పవన్‌మూడ్ పాడుచేసింది తను. పవన్ చెప్పినట్టు బొంబాయి వెళ్తున్నపుడు మరోసారి ఆ భవనంలో ఏముందో చూస్తే అన్ని అనుమానాలు తొలగిపోతాయి. ఇక పవన్‌తో నార్మల్‌గా ఉండాలి తను.

ఖండాలా రోడ్డుమీద నెమ్మదిగా డ్రైవ్‌చేస్తున్నాడు పవన్. కిటికీ లోంచి బయటకు చూస్తూ కూర్చుంది స్నిగ్ధ.

"పవన్ లుక్!" అంటూ కారాపమందామె.

రోడ్డుకి ఒకపక్కగా కారాపి స్నిగ్ధతోపాటు కిందకి దిగాడు పవన్ స్నిగ్ధ దృష్టిని ఆకర్షించింది రోడ్డుకి ఎడమవైపున్న చిన్న పార్కు. ఆ పార్కు కొండచెరియపై ఉండటంతో అక్కడ్నించి ఖండాలా అందచందాలన్నీ కనిపిస్తున్నాయి. పార్కుచివరున్న రెయిలింగ్‌ని ఆనుకుని నిలబడ్డా

రిద్దరూ.

"పవన్! అటుచూడు...కొండని చుట్టుకుంటున్నట్టున్న ఘాట్ రోడ్డు దానిమీద వెళ్తున్న బస్సులు కారులు బొమ్మల్లా కనిపిస్తున్నాయి కదూ." అంది స్నిగ్ధ.

పవన్ అటు తలతిప్పకుండా ఆమెనే చూస్తున్నాడు.

"ఏం చూస్తున్నావు?" అడిగింది స్నిగ్ధ.

"ప్రకృతి కాంతని" అన్నాడతను నవ్వుతూ."

స్నిగ్ధకూడా నవ్వేసింది.

వాళ్ళిద్దరూ నిలబడ్డచోటుకి ఇరవైగజాల దూరంలో ఒకతను పచ్చికలో వెల్లకిలా పడుకుని ఉన్నాడు. స్నిగ్ధ నవ్వు విని లేచికూర్చుని క[...]ర్పకుండా ఆమెకేసే చూడసాగాడు.

అప్రయత్నంగా అతడికేసి చూసింది స్నిగ్ధ.

మాసినగెడ్డం...చెదిరిన జుట్టు... మట్టికొట్టుకుని పోయినబట్టలు. పిచ్చివాడిలా ఉన్నాడు.

స్నిగ్ధను చూసి వెకిలినవ్వు ఒకటి నవ్వాడు.

"పదపోదాం" అంటూ పవన్ చెయిపట్టుకుంది స్నిగ్ధ.

ఆమెతోపాటు కారుకేసి నడుస్తూ వెనక్కి చూసి అడిగాడు పవన్-

"ఆ పిచ్చివాడిని చూసి భయపడ్డావా!"

"భయం కాదు! అసహ్యంగా చూస్తున్నాడు నాకేసి" అంటూ కారెక్కింది స్నిగ్ధ.

అక్కడ్నించి కారుస్టార్టుచేసుకుని బయల్దేరాడు పవన్. దారిలో "ఆంటిక్స్ అండ్ హాండిక్రాఫ్ట్స్ షాపు ఒకటి కనబడి ఆపాడు కారుని.

"లోపల ఏముందో చూద్దాం పద" అంటూ కారు దిగాడతను. హ్యాండీక్రాఫ్ట్షాపు లోపల చాలా విశాలంగా ఉంది.

"ఇలారండి సాబ్...కొండప్రాంతం వాళ్ళు తయారుచేసిన హ్యాండీక్రాఫ్ట్స్ చాలా ఉన్నాయి" అంటూ వాళ్ళిద్దర్నీ షాపులోపల గదిలోకి తీసుకెళ్ళాడు షాపు ఓనరు.

నూకమానుకో చెక్కన ఫ్రూట్‌బౌల్స్... కాండిల్‌స్టాండ్‌కొన్నాడు పవన్. అక్కడ గాజుబీరువాల్లో వేలాడుతున్న చేతిగాజులు రింగులు కొనుక్కొని అడిగింది స్నిగ్ధ.

"మీ ఆంటిక్స్ కలెక్షన్ చూపించండి" అని.

"మా దగ్గర జెనువిన్ అయిటమ్స్ చాలా ఉన్నాయి రండి చూపిస్తాను" అంటూ మరోవైపు దారితీసాడు షాపు ఓనర్.

పోర్సిలీన్ టీసెట్స్, వాల్ హంగింగు, సౌండరీల్స్...విగ్రహాలు ఎన్నో ఉన్నాయి అక్కడ...చిన్న మ్యూజియంలా ఉంది.

"ఈ ఫ్లవర్‌వాజ్ ఎంత?" అడిగింది స్నిగ్ధ...

ఇది చైనీస్‌వాజ్. ఈ డిసైన్స్ చూడండీ దీన్నిబట్టి కనీసం నూటాయాభై ఏళ్ళనాటిదని చెప్పొచ్చు..." అంటూ ఆ పూలకుండీ గొప్పలు వర్ణించి దాని ధర వెయ్యిరూపాయలన్నాడు.

"మరీ అంత ఖరీదా!" అంటూ అక్కడ్నుంచి కదిలింది స్నిగ్ధ...

"మీకు నచ్చినట్టుంది...మీకోసం స్పెషల్ డిస్కౌంట్ ఇస్తాను" అని ఏకంగా రెండువందలు తగ్గించి అడిగాడతను.

పవన్ మొహం చూసింది స్నిగ్ధ...ఆ ఫ్లవర్‌వాజ్ ఆమెకు నచ్చిందని అర్థమయింది పవన్‌కి. షాప్ ఓనర్‌తో బేరమాడి చివరకి నాలుగు వందలదాకా దించాడు దాని ధరని.

ఫ్లవర్‌వాజ్ ప్యాకింగ్ చేయించడానికి షాప్ ఓనర్ లోపలికి వెళ్ళాడు.

"అసలు ఈ నాలుగువందలు కూడా ఎక్కువేనేమో...ఈ అంటిక్స్ గురించి ఏమీ చెప్పలేము" అన్నాడు పవన్.

బిల్లు చెల్లించి బయటకు నడిచారిద్దరూ!... అప్పటికే వాళ్ళుకొన్న హాండీక్రాఫ్ట్స్ పాకెట్లు కారువెనక సీటులో పెట్టించేసాడు షాపు ఓనరు.

కారు కాటేజీకేసి మళ్ళించాడు పవన్...వాళ్ళకారు వెళ్ళిపోతుంటే ఆదరాబాదరాగా ఒకవ్యక్తి హాండీక్రాఫ్ట్స్ షాపులోకి వచ్చాడు. అతడ్ని చూడగానే షాపు ఓనరు గౌరవంగాలేచి నిలబడ్డాడు.

"రుస్తుం సేట్! మీరా!...? ఎప్పుడొచ్చారూ?

"నా కోసం ఎవరయినా వచ్చారా?" అడిగాడు రుస్తుంసేట్.

"ఆఁ వచ్చారు సేట్! నాలుగురోజుల క్రితం ఒకతనువచ్చి మీ కోసం పార్సిల్ ఒకటి ఇచ్చివెళ్ళారు. ఇపుడే తెస్తాను..." అంటూ లోపలికివెళ్ళి పెద్దసైజు పార్శిల్ ఒకటి తెచ్చాడు.

దాన్ని అటూ ఇటూతిప్పి చూసాడు రుస్తుంసేట్.

"ఎవరూ దీన్ని ముట్టుకోలేదు కదా!" అడిగాడతను.

"లేదు రుస్తుంసేట్ జాగ్రత్తగా దాచాను."

"సరే...ఆ వచ్చిన అతను తన పేరు చెప్పాడా?" అడిగాడు రుస్తుంసేట్.

"ఆఁ...చెప్పారండీ...అతడిపేరు మిహిర్ కట్టీ."

• • •

ఖండాలా సైట్ సేయింగ్ చేసుకుని కాటేజికి వచ్చేపటికి రాత్రి ఎనిమిది గంటలయింది.

భోజనాలు ముగించి కబుర్లుచెప్పుకుంటూ వరండాలోకూర్చున్నారు స్నిగ్ధ...పవన్. కాటేజి మెయిన్ రోడ్డు చివరన ఉండటంవల్ల కాటేజి ఎదురుగా ట్రాఫిక్ లేదు.

నాయర్ టేబిల్ క్లీన్‌చేసి సర్వెంట్స్ క్వార్టర్స్‌కి వెళ్ళాక ఇద్దరూ లోపలికి నడిచారు.

డ్రెస్సింగ్‌రూంలోకెళ్ళి నైటీవేసుకుని వచ్చింది స్నిగ్ధ.

కుర్చీలో కూర్చుని మాగజైను ఏదో తిరగేస్తున్న పవన్ లేచినిలబడ్డాడు.

"ఈ కాటేజి స్పెషాలిటీ నీకు చెప్పనే లేదు కదూ?" అంటూ గది మధ్యన రౌండ్ బెడ్‌మీద కూర్చోమన్నాడు స్నిగ్ధని. లైట్‌స్విచ్ పక్కనున్న మరో చిన్న స్విచ్‌ని నొక్కాడు.

ఉన్నట్టుండి స్నిగ్ధ కూర్చున్న రౌండ్‌బెడ్ నెమ్మదిగా తిరగనారంభించింది...గుండ్రంగా. దానికితోడు స్టీరియో స్పీకర్స్‌లో హవాయియన్ గిటార్ వాద్యం ప్రారంభమయింది.

"ఏమిటిదంతా" అడిగింది స్నిగ్ధ ఆశ్చర్యంగా.

"ఇది హనీమూన్ చేసుకుంటున్న వాళ్ళకోసం ప్రత్యేకంగా కట్టించిన కాటేజి. ఈ హంగులు ఇక్కడకాక మరెక్కడుంటాయి" అంటూ ఆమె. పక్కన కూర్చుని ముద్దిచ్చాడు. అతడిచేతులు తన ఛాతికేసి వెళ్తుంటే అతడ్ని వారించింది స్నిగ్ధ.

"ప్లీజ్...నాకు సిగ్గుగా ఉంది!" అందామె.

"ఒకమాటచేప్తే నువ్వు నవ్వుతావు" అన్నాడు పవన్ చేయి జరిపేస్తూ.

ఏమిటన్నట్టు అతడికేసి చూసింది స్నిగ్ధ.

"నాక్కూడా కొంచెం సిగ్గుగానే ఉంది...

అతడిమాటలు విని కిలకిల నవ్వేసింది స్నిగ్ధ... ఆమె జుట్లు నిమురుతూ అన్నాడు పవన్-

"మనిద్దరికీ ఈ ఇంటిమసీ కొత్తగా ఉంది... అంతే స్నిగ్ధా!... ఆఫీసులో కోలీగ్స్‌గా... స్నేహితులుగా ఒకరికొకరం దగ్గరయ్యాం...కానీ ఇలా సన్నిహితం ఉండాలంటే ఏదో మెంటల్‌బ్లాక్ వస్తోంది కదూ? ఇన్‌హిబిషన్ అనుకుంటాను. కానీ మనమధ్య ఇన్‌హిబిషన్స్ ఉండటం మన స్నేహానికే ఇన్సల్ట్..." అంటూ ఆగాడతను.

"మనమధ్య ఇన్‌హిబిషన్స్ ఉండనివ్వద్దు పవన్ ..." అంది స్నిగ్ధ తలవంచుకునే.

"మరోమాట చెప్పనా, భార్యాభర్తల మధ్య ఇన్‌హిబిషన్స్ అలాగే ఉండిపోయి వాళ్ళు దగ్గరయితే అది కేవలం సెక్స్...అభ్యంతరాలు, అరమరికలకు మనమధ్య రాకుండా చూసుకుంటే అది నిజమైన కంజ్యూగల్‌బ్లిస్ అందుకుంది."

"ఐ అగ్రీ పవన్...అయినా నేనే నువ్వు అనుకున్నపుడు ఇవన్నీ ఎలా వస్తాయి?" అంటూ అతడి బుగ్గమీద చిన్నముద్దిచ్చింది స్నిగ్ధ... ఆమెను దగ్గరకు తీసుకుంటూ మంచంమీదకు ఒరిగాడు పవన్. రౌండ్‌బెడ్ నెమ్మదిగా తిరుగుతుంటే పవన్ ఆమె మీదకు వాలిపోయి మొహాన్ని ముద్దులతో తడిపేసాడు. అతడిపెదాలు మెడమీదుగా కిందకి జారుతుంటే మత్తుగా కళ్ళు మూసుకుని పడుకుంది స్నిగ్ధ...

పవన్ తన భర్త!...తన ప్రియుడు...అంబవ్ ఆల్,...తన బెస్ట్ ఫ్రెండ్!...అతను తననేం చేసినా అభ్యంతరం లేదు.... ఉండకూడదు. తన శరీరంలోని అణువణువు అతడిదే....

శయనేషురంభ!...

అన్ని విధాలుగా అతడ్ని కవ్వించి...అలరించాలి తను.

ఒకొక్కటంటూ ఒంటిమీద బట్టలుజరపసాగాడు పవన్...అతడితో పూర్తిగా సహకరించింది స్నిగ్ధ...

చటుక్కున దుప్పటి మెడదాకా లాక్కుని "ఇది అన్యాయం కాదా?" అంది అతడి బట్టలకేసి చూపుతూ...

పవన్‌లేచి ఆమె చెప్పినట్టే చేసి ఆమె పక్కన దుప్పటి కప్పుకుని పడుకున్నాడు...

"ఇప్పుడు ఇద్దరం డిస్ అడ్వాంటేజిలో ఉన్నట్టేనా?" అంటూ ఆమెకు దగ్గరగా జరిగి పడుకున్నాడు పవన్.

వాళ్ళిద్దరి మనోభావాలకు తగ్గట్టుగా గిటార్ వాద్యం పేస్ కూడా ఎక్కువయింది.

స్నిగ్ధకు పూర్తిగా దగ్గరయిపోతూ..." స్నిగ్ధా...మై డార్లింగ్." అన్నాడు పవన్ బిగ్గరగా.

"నా స్నేహం ప్రేమగా ఫలించిన ఈ క్షణాన్ని నేనెప్పటికీ మరవను పవన్." అంది స్నిగ్ధ మత్తుగా...

.......

కాసేపటికి...

... ...

నెమ్మదిగా లేచికూర్చుని స్నిగ్ధకేసి చూసాడు పవన్...హాయిగా నిద్రపోతోందామె...

ఆమె మణి కట్టుమీదున్న నల్లదారం ముడి విప్పి దారం తీసేసాడు పవన్. మంచం దిగి వెళ్ళి కిటికీలోంచి బయటకు విసరేసాడు ఆ దారాన్ని...ఆ తర్వాత హాయిగా ఊపిరి పీల్చుకుని మళ్ళీ స్నిగ్ధ పక్కన వచ్చి చేరాడతను.

• • •

రాత్రి పన్నెండు దాటాక నిద్రమెలుకువ వచ్చింది స్నిగ్ధకి. తన నడుంచుట్టూ చెయివేసి ఛాతిమీద తలపెట్టుకుని నిద్రపోతున్నాడు పవన్. గదిలో దీపం అలాగే వెలుగుతోంది... గదిమధ్యన కుప్పగా పడిఉన్న నైటీచూసి అంతకు ముందు పవన్‌చేసిన చిలిపి పనులు గుర్తొచ్చాయి స్నిగ్ధకి.

నెమ్మదిగా పవన్‌ని పక్కకు జరిపి లేచింది స్నిగ్ధ నైటీ తొడుక్కుని లైటాఫ్ చేద్దాం అనుకుంటున్నంతలో టేబుల్ మీద చిందర వందరగా పడున్న పార్శిల్స్ కనబడ్డాయి ఆమెకు. అందులో అన్నింటి కంటే పెద్దపార్సిల్‌లో తను సాయంత్రం కొన్న ఫ్లవర్‌వాజ్ ఉండాలి. యధాలాపంగా దాన్ని టేబిల్‌మీద సర్ది పెట్టబోయింది స్నిగ్ధ...

కానీ, దాని బరువునుబట్టి ఏదో అనుమానం వచ్చిందామెకు.

పెట్టెమూత తెరచి ప్యాకింగ్ మెటీరియల్ జరుపుతూ చెయి లోపలికి పెట్టింది... చేతికి తగిలింది ఫ్లవర్‌వాజ్ కాదు!

లోపలున్న వస్తువుని బయటకు లాగింది స్నిగ్ధ.

అది షాపులో కొన్న ఫ్లవర్‌వాజ్ కానేకాదు!

ఆమె చేతిలో ఉన్నది రెండడుగుల విగ్రహం!

ఆ విగ్రహాన్ని విప్పారిన కళ్ళతోచూసి బిగ్గరగా అరచిందామె.

కరకింకర! కరకింకర!! కరకింకర!!!

స్నిగ్ధకేక విని ఉలిక్కిపడి లేచాడు పవన్...

"స్నిగ్ధా..." అంటూ ఆమెదగ్గరకువచ్చి పొదిమిపట్టుకున్నాడు...

భయంతో ఒణికిపోతూ ... టేబిలుమీదున్న పార్శిల్‌కేసి చూపిస్తూ... "కరకింకర!" అంది తడారిన గొంతుకతో.

ఆమె చెప్తోందేమిటో అర్థంకాలేదు పవన్‌కి.

"పొద్దున నేను చూసిన విగ్రహమే! ... నన్ను వెంటాడుతూ... ఇక్కడిదాకా" అంటూ ఆగిపోయింది.

స్నిగ్ధకి ఏదో కలవచ్చి ఉంటుందనిపించింది పవన్‌కి. వెంటనే ముందుకెళ్ళి టేబిల్‌మీద విప్పి పడేసిఉన్న పార్శిల్ అందుకుని అందు లోంచి విగ్రహాన్ని బయటకు తీసాడు.

చేతిలోని విగ్రహాన్ని చూసి అతడుకూడా అదిరిపడ్డాడు.

"ఏమిటిది? మనంకొన్న ఫ్లవర్‌వాజ్ ఏదీ?" అన్నాడు.

తెలీదన్నట్టు తలాడించి మరింత వెనక్కి జరిగింది స్నిగ్ధ.

"అసలు బీర్వాలోంచి బయటకు ఎందుకు తీసావు ఈ పార్సిల్? అడిగాడు పవన్...

అతనికేసి ఆశ్చర్యంగా చూసి నెమ్మదిగా పక్కనే ఉన్న బీర్వా తెరిచింది స్నిగ్ధ. పై అరలో మరో పార్సిల్! సరిగ్గా అలాంటి గిఫ్ట్‌రాపర్ లోనే ఉందక్కడ.

"అంటే...పొరపాటున ఆ షాపువాడు ఎవరిదో పార్సిల్ మరొకటి మనకిచ్చేసాడన్నమాట!...ఈ బొమ్మచూసి బెదిరిపోయావా?" అంటూ నవ్వేసి ఆమెకేసి నడిచాడు పవన్.

అంతే!

మరోసారి బిగ్గరగా అరచి బెడ్‌వెనక్కి పరుగెత్తింది స్నిగ్ధ.

"నో! పవన్ ప్లీజ్...నా దగ్గరకి రావద్దు..."

స్నిగ్ధ ప్రవర్తన చూసి స్తంభించిపోయాడు పవన్.

"స్నిగ్ధా...ఇది ఎవరిదో అంటిక్ బొమ్మ..." అని మళ్ళీ ఆమెకు అర్థమయ్యేలా చెప్పబోయాడు. కానీ...స్నిగ్ధ కళ్ళలో క్షణం క్షణానికి ఎక్కువయిపోతున్న భయం గమనించి తనచేతిలోని బొమ్మని దూరంగా విసిరేసాడు పవన్. మెత్తటి కార్పెట్‌మీదపడి డ్రెస్సింగ్ టేబిల్‌కిందకు దొర్లిందా బొమ్మ.

కొంచెం రిలాక్స్‌అయిన స్నిగ్ధ చేతులు రెండు పట్టుకున్నాడు పవన్.

"ఏమయింది స్నిగ్ధా! ఆ బొమ్మనుచూసి ఎందుకలాభయపడ్డావు?"

"ఆ భవనంలో చూసింది ఇలాంటి విగ్రహమే! అయితే అది చాలా పెద్దది."

అసహనంగా చెయిపైకెత్తి ఆమెను ఆపాడు పవన్.

"డోంట్ బి ఫన్నీ స్నిగ్ధా...ఈబొమ్మ కొంచెం వికృతంగా ఉన్న మాట నిజమే...దీన్ని చూసి కలలో చూసింది. ఈ విగ్రహమే అని ఊహించుకుంటున్నాడు రీజనింగ్ చెప్పబోయాడు.

అతడ్ని పూర్తిగా మాట్లాడనివ్వలేదు స్నిగ్ధ ... తల అడ్డంగా తిప్పుతూ బిగ్గరగా అరిచింది..." నో... ఐయామ్ ష్యూర్ ఇది ముమ్మూర్తులా అలాంటి విగ్రహమే! నేనా రూపం మరచిపోలేను."

ఆమెను దగ్గరకు తీసుకున్నాడు పవన్.

"స్నిగ్ధా నీకు ఒంట్లో బావున్నట్టులేదు...ఎందుకయినా మంచిది బొంబాయి వెళ్ళగానే డాక్టర్ని కలుద్దాం."

"పవన్!!... నాకు పిచ్చి పట్టిందనుకుంటున్నావా? అంటూ అతడ్ని వెనక్కితోస్తూ అడిగింది స్నిగ్ధ.

"అది కాదు స్నిగ్ధా..." అని ఏదో చెప్పబోయాడు పవన్ కానీ ఆమెకళ్ళలో ఎక్స్‌ప్రెషన్ చూసి ఆగిపోయాడు.

"పవన్...నీకు తెలీదు. నువ్వు నాతో ఆలా అపనమ్మకంగా మాట్లాడితే నాకు బావుండదు. మనసువిప్పి అన్నీ చెప్పుకోవాలనుకుంటున్న నాకు నీ ధోరణి చూసి ఏమీ చెప్పకూడదని పిస్తుంది..." అంది స్నిగ్ధ బాధగా.

తల విదిలిస్తూ నవ్వేసాడు పవన్.

"ఐయామ్ సారీ స్నిగ్ధా...నువ్వింత హర్ట్ అవుతావని తెలియక ఏదో అనేసాను...సరే, ఆ భవనంలో నువ్వు చూస్తానంటున్న విగ్రహం ఈ విగ్రహంలాగే ఉందంటావు అంతే కదా? దానికంత భయందేనికి? బొంబాయి తిరిగివెళ్ళాక ఈ విగ్రహం ఏ కాలం నాటిదో దీనిచరిత్ర ఏమిటో కనుక్కుందాం. ఆర్కియాలజిస్ట్‌వి నువ్వే కంగారుపడిపోతే ఎలా?" అన్నాడు పవన్ ఆమెను ఊరడిస్తున్నట్టు.

"అయితే ఈ విగ్రహం పాతకాలంనాటిదంటావా?" అడిగింది స్నిగ్ధ కొంచెం సర్దుకుంటూ.

"అవును చాలా పాతకాలంనాటిదయి ఉండాలి... అసలు దాని

షేప్ చూస్తుంటే మనదేశానికి చెందిందికాదేమో అనిపిస్తోంది కదూ!" అంటూ యధాలాపంగా డ్రెస్సింగ్ టేబిల్ కేసి చూసాడు పవన్.

అతనలా చూస్తుండగానే డ్రెస్సింగ్‌టేబిల్ కిందనించి బయటకు దొర్లిందా బొమ్మ.

ఆశ్చర్యంగా దానికేసే చూస్తూ నిలడిపోయాడతను.

అతడు చూస్తున్న వైపుకి స్నిగ్ధకూడా తల తిప్పింది.

కార్పెట్టుమీదున్న బొమ్మలో కదలిక వచ్చింది!

ఇద్దరూ చూస్తుండగానే ఆ కదలిక ఎక్కువయింది...

బొమ్మ...నెమ్మదిగా పైకి లేచింది!

నిటారుగా లేచి నిలబడింది!

పవన్‌చెయి గట్టిగా పట్టుకుని నిలబడింది స్నిగ్ధ. ఆమెను పొదివి పట్టుకుంటూ ఆ బొమ్మకేసి పరిశీలనగా చూసాడతను, అతడికి నమ్మ శక్యంగా లేదంతా.

అంతవరకూ కళ్లుమూసుకున్నట్టున్న ఆ బొమ్మ కళ్ళు తెరచు కున్నాయి.

కళ్లు గుండ్రంగా తిప్పుకున్నట్టు మెరిసాయి.

ఆ కళ్ళలో ఆకుపచ్చకాంతి తళుక్కుమంది!

"పవన్!" అంటూ అతడి ఛాతీమీద మొహందాచుకుంది స్నిగ్ధ. ఆమెను పక్కకితోస్తూ బొమ్మకేసి నెమ్మదిగా కదిలాడు పవన్.

"వద్దు పవన్! దాని దగ్గరకు వెళ్ళకు" వారించింది స్నిగ్ధ.

పవన్ ఆగకుండా ముందుకెళ్ళి బొమ్మనందుకున్నాడు... దాన్ని అటూ ఇటూ తిప్పి చూసాడు పరిశీలనగా...

అంతలో పకపక నవ్వేసాడు.

"స్నిగ్ధా ఇలారా!" అన్నాడు అలాగే నవ్వుతూ ...

స్నిగ్ధ నిలబడ్డచోటునించి కదల్లేదు.

"భయపడకు స్నిగ్ధా... ఈ బొమ్మలో చిన్న గమ్మత్తు ఉంది అంతే!...కానాలంటే వచ్చిచూడు" అంటూ బొమ్మను కార్పెట్‌మీద పడు కోబెట్టి కొంచెం కదిలించాడు.

బొమ్మ లేచి నిలబడింది!

"చూసావా? టామ్‌షాప్స్‌లో ఇలాంటి బొమ్మలు అమ్ముతుంటారు. విసిరేస్తే వాటంతట అవే లేచి నిలబడ్తాయి. ఇదికూడా అలాంటిదే... దీని సెంటర్ ఆఫ్ గ్రావిటీవల్ల అలాలేచి నిలబడ్తుంది...అంతే" అని మళ్ళీ బొమ్మను పడుకోపెట్టి కదిలించాడు. బొమ్మమళ్ళీ లేచి నిలబడింది...

అతడికేసి మెల్లగా కదలి వెళ్ళింది స్నిగ్ధ...

పవన్ చెప్తున్నదాంట్లో రీజనింగ్ ఉన్నట్టే అనిపించింది ఆమెకు... అయినా అడిగింది.

"ఆ బొమ్మ బయటకు ఎలా దొర్లింది?"

"అదేమంత పెద్ద విషయం? డ్రెస్సింగ్‌టేబిల్ కింద ఏ మాత్రం స్లోప్ ఉన్నా చాలు...చెప్పాను కదా దీని సెంటర్ ఆఫ్ గ్రావిటీ బేస్‌లోనే ఉంది..."

"మరి...కళ్ళలో కనిపించిన ఆకుపచ్చ వెలుతురు మాటేవిటి?" అడిగింది స్నిగ్ధ.

"అదా...?" అంటూ బొమ్మకళ్ళలోకి చూస్తూ ఆలోచనలో పడి పోయాడు పవన్.

తన ప్రశ్నకు సంతృప్తికరంగా సమాధానం అతనివ్వలేదని అని పించింది స్నిగ్ధకి.

"స్నిగ్ధా...ఇటు చూడు!" అంటూ బొమ్మచేత్తో పట్టుకుని స్నిగ్ధ దగ్గరకు వచ్చాడు పవన్.

ఒక్కడుగు వెనక్కివేసింది స్నిగ్ధ.

"సిల్లీగర్ల్! ఇంత చెప్పినా ఇంకా భయపడ్తున్నావా... ఇవిగో ఈ కళ్ళుచూడు సముద్రతీరంలో దొరికే గవ్వలతో చేసినట్టుంది. కొన్ని షెల్స్‌కి 'ఫాస్ఫారిసెన్స్' ఉంటుంది అన్నాడు పవన్...

"ఫాస్ఫారిసెన్స్ గురించి ఒప్పుకుంటాను కానీ అది చీకట్లో సాధ్య మవుతుంది. అంతెందుకూ ఆ కాంతి ఇపుడెందుకు కనబడటంలేదు?" అడి గింది స్నిగ్ధ మళ్ళీ–

ఒక్కక్షణం ఆలోచించి చిరునవ్వుతో చెప్పాడు పవన్–"పాయింటే!

అయితే ఈ కళ్ళలో ఏవో ఆర్గానిక్ బాడీస్ చేరివుండాలి ... కొన్ని బాక్టీరియాలకి మిణుగురు పురుగుల్లా కాంతినిచ్చే స్వభావం ఉంటుంది కదా... ఎనీవే. ఈ బొమ్మ నిజంగానే నన్ను హడలుగొట్టేసింది " బొంబాయికివెళ్ళి మన డిపార్ట్ మెంట్ వాళ్ళకు చూపిద్దాం—

"అయితే దీన్ని ఆ షాప్ వాళ్ళకి వాపసుచేయవా?" అడిగింది స్నిగ్ధ ఆశ్చర్యంగా...

"ఇంక రేర్ అంటిక్ మన డిపార్టుమెంటులో ఉంటే మనం రిసెర్చ్ చేయవచ్చు...రేపు షాపు అతడ్ని అడిగి దీనిధర చెల్లించేస్తాను..."

ఆ తర్వాత మౌనంగా ఉండిపోయింది స్నిగ్ధ

అక్కడ్నించి కదిలివెళ్ళి కిటికీలోంచి బయటకు చూస్తూ నిలబడి పోయింది.

పవన్ మాటల్లో రీజనింగ్ ఉంది-లాజిక్ ఉంది కానీ తన మనసు దాన్ని స్వీకరించలేకపోతోంది...

ఖండాలాకు బయల్దేరిన వేళావిశేషం ఏమిటోకాని అసాధారణమయిన సంఘటనలు మనశ్శాంతిలేకుండా చేస్తున్నాయి.

పవన్ ఆమె పక్కనవచ్చి నిలబడ్డాడు - అతడికేసి తిరిగి చూడకుండా నెమ్మదిగా చెప్పింది స్నిగ్ధ.

"పవన్! మనం బొంబాయి తిరిగి వెళ్ళిపోదాం—"

ఆమె భుజం చుట్టూ చెయివేసి అభయమిస్తున్నట్టు దగ్గరకు తీసుకున్నాడు పవన్.

• • •

మర్నాడు ఉదయం—

కాటేజి చౌకీదారు డిక్కీలో సామానులు సర్దేసాక అతడికి బక్షీష్ ఇచ్చి కారెక్కాడు పవన్. అప్పటికే కారెక్కి కూర్చున్న స్నిగ్ధకేసి చూసి "బయల్దేరదామా?" అంటూ కారు స్టార్ట్ చేసాడు.

మాల్ రోడ్డు దాటి హాండీక్రాఫ్ట్ షాప్ కేసి కారు మళ్ళించాడు పవన్.

హాండీక్రాఫ్ట్ షాపు ఎదురుగా కారాపి కిందకు దిగి అన్నాడు

"స్నిగ్ధా...నువ్వు కారులోనే కూర్చో నేను షాపతడితో మాటాడి

వచ్చేస్తాను"

విగ్రహం ఉన్న పార్సిల్ వెనకసీటులోంచి అందుకుని షాపులోకి నడిచాడు పవన్.

కౌంటర్ దగ్గర షాపుఓనర్ కనబడక "సేట్‌జీ లేరా?" అడిగాడు తను అక్కడున్న కుర్రాడిని.

"అంటున్నారు..." అని వెనక గదికేసి సైగచేసాడా కుర్రాడు.

ఆ గదికేసి నడిచి గుమ్మం దగ్గరే ఆగిపోయాడు పవన్. దగ్గరకు వేసిఉన్న తలుపు అవతలి నించి ఇద్దరువ్యక్తుల సంభాషణ వినబడుతోంది-తలుపు సందులోంచి గదిలోపలకి చూసాడు పవన్.

"నిన్న సాయంత్రం జరిగుండాలి ఈ పొరపాటు...నువ్వు రాక ముందు కొత్తగా పెళ్ళయిన జంట ఒకరు షాపింగ్‌కి వచ్చారు...పొర పాటున ఆ పార్సిల్ వాళ్ళ కారులో పెట్టించేసానేమో" అంటున్నాడు షాపు ఓనర్.

"యూ ఫూల్!" అని షాపు ఓనర్‌ని చెంప మీద బలంగాకొట్టాడు రెండవ వ్యక్తి.

"అదికాదు రుస్తుంసేట్." అని మళ్ళీ ఏదో అనబోయాడు షాపు ఓనర్.

"ఇక మాట్లాడకు...ఇది సాధారణమయిన విషయం కాదు. భీష్మి నాయక్‌కి ఈ విషయం తెలిసిందంటే మన ప్రాణాలు దక్కవు..." అన్నాడు రుస్తుంసేట్.

అంతవరకూ గది తలుపులు తోసుకుని లోపలికి వెళ్దాం అనుకుం టున్న పవన్ ఆ ఆలోచన మానుకున్నాడు ... అక్కడే నిలబడి వాళ్ళ సంభాషణ వినసాగాడు-

"భీష్మినాయక్? ఆ పార్సిల్ ఆయనదా?" అన్నాడు షాపుఓనర్ భయంగా.

"ఆ పార్సిల్ తీసుకెళ్ళిన వాళ్ళు ఎక్కడుంటారో తెలుసా నీకు?"

"తెలీదు...కానీ తెలుసుకోవడం ఏమంత కష్టంకాదు." అన్నాడు షాప్ ఓనర్.

"అయితే వెంటనే బయల్దెరు...ఎలాగయినా ఆ పార్సిల్ తెచ్చు కోవాలి మనం...వాళ్ళు మర్యాదగా ఇచ్చేస్తే సరేసరి లేకపోతే ... దీనికి పని చెప్పవలసి ఉంటుంది" అంటూ తనకోటు జేబులోంచి వంపు కత్తి ఒకటి బయటకు తీసాడు రుస్తుంసేట్.

ఆ మాటలు విని అద్దిరిపడ్డాడు పవన్.

ఆ విగ్రహం కోసం తమని చంపడానికి కూడా సిద్ధపడుతున్నా రంటే అది చాలా విలువయినదయి ఉండాలి...దీని వెనక తనకు అర్థం కాని రహస్యం ఏదో ఉంది.

గది లోపలికివెళ్లి ఆ పార్శిల్ వాళ్ళకిచ్చేయాలా లేక...వెనక్కి తిరిగి వెళ్ళిపోవాలా అన్న ఆలోచనలో రెండు క్షణాలు కాలాయాపన చేసాడు పవన్.

అంతలో తలుపుతెరచుకుని షాపుఓనరు అతడి వెనక బట్టతల రుస్తుంసేట్ బయటకి వచ్చేసారు?

ఎదురుగా పవన్‌ని చూసి షాక్ తిన్నట్టు ఆగిపోయాడు షాప్ అతను.

"రుస్తుంసేట్...ఈయనే నిన్న మీ పార్సిల్ తీసుకెళ్ళింది."

రుస్తుంసేట్ ఒక అడుగు ముందుకేసాడు అతడిచేతిలో వంపుకత్తి మెరుస్తోంది—

"ఈ పార్సిల్ పొరపాటున నాకిచ్చేసారు నిన్న..." అన్నాడు పవన్.

"అవును ఇవ్వండి నాదే అది-దాని కోసమే వెతుక్కుంటున్నాం" అన్నాడు రుస్తుంసేట్.

"నేను స్టేట్ ఆర్కియాలజీ డిపార్ట్‌మెంట్‌లో అసిస్టెంట్ డైరెక్ట ర్‌ని...మీ కభ్యంతరం లేకపోతే ఇది నేను కొనుక్కుంటాను" అన్నాడు పవన్.

ఒక్కక్షణం అతడికేసి తేరిపారి చూసాడు రుస్తుంసేట్

"లేదు...అది ఎవరికీ అమ్మేదికాదు...ఇవ్వు!" అంటూ ముందుకి రాబోయాడు రుస్తుంసేట్.

"పోనీ ఈ విగ్రహం ఎక్కడిదో మీ దగ్గరకు ఎలా వచ్చిందో చెప్తారా?" అడిగాడు పవన్.

అతనికేసి కోపంగా చూసాడు రుస్తుంసేట్.

"అదంతా నీ కనవసరం మర్యాదగా ఆ పార్సిల్ అక్కడ పెట్టు!" అన్నాడతను కోపంగా.

పవన్‌కి పట్టుదల పెరిగింది—

"ఇందాక మీ ఇద్దరి సంభాషణ విన్నాను. దీని వెనక రహస్యం ఏమిటో తెలుసుకోనిదే ఈపార్శిల్ ఇచ్చేదిలేదు." అన్నాడు నిక్కచ్చిగా.

అంతే! కత్తి ఝళిపిస్తూ ముందుకి ఉరికాడు రుస్తుంసేట్.

ఇలాంటిదేదో జరుగుతుందని ముందే ఊహించిన పవన్ ఎడమ పక్కనున్న బొమ్మల స్టాండు బలంగా లాగాడు ... స్టాండున్నందున్న బొమ్మలు, ఫ్లవర్‌వాజ్‌లు ఫోటో ఫ్రేమ్‌లు రుస్తుంసేట్ మీద షాపు ఓనర్ మీద పడ్డాయి—.

ఒక్కక్షణం కూడా వృధాచేయకుండా వెనక్కి తిరిగి బయటకు పరుగెత్తాడు పవన్.

ఎదురొచ్చిన షాపుబాయ్‌ని ఒక్కతోపుతోసి షాపు బయట నిల బెట్టిన కారెక్కి ఇగ్నీషన్ స్విచ్ తిప్పాడు—

"ఏమయింది పవన్?" కంగారుగా అడిగింది స్నిగ్ధ వెనక సీటు లోంచి.

"చెప్తాను" ఈ పార్సిల్ పట్టుకో అని రివర్స్‌గేరులో కారు వెనక్కి మళ్ళించాడు—

కారు ముందుకి పోనిస్తుంటే రేర్‌వ్యూ అద్దంలో షాపులోంచి... రుస్తుంసేట్, అతని వెనుక షాపు ఓనర్ బయటకు రావడం కనిపించింది పవన్‌కి.

వాళ్ళిద్దరూ పరుగెత్తుకుంటూ రోడ్డుకి మరోవైపు పార్క్‌చేసిన కారె క్కారు...

అంటే! తమని వెంటాడ్తున్నారన్నమాట.

కారువేగం పెంచి ఘాట్‌రోడ్డుకేసి బయల్దేరాడు పవన్. వాళ్ళు తన

ప్రాణాలు తీసయినా ఆ విగ్రహాన్ని చేజిక్కించుకోవాలి అనుకుం టున్నారంటే తప్పకుండా క్రిమినల్స్ అయ్యుండాలి. ఆ విగ్రహం పోలీసు లకి అందివ్వడం మంచిది...కానీ ఇక్కడ కాదు...బొంబాయి పోలీసు డిపార్టుమెంట్ వాళ్ళకివ్వాలి—

"పవన్...ప్లీజ్...ఇపుడయినా చెప్తావా ఏం జరిగిందో? ఆ విగ్ర హం వాళ్ళకెందుకు ఇవ్వలేదు...ఎందుకింత ఫాస్టుగా డ్రైవ్ చేస్తునావ్?" ప్రశ్నలు కురిపించింది స్నిగ్ధ.

క్లుప్తంగా జరిగిందామెకు చెప్పాడు పవన్.

తన చేతిలోని పార్సిల్‌ని కారువెనక డాష్‌బోర్డు మీద పెట్టేసింది స్నిగ్ధ. కారువేగంగా సాగిపోతుంటే ఆ పార్సిల్ అటూ ఇటూ ఊగింది—

ఘాట్‌రోడ్డు కుదుపులకి పార్సిల్‌లోంచి బయటకు తొంగి చూసింది కరకింకర విగ్రహం—

ఘాట్‌రోడ్డులో చాలా జాగ్రత్తగా డ్రైవ్‌చేయాలి. కానీ పవన్ చాలా రఫ్‌గా డ్రైవ్ చేస్తున్నాడు. వెనకనుంచి వస్తున్న రుస్తుంసేట్‌ని వదిలించు కోవాలని యాభైకిలోమీటర్ల వేగంతో పోనిస్తున్నాడు కారుని. కారు మలు పులు తిరుగుతున్నపుడు రేర్‌వ్యూ అద్దంలో తనని ఫాలో అవుతున్న నల్ల అంబాసిడర్‌కారుని గమనిస్తూనే ఉన్నాడు పవన్.

ఇదంతా తమాషాగా ఉందన్నట్టు తలూపుతోంది కరకింకర విగ్రహం.

అంతలో...

ఒక మలుపుదగ్గర కారు బాగా స్లో చేయవలసివచ్చింది పవన్...

ఎదురుగా స్పీడుగా వస్తోంది ఒక లారీ.

లారీనిండా గ్యాస్ సిలండర్లున్నాయి.

కానీ, ఆ లారీ ఆ రోడ్డుమీద ఎలా వస్తోంది? అది వన్ వే రోడ్డు.

అట్నుంచి లారీ వస్తోందంటే తనని ఆపడానికేనా?

ఆ లారీడ్రైవర్ కూడా రుస్తుంసేట్ మనిషేనా?

ఒక్క క్షణం ఏం చెయాలో అర్థంకాలేదు పవన్‌కి. లారీపక్క నుంచి వెళ్ళడానికి ఘాట్‌రోడ్డు చాలా ఇరుకుగా ఉంది. ఒకవైపు కొండ...

మరోవైపు అగాధం!

కారాపి లొంగిపోదామా అనిపించింది పవన్‌కి ... కానీ ఆ లారీ మరింతవేగంగా ముందుకే వస్తోంది—తను బ్రేక్ వేసినా ఆ లారీ ఆగేట్టులేదు.

తిన్నగా తన కారుమీదకే వచ్చేస్తోంది...

రాక్షసిలా...తమను కంబళించేయాలన్నట్టు వేగంగా వస్తోంది.

"పవన్ డూ సమ్ థింగ్" అంటూ బిగ్గరగా అరిచింది స్నిగ్థ...

సడన్‌గా...

ఆక్సిలలేటర్ నొక్కేస్తూ...ఏమయితే అయిందని ఎడమ వైపుకి స్టీరింగ్ కట్ చేసాడు పవన్.

ఫాస్టుగా మీదకు వస్తున్న గ్యాస్ సిలండర్లలో అతడికారు పక్కనించి దూసుకుంటూ ముందుకెళ్ళి వందగజాల దూరంలో ఫాలో అవుతున్న నల్ల అంబాసిడర్ కారుని ఢీ కొట్టింది...

బిగ్గరగా అరచి కళ్ళుమూసుకుంది స్నిగ్థ...

కారు బ్రేక్ వేసి కిందకి దిగి చూసాడు పవన్. గ్యాస్‌సిలండర్ల లారీతోపాటు నల్ల అంబాసిడర్ కారు లోయలోకి ఒరిగిపోతుంటే గ్యాస్ సిలెండర్లు పెద్దగా మోతచేస్తూ బర్స్ట్ అయ్యాయి..." ఉవ్వెత్తున మంటలు లేస్తుంటే ఆ రెండు బండ్లు లోయలోకి పడిపోయాయి!...

కిందనించి పెద్ద బ్లాస్టు ఒకటి మళ్ళీ వినిపించింది.

అంబాసిడర్ కారు లోయలోకి పడిపోతున్నపుడు అందులోంచి బయటకు దూకిన రుస్తుంసేట్ శవం ఘాట్‌రోడ్డు కిందున్న ఒక చెట్టు కొమ్మమీద వేలాడుతోంది. అతడి కుడిచెయి తెగి పవన్ కారుదగ్గర పడుంది!

నిశ్చేష్టుడయి ఆ దృశ్యం చూస్తూ నిలబడ్డాడు పవన్.

అప్రయత్నంగా తనకారుకేసి చూసాడతను

కారు వెనకసీటు అద్దంలోంచి తొంగిచూస్తోంది కరకింకర విగ్రహం...

ఆ బీభత్సం తనకు సంతృప్తికరంగా ఉందన్నట్టు తలాడిస్తోందా విగ్రహం!

ఆ ఇల్యూషన్‌ని మనసులోంచి పక్కకు నెట్టేస్తూ వెనక్కి తిరిగాడు పవన్.

కారుతలుపు తెరచుకుని స్నిగ్ధ దిగడం చూసి స్నిగ్ధా...ప్లీజ్ కారు దిగద్దు..." అని బిగ్గరగా అరుస్తూ కారుకేసి పరుగెత్తాడతను.

# 3

బొంబాయి సాంటాక్రజ్ సెంటూర్ హోటల్ ఆవరణలో కారాపి స్నిగ్ధతోపాటు కిందకి దిగాడు పవన్.

రిసెప్షన్ కౌంటర్‌కెళ్లి డీలక్స్ స్వీట్ ఒకటి బుక్ చేసుకున్నాడతను బెల్‌బోయ్‌కి లగేజి అప్పచెప్పి స్నిగ్ధతో లిఫ్ట్‌కేసి నడిచాడు పవన్.

పవన్ బుక్‌చేసిన స్వీట్ నాల్గవ అంతస్తులో ఉంది. ఎంతో అధునాతనంగా ఉందా స్వీట్. విశాలమయిన హాలులో ఒకవైపు సోఫాసెట్టు మరోవైపు టి.వి. ఉంది...ఇంకో వైపు చిన్న డైనింగ్ టేబిల్. పల్చటి కర్టెన్ అవతల బెడ్‌రూం, డ్రెస్సింగ్ రూం...అటాచ్డ్ బాత్.

"స్వీట్‌బుక్ చేసావెందుకూ?..." అడిగింది స్నిగ్ధ బెల్‌బోయ్ లగేజి సర్దిపెట్టి వెళ్ళాక.

ఆమెను తన పక్కన సోఫాలో కూర్చోబెట్టుకున్నాడు పవన్.

"డార్లింగ్!...ఖండాలాలో రెండురోజులు హాయిగా ఉండిరావచ్చని ప్లాన్‌చేసుకుని వెళ్ళాం. కానీ బయల్దేరినప్పట్నించి ఏదో ఒకటి జరుగుతుండటంతో ఇద్దరం మూడ్స్‌పాడుచేసుకున్నాం. ఎల్లుండి హైదరాబాదుకి వెళ్ళిపోవాలి నేను...కనీసం ఈరెండురోజులయినా హాయిగా స్పెండ్ చేద్దాం ఇక్కడ" అన్నాడతను.

అతడిమాటలు నిర్లిప్తంగా వింది స్నిగ్ధ.

ఆమె చేతుల్ని మృదువుగా పట్టుకున్నాడు పవన్.

"స్నిగ్ధా! నువ్విలా డల్‌గా ఉంటే పిచ్చిపట్టినట్టుంటుంది నాకు" అన్నాడతను.

చటుక్కున అతడి కేసి తిరిగింది స్నిగ్ధ—

ఘాట్‌రోడ్‌లో నన్ను కారు దిగనివ్వలేదెందుకూ?"

ఉలిక్కిపడి ఆమెకేసి చూసాడు పవన్. ఘాట్‌రోడ్ ఆక్సిడెంట్ గురించి దార్లో ఏమీ అడగలేదు స్నిగ్ధ. పోలీస్‌స్టేషలో ఆక్సిడెంట్ రిపోర్ట్ నమోదు చేసినపుడు కూడా చాలా నార్మల్‌గా ఉందామె. దాన్నిబట్టి, ఇక ఆక్సిడెంట్ ప్రసక్తిరాదని అనుకున్నాడు తను.

"ఆ ఆక్సిడెంట్ చాలా భయంకరంగా జరిగింది స్నిగ్ధా! అది చూసి ఉంటే నువ్వు పూర్తిగా అప్సెట్ అయిపోయి ఉండేదానివి. అందుకే వారించాను" అన్నాడు పవన్.

"ఆ దృశ్యం దగ్గర్నించి చూద్దామనుకున్నాను." అంది స్నిగ్ధ.

ఆమెకేసి విచిత్రంగా చూసాడు పవన్.

"ఎ...ఎందుకూ?"

"అది మామూలు ఆక్సిడెంట్ కాదు కాబట్టి!"

"అంతే?" కళ్ళు చిన్నవిచేసి ఆమెకేసి చూసాడు పవన్.

ఒక్క క్షణం ఆగి సమాధానం చెప్పింది స్నిగ్ధ...

"ఆక్సిడెంట్‌కి కారణం కరకింకర విగ్రహమే."

ఆమె మాటల్ని మరోలా అర్థం చేసుకున్నాడు పవన్.

"అఫ్‌కోర్స్! దాని కోసమే కదా వాళ్లు మనల్ని వెంటాడింది." అన్నాడతను తేలిగ్గా.

"అదికాదు పవన్! కరకింకర శక్తే ఆ బీభత్సం చేసింది. ఆ విగ్రహం మన దగ్గరుండబట్టే మిరాక్యులస్‌గా తప్పించుకోగలిగాం." అంది స్నిగ్ధ నమ్మకంగా.

"ఓ గాడ్!" అంటూ నీరసంగా సోఫాలో వెనక్కివాలి కూర్చున్నాడు పవన్. ఫాంటసీలోకి వెళ్ళిపోతున్న స్నిగ్ధతో ఎలా మాట్లాడాలో అర్థంకాలేదతనికి.

"స్నిగ్ధా!...అది ప్యూర్ ఆక్సిడెంట్...అద్భుతశక్తి ఏదో అది జరిపించిందని ఊహించుకుంటావెందుకు? ఆ లారీ ఎదురొచ్చి ఉండకపోతే ఏమీ జరిగేదికాదు.ఎందుకిలా డీప్‌గా ఆలోచించి ఫాంటసీలోకి వెళ్ళిపోతావు?

అతడి మాటల్లో తొంగిచూస్తున్న చికాకును పట్టించుకోలేదు స్నిగ్ధ.

"నావి ఫాంటసీస్‌కావు పవన్. కరకింకర శక్తిమీద నాకు నమ్మకం బలపడ్తోంది రోజురోజుకి." అందామె.

ఆ మాటలువిని అదిరిపోయాడు పవన్. స్నిగ్ధగురించి ఏమనుకోవాలో అర్థంకాలేదతనికి. ఆమె గురించి ఆందోళన చోటు చేసుకుందతని మనసులో. హేతువాదానికి అందని విషయాలగురించి ఆలోచించి మనసు పాడుచేసుకుంటోందామె...తన రీజనింగ్ ప్రభావం ఆమెపైన ఏ మాత్రం ఉన్నట్టులేదు.

స్నిగ్ధ ఆలోచనా సరళి ఇలాగే కొనసాగితే... అది న్యూరాసిస్‌కి దారి తీయవచ్చు.

చటుక్కున లేచివెళ్ళి టెలిఫోన్ డైరక్టరీ అందుకున్నాడు పవన్. అందులోని పేజీలు గబగబ తిప్పి తనక్కావలసిన నంబర్ చూసుకుని ఫోన్ డయల్ చేసాడు-

"హల్లో। ఈజ్ ఇట్ డాక్టర్ సమ్దాన క్లినిక్?" అడిగాడతను ఫోన్లో

"పవన్" అంటూ అతడి దగ్గరకువచ్చి నిలబడింది స్నిగ్ధ.

ఆమెను పట్టించుకోకుండా ఫోన్‌లో మాట్లాడాడు పవన్. "డాక్టర్ సమ్దానితో మాట్లాడవచ్చా? నాపేరు పవన్‌కుమార్. నేను..." అని ఏదో అనబోయాడు తను...

కానీ...క్రాడిల్ మీద వేలుపెట్టి...

ఫోన్ డిస్కనెక్ట్ చేసేసింది స్నిగ్ధ.

ఆపెకేసి తలెత్తి చూసాడు పవన్...

"డాక్టర్ సమ్దాని...సైకియార్టిస్టుకి ఫోన్ చేస్తున్నావా పవన్? నాకు పిచ్చి పట్టిందనుకుంటున్నావా? బాధగా పలికిందామె కంఠం.

ఫోన్ క్రాడిల్‌లో పెట్టేసి లేచాడు పవన్.

"నో స్నిగ్ధా అలాంటిదేమీలేదు. నేను ఎన్ని విధాలుగా చెప్పినా నువ్వర్థం చేసుకోవడంలేదు. అందుకే డాక్టర్ సమ్దానికి నీ అబ్సెషన్ గురించి చెప్పి సలహాతీసుకుందాం అనుకున్నాను..."

అతడి మాటలు విని స్నిగ్ధ కళ్ళలో నీళ్ళు తిరిగాయి-

"నేను మనసువిప్పి మాట్లాడితే దాన్ని అబ్సెషన్ అంటావా

పవన్!...సరే...డాక్టర్ సమ్మానికి ఫోన్‌చేసి మాట్లాడు నన్నొక మెంటల్ పేషంట్‌గానూ, న్యూరాటిక్‌గాను చిత్రిస్తే నీకు బావుంటుందంటే అలాగే చెయ్యి. పెళ్ళయితే మనిద్దరం మరింత దగ్గరౌతాం అనుకున్నాను కానీ ఇలా మనమధ్య విభేదాలు వస్తాయనుకోలేదు" అంది స్నిగ్ధ.

ఆమె మాటలకు చలించిపోయాడు పవన్.

"స్నిగ్ధా...ప్లీజ్ అలా మాట్లాడకు. ఇపుడుమనిద్దరిమధ్య విభేదాలు విముఖతలు లేవు...ఈ రెండురోజులుగా నీధోరణి చూసి కంగారుపడ్డా నంతే...స్నిగ్ధా...నాక్కావల్సింది ఎటువంటి సమస్యలు, చికాకులు లేని హ్యాపీసూరీడ్ లైఫ్! అంతే...అది నాకివ్వలేవా? నేను నీ దగ్గర్నించి కోరు కునేది అంతకంటే ఏముంటుంది?" అన్నాడతను.

"నన్నేం చేయమంటావో నువ్వే చెప్పు పవన్...నువ్వెలా ఉండ మంటే అలా ఉంటాను. కానీ, దయచేసి నన్ను పిచ్చిదాన్ని చూసినట్టు చూడకు" అంది స్నిగ్ధ ప్రాధేయపడుతున్నట్టు.

స్నిగ్ధ దగ్గరకువచ్చి ఆమె భుజంమీద చేతులు వేసాడు పవన్.

"అయితే సీజ్ ఫైర్! ఇంతవరకు జరిగిందంతా మరచిపోయి మామూలుగా ఉందాం ఇద్దరం...మన మైండ్స్‌ని కండిషన్ చేసుకుని గత రెండురోజుల సంఘటనలు మనస్సుల్లోంచి తీసిపారేద్దాం-సరేనా?" నవ్వుతూ అడిగాడు...

ఒక్కక్షణం ఆలోచించి "సరే" అంది స్నిగ్ధ...

"అదీ! అలా ఉండాలి నా స్నిగ్ధ" అంటూ ఆమెను దగ్గరకు తీసు కుని ముద్దాడాడు పవన్.

• • •

ఆ సాయంత్రం హాయిగా గడిచిపోయింది...జుహూబీచ్‌లో గంట సేపు కాలక్షేపం చేసి భేల్‌పూరీతిని హోటల్‌కి చేరుకున్నారిద్దరూ.

రాత్రి తొమ్మిదిదాటాక బెడ్‌రూంలో టి.వి చూస్తూ కూర్చున్నాడు పవన్.

డ్రెస్సింగ్ రూంలోంచి బట్టలుమార్చుకుని బయటకు వచ్చిన స్నిగ్ధను రమ్మంటూ చేతులు చాపాడు...వచ్చి అతడి ఒడిలో వాలిపోయిం

దామె. ఆమెను పోదివి పట్టుకుని ముద్దెట్టుకుంటుంటే అతడ్ని వెనక్కి తోసేస్తూ కోపం నటించింది.

ఆమెను మరింత దగ్గరకు లాక్కుని మెడమీద ముద్దిచ్చాడు పవన్.

"వన్స్ ఈజ్ నాట్ ఎనఫ్" అంటూ నైటీ హూక్కులు విప్ప సాగాడు.

అతడ్ని వదిలించుకుని నిలబడింది స్నిగ్ధ...ఆమెను వెనకనించి పట్టుకుని నైటీపూర్తిగా లాగేసాడు...

ఒంటిమీద నూలుపోగు కూడా లేకపోవడంతో సిగ్గుపడి మొహాన్ని అరచేతుల్లో దాచుకుని బెడ్ కేసి నడవబోయింది స్నిగ్ధ...

ఆమెను ముందుకి పోనివ్వలేదు పవన్. తెల్లటి ఆమె వొంపుల శరీరం ట్యూబ్ లైట్ కాంతిలో మెరిసిపోతుంటే తన్మయత్వం వచ్చిందతనికి... వొత్తుగా ఉన్న ఆమె జుట్టు ఛాతిని కప్పేస్తుంటే...పక్కకు జరిపేసాడు..

అతడి జుట్టులోకి వేళ్ళుపోనిచ్చి ... తనకేసి లాక్కుంది స్నిగ్ధ. మెత్తటి కార్పెట్టుమీదకు అతడితో వాలిపోతూ శరీరమంతా అతడికి అప్ప చెప్పేసింది.

♦ ♦ ♦

రాత్రి ఒంటిగంటయింది...బెడ్ మీద పవన్ హాయిగా నిద్రపోతున్నాడు...

స్నిగ్ధ డ్రెస్సింగ్ రూంకి కెళ్ళి చీరకట్టుకుని వచ్చింది. హాండ్ బ్యాగ్ అందుకుని గబగబ బయటకు వెళ్ళబోయి ఏదో ఆలోచన వచ్చి నిద్రపోతున్న పవన్ కేసి చూసింది....

రైటింగ్ టేబిల్ మీద గుంటూర్ హోటల్ వాళ్ళ లెటర్ పాడ్ అందుకుని క్లుప్తంగా ఉత్తరం ఒకటి రాసింది...పొద్దునలేచి తను కనబడకపోతే కంగారుపడతాడు పవన్...ఆ ఉత్తరం చూసినంతమాత్రాన అతడు తను చేస్తున్న పనిని ఆమోదిస్తాడని కాదు...అది కేవలం తన సంతృప్తికోసమే

మరోసారి గడియారం చూసుకుని నెమ్మదిగా బయటకు నడిచింది స్నిగ్ధ...

లిఫ్ట్‌లో గ్రౌండ్ ఫ్లోర్‌కి దిగింది...చకచక రిసెప్షన్ కౌంటర్ దాటుకుంటూ బయటకి నడిచింది...

కార్‌పార్కింగ్‌లో కారు లాక్ తీస్తుంటే మెరుపొకటి మెరిసింది ఆకాశంలో...

దారిలో వర్షం పట్టుకోకపోతే బావుణ్ను... అనుకుంటూ కారుస్టార్టు చేసుకుని బయల్దేరింది. స్నిగ్ధ...

బొంబాయి దాటాక వర్షం పట్టుకుంది ... కారువేగం తప్పనిసరిగా తగ్గించి జాగ్రత్తగా డ్రైవ్ చేస్తోంది స్నిగ్ధ...ఆ భవనం సంగతేమిటో ఆ కరకింకర బ్యాక్‌గ్రౌండ్ ఏమిటో ఇవాళ తెలుసుకోవాలి తను. మనసులో ఎటువంటి అనుమానాలు మిగలకూడదు.

అడ్వెంచర్!

అవును తను చేయబోతున్నది అడ్వెంచరే?... ఈ అడ్వెంచర్ చేస్తేనే తన మనసు కుదుటపడ్తుంది. పవన్‌కి చెప్పి ఇలా వచ్చే అవకాశం ఉండదు...అందుకే చెప్పకుండా బయల్దేరింది తను... మాటతప్పి ఇలా చేస్తున్నందుకు, తన ప్రేమని, స్నేహాన్నే శంకిస్తాడేమో! కావచ్చు...కానీ తన సంజాయిషీ వింటే అర్థంచేసుకుంటాడు...

గంటన్నరసేపు కారు నడిపాక అనుమానం వచ్చింది స్నిగ్ధకి... ఆ గుట్ట ఎక్కడుందో తను కనిపెట్టకలదా? ఇంతకుముందు అట్నుంచి వెళ్తున్నపుడు పట్టపగలు... కానీ ఇపుడు కటికచీకటి...పైగా వర్షం కూడా కురుస్తోంది!... ఎదురుగా ఉన్న రోడ్డు కూడా సరిగ్గా కనిపించడం లేదు. కిటికీలోంచి బయటకు చూసింది...అంతా చీకటి!...పైగా వర్షం నీళ్లు కిటికీ అద్దంమీద పడ్తుండటంతో ఏమీ కనిపించడంలేదు.

పోనీ వెనక్కి తిరిగి వెళ్ళిపోతే?

కారు స్లో చేసి ఒక పక్కగా ఆపింది స్నిగ్ధ...

ఎందుకిలా చేసింది తను? ఆలోచించకుండా ఈ నిర్ణయం ఎందుకు తీసుకుంది?

కిటికీ అద్దం కిందకి రోల్‌చేసి బయటతొంగి చూసింది... వాన మరింత పెద్దదయింది...అప్పుడే తగ్గే సూచనలు లేవు!

మొహంమీద నీళ్లుపడితే తుడుచుకోడానికి హ్యాండ్‌బ్యాగ్‌లోంచి కర్చీఫ్ తీసింది స్నిగ్ధ...కర్చీఫ్‌తోపాటు చేతికి చిన్నపొట్లం తగిలింది... ఏమిటది?

కారు లోపల లైట్ ఆన్‌చేసి పొట్లాం విప్పిచూసింది...కాత్యాయని తనకిచ్చిన నల్లదారం.

మరుల మాతంగి!

కాటేజిలో తను నిద్రపోయాననుకుని దాన్ని కిటికీలోంచి బయటకు విసిరేసాడు పవన్...కానీ, తను అతడికి తెలియకుండా తెచ్చిపెట్టుకుంది మళ్ళీ...

మరులమాతంగి మణికట్టుకి కట్టుకుంది స్నిగ్ధ...

ఒక్క క్షణం అక్కడే కూర్చుని ఏదో ఆలోచిస్తూ ఉండిపోయింది...

ఇక లాభంలేదు...ఏదో ఒకటి చేయాలి తను. ఇక్కడ వర్షంలో ఒంటరిగా ఎంతసేపని కూర్చుంటుంది?

డోర్ తెరచుకుని కిందికి దిగింది స్నిగ్ధ...

వర్షపు జల్లు మొహంమీద పడుతుంటే కళ్లుమూసుకుని పోతున్నాయి.

కారులాక్ చేసి తాళాలు బ్యాగ్‌లో పడేసుకుని ఎడమవైపుకి చూసింది.

అంతలో కళ్ళుచెదిరిపోయేట్టు మెరుపొకటి మెరిసింది...ఎదురుగా బంజరుపొలం. దేవదారు చెట్లున్న బంజరుపొలం! అంటే తను అనుకోకుండా అక్కడే ఆపిందన్నమాట కారు! కాకతాళీయంగా జరిగిందా అలా?

బ్యాగ్‌లోంచి పెన్‌టార్చ్ లైట్ తీసి వెలిగించింది స్నిగ్ధ...అదేమంత ఉపయోగకరంగా అనిపించలేదు...అయినా మొండిగా ముందుకి నడిచింది పొలంలోంచి...

అలా ఎంతసేపు నడిచిందో...గుట్టదాకా ఎలా చేరుకుందో ఆమెకే తెలియదు...

గుట్ట దగ్గరకు చేరుకుంటుంటే ఆమె మనసులో ఆలోచనలు స్తంభించిపోయాయి. ఒకే ఒకమాట మనసులో మెదుల్తోంది...కరకింకర కరకింకర...

మెట్లెక్కి నెమ్మదిగా లోపలికి అడుగుపెట్టింది స్నిగ్ధ...

మైనంవొత్తి పట్టుకుని ఎదురైంది కాత్యాయని!

"నీ కోసమే ఎదురుచూస్తున్నాను..." అందామె...స్నిగ్ధకి ఏమనాలో అర్థంకాలేదు.

"అందరూ కింద ఆలయంలో ఉన్నారు." అంది కాత్యాయని మళ్ళీ.

అందరూ అంటే? కళ్ళు పెద్దవిచేసి ఆమెకేసి చూసింది స్నిగ్ధ...

"మనం కూడా వెళ్ళాం...కానీ ఇలా కాదు..." అంటూ స్నిగ్ధ చెయ్యిపట్టుకుని ఒకగదిలోకి తీసుకెళ్ళింది-రోమన్ మహారాజుల కాలంనాటి పడకగదిలా ఉంది.

పాడుబడిన ఆ భవనంలో ఇలాంటి గదులు కూడా ఉన్నాయా?

"ఆలయంలోకి వెళ్ళాలంటే ముందు స్నానం చేయాలి." అని స్నిగ్ధని స్నానాల గదిలోకి తీసుకెళ్ళింది కాత్యాయని.

స్నానాలగదిలో తన చీర విప్పేసింది కాత్యాయని. ఒక్క నిమిషం తర్వాత నగ్నంగా నిలబడి ఉందామె స్నిగ్ధ ఎదురుగా!

"అదేమిటి ఆగిపోయావు? ఆలస్యం అవుతోంది కానీ..." అంది కాత్యాయని...

స్నిగ్ధ కదల్లేదు...

కాత్యాయని ముందుకివచ్చి వర్షంలో ముద్దగా తడిసిన స్నిగ్ధ బట్టలు విప్పసాగింది.

స్నిగ్ధ అభ్యంతరం చెప్పలేదు ... చెప్పాలనిపించలేదు.

ఇద్దరూ స్నానాల తొట్టికేసి నడిచారు...పాలరాయి తొట్టి అది!... అప్పటికే అందులో వేడినీళ్ళు తోడి పెట్టారెవరో...అందులో ఏదో పొడి చల్లింది కాత్యాయని ... తొట్టిలోని నీళ్ళు ఆకుపచ్చగా మారాయి ... కొక్కానికి వేలాడుతున్న సంచిలోంచి రక్త గన్నేరు పూవులు తుంచి నీళ్ళలో చల్లింది.

"పద...కాసేపు హాయిగా పడుకో ఈ తొట్టిలో అంటూ స్నిగ్ధని చెయ్యి పట్టుకుని తొట్టిలో కూర్చోబెట్టింది...కాత్యాయని

స్నిగ్ధ నీటిలో కూర్చున్న వెంటనే కాత్యాయని కూడా ఆమె పక్కనే కూర్చుంది...తొట్టి ఎంతో విశాలంగా ఉంది. అయినా కాత్యాయని తన శరీరం స్నిగ్ధకు తాకుతున్నట్టుగా కూర్చుంది. నెమ్మదిగా ఇద్దరూ వెనక్కి వాలి పడుకున్నారు...ఇప్పుడు తొట్టిలోని నీళ్ళు మెడదాకా ఉన్నాయి. నీళ్ళలో తేలుతూ రక్త గన్నేరు పువ్వులు స్నిగ్ధ మొహాన్ని తాకుతున్నాయి. ఆ తొట్టి నీళ్ళలోని పరిమళం మత్తెక్కించేలా వుంది ...

కాసేపు స్నిగ్ధ ఒళ్ళు రుద్దింది కాత్యాయని. ఆ తర్వాత ఆమెకూడా నిశ్చలంగా స్నిగ్ధ పక్కన పడుకుంది.

అలా కాత్యాయని పక్కన కదలిక లేకుండా పడుకుంటే...ఎంతో హాయిగా ఉంది స్నిగ్ధకి.

స్నానాల తొట్టిపైన అమర్చి ఉన్న అద్దంలో ప్రతిమను చూసింది స్నిగ్ధ.

ఆకుపచ్చ నీటిలో తేలుతున్న రెండు శవాలు!

ఒక్కసారి ఒళ్ళు జలదరించింది. తనుకూడా శవంలా వుంది. ఇప్పుడు-

వెంటనే లేచి అక్కడ్నించి వెళ్ళిపోవాలనిపించింది ... అసలు తనక్కడేం చేస్తోంది?

"లేద్దాం పద!" అంటూ కాత్యాయని తొట్టిలోంచి లేచింది...

స్నిగ్ధ కూడా లేచి నిలబడింది...ఒక్కక్షణం క్రితం మనసులో మెదలిన ప్రశ్నలు ఇపుడామెను కలవరపెట్టడంలేదు. కాత్యాయని చెప్పినట్టు ఒళ్ళు తుడుచుకుని నిలబడింది!

కాత్యాయని సైగచేస్తే ఆమెను అనుసరిస్తూ గదిలోంచి బయటకు వచ్చింది.

అంతలో దూరంగా ఏదో శబ్దాలు వినబడ్డాయి ... నడుస్తుంటే శబ్దాలు మరింత దగ్గరయ్యాయి.

నగారా నాదమది...నగారా నాదంతోపాటు చాలామంది ఏదో జపం చేస్తున్నారు...అంతాకలసి ఒక హోరులా ఉంది!?

కిందికివెళ్ళే మెట్లదగ్గర ఒక్కక్షణం ఆగారిద్దరూ...గబగబ మెట్లు దిగి కిందికి వెళ్ళాలని స్నిగ్ధమనసు బలంగా కోరుకుంటోంది.

కాత్యాయనితో ఒక్కొక్క మెట్టు కిందకు దిగసాగింది స్నిగ్ధ...

భూగృహంలో. అడుగుపెట్టగానే కరకింకర విగ్రహంకేసి చూసింది స్నిగ్ధ...

విగ్రహంచుట్టూ ఇరవైమంది భక్తులు నిలబడి కరకింకరని మేలు కొల్పుతూ జపంచేస్తున్నారు.

ఆ విగ్రహంముందు చేతులు జోడించి నిలబడి ఉన్నాడో వ్యక్తి...

నెరసిన గెడ్డం... భుజాలదాకా తెల్లటి గిరజాలజుట్టు... కను బొమ్మలు మాత్రం నల్లగా ఉన్నాయి. వాటిమధ్య వింతగా మెరుస్తోంది రక్తతిలకం.

స్నిగ్ధ చెయ్యి పట్టుకుని అతని దగ్గరకు వెళ్ళింది కాత్యాయని...

"భక్తురాలు వచ్చేసింది మిహిర్‌కుట్టీ!" అంది కాత్యాయని అతడికి ప్రణామం చేస్తూ...

కుచ్చులిగంత ధరించిన మిహిర్‌కుట్టి స్నిగ్ధకేసి కదిలాడు. ఆమె ఎదురుగా నిలబడి పైనించి కిందదాకా పరిశీలనగా చూసాడు... అతడలా చూస్తుంటే ఒంట్లో సన్నగా చలి ప్రారంభమయి వొణికిపోయింది స్నిగ్ధ...అప్రయత్నంగా ఛాతిమీదకు చేతులుపోయాయి...

ఇదేమిటి?!

తను నగ్నంగా ఉందా!

అవును...నగ్నంగా ఉండటమే సహజంగా ఉంటుంది. పైగా కరకింకర ఆలయంలో అలాగే ఉండాలి కాబోలు.

"కరకింకర కోసం ఏం చేయకలవు నువ్వు" ఖంగుమని పలికింది మిహిర్‌కుట్టి కంఠం.

"ఏమయినా చేయగలను" అన్నాయి స్నిగ్ధ పెదాలు. ఆమె ఆలోచ నలు ఎప్పుడో స్తంభించిపోయాయి.

"సిద్ధంగా ఉన్నావా?" అడిగాడు మిహిర్‌కుట్టి-

"సిద్ధంగా ఉన్నాను..." పలికింది స్నిగ్ధ.

ఆమె భుజంచుట్టూ చెయివేసి విగ్రహంకేసి నడిచాడు మిహిర్‌కుట్టి–

"కరకింకర కళ్ళలోకి చూడు" అన్నాడు అతను.

తలెత్తి చూసింది స్నిగ్ధ...

విగ్రహం కళ్ళు తనకేసే చూస్తున్నాయి.

క్రమంగా అవి ఆకుపచ్చరంగులో మెరవసాగాయి.

ఆ కళ్ళలోకి చూస్తూ ఉండిపోయింది స్నిగ్ధ...దృష్టి తిప్పుకోవాలని లేదు...అక్కడ్నించి కదలాలని లేదు.

"కరకింకర నీ పొందు కోరుకొంటున్నాడు" అన్నాడు మిహిర్‌కుట్టి

తెలుసన్నట్టు తలూపింది స్నిగ్ధ...ఎందుకో.

"నీకా అర్హత ఉందా?" అడిగాడు మిహిర్‌కుట్టి...

ఉందన్నట్టు తలూపిందామె...మిహిర్‌కుట్టి ఆమెకేసి కదిలాడు... యంత్రికంగా కాళ్ళుచాపి నిలబడింది స్నిగ్ధ.

ఆమె తొడలమధ్య తడిమి చెయి పైకెత్తాడు మిహిర్‌కుట్టి... అతడి చేతి కంటిన రక్తపు మరకలు చూసి అక్కడున్న భక్తులందరూ స్నిగ్ధ ముందు మోకరిల్లారు. ఆమె అలాగే కాళ్ళుచాచి నిలబడి ఉంటే వాళ్ళందరూ యోనిపూజ ప్రారంభించారు.

ఏమిటి తను చేస్తున్నది? ఎవరు వీళ్ళంతా...? ఎందుకిలా చేస్తున్నారు? జుగుప్స కలిగేలా ఎందుకు ప్రవర్తిస్తోంది తను?

అంతలో ఒక మగశిశువుని ఎత్తుకుని వచ్చింది కాత్యాయని...

ఆ శిశువుని అందుకుని కరకింకర పాదాల దగ్గర పడుకోబెట్టాడు మిహిర్‌కుట్టి...

"కరకింకరకు నీ పొందుకావాలి. దానికోసం నువ్వు పరమోత్కృష్టమయిన సమర్పణ చేయాలి" అంటూ స్నిగ్ధచేతికి తళుక్కుమని మెరుస్తున్న కొడవలి ఇచ్చాడు మిహిర్‌కుట్టి

కొడవలి అందుకుంది స్నిగ్ధ...కరకింకర పొందుకోసం అదేమంత పెద్దపనికాదు. కరకింకర విగ్రహం కాదు. ...శక్తి!! ఈచిన్న పనిచేస్తే ఆ శక్తి తనదవుతుంది.

అంతలో...అక్కడున్న వాళ్ళంతా మంత్రోచ్చారణ ప్రారంభించారు.

కరకింకరా...మహమ్మారి.
అఘోరథా...కుంభీనసా॥
భద్ర ఛాద్ర—భయంభయా॥।
మంత్రోచ్చారణకి నగారానాదం తోడయి ఆలయం మారుమ్రోగి పోతోంది...

అంతవరకూ మామూలుగా పడుకున్న ఆ శిశువులో ఏదో చలనం వచ్చింది...శిశువు కుడిచేయి మెలికలు తిరిగిపోతోంది.

తనచేత్తో తనగొంతు నులుముకుంటూ బిగ్గరగా ఏడవసాగిందా శిశువు...

"ఈ శిశువుని గుర్తుపట్టావా?" అడిగాడు మిహిర్‌కుట్టి

స్నిగ్ధ ఒక్క క్షణం ఆగి చూసింది.

ఆ బాబు ఎవరోకాదు...తను కన్నబిడ్డ!

"కరకింకరకు నైవేద్యం పెట్టు." అన్నాడు మిహిర్‌కుట్టి మళ్ళీ.

తను చేయవలసిన పని అర్థమయింది స్నిగ్ధకి... గొంతునులుము కుంటున్న శిశువు చెయి కొడవలితో నరికేయాలి తను.

కొడవలి పట్టుకున్న ఆమె చెయ్యి దానంతట అదే పైకిలేచింది...

తనలో ఈ రాక్షసత్వం ఏమిటి?

ఈ దౌర్జన్యానికి ఎలా ఒప్పుకుంది తను?

తన కన్నబిడ్డచేతిని తనే నరికేయాలా. ఆ దెబ్బకి పసివాడి ప్రాణాలేపోతేనో?

మనస్సు వద్దంటోంది...మాతృత్వం విలపిస్తోంది...

అయినా స్నిగ్ధ శరీరం మాత్రం ఆమెవశంలో లేదు.

అవును మరి! కరకింకర శక్తిముందు తనెంత?

స్నిగ్ధ చెంపలమీదుగా కన్నీళ్ళు కారిపోతున్నాయి. మరోసారి తన బిడ్డకేసి చూసుకుంది స్నిగ్ధ!...గొంతు నులుముకుంటున్న ఆ చెయ్యి నరికేయాలి. కనీసం....అలా అయినా తనబిడ్డ ప్రాణం కాపాడుకోగలదు తను. లేకపోతే తన గొంతు నులుముకొని చచ్చిపోతాడు బాబు.

"బాబూ నన్ను క్షమించు" అనుకుంది మనసులో ఒకసారి.

కొడవలి పట్టుకున్న ఆమె చెయ్యి విసురుగా కిందికి వాలింది.

సరిగ్గా శిశువు భుజంమీద పడింది కొడవలి దెబ్బ.

## 4

కొడవలిదెబ్బ శిశువు భుజం మీదపడి ఆ పసివాడిరక్తం పైకి చిమ్ముతుంటే...

"బాబూ!" అంటూ కళ్ళుమూసుకుని వెక్కి వెక్కి ఏడవసాగింది స్నిగ్ధ.

కరకింకర భక్తులు ఆనందోత్సాహాలతో మంత్రోచ్చారణ కొనసాగించారు. నగారానాదం కూడా దానికితోడై ఆలయం మారుమ్రోగింది. ఆ హోరులో స్నిగ్ధను ఎవ్వరూ పట్టించుకోవడం లేదు.

"స్నిగ్ధా!"

ఏడుపు ఆగడంలేదు స్నిగ్ధకు. కన్నబిడ్డ చెయి నరికేసింది తను. ఆ చిన్నారి చెయి అల్లారుముద్దుగా పట్టుకుని అక్షరాభ్యాసం చేయించవలసిన తను...రాక్షసిలా ఒకే ఒక దెబ్బతో బాబుని అవిటివాడిని చేసేసింది

"స్నిగ్ధా!"

భుజం పట్టుకుని ఎవరో కుదిపేస్తున్నారు తనని... మిహిర్ కుట్టా? కాత్యాయనా?...పట్టించుకునే స్థితిలో లేదు తను...ఏడుపు ఆపుకోలేకపోతోంది? కన్నీళ్లు ప్రవాహం చెంపల్ని తడిపేస్తున్నాయి. కళ్లుతెరచి చెయి తెగిన బాబుకేసి చూడటానికి ధైర్యం చాలడం లేదు.

"స్నిగ్ధా" మళ్ళీ ఎవరో కుదిపేస్తూ పిలుస్తున్నారు తనని-ఎవరిదా పిలుపు?

......

నెమ్మదిగా కళ్ళుతెరచింది స్నిగ్ధ

చుట్టూ కలయచూసింది...

ఏమీ అర్థంకాలేదు!

అక్కడ మిహిర్ కుట్టిలేదు. కాత్యాయని కూడా లేదు. కరకింకర విగ్రహం చుట్టూ మంత్రోచ్చారణ చేస్తున్న భక్తులు లేరు। కొడవలితో తను గాయపరిచిన శిశువు జాడలేదు.

ఏమయిపోయారందరూ?

తనమీదకు వొంగి ఆందోళనతో చూస్తున్న వ్యక్తి ఎవరు?

అసలు తనెక్కడుంది?

"స్నిగ్ధా ఏమయింది?..." అడిగాడతను.

అయోమయంగా చూసిందతడ్ని... ఎవరతను? గుర్తు తెచ్చుకోవడానికి ప్రయత్నించింది స్నిగ్ధ.

"ఏమిటా చూపులు?... నిన్నే. ఏడుస్తున్నావెందుకూ? పీడకల ఏదైనా చూశావా?" అడిగాడతను మళ్ళీ.

పవన్।

పవన్ తన భర్త।

అంటే?...అంతసేపు తనుచూసింది కలా?

ఇంకావెక్కిళ్ళు వస్తూనే వున్నాయి స్నిగ్ధకు...నెమ్మదిగా తేరుకుంటూ చుట్టూ కలయ చూసింది. హోటల్ గది. సెంటూర్ హోటల్ గది। ఒక్కొటంటూ అన్ని విషయాలు గుర్తుకొచ్చాయి...

రెండ్రోజులక్రితం రిజిస్ట్రార్ ఆఫీసులో పవన్ తోపెళ్ళిజరగడం... ఖండాలాకి వెళ్ళడం... బొంబాయికి తిరిగి వస్తున్నపుడు దారిలో జరిగిన ప్రమాదం... అంతా గుర్తొచ్చింది.

అది వాస్తవం.

హోటల్ గది దాటి తనెక్కడికీ వెళ్ళలేదు.

అయినా...కరకింకర ఆలయంలో జరిగినసంఘటన కేవలం పీడకల అని నమ్మలేకపోతోంది మనసు.

వాస్తవంలోకి రావడానికి తిరస్కరిస్తోంది మనసు.

"మంచినీళ్లు తాగుతావా స్నిగ్ధా।" పవన్ అడిగాడు.

నీరసంగా తలూపింది స్నిగ్ధ.

పవన్ లేచి ఫ్రిజ్ నీళ్ళు గ్లాసులోపోసి తీసుకొచ్చాడు.

భుజందాకా కప్పుకున్న బ్లాంకెట్ మరింత దగ్గరకు లాక్కుంటూ లేచి కూర్చుని మంచినీళ్ళ గ్లాసు అందుకుంది స్నిగ్ధ.

"థాంక్స్" అంది మంచినీళ్లు సిప్ చేసి.

"ఆర్ యూ ఫీలింగ్ బెటర్?" అడిగాడు పవన్...

తలూపి మళ్ళీ దిండు మీదకు తలవాల్చేసింది స్నిగ్ధ. ఆమెపక్కనే తల నిమురుతూ పడుకున్నాడు పవన్.

"నిద్దట్లో నువ్వలా వెక్కి వెక్కి ఏడుస్తుంటే అద్దిరిపోయాను కల భయంకరంగా ఉందా?"

సమాధానం చెప్పకుండా ఒత్తిగిలి పడుకుంది స్నిగ్ధ. ఆమె భుజం చుట్టూ చేయివేసుకొని పడుకున్నాడు పవన్.

స్నిగ్ధ మనసు కొంత కుదుటపడ్డా అంతకుముందు చూసింది కల మాత్రమేనని నమ్మడం కుదరడంలేదు ఆమెకు.

కాపలో తను ఒంటరిగా ఖండాలా రోడ్డులో వెళ్ళడం... వర్షంలో ముద్దగా తడుస్తూ భవనం చేరుకోవడం కళ్ళకు కట్టినట్టుగా గుర్తుంటే అది కల అని ఎలా నమ్మేది? అదంతా వాస్తవంగా జరిగినట్టుగానే తోస్తోంది. ఆలయంలో కరకింకరకు నైవేద్యం పెట్టాలని బాబు చెయి నరకడం కూడా......

బాబు??!

స్నిగ్ధ ఆలోచనలు క్షణంసేపు ఆగిపోయాయి.

బాబు ఎవరు?

తను చెయి నరికేసిన శిశువు తన బిడ్డా.

అయినా, తనకు బిడ్డలేమిటి? ఇంపాసిబుల్

మంచంమీద అసహనంగా కదిలింది స్నిగ్ధ...

పక్కన పడుకున్న పవన్ అపుడే నిద్ర పోయాడని అతడి ఉఛ్వాస నిశ్వాసను బట్టి అర్థమయి భుజంమీదనుంచి జారుతున్న అతడి చేయి జరిపేసి నెమ్మదిగా లేచింది.

ఒళ్ళంతా బరువుగా ఉన్నట్టనిపిస్తున్నా మెల్లగా బాత్‌రూంకేసి నడిచింది.

బాత్‌రూం లైట్ ఆన్‌చేసి లోపలికి అడుగుపెట్టి...ఎదురుగావున్న అద్దంలో తన ప్రతిమను చూసుకుని అదిరిపడింది స్నిగ్ధ.

తెల్ల సిల్కుచీర కట్టుకుని ఉంది తను.

ఆ చీర కట్టుకునే కదా తను బయల్దేరింది?

తను చూసింది కలే అయితే ఒంటిమీద ఆ చీర ఎలా ఉంటుంది? రాత్రి చీర కట్టుకునే పడుకుందా తను? నో... తనకు బాగా గుర్తుంది. ఒంటిగంట ప్రాంతాల్లో నిద్రలేచి బట్టలు మార్చుకుని బయల్దేరింది తను అప్పుడు కట్టుకున్న చీర ఇదే.

అంటే జరిగిందంతా వాస్తవమేనా??

వాస్తవానికి కలకి తేడా తెలుసుకోలేకపోతోందేమిటి తను?

ఏమయిపోతోంది తనకు?...

ఒకవేళ...

జరిగింది నిజమయితే...

కరకింకర ఆలయంనించి హోటల్‌కి ఎలా తిరిగి వచ్చింది తను?

తను జ్ఞాపక శక్తి కోల్పోతుందా? మతి భ్రమిస్తోందా?

లేక...ఇదంతా

కరకింకర మాయా?

ప్రశ్నల పరంపరలో మనస్సంతా గజిబిజిఅయిపోతుంటే అక్కడే బాత్‌రూంలో నిలబడిపోయింది స్నిగ్ధ...

భుజంమీదనించి చీరకొంగు జారిపోతున్నా పట్టించుకోలేదామె.

అప్పుడు కనిపించాయామెకు.

తన ఒంటిమీద...రక్తపుమరకలు.

ఏమిటిది?

ఎలా వచ్చాయామరకలు?

బాబు చెయి నరికేస్తున్నప్పుడు తనమీదకి చిందిన రక్తమా అది?!

అప్రయత్నంగా చీర విప్పిపడేసింది స్నిగ్ధ. మరోసారి అద్దంలో పరిశీలనగా చూసుకుంది. ఒంటిమీద రక్తపుమరకలు చీరమీద లేవెందుకు?

అవును మరి...

కరకింకర ఆలయంలో తను నగ్నంగా ఉంది కదా.

• • • •

మర్నాడు ఉదయం—

"గుడ్ మార్నింగ్" అంటూ నిద్రలేపాడు పవన్...

"టైం ఎంతయింది?" అడిగింది స్నిగ్ధ బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంటూ.

"తొమ్మిది..."

చటుక్కున లేచి కూర్చుంది స్నిగ్ధ.

"మరింతసేపు లేపలేదెందుకూ?"

"నువ్వు హాయిగా నిద్రపోతుంటే లేపాలనిపించలేదు. రాత్రేదో పీడ కలలంటూ సరిగ్గా నిద్రపోయినట్టులేదు." అన్నాడు పవన్ ఆమె పక్కన కూర్చుంటూ.

అతని భుజంమీద తలానించి కూర్చుంది స్నిగ్ధ. ఒంట్లో కొంచెం నీరసంగా ఉన్నా మనసు తేటగానే ఉంది.

రాత్రి బాత్‌రూంలో ఒంటిమీద రక్తపు మరకలు చూసుకుని పూర్తిగా కన్‌ఫ్యూజ్ అయిపోయింది తను. ఆ సంభ్రమంలోంచి బయట పడటానికే రెండు నిద్రమాత్రలు వేసుకుని పడుకుంది... ఆ మాత్రల ప్రభావం వల్లనే కాబోలు ఇపుడు కొంచెం ప్రశాంతంగా ఉంది.

"రాత్రి ఏం కల చూశావు? అంతగా ఏడ్చావు?" అడిగాడు పవన్ నవ్వుతూ...

తను చూసింది కలకాదని చెప్పాలనిపించింది స్నిగ్ధకి—

కరకింకర కేవలం తన ఊహ కాదని—అతడి హేతు వాదానికి అందని అతీత శక్తని చెప్పాలనుకుంది—

కానీ, చెప్పలేదు - చెప్పదలుచుకోలేదు.

"కలా—? ఏమో గుర్తులేదు; బాగా ఏడ్చానా? నా ఏడుపు వినే లేచావా నువ్వు?" అడిగింది స్నిగ్ధ నవ్వు తెచ్చిపెట్టుకుంటూ.

అంతలో డోర్‌బెల్ మోగడంతో పవన్ లేచివెళ్ళాడు.

కాసేపట్లో తెల్లకవరొకటి పట్టుకుని లోపలకు వచ్చాడు.

"ఏమిటిది?" అడిగింది స్నిగ్ధ—

"శ్యామసుందర్ దగ్గర్నించి ఏదో మెస్సేజ్ వచ్చింది" అంటూ కవరు చింపాడు.

ఆ ఉత్తరం చదివి ఆలోచనలో పడిపోయాడతను.

"పవన్ ఏమయింది?" స్నిగ్ధ అడిగింది.

"అమ్మకు ఒంట్లో బాలేదని టెలిగ్రాం వచ్చిందట..." అన్నాడు పవన్ కంగారుగా.

"ఓగాడ్!...మరి నువ్వు వెళ్తావా?"

"వెళ్ళాలి మరి...కానీ..." అంటూ ఆగాడు పవన్.

"నా గురించి ఆలోచిస్తున్నావా? డోంట్‌వర్రీ...నువ్వు వీలైతే ఇవాళ సాయంత్రం ఫ్లైట్‌కే బయల్దేరు." అంది స్నిగ్ధ...

"సరే...తప్పదనుకుంటాను. కానీ స్నిగ్ధా...చిన్నరిక్వెస్ట్. నేను అమ్మకు మన విషయం చెప్పి నిన్ను తీసుకెళ్ళడానికి వారం పదిరోజుల్లో తిరిగివస్తాను...అప్పటిదాకా నువ్వు శ్యాంసుందర్ వాళ్ళింట్లో ఉండాలి!... శ్యాంసుందర్ వాళ్ళావిడ నీకు ఫ్రెండేకదా?" అన్నాడు పవన్ లేస్తూ.

అతనలా ఎందుకంటున్నాడో అర్థం చేసుకుంది స్నిగ్ధ. ఒంటరిగా ఉండి లేనిపోని ఆలోచనలతో మనసు పాడుచేసుకుంటుందని అతడి భయం.

"సరే అలాగే!" అంది స్నిగ్ధ.

• • •

ఆ మధ్యాహ్నమే హోటల్ స్వీట్ ఖాళీచేసి శ్యాంసుందర్ ఇంటికి చేరారిద్దరూ. శ్యాంసుందర్, అతడి భార్య సుమిత్ర వాళ్ళకోసమే ఎదురు చూస్తున్నారు.

"సోహా ఆర్ ద లవ్ బర్డ్స్" అని జోక్ చేసాడు శ్యాం వాళ్ళిద్దర్నీ చూసి.

ఆ తర్వాత అందరూ కలిసి భోంచేస్తున్నపుడు సుమిత్ర అంది.

"అన్నయ్యగారూ-మీరేం కంగారు పడకండి...మీ ఆవిడ్ని కంటికి రెప్పలా మేము చూసుకుంటాం. అమ్మగార్కి జ్వరం తగ్గాక వచ్చి తీసుకెళ్ళరుకాని."

"అన్నట్టు శ్యాం నా టికెట్ కన్ఫర్మ్ అయిందా?" అడిగాడు

పవన్ తనమిత్రుడిని.

"అం...ఓ.కె...పవన్ ఇక మీరిద్దరూ కాసేపు గెస్ట్‌రూంలో రెస్ట్ తీసుకోండి నేనూ, సుమిత్ర చిన్న షాపింగ్ ఒకటి ముగించుకుని నీ ఫ్లైట్ టైంకి వచ్చేస్తాం" అన్నాడు శ్యాం లంచ్ ముగించి లేస్తూ.

• • •

సూట్‌కేసులో బట్టలు సర్దుకుంటూ స్నిగ్ధను పిలిచాడు పవన్.

"ఆ బొమ్మ ఏదీ?" అడిగాడతను.

"నా దగ్గరే ఉంది...ఎయిర్ బ్యాగ్‌లో" అంది స్నిగ్ధ.

మంచంకిందున్న ఎయిర్‌బాగ్ జిప్‌తీసి అందులోంచి కరకింకర బొమ్మ బయటకి తీసాడు పవన్.

"దీన్ని నేను తీసుకెళ్తాను" అంటూ తన సూట్‌కేసులో పెట్టుకున్నాడా బొమ్మని.

"అదెందుకు నీకు?" అడిగింది స్నిగ్ధ...

"చెప్పానుకదా...ప్రొఫెషనల్ ఇంటరెస్ట్! హైదరాబాదులో మన డిపార్టుమెంటులో దీని గురించి పరిశోధన చేయిస్తాను. ప్రొఫెసర్ మెహ్తా గారికికూడా చూపిద్దాం అనుకుంటున్నాను" అని సూట్‌కేస్ మూసేసాడు.

కాసేపాగి మళ్ళీ అన్నాడు పవన్.

"స్నిగ్ధా...నాకిలా ఉన్నఫళంగా వెళ్ళిపోవడం ఏమీ బాలేదు...నిన్నిలా ఒంటరిగా వదిలివెళ్ళిపోతే మళ్ళీ నువ్వా సంఘటనలగురించి ఆలోచిస్తూ బుర్ర పాడుచేసుకుంటావని భయంగా ఉంది."

"నా గురించి కంగారుపడకు పవన్. ఐవిల్ బీ ఫైన్. నేనా విషయాలు గురించి ఆలోచించను...వీలైతే రేపే డ్యూటీ జాయిన్ అయిపోతాను. పనిలోపడిపోతే మైండ్ డైవర్ట్ అవ్వదు" అంది స్నిగ్ధ నవ్వుతూ.

స్నిగ్ధను దగ్గరకు తీసుకుని పెదాలమీద ముద్దిచ్చాడు పవన్.

కాంపౌండ్‌లో కారుహారన్ విని ఆమెను వదిలిపెట్టాడతను.

"శ్యాంసుందర్ వెయిట్ చేస్తున్నాడు...పద" అంటూ సూట్‌కేస్ అందుకుని బయటికి నడిచాడు పవన్.

• • •

ఆఫీసు టేబిల్ మీద హ్యాండ్ బ్యాగ్ పడేసి లేత నీలంరంగు కవరు అందుకుని గబగబ చింపి ఉత్తరం తీసి చదువుకుంది స్నిగ్ధ. పవన్ హైదరాబాదుకు చేరాక రాసిన ఉత్తరం అది.

'స్నిగ్ధా, మై డార్లింగ్'

ఎలా ఉన్నావ్? నా టెలిగ్రాం అందిందా? అక్కణ్నించి వచ్చాక మనస్సంతా చికాగ్గా ఉంది. ఏమీ చేయాలనిపించడంలేదు. ఇవేల్టికి నిన్ను చూసి మూడురోజులయింది తెలుసా? కళ్ళు మూసుకున్నా తెరచినా నీ రూపమే కనిపిస్తోంది. బొంబాయి ఎయిర్‌పోర్ట్‌లో నన్ను సాగనంప డానికి వచ్చి సెక్యూరిటీ చెక్‌కి నేను వెళ్తుంటే చెయ్యూపుతున్న నీ రూపం మాటిమాటికి గుర్తుకొస్తోంది. రాత్రి పడుకుంటే ... నువ్వు నా పక్కనే ఉన్నట్టు...నా భుజంమీద తలపెట్టుకు పడుకుని నా ఛాతీమీద "ఐ అడోర్ యూ!" అని చూపుడువేలుతో రాస్తున్నట్టు...ఏదో ఫాంటసీ!... మనంఇలాఇంకెన్నాళ్ళుదూరంగాఉండాలోతెలియడంలేదు వసూ!..అమ్మకు ఇప్పుడు జ్వరం తగ్గింది కానీ ఇంకా పూర్తిగా కోలుకోలేదు. అందుకే ఇంతవరకూ ఆమెకు ఏమీ చెప్పకుండా ఉండిపోయాను. అవకాశం చూసుకుని వీలైనంత త్వరలో అమ్మతో మాట్లాడతాను. బేర్ విత్ మీ ఫర్ సమ్ మోర్ టైం డియర్.

విత్ లవ్...నీ

పవన్—

పవన్ రాసిన ఉత్తరం చదివి నిస్సత్తువుగా కుర్చీలో కూర్చుండి పోయింది స్నిగ్ధ—

అవకాశం చూసుకుని...తన తల్లికి చెప్తానని రాశాడు పవన్.

ఎప్పుడొస్తుందా అవకాశం?

పవన్‌కి అతడి తల్లిపట్ల ఉన్న ప్రేమ, గౌరవం— భయం తనె రుగనిది కాదు. శ్యామసుందర్ తనకు అన్నీ విడమర్చి చెప్పాడు. శ్యామ సుందర్ మాటలు విన్నాక అసలు పవన్ తన తల్లితో మాట్లాడకలడా అన్న అనుమానం కూడా వచ్చింది.

అతడు ధైర్యంచేసి మాట్లాడే వరకు తనిలా ఒంటరిగా ఉండవలసిం

దేనా.

పవన్ గురించి ఆలోచనలు పక్కకునెట్టి ఫైల్సులో కాగితాలమీద మనస్సు లగ్నం చేయాలని ప్రయత్నించింది స్నిగ్ధ...

ఇక లాభంలేదనుకుని ఫైల్స్ లాకర్‌లో పెట్టి లేచింది.

• • •

హైదరాబాదు—

స్టేట్ ఆర్కియాలజీ డిపార్టుమెంట్ ఆఫీసు—

అసహనంగా తన సీట్లో కూర్చున్నాడు పవన్—

అరగంటనుంచీ బొంబాయి శ్యామసుందర్ ఇంటికి ఎస్.టి.డి డయల్ చేస్తున్నాడతను—నెంబర్ దొరకడంలేదు.

పదిహేను రోజులైనా స్నిగ్ధ దగ్గర్నుంచి తన ఉత్తరానికి సమాధానంరాలేదు. కారణమేమిటో అంతుపట్టడంలేదు. సంగతేమిటో కనుక్కుందామని గంట ముందే ఆఫీసుకి వచ్చి శ్యామసుందర్ ఇంటికి ఫోన్ చేస్తున్నాడతను. ట్రంక్‌కాల్ బుక్ చేస్తేనైనా లైను దొరుకుతుందేమో అనుకుంటూనే చివరిసారి అనుకుంటూ బొంబాయి నెంబర్ డయల్ చేశాడు పవన్.

నెంబర్ రింగ్ అవుతోంది.

రిలీఫ్‌తో కుర్చీలో వెనక్కి వాలాడు పవన్.

రెండు నిముషాలపాటు ఫోన్ రింగ్ అయినా ఎవరూ పికప్ చెయ్యక పోయేసరికి ఆశ్చర్యమనిపించిందతనికి.

శ్యాంసుందర్ ఇంట్లో ఎవరూ ఉండకపోవడమూ?

ఎక్కడికి వెళ్ళి వుంటారు?

మరికాస్సేపు ఓపిగ్గా రిసీవర్ పట్టుకు కూర్చున్నాడు పవన్...

బెల్ మోగుతూనే వుంది...

విసుగొచ్చి ఫోన్ పెట్టేసి, ఆలోచనలో పడిపోయాడు పవన్.

.........

శ్యాంసుందర్ అతని భార్యతో ఎక్కడికైనా వెళ్ళాడేమో! మరి స్నిగ్ధ ఎక్కడున్నట్టు? తన హాస్టల్ గదిలోనా?...వంటరిగా వుందా?... తను హైదరాబాద్‌కి బయలుదేరుతుంటే, సెలవు కాన్సిల్ చేసుకుని డ్యూటీలో

జాయినయిపోతానని చెప్పింది...జాయినయిందా?

పోనీ స్నిగ్ధ ఆఫీసుకి ఫోన్ చేస్తే?...

అదే మంచిదనుకుని టేబిల్‌మీది కాగితాలు దగ్గరకు లాక్కుని కూర్చున్నాడు పవన్...కానీ ఎంత ప్రయత్నించినా అతని ఆలోచనలు స్నిగ్ధ చుట్టూ పరిభ్రమిస్తున్నాయి...కాగితాలమీద మనస్సు లగ్నం చెయ్యలేకపోతున్నాడతను...విసుగ్గా గడియారంకేసి చూసుకుని స్నిగ్ధ ఆఫీసు నెంబర్ డయల్ చేశాడు.

శకునం బావున్నట్టు, వెంటనే లైనుదొరికి, ఆపరేటర్ 'హలో' అంది...

"స్నిగ్ధ...ఉన్నారా?" ఉత్సాహంగా అడిగాడు పవన్...

"స్నిగ్ధ మేడమ్ ఈజ్ నో మోర్ విత్ అస్" అంది ఆపరేటర్.

"హలో...అయామ్ పవన్ స్పీకింగ్...స్నిగ్ధని పిలవండి" అరిచాడు పవన్, అవతలి మాటలు సరిగ్గా వినిపించక...

"స్నిగ్ధ మేడమ్ రిజైన్ చేశారు సర్...అంది ఆపరేటర్.

ఆపరేటర్ చెప్తున్నదేమిటో అర్థంకాలేదు పవన్‌కి...స్నిగ్ధ రిజైన్ చెయ్యడమేమిటి?...

"హలో ఆపరేటర్..."

"ఎస్ సర్...మిస్ స్నిగ్ధ రిజైన్డ్ టూ డేస్ ఎగో...మోర్ మరెవరితోనైనా మాట్లాడ్తారా?"

"నో...థ్యాంక్స్..."అని రిసీవర్ పెట్టేశాడు పవన్...అసలే చికాగ్గా ఉన్న అతని మనస్సు ఈ వార్త విన్నాక మరింత గందరగోళమైంది.

స్నిగ్ధ ఎందుకిలా చేసింది?. తనని అడగకుండా...మాటమాత్రం చెప్పకుండా...అసలు తన ఉత్తరం అందిందా తనకి...ఉత్తరం చదివి మనస్సు కష్టపెట్టుకుందా! పోనీ శ్యాంసుందర్‌ని అడుగుదామంటే సమయానికి అతనుకూడా ఫోన్లో దొరకడంలేదు. ఓ గాడ్! ఇప్పుడు స్నిగ్ధ వైనం వెంటనే తెలుసుకోవాలంటే ఏమిటి మార్గం?

• • •

పవన్ ఇంటికి చేరుకునేసరికి ఏడు దాటింది. మోటర్ సైకిల్ పార్క్ చేస్తూ ఇంట్లో చీకటిగా వుండడం గమనించాడతను... అమ్మ బయటికి వెళ్ళిందా అనుకుంటూ తలుపు తెరచి వుండడం గమనించి ఆశ్చర్య పోయాడు...

హాల్లోకి వెళ్తూ "అమ్మా" అని పిలిచాడు పవన్ ... సమాధానం లేదు. చీకట్లో తడుముకుంటూ వెళ్ళి లైటు వేశాడు ... దీపం వెలగగానే కనిపించింది రాజేశ్వరీదేవి...సోఫాకమ్ బెడ్‌లో మొహానికి చెయ్యి అడ్డం పెట్టుకుని పడుకుంది.

"అమ్మా...అంటూ ఆందోళనగా ఆమెకేసి నడిచాడు.

"అమ్మా...అలా పడుకున్నావేం?...మళ్ళీ జ్వరం వచ్చిందా?" కంగారుగా అడిగాడు పవన్.

మొహానికి అడ్డం పెట్టుకున్న చెయ్యి కొంచెం జరిపి, కళ్ళు తెరిచి పవన్‌కేసి చూసిందావిడ.

ఆమె మొహంచూసి అదిరిపోయాడతను...అసలే తెల్లగా ఉండే ఆమె మొహం బాగా కందిపోయింది...బాగా ఏడ్చినట్టు కనురెప్పలు ఉబ్బి వున్నాయి.

అమ్మకేమైంది?...ఎందుకిలా వుంది?

"అమ్మా!...నీకు మళ్ళీ జ్వరం వచ్చిందా?...మరి నాకు ఫోన్ చెయ్యలేదేం?...బాగా నీరసంగా ఉందా?" గబగబా అడిగాడు పవన్ ఆందోళనగా.

కొంగుతో ముక్కు చీదుకుంటూ లేచి కూర్చోబోయింది రాజేశ్వరీ దేవి.

"పడుకో అమ్మా...లేవకు...అసలేం జరిగింది?...భోంచేశావా పొద్దున్న?...ఆర్తిగా అడిగాడు పవన్.

అతనికేసి జాలిగా చూసి, తలతిప్పేసుకుంది రాజేశ్వరీదేవి.

"అమ్మకి ఏమైంది? ఎందుకిలా ప్రవర్తిస్తోంది?...ఒళ్ళు చల్లగానే వుంది. అంటే జ్వరం లేదన్నమాట. తనమీద కోపం వచ్చిందా? ఎందుకు? ఆలోచిస్తూ...బలవంతంగా, తల్లి తలపట్టుకుని తనవేపు తిప్పుకున్నాడు

పవన్.

"అమ్మా...నువ్విట్లా వుంటే నేను ...
తేమిటో చెప్పకుండా ఇలా నన్ను బాధపెట్ట...
అన్నాడు.

దుఃఖాన్ని దిగమింగే ప్రయత్నంలో రాజేశ్వ...
తున్నాయి. అతికష్టంమీద ఏదో చెప్పబోతూ...తలుపు ...
అటుకేసి చూసి ఆగిపోయిందామె.

అప్రయత్నంగా అటుకేసి తిరిగిన పవన్ అవాక్కయిపోయాడు?

స్నిగ్ధ!!

అక్కడ స్నిగ్ధ నిలబడి వుంది.

స్నిగ్ధ...ఇక్కడికెలా వచ్చింది?

ఎప్పుడు వచ్చింది?

అంటే...అంటే తన పెళ్ళి సంగతి అమ్మకి తెలిసిపోయిందా?

ఏమని చెప్పింది స్నిగ్ధ?...తనని ఎలా పరిచయం చేసుకుంది... ఆ షాక్‌కి తట్టుకోలేక అమ్మ ఇలా అయిపోయిందా...

హృదయ విదారకమైన ఏడుపు వినిపించి ఉలిక్కిపడ్డాడు పవన్. తల్లి కేసి తిరిగేసరికి రాజేశ్వరీదేవి వెక్కివెక్కి ఏడుస్తోంది ఆ వెక్కిళ్ళ మధ్య ఆమె మూలుగు వినిపిస్తోంది.

హఠాత్తుగా అక్కడ స్నిగ్ధ కనిపించడం, అంతవరకూ మూగగా వున్న రాజేశ్వరీదేవి ఒక్కసారిగా భోరుమనడం చూసిన పవన్ మెదడు స్తంభించిపోయింది. ఆలోచించుకునే అవకాశం లేకుండా, ఒకదానివెంట మరోటి...ఎదురుచూడని సంఘటనలు అతడ్ని ఉక్కిరిబిక్కిరి చేసేస్తు న్నాయి.

అయితే అమ్మకి సంగతి తెలిసిపోయిందన్న మాట...ఇప్పుడేం చెయ్యాలి తను. జరిగిందేమిటో ఎలా సర్ది చెప్పాలి?...

ఉన్నట్టుండి రాజేశ్వరీదేవి ఏడుపు ఆపేసింది. ఆయాసపడుతూ విసురుగా లేచింది తూలిపడబోతుంటే ఆమెను పట్టుకోబోయిన పవన్ చేతిని విదిలించుకుని గబగబా పెరట్లోకి నడిచింది. రాజేశ్వరీదేవి నసుస

...ారు.

...సుతో మొహం తుడుచుకుంటూ వచ్చిన

... వెళ్ళి భళ్ళున తలుపు వేసుకుంది.

...మ్మ" అంటూ ఆమె వెనకే వెళ్ళిన పవన్ తలుపు

...్లీజ్...నా మీద కోపంవస్తే నన్నేమైనా చెయ్యి...

...ా తలుపు తియ్యమ్మా...ముందు నేను చెప్పేది వినమ్మా" అని అరుస్తూ తలుపులమీద బాదసాగాడు.

తల్లి పూజగదిలోకివెళ్ళి తలుపులేసుకోగానే పవన్ అలా తల్లడిల్లి పోవడమెందుకో అర్థంకాలేదు స్నిగ్ధకి...అతడ్ని వారించే ఉద్దేశ్యంతో మెల్లిగా అతని దగ్గరగా వెళ్ళి భుజంమీద చెయ్యివేసింది. స్నిగ్ధ ఉనికిని పూర్తిగా విస్మరించినట్టు, తలుపుమీద కొడ్తూనే ఉన్నాడు పవన్.

అతడ్ని చూస్తే జాలివేసింది స్నిగ్ధకి.

తప్పిపోయి తల్లికోసం అలమటిస్తున్న ఆరేళ్ళ పసివాడిలా ఉన్నాడు పవన్.

తల్లి కేం సంజాయిషీ ఇవ్వాలో, ఆమెనెలా ఊరడించాలో తెలియక అవస్థపడుతున్నాడతను.

పూజగదిలో ఏం జరుగుతోందో ఊహించిన పవన్ ఇక ఉండలేక పోయాడు...

"అమ్మా నువ్వు వెంటనే తలుపు తియ్యకపోతే నేను తలుపు విరగ్గొడ్తాను...అమ్మా...నిన్నే" అని అరుస్తూ నాలుగడుగులు వెనక్కి వెళ్ళి మూకుడుగా వచ్చి భుజంతో తలుపులు తోశాడు...తలుపు తెరుచుకోలేదు. పవన్ మళ్ళీ వెనక్కి నడిచాడు.

అతనెందుకలా ప్రయాసపడ్తున్నాడో అర్థంకాలేదు స్నిగ్ధకి...

అతడ్ని ఆపాలా...వద్దా అన్నట్టు సందిగ్ధలో పడిపోయింది...

పూనకం వచ్చినవాడిలా తలుపుమీదపడి బాదుతూనే ఉన్నాడు పవన్...

ఉన్నట్టుండి తలుపు గొళ్ళెం ఊడిపోయింది.

పెద్దశబ్దంతో తలుపు తెరుచుకుంది.

పవన్‌తోపాటు స్నిగ్ధకూడా లోపలికెళ్ళింది.

గది మధ్యగా రాజేశ్వరీదేవి పద్మాసనంలో కూర్చుని ఉంది...

ఆమె జుట్టు విరబోసుకుని ఉంది...

నేలమీద వెలుగుతున్న హారతి కర్పూరం మంట మీదికి అరచెయ్యి చాపి ఉంచింది.

'అమ్మా' అని కేకపెట్టి ఒక్క ఉదుటున వెళ్ళి ఆమె చెయ్యి మంటమీది నుంచి లాగేశాడు పవన్... కళ్ళల్లో నీళ్ళు సుడులు తిరుగుతుంటే, బాధగా ఆమె చేతికేసి చూశాడు పవన్.

రాజేశ్వరీదేవి అరచెయ్యి...మధ్యభాగం కాలిపోయింది. నల్లగా మసి పట్టిన ఆమె అరచేతి చర్మం...అర్థరూపాయంతమేర...కాలి... కమిలిపోయింది...

"అమ్మా...ఏమిటమ్మా ఇది—మళ్ళీ నిన్ను నువ్వు శిక్షించుకున్నావా?...నేను చేసిన తప్పుకు నాకు శిక్ష వెయ్యాలిగానీ...నిన్ను నువ్విలా హింసించుకుంటావనుకోలేదు...అమ్మ...మాట్లాడమ్మ" అని పసివాడిలా విలపించసాగాడు పవన్...

పవన్ చేసిన తప్పుకి పరిష్కారంగా...పవన్ ప్రేమించి పెళ్ళి చేసుకున్న నేరానికి శిక్షగా...పవన్ తన జీవితంలో మరో వ్యక్తికి స్థానం ఇచ్చిన అపరాధానికి ప్రాయశ్చిత్తంగా...రాజేశ్వరీదేవి తనను తాను హింసించుకుంది...

ఆ సంఘటన చూస్తూ నిర్ఘాంతపోయింది స్నిగ్ధ...

ఏమిటీ జీవితం!

అన్నీ ఎదురు చూడని ఘట్టాలు!!

ఎవరూ నమ్మని దృశ్యాలు!!!

కలలోకూడా ఊహించని సన్నివేశాలు!!!!

ఇప్పుడిపుడే మానసికంగా కోలుకుంటున్న తను ముందు ముందు ఇంకా ఏమేం చూడాలి?...

ఏం ఎదుర్కోవాలి?...

నిస్సహాయంగా నిలబడిపోయింది స్నిగ్ధ!

# 5

రాజేశ్వరీదేవి కాల్చుకున్న చెయి తన చేత్తో పట్టుకుని మరో చెయి భుజంచుట్టూవేసి ఆమెను లేపాడు పవన్...

నీరసంగాఅతడి భుజంమీద తలవాల్చేసి పూజగదిలోంచి బయటకు నడిచింది రాజేశ్వరీదేవి.

వాళ్ళిద్దరికీ దారిస్తూ తలుపుకి ఆనుకుని నిలబడింది స్నిగ్ధ.

తల్లి ని హాల్లోకి తీసుకెళ్ళి సోఫాలో కూర్చోపెట్టాడు పవన్. గది లోంచి ఆయింట్ మెంట్ తెచ్చి ఆమె చేతి గాయాలికి పూశాడు.

ఏమీ మాట్లాడకుండా విచారంగా రాజేశ్వరీదేవి కూర్చుని వుంటే ఆమె పక్కనే కూర్చున్నాడు పవన్.

ఎందుకమ్మా ఇలా చేశావు? నామీద కోపంవస్తే తిట్టు,కొట్టు...కానీ, ఇదేమిటమ్మా?" అన్నాడు మళ్ళీ.

ఆమె సమాధానం చెప్పకపోయేసరికి చిన్నపిల్లాడిలా తల్లడిల్లి పోయాడతను.

పూజగది గుమ్మం దగ్గరే నిలబడి తల్లీ కొడుకులను చూస్తుండి పోయింది స్నిగ్ధ...తల్లి ని ఊరడించే ప్రయత్నంలో తన ఉనికినే మరచి పోయినట్లున్నాడు పవన్.

పవన్‌కి తల్లంటే చాలా అటాచ్ మెంట్ అని తెలుసు స్నిగ్ధకి... కానీ ఆ మమకారం ఇంత బలంగా ఉంటుందని ఊహించలేదెన్నడూ.

రాజేశ్వరీదేవి చెయి కాల్చుకుని అఘాయిత్యంగా ప్రవర్తిస్తే పవన్ రియాక్షన్ మోతాదుకు మించినట్టుగా అనిపించింది స్నిగ్ధకి.

....వాళ్ళిద్దరిమధ్య తనకు స్థానంలేదు.

అసలు...ఇలాంటి ఉద్వేగాలున్న వారిద్దరి మధ్య తను ఇమడ కలదా?

రాజేశ్వరీదేవితో పవన్‌అంటున్న మాటలు అస్పష్టంగా వినబడ్డాయి స్నిగ్ధకి.

"...స్నిగ్ధ చాలా మంచిదమ్మా...తనకీలోకంలో మరెవరూలేరు,

నువ్వొక అవకాశం ఇచ్చి చూడు, నాకంటే ఎక్కువగా నిన్నాదరిస్తుంది."
అన్నాడతను.

పవన్ ఆ మాటలు అన్నాడో లేదో...

ఉన్నట్టుండి...

పెద్దగా ఏడవసాగింది రాజేశ్వరీదేవి.

ఆమె అలా వెక్కి వెక్కి ఏడుస్తుంటే నిస్సహాయంగా చూస్తుండి పోయాడు పవన్.

ఆమెను ఎలా ఓదార్చాలో తెలియక తల పట్టుకుని కూర్చుండి పోయాడతను.

అంతలోనే—ఏడుపు ఆపేసింది రాజేశ్వరీదేవి.

దుఃఖాన్ని దిగమింగి ఉద్వేగాన్ని అదుపులోతెచ్చుకుంటూ కొంగుతో కళ్ళను తుడుచుకుంది.

మౌనంగా కూర్చున్న ఆమె మొహంలో మునపటి బాధ కనబడటంలేదు. సమస్యలతో రాజీ పడ్డట్టు తేటగావుంది।

"అమ్మా!..." అని ఏదో అనబోయాడు పవన్.

చటుక్కున సోఫాలోంచి లేచింది రాజేశ్వరీదేవి.

వంటింటికేసి కదిలిందామె.

"కాళ్ళు కడుక్కుని వంటింట్లోకి వస్తావా—అన్నం పెడతాను" అందామె వంటింట్లోకి వెళ్తూ.

పవన్ సందేహిస్తూ నిలబడ్డాడు.

"ఏమిటి సందేహిస్తూ నిలబడ్డావు?" అడిగింది రాజేశ్వరీదేవి అక్కడ్నించే.

స్నిగ్ధకేసి ఒకసారి తిరిగి చూసి ఊరుకున్నాడు పవన్.

"ఏమ్మిటా? నిన్నొక్కడినే భోజనానికి రమ్మంటున్నాననుకుంటున్నావా? ఇద్దర్నీ పిలిచాను. రామ్మా—రా—భోంచేద్దువుగాని" అందామె.

ఆమె మాటలకి రిలీఫ్ ఫీలవుతూ స్నిగ్ధకేసి చూశాడు పవన్. వెళ్దాం పద అంటున్నట్టు కళ్ళతోనే స్నిగ్ధకి సైగచేసి వంటింటికేసి దారితీసాడతను.

రాజేశ్వరీదేవి ధోరణిలో చికాకుగాని కోపంగాని కనిపించలేదు స్నిగ్ధకి—పవన్‌ని అనుసరిస్తూ నడిచిందామె

• • •

భోజనాలు ముగించాక హాల్లోని సోఫాలో కూర్చుంది రాజేశ్వరీదేవి. ఆమె పక్కనే కూర్చున్నాడు పవన్.

"నొప్పి ఎలా ఉందమ్మా" అడిగాడతను ఆమె చెయి నిమురుతూ.

"ఫర్వాలేదు...తగ్గిపోతుందిలే" అందామె.

"ఇది నా మూలంగానే జరిగింది" అన్నాడు పవన్ తల వంచుకుని.

పవన్‌కేసి ప్రేమగాచూసి అతడితలని భుజంమీదకు లాక్కుంది రాజేశ్వరీదేవి.

"నీకు నచ్చిన అమ్మాయిని పెళ్ళి చేసుకున్నావని కాదురా నా బాధ!...నీ పెళ్ళికి నేనడ్డు చెప్తానని భయపడి ఇలా చేసావే అదిరా నా బాధ!...అల్లారుముద్దుగా పెంచి పెద్దచేసిన నా కొడుకు నన్నింత బాగా అర్థం చేసుకున్నాడన్నమాట! అందామె ఆర్ద్రంగా."

"స్నిగ్ధ...మన కులం కాదమ్మా...వాళ్ళ అమ్మా నాన్న తన చిన్నప్పుడే పోయారు. దూరపుబంధువుల సహాయంతో హాస్టల్లో ఉంటూ చదువుకుంది...ఇవన్నీ నీకెలా చెప్పాలోనని..." అంటూ ఆగాడు పవన్.

"ఆ అమ్మాయి గతంగురించి నా కెందుకురా? నువ్వు పెళ్ళి చేసుకున్నావు కాబట్టి రాజేశ్వరీదేవి కోడలయింది. అంతకంటే ఆ అమ్మాయికి అర్హతలేంకావాలి?...సరే జరిగిందేదో జరిగిపోయింది. నువ్వు నన్ను ఖాతరు చేసినా చేయకపోయినా నా మనసు ఎప్పటికైనా నీ సుఖసంతోషాల్నే కోరుకుంటుందిరా."

రాజేశ్వరీదేవి కళ్ళలో మళ్ళీ కన్నీళ్ళుచూసి చలించిపోయాడు పవన్.

"నన్ను క్షమించమ్మా! నీ మనసు చాలా బాధపెట్టానుకదూ" అన్నాడు బాధగా.

పేలవంగా నవ్వి లేచి నిలబడింది రాజేశ్వరీదేవి.

"అమ్మాయి...ఇలారా..."అంటూ స్నిగ్ధని పిలిచింది తనకేసి.

అంతవరకూ స్తంభానికి ఆనుకుని నిలబడ్డ స్నిగ్ధ దగ్గరకు వచ్చింది.

"నీ పేరేమిటన్నావు?" అడిగింది రాజేశ్వరీదేవి ఆమెకేసి పరిశీలనగా చూస్తూ.

సమాధానం చెప్పింది స్నిగ్ధ.

దీవిస్తున్నట్టు ఆమె తలమీద చెయ్యి పెట్టింది రాజేశ్వరీదేవి. పవన్. కూడా దగ్గరకు వచ్చి నిలబడ్డాడు.

"ఇకనించి...వీడి బాధ్యత నీదేనమ్మా" అంది గద్గదంగా.

ఇద్దరూ రాజేశ్వరీదేవి పాదాలకు దండంపెట్టి లేచారు.

"బాగా పొద్దుపోయింది...పడుకోండి"అందామె కన్నీళ్ళు తుడుచుకుంటూ.

బెడ్‌రూంకేసి నడుస్తూ హాయిగా ఊపిరి పీల్చుకుంది స్నిగ్ధ... పవన్ తల్లి గురించి అనవసరంగా అపోహలేవో పెంచుకుంది.

ఎంతయినా అమ్మ అమ్మే!

ఇక ఆవిడ అండలో తనకు ఎటువంటి సమస్యలూ ఉండవు.

స్నిగ్ధను అనుసరించి పవన్‌కూడా గదిలోకి వచ్చాడు. ఆనందంగా అతడికేసి రెండడుగులు వేసి అతడి మొహంలో చికాకుచూసి ఆగిపోయింది స్నిగ్ధ.

"అమ్మకు అవకాశం చూసి మన సంగతి చెప్పి నీకు కబురు చేస్తానని అంత స్పష్టంగా చెప్పానే? అంతలో ఏమయిందని ఇలావచ్చేసావ్? అమ్మను చూసావుకదా? చాలా ఇమోషనల్! చిన్న విషయాలకే బాగా అప్సెట్ అయిపోతుంది. ఎందుకిలా వచ్చేసావో చెప్తావా?" అడిగాడు. పవన్.

స్నిగ్ధ వెంటనే సమాధానం చెప్పలేదు.

"అసలీ ఆలోచన నీకెలా వచ్చింది? శ్యాంసుందర్ తెలివి తేటలా ఇవి?" మళ్ళీ అడిగాడు పవన్.

కాదన్నట్టు తలూపింది స్నిగ్ధ.

"ఈ నిర్ణయం నేనే తీసుకున్నాను...పవన్! నేను ఉద్యోగం రిజైన్ చేసేసాను" అందామె.

"తెలుసు..." అన్నాడు పవన్ పొడిగా.

"అత్తయ్యగారు ఇలా రియాక్ట్ అవుతారనుకోలేదు పవన్....నిన్ను ఇబ్బంది పెట్టేసాను కదూ! ఐయామ్ వెరీసారీ...కానీ ఏం చేయను చెప్పు? అక్కడ బొంబాయిలో నువ్వు వెళ్ళాక బ్రతుకు దుర్భరంగా తయారయింది. పైగా...సుమిత్ర వాళ్ళ నాన్నగారికి ఒంట్లో బాలేదని టెలిగ్రాంవస్తే శ్యాంసుందర్, సుమిత్ర నైనిటాల్ వెళ్ళిపోయారు! ఇక అక్కడ ఒక్కక్షణంకూడా ఉండలేననిపించింది. ఏది ఏమయినా నీ దగ్గరకు వచ్చేయాలనిపించింది. అత్తయ్యగారికి ఏదో ఒకరోజు మన సంగతి చెప్పకతప్పదు కదా! అందుకే ధైర్యంచేసి తిన్నగా వచ్చేసాను...నా ఇంటికి!" అంటూ ఆగింది స్నిగ్ధ.

"ఆమె మాటలు విని కొంచెం రిలాక్స్ అయ్యాడు పవన్...ఒక విధంగా ఆలోచిస్తే స్నిగ్ధ ఇలా వచ్చేయడంవల్ల మంచే జరిగింది. అమ్మకి తన పెళ్ళి విషయం ఎలా చెప్పాలా అని ఇన్నాళ్ళు సందేహిస్తూ జాప్యం చేసాడు తను. స్నిగ్ధ రాకతో అమ్మకు అన్ని విషయాలు తెలియడమే కాదు ఆమె అప్పుడే స్నిగ్ధని ఇంటికోడలిగా స్వీకరించిందికూడా.

"పవన్, ఎంతో కష్టపడి సంపాదించుకున్న ఉద్యోగం రిజైన్ చేసాను. ఎందుకో తెలుసా? నా ఒంటరి జీవితానికి గుడ్‌బై చెప్పి ఇక్కడికి...నీ దగ్గరకి వచ్చేయాలని! నా అంతట నేనే వెనక్కి తిరిగి వెళ్ళే తలుపులకు గడియ వేసేసాను. అత్తయ్యగారు మన పెళ్ళిని ఆమోదించినా ఆమోదించకపోయినా నేను వెనక్కి తిరిగి వెళ్ళకూడదని డిస్పరేట్‌గా వచ్చేసాను. ఐ హావ్ బర్ట్ ఆల్ ద బోట్స్" అంది స్నిగ్ధ.

చిరునవ్వుతో ఆమెను దగ్గరకు తీసుకుని బుగ్గమీద ముద్దిచ్చాడు పవన్.

"రిలాక్స్ స్నిగ్ధా! ఎలా అయితేనేం నువ్విక్కడికి వచ్చేసావు...ఇక మన సమస్యలన్నీ పరిష్కారమయినట్టే" అని పవన్ అంటుండగా హాల్లోంచి రాజేశ్వరీదేవి అతన్ని పిలిచింది-స్నిగ్ధని వొదిలిపెడ్తూ హాల్లోకి వెళ్ళాడు పవన్.

తనబెడ్‌రూంలోకి వెళ్ళకుండా ఇంకా అక్కడేకూర్చున్న రాజేశ్వరి

దేవికేసి ఆశ్చర్యంగా చూసాడతను.

"ఒరేయ్ కన్నా!...మీ ఇద్దరికీ పెళ్ళి జరిగినట్టు రిజిస్ట్రార్ ఆఫీసువాళ్ళు సర్టిఫికేట్ ఇచ్చినా అందరి సమక్షంలో ఆ అమ్మాయి మెళ్ళో తాళి కట్టినపుడే ఆ పెళ్ళికి అసలయిన గుర్తింపు వస్తుంది...మన సంప్రదాయం ప్రకారం పెళ్ళి జరగనీ!..." అంది రాజేశ్వరీదేవి.

ఆవిడ మాటలు అర్ధమయి తల పంకించాడు పవన్.

గదిలోకి వచ్చి స్నిగ్ధకేసి చూసాడతను.

"స్నిగ్ధా..." అని ఏదో అనబోయాడు.

"విన్నాను..." అని చూపులు మరోవైపుకి మళ్ళించింది స్నిగ్ధ.

ఒక్కక్షణం సందేహించి ... మంచం మీదనించి ఒకదిండు అందుకున్నాడు పవన్.

"స్నిగ్ధా...అయితే నువ్వు ఇక్కడే పడుకో నేను అమ్మ గదిలో పడుకుంటాను" అంటూ బయటకి కదిలాడు. హాల్లో లైటార్పి రాజేశ్వరి దేవితో ఆవిడ గదిలోకి పవన్ వెళ్ళిపోయాక...ఒంటరిగా మంచంమీద కూర్చుంది స్నిగ్ధ.

పవన్‌తో చెప్పుకోవలసిన విషయాలు ఇంకెన్నో ఉన్నాయి... కానీ, తనని ఒంటరిగా వొదిలిపెట్టి వెళ్ళిపోయాడతను! పవన్ వాళ్ళ అమ్మగారు చెప్పినట్టు సంప్రదాయ బద్ధంగా పెళ్ళి జరిగేవరకూ ఈ ఎడబాటు తప్పదా? ఒక్క నిమిషం క్రితం ఆ రాత్రి పవన్ కంపెనీలో హాయిగా గడిచిపోతుందనుకుంది తను...అతడి కౌగిట్లో సేద తీర్చుకోవచ్చనుకుంది కానీ, అలాంటిదేమీ జరగలేదు.

పవన్ గది కలయచూసింది స్నిగ్ధ...

ఒకవైపు బట్టల బీరువా, బట్టల స్టాండు ఉన్నాయి మరోవైపు బుక్ షెల్ఫ్ పక్కనే పెద్ద టేబిల్ ఒకటుంది. టేబిల్‌మీద అస్తవ్యస్తంగా పడున్న పుస్తకాలు సర్దసాగింది స్నిగ్ధ ..చాలామటుకు ఆర్కియాలజీకి ఆంత్రోపాలజీకి సంబంధించిన పుస్తకాలవి. ఆర్కియాలజీ డిపార్టుమెంటులో నూటికి నూరుపాళ్ళు రిసెర్చి పనే! డ్యూటీలో ఉన్నా లేకపోయినా ఆ రీసెర్చ్ కొనసాగుతూనేఉంటుంది. ఆ సబక్కే అలాంటిది,

టేబిల్ మీద పుస్తకాలు సర్దుతూ పవన్ నోట్స్‌కేసి ఆసక్తిగా చూసింది స్నిగ్ధ.

ఆ నోట్స్‌లోని విషయంచూసి అద్దిరిపడిందామె.

పవన్ ఎన్నో పుస్తకాలు చదివి, కొందరు నిపుణలని సంప్రదించి తయారు చేసిన నోట్స్ అది.

కరకింకరః

కరకింకర పూర్వ చరిత్రః

ఆ కాగితాలు ముందుకు జరపుకుని టేబిల్ లాంప్ ఆన్ చేసుకుని కూర్చుంది స్నిగ్ధ.

పవన్ తయారు చేసిన నోట్స్ గబగబ చదవసాగింది స్నిగ్ధ.

"ఈ విగ్రహం తయారీకి ఉపయోగించిన లోహం పాతకాలంనాటి కంచు. కళ్ళకి...చేతిగోళ్ళకి ఉపయోగించిన గవ్వలను అనారైజ్ చేసాక ఈ విగ్రహం ఎంత కాదన్నా 500 సంవత్సరాల క్రితందని తెలుస్తోంది. గోవా తీరప్రాంతానికి చెందిన శిల్పి ఎవరో దీనిని తయారు చేసి ఉండాలి.

సర్ స్టీవెన్స్‌బర్గ్ (1869) రచించిన 'ద మేజర్ ఆర్కియాలజికల్ డిస్కవరీస్ ఇన్ టిబెట్' (**The Major Archalogical Discoverieres in Tibbet**) లో ఇలాంటి విగ్రహం గురించి ప్రస్తావించారు. ఒకానొకప్పుడు (1598) టిబెట్టులో "డాగ్పా" తెగకు చెందిన వారు రహస్య మందిరాల్లో ఇలాంటి విగ్రహాన్ని ఆరాధించేవారని రచయిత అభిప్రాయం. అప్పట్లో దానిపేరు "ఇన్‌క్యూబస్" అట దాదాపు ఇదే పోలికలున్న విగ్రహాన్ని "బ్రామాజెమ్" తెగకు చెందినవాళ్లు "మామ్మన్" అనే పేరుతో 1728 లో ఆరాధించేవారని తెలుస్తోంది.

రోనాల్డ్ వూడ్స్ రచన 'ద మిడీవల్ ఫెయిత్స్'(**The Mediovel Failts**) లో కూడా ఇలాంటి పూర్వ దేవుడి ప్రస్తావన ఉంది. 100 సంవత్సరాలకి ఒకసారి ప్రపంచంలో ఏదో ఒకమూల ఇలాంటి ఆకారాన్ని ప్రతిష్ఠించి 'అష్టోరెథ్' పేరుతో ఆరాధనలు జరిపి శిశుబలి కూడా ఇస్తుంటారని రోనాల్డ్ వూడ్స్ అభిప్రాయం. (అష్టొరెథ్ అసలు పేరు 'కోర్కింకర్' అని రచయిత మరోచోట రాసాడు) 1858 లో ఇలాంటి ఉపాసనలు

బర్మాదేశంలో జరిగేవట।

'అఫ్రొరెథ్' ని ప్రసన్నం చేసుకున్న తర్వాత 9 ఏళ్ళపాటు నియమం తప్పకుండా ఆరాధిస్తారు భక్తులు. నియమం తప్పితే పరిణామాలు చావుకంటే భయంకరంగా ఉంటాయని భక్తులనమ్మకమట. తొమ్మిదేళ్ళ ఉపాసనల తర్వాత అఫ్రొరెథ్ ఆలయాలను మూసివేస్తారు.

అఫ్రొరెథ్ లేదా కోర్కింకర్ అప్పట్నుంచి 121 సంవత్సరాలు నిద్రపోతాడట.

ఈ విగ్రహం చరిత్ర తెలుసుకుంటున్నకొద్దీ ఆసక్తికరంగా ఉంది.

టిబెట్టులోనూ, బర్మాలోనూ తవ్వకాల్లో బయటపడ్డ ఇలాంటి విగ్రహాలు గోవా ప్రాంతానికి—ఎలా చేరుకున్నాయో?

మన దేశంలో కూడా ఈ మూఢనమ్మకాలు ఇప్పటికీ ప్రచారంలో ఉన్నాయా? ..."

పవన్ అంతవరకూ రాసిన నోట్స్ ఒక ఫైల్లో సర్దేసి ఆలోచనల్లో పడిపోయింది స్నిగ్ధ.

అయితే పవన్ చాలా సీరియస్‌గా ఆ విగ్రహం గురించి స్టడీ చేస్తున్నాడన్నమాట.

కానీ, అతడి స్టడీ కేవలం ఆర్కియాలజిస్టుగానే చేసాడు. ఆ విగ్రహానికి అంత చరిత్ర ఉందని తెలుసుకున్నా—ఖండాలాలో జరిగిన విచిత్రమైన సంఘటనలకి ప్రాముఖ్యతివ్వడంలేదు ఎందుకో?

తను కూడా ఆర్కియాలజిస్టే—ఉద్యోగం రిజైన్ చేసినా తన వృత్తి అదే—కానీ తను ఆ విగ్రహాన్ని కేవలం ఒక "ఆంటిక్" అనుకోవడంలేదు. ఆర్కియాలజీకేకాదు—సైన్స్‌కే అందని విశేషం ఏదో ఉందా విగ్రహంలో.

తను చూసింది కల అని కొట్టిపారేస్తాడు పవన్... అలాంటపుడు తనకు 'కరకింకర' పేరు ఎలాతెలుస్తుంది?

పవన్ స్టడీలో "కోర్కింకర్" అన్న పేరుకి ఎంతో దగ్గరగాఉంది కరకింకర పేరు।—1?0 ఏళ్ళకి ఒకసారి కరకింకర మేల్కొంటాడా?!...

అంటే? 1598—1728—1858తర్వాత?

1988!!

అంటే ఈ సంవత్సరమే!!

ఇప్పట్నుంచి తొమ్మిది సంవత్సరాలు అంటే 1997దాకా కరకింకర ఆరాధనలు జరపాలి భక్తులు.

అసహనంగా టేబిల్ దగ్గర్నుంచి కదిలింది స్నిగ్ధ—

కరకింకర విగ్రహం ఎక్కడుంది?

అనలైజ్ చేయడానికి డిపార్టుమెంట్‌లోనే ఉంచాడా...లేకఇంట్లోనే దాచాడా ?

ఇంట్లో అంటే తన గదిలోనే కదా దాచాలి?

గబగబ టేబిల్ డ్రా తీసి చూసింది స్నిగ్ధ—అందులో టూల్ బాక్స్—కాగితాలు మాత్రమే ఉన్నాయి—అక్కడ కాకపోతే—బట్టల బీరువాలోనే దాచివుండాలి ఆ విగ్రహాన్ని.

చప్పుడు చేయకుండా బీరువా తలుపుతీసి చూసింది స్నిగ్ధ—పవన్ బట్టలు నీటుగా సర్ది ఉన్నాయి అందులో. లాకర్ తాళం దానికే పెట్టిఉంది। తాళం తిప్పి నెమ్మదిగా లాకర్ తెరచింది స్నిగ్ధ—

అందులోనే ఉంది కరకింకర విగ్రహం!!

అంత సులభంగా దొరుకుతుందనుకోలేదు — వొణుకుతున్న చేతులతో దాన్ని బయటకు తీసి టేబిల్ మీద నిలబెట్టింది.

"కరకింకరను చూడక పదిహేను రోజులు ఎలా ఉండగలిగాను?!"

అప్రయత్నంగా మనసులో మెదిలిన ఆ ఆలోచనకి ఉలిక్కిపడింది స్నిగ్ధ।

ఎలా వచ్చింది తనకా ఆలోచన?

కరకింకర విగ్రహాన్ని చూడాలని నిజంగానే తను కోరుకుందా?

ఏమో?!

పరిశీలనగా ఆ విగ్రహంకేసి చూసింది స్నిగ్ధ—పవన్ తన నోట్స్‌లో ఆ విగ్రహం పూర్వచరిత్ర గురించి రాసింది నిజమేకావచ్చు—

కానీ, దానివల్ల కరకింకర బ్యాక్‌గ్రౌండ్ మాత్రమే తెలుస్తుంది—

కరకింకర అతీత శక్తి అవునో కాదో తెలుసుకోవడానికి మార్గం అదికాదు—

అతీత శక్తులగురించి సైన్సు కూడా సంతృప్తికరమైన సమాధాన మివ్వదు. సైన్సు పంచేంద్రియాలకే పరిమితం—కానీ, సృష్టి పంచేంద్రి యాలకు పరిమితంకాదు.

కరకింకర విగ్రహాన్ని మళ్ళీ లాకర్‌లో పెట్టేసి తాళం వేసింది స్నిగ్ధ—తనా విగ్రహాన్ని చూసినట్టుగాని టేబిల్‌మీద రాసిపెట్టిన నోట్స్ చదివినట్టుగా కానీ పవన్‌కి చెప్పగూడదు. అనుకుంటూ మంచంమీద పడుకుంది.

కాసేపటికే నిద్రముంచుకుని వచ్చేసిందామెకు.

...నిద్రలో యూనివర్సిటీ లైబ్రరీకి వెళ్ళినట్టు కల వచ్చిందామెకు

లైబ్రరీ స్టాక్స్‌లో అర్కియాలజీ పుస్తకాలేవో వెదుకుతోంది తను—చివరి ర్యాక్‌లో తనక్కావలసిన పుస్తకం దొరికింది।

చాలా పాత పుస్తకమది.

కరకింకర గురించి తనక్కావలసిన ఇన్‌ఫర్మేషన్ అంతాఅందులో దొరుకుతుంది—

ఆ పుస్తకం దుమ్ముదులుపుతూ రీడింగ్‌రూంలోకి వెళ్ళింది తను—అక్కడ ఎవరూలేరు—రూంచివరన-మొహానికి పేపర్ అడ్డం పెట్టుకుని ఒకతను కూర్చుని ఉన్నాడు.

టేబిల్‌మీద పుస్తకంపెట్టి కుర్చీ లాక్కుని కూర్చుంది తను.

పుస్తకం చాలా పాతది కావడంతో కాగితాలన్నీ ముట్టుకుంటే ఊడిపోతున్నాయి। జాగ్రత్తగా ఒకొక్క పేజీ తిప్పసాగింది...పేజీకి పేజీకి మధ్య తెల్ల పురుగులు స్వేచ్ఛగా తిరుగుతున్నాయి। ఇన్ని తెల్ల పురుగులు పుస్తకంలో చేరాయంటే ఎన్నేళ్ళబట్టి ఆపుస్తకం అలా పడివుందో...అనుకుంటూ మరికొన్ని పేజీలు తిప్పింది.

తెల్ల పురుగొకటి చేవిపైదికి పాకుతుంటే దులుపుకుని పుస్తకం చదవనారంభించింది.

మళ్ళీ రెండుమూడు తెల్ల పురుగులు చేతిమీదికి ప్రాకాయి.

పుస్తకం టేబిల్ మీద పెట్టేసి వాటిని దులుపుతూ కూర్చుంది తను.

కానీ అప్పటికే చాలా పురుగులు ఒంటిమీద పాకుతున్నాయి... కుర్చీ వెనక్కి తోసేసి లేచి నిలబడి కొంగుతో పురుగుల్ని దులపసాగింది.

అంతలో చెంపమీద చురుక్కుమనడంతో 'అబ్బా' అంటూ తడిమి చూసుకుంది...తెల్ల పురుగు! చెంపను కొరికేస్తోంది! వేళ్ళతో ఆ పురుగుని నలిపి పారేసింది.

ఏమిటిది...ఇన్ని పురుగులు! ఈపుస్తకానికి పట్టిన చెదేనా?

ఆలోచిస్తున్నంతలో మరికొన్ని తెల్ల పురుగులు మీదకు పాకాయి. అంతలో మరికొన్ని!

ఎంత దులుపుకున్నా...కుప్పలు కుప్పలుగా ఆ పురుగులు మీదకు పాకుతున్నాయి.

ఒంటిమీద ఎక్కడా ఆగకుండా తిన్నగా మొహంమీదకే పాకుతున్నాయి.

కొన్ని వందలు కాదు వేల పురుగులు!!

అన్నీ మొహంమీదకే పాకి వెళ్తున్నాయి!

మొహంమీద కూడా ప్రత్యేకించి కుడివైపుకే చేరాయి అన్నీ! కుడి కన్ను మూతబడింది!!

గట్టిగా అరవబోయింది—కానీ—నోటమాటరాలేదు.

చెదపురుగులు మొహాన్ని పీక్కుని తినేస్తున్నాయి!!

నొప్పి! మంట!—అబ్బా!!

భరించలేకపోతోంది.

రీడింగ్‌రూం చివర కూర్చున్నవ్యక్తి మొహానికి పేపరు అడ్డంపెట్టుకుని నిశ్చలంగా కూర్చున్నాడు.

అతనికేసి పరుగుతీసింది—తను—హెల్ప్! హెల్ప్ అని అరవబోయింది—కానీ—

అరవలేక—

అతని ఎదురుగా టేబిల్ మీద దబదబ బాదింది.—

నెమ్మదిగా పేపరు కిందికి దించాడతను...

అతని మొహం చూసి సంభించిపోయింది.

అతని మొహాన్ని అపుడేచెద సగం తినేసింది.కుడివైపుమొహం... మొహంకాదది పు౹రె ...

ఎడమవైపు మా౹తం ఇంకా జీవం ఉంది.

తనను చూసి...

వంకరగా...నవ్వింద మొహం!!

మరికాసేపటికి తన మొహం కూడా అలాగే తయారవు తుందా! తనకు పట్టిన చెదపురుగులు కూడా అలాగే పీక్కుని తినేస్తాయా తన మొహాన్ని?!

నో...నో...నో...

ఇదంతాకల!...ఈ కలలోంచి బయటకి రావాలి...ని౹ద మెలకువ వస్తే...ఇదంతా పీడకలని తెలుసుకుంటుంది తను.

మేల్కోవాలి!...మేల్కోవాలి!...

దిండుమీద బాధగా తల అటూ ఇటూ ఆడిస్తూ ఎంతో కష్టంమీద కళ్ళు తెరచింది...స్నిగ్ధ. రొప్పుతూ.

ఓ గాడ్!...

ఎంత భయంకరమైన కల!

నిజంగానే మొహానికి చెదపట్టేసినట్టు భయపడిపోయింది.

రెండు నిముషాలసేపు అలాగే పడుకుంది...కదలడానికి శక్తి చాలక...భయంతో గుండె వేగంగా కొట్టుకుంటోందింకా

నెమ్మదిగా మంచందిగి తడబడుతున్న అడుగులతో బాత్‌రూంకేసి నడిచిందామె.

చన్నీళ్ళతో మొహం కడుక్కుని మంచినీళ్ళు తాగితేనేకాని తను పూర్తిగా తేరుకోలేదు.

బాత్‌రూంలో లైటు వేసుకుని వాష్‌బేసిన్ కొళాయి తెరుస్తూ యధాలాపంగా ఎదురుగావున్న అద్దంలో మొహం చూసుకుంది స్నిగ్ధ...

అంతే...!!

భయంకరంగా అరిచింది స్నిగ్ధ! అలాఅరుస్తున్నపుడు—అద్దంలో

కనబడుతున్న పురి బింబం కూడా నోరు తెరవడంతో ఆ దృశ్యం మరింత వికృతంగా కనిపించింది...సగం మొహం సగం...పుర్రె!!

అది చూడలేక...గుండెలు బద్దలయ్యేలా అరుస్తూ కిందకు ఒరిగింది స్నిగ్ధ...

# 6

తెల్లవారుతుండగా—

నెమ్మదిగా కళ్ళు తెరచింది స్నిగ్ధ.

బాత్‌రూంలో వాష్ బేసిన్ ఎదురుగా పడుకుంది తను! భయంకరంగా తయారయిన తనమొహం అద్దంలో చూసుకుని తెలివితప్పి పడిపోయి ఉండాలి.

అప్రయత్నంగా మొహాన్ని తడిమి చూసుకుంది స్నిగ్ధ.

చేతికి మృదువుగా తగిలింది మొహం. ప్రాణం లేచివచ్చి నట్టయ్యింది...!

నెమ్మదిగా లేచినిలబడుతూ రవ్వంత భయంగా అద్దంలో ప్రతిబింబాన్ని మరోసారి చూసుకుంది స్నిగ్ధ.

విశాలమయిన నుదురు తీర్చిదిద్దినట్టున్న కనుబొమ్మలు అందంగా మెరిసే కళ్ళు, లేత గులాబీ ముఖవర్చస్సు...ఏవీ చెక్కుచెదరలేదు. ఎప్పటిలా మొహంలో జీవకళ ఉట్టిపడుతోంది...

అరచేతులతో చెంపలు నిమురుకుంటూ నిలబడింది స్నిగ్ధ.

ఏమవుతోంది తనకి.

పీడకలలు రావడం సహజమే. కానీ మెలకువ వచ్చాక కూడా పీడకల కొనసాగుతుందా?

ఇదికూడా హాల్యూసినేషనేనా?

గత మూడు వారాలనుంచి తను ఎదుర్కొంటున్న అసాధారణమయిన సంఘటనలు మనసుని పూర్తిగా కలవరపెట్టేస్తున్నాయి సాఫీగా సాగిపోతోంది. జీవితం ముప్పెన్నడూ జరగలేదిలా.

రిజిస్ట్రార్ ఆఫీసులో పవన్‌తో పెళ్ళయ్యాకే ప్రారంభమయిందీ అల్లకల్లోలం.

తన పెళ్ళికీ, ఈ సంఘటనలకీ ఏదయినా సంబంధం ఉందా?

ఏమో!?

బాత్‌రూంలోకిచి బయటకు నడవబోయి అడుగు ముందుకి వేయ లేకపోయింది స్నిగ్ధ. వొళ్ళంతా బరువెక్కినట్టుంది. అతి కష్టంమీద గోడ పట్టుకుని నడిచి మంచం దాకా చేరుకుంది. నీరసంగా పరుపుమీద వాలి పోయి కళ్ళుమూసుకుని పడుకుంది.

లైబ్రరీలో కరకింకర గురించి ఇన్‌ఫర్మేషన్ కోసం పుస్తకం తెర వడం...అందులోంచి చెద తనకు పట్టడం...మళ్ళీ మనసులో మెదిలింది.

అసలది పీడకలేనా?

కలయితే మెలకువ వచ్చాక కరిగిపోతుంది...కానీ అలాజరగడం లేదు. బాత్‌రూం అద్దంలో తన మొహం చూసుకోవడం కలలో జరిగింది కాదు.

కలకీ వాస్తవానికి తేడా తెలియడంలేదు.

ఈ పీడకల ఒక్కటేకాదు...అంతకుముందు జరిగిన సంఘటనలు కూడా దీనికి తీసిపోలేదు...

ఖండాలా దగ్గర భవనంలోకి వెళ్ళి కరకింకర విగ్రహం చూడటం కాత్యాయనితో మాట్లాడటం...

అర్ధరాత్రి వర్షంలో తడుస్తూ మళ్ళీ ఆ భవనానికి వెళ్ళడం... శిశువు చెయి నరికేయడం...

అన్నీ అనూహ్యమయిన సంఘటనలు.

అయినా వాటిని తన భ్రమ అనుకుని మనసులోంచి కొట్టిపారేయ డానికి వీల్లేకుండా బలమయిన ఆధారాలు ఉన్నాయి.

ఖండాలా కాటేజీకి చేరాక మణికట్టుమీద కాత్యాయని కట్టిన మరుల మాతంగి...

సెంటూరీ హోటల్‌లో...ఒంటిమీద రక్తం మరకలు!...

తను చూసింది కలలు కాదనడానికి ఇవి చాలవా? అయినా...జరి గిందంతా నిజమేనని మనసు ఒప్పుకోలేక పోతోంది.

దీని గురించి స్థిమితంగా ఆలోచించకలగాలంటే జరిగినదంతా

మరోసారి పరిశీలించాలి. విచిత్రమయిన ఈ సంఘటనల గురించి నిర్దిష్ట మయిన అభిప్రాయం లేకపోతే తన బ్యాలెన్స్ ఆఫ్ మైండ్ పోతుందేమో!

పిచ్చి పడుతుందేమో?

ఆ ఆలోచనకే ఒళ్ళు జలదరించింది స్నిగ్ధకి.

పెళ్ళయ్యాక జీవితంలో ఎటువంటిలోటూ ఉండదనుకుంది...కానీ ఏమిటీ భయాలు.

నో! అలా జరక్కూడదు!...తను బ్యాలెన్స్ ఆఫ్ మైండ్ పోగొట్టు కోకుండా నిలదొక్కుకోవాలి.

తనకోసంకాదు...ప్రేమించి పెళ్ళి చేసుకున్న పవన్ కోసం దీంట్లోంచి బయటపడి...జీవితాన్ని అందంగా తీర్చిదిద్దుకోవాలి. ఆదర్శ వంతంగా గడపాలి.

ఎవరో తలుపు తట్టిన శబ్దానికి ఆలోచనల్లోంచి బయటపడి లేచింది స్నిగ్ధ. నెమ్మదిగా మంచం దిగి వెళ్ళి తలుపుతీసింది.

పవన్!

"గుడ్ మార్నింగ్!" అంటూ లోపలికి వచ్చి మంచంమీద కూర్చున్నాడతను.

"ఏమిటీ అలా ఉన్నావ్? రాత్రి నిద్ర పట్టలేదా?" అడిగాడతను స్నిగ్ధకేసి చూస్తూ.

"ఏం...ఏంలేదు...కొంచెం తలనొప్పిగా ఉంది అంతే."

"అంతేనా?...వంటింట్లో అమ్మ కాఫీ కలుపుతోంది తాగిరా..." అన్నాడు పవన్.

ఒక్కక్షణం సందేహించి వెనక్కితిరిగింది స్నిగ్ధ...

"స్నిగ్ధా!" పిలిచాడతను.

ఏమిటన్నట్లు చూసింది అతనికేసి.

"నిన్నరాత్రి అమ్మతో చాలాసేపు మాట్లాడాను. మన గురించి వివరంగా చెప్పాను. అమ్మకు కోపం తగ్గిందనే అనిపిస్తోంది. సాధ్య మయినంత త్వరలో...వీలైతే ఈ వారం రోజుల్లోనే మన పెళ్ళి గుళ్ళో జరిపిస్తానంది అమ్మ. ఆ తర్వాత ఇక్కడున్న మా బంధువులకీ ఫ్రెండ్స్‌కి

రిసెప్షన్ ఇవ్వమంది...నీకు అభ్యంతరంలేదు కదా?" అంటూ ఆగాడు పవన్.

లేదన్నట్టు తలూపింది స్నిగ్ధ.

"గుడ్!...స్నిగ్ధా...మరోమాట. అమ్మని పూర్తిగా నార్మల్ చేయడం నీ చేతుల్లోనే ఉంది. ఈ వారం రోజులూ మనిద్దరం దూరం ఉండవలసి వచ్చినా నువ్వు మాత్రం ఈ ఇంటి మనిషివే...ఇంటి పనుల్లో అమ్మకు చేదోడుగా ఉంటూ ఆవిడ్ని మంచి చేసుకోవాలి." అన్నాడు పవన్.

"అలాగే" అంటూ అక్కడ్నించి కదిలింది స్నిగ్ధ...

పవన్ చెప్పింది నిజమే! వాళ్ళ అమ్మగారిని మంచిచేసుకుని ఎటువంటి అపార్థాలు గొడవలు లేకుండా చూడటం తన చేతుల్లోనే ఉంది. ఆవిడ్ని సంతోషపెట్టేట్టు ప్రవర్తించి మెప్పు పొందడం తనకేమంత కష్టమయిన పనికాదు. ఇంతకుముందు...బొంబాయిలో పవన్‌తో పెళ్ళయినపుడు ఈ విషయం గురించి సందేహాలు లేవు. కానీ...ఇప్పుడు తన మానసిక పరిస్థితి వేరుగావుంది. మనస్సంతా గజిబిజిగా ఉండటంతో ఏదీ సవ్యంగా ఆలోచించలేకపోతోంది తను. తన ఆలోచనా శక్తిమీద నమ్మకం సన్నగిల్లుతోంది. ఇలాంటి సమయంలో—పవన్ భార్యగా—రాజేశ్వరీ దేవి కోడలిగా తన పాత్ర సమర్థవంతంగా నిర్వర్తించకలదా?

ఏమో?

వంటింటి గుమ్మందగ్గర ఒక్కక్షణం ఆగి లోపలికి చూసింది స్నిగ్ధ. గ్యాస్‌స్టవ్ దగ్గర నిలబడి కాఫీ కలుపుతోంది రాజేశ్వరీదేవి

"అత్తయ్యగారూ. మీరుజరగండి నేను కలుపుతాను కాఫీ." అంటూ వంటింట్లోకి నడిచింది స్నిగ్ధ.

నిలబడ్డ చోటునించి కదలకుండా తిరిగి చూసింది రాజేశ్వరీదేవి.

"ఫర్వాలేదమ్మాయి నేను కలుపుతాను. నువ్వెళ్ళి డైనింగ్‌రూంలో కూర్చో తెచ్చిపెడ్తాను"

ఒక్కక్షణం తటపటాయించి అక్కడ్నించి బయటకు వచ్చేసింది. స్నిగ్ధ.

కాసేపయ్యాక డైనింగ్ టేబిల్ దగ్గరకి కాఫీ పట్టుకొచ్చింది రాజే

శ్వరీదేవి.

"స్నానం చేయకుండా వంటింట్లోకి రాకూడదమ్మాయి" అందామె కాఫీ గ్లాసు టేబిల్ మీద పెడుతూ...

"సారీ అత్తయ్యగారూ—"

"ఫర్వాలేదమ్మాయి — చిన్నప్పట్నుంచి హాస్టళ్ళలోనే ఉంటున్నావటకదా. ఈ విషయాలన్నీ నీకెలా తెలుస్తాయిలే—" అంటూ అక్కడ్నించి కదిలిందావిడ.

గబగబ కాఫీ తాగేసి బెడ్‌రూంకేసి బయల్దేరింది స్నిగ్ధ. హాల్లో పేపర్ చూస్తూ కూర్చుని ఉన్నాడు పవన్. కాఫీ తాగి రమ్మని వంటింట్లోకి పంపించిందతనే. తను కూడా ఆలోచించుకోకుండా తిన్నగా వంటింట్లోకి వెళ్ళి పొరపాటు చేసింది. తను జాగ్రత్తగా ఉండకపోతే చినికి చినికి గాలివాన అయినట్టు ఇలాంటి చిన్న చిన్న విషయాలే అపార్థాలకి దారితీస్తాయి.

గబగబ బెడ్‌రూంలోకివెళ్ళి సూట్‌కేసులోంచి టవల్ తీసుకుని స్నానానికి వెళ్ళింది స్నిగ్ధ.

పదిహేనునిముషాల్లో స్నానం ముగించి కాటన్‌చీర కట్టుకుని మళ్ళ వంటింటికేసి వెళ్ళింది స్నిగ్ధ. అప్పటికే కూరలు తరుగుతూ కూర్చుని ఉంది రాజేశ్వరీదేవి.—

"ఇలా ఇవ్వండి నేను తరుగుతాను" అంటూ ఆమె పక్కనే కూర్చుంది.

"ఫర్వాలేదమ్మాయి నేను చేస్తున్నాను కదా..." పని ఆపకుండా అంది రాజేశ్వరీదేవి.

అక్కడే మౌనంగా కూర్చుండిపోయింది స్నిగ్ధ.

"ఇవ్వాళ వాడికిష్టమయిన వంటలేవో చేస్తున్నాను. అయినా వాడికి నా చేతి వంటతప్ప మరొకరుచేస్తే నచ్చదు—నాచేతి వంటలెలా ఉంటాయో. నువ్వు కూడా రుచి చూద్దువుకాని."

"పోనీ వేరేపని ఏదయినా ఉంటే చెప్పండి. మీరొక్కరే పని చేస్తుంటే నాకేమీ బాగాలేదు ... పైగా మీ ఆరోగ్యం బాగాలేదన్నారు

పవన్—" అంది స్నిగ్ధ...

"నా ఆరోగ్యానికేం బాగానే ఉందిపుడు...అయినా నాకు చేతినిండా పని ఉంటేకాని తోచదు... ఈ వారం పదిరోజులు ఇంటి పనులు ఏమీ చేయనఖర్లేదమ్మాయి నువ్వు...హాయిగా రెస్టుతీసుకో...షాపింగ్ పనులే వయినా ఉంటే చూసుకో..." అంటూ లేచింది రాజేశ్వరీదేవి.

తను వంటింట్లో ఉండటం ఆవిడకిష్టంలేదని అర్థమయింది స్నిగ్ధకి. అక్కడ్నించి లేచి బయటకు వచ్చేసింది.

హాల్లో పవన్ ఎదురొచ్చాడు.

"ఏమయింది? అలా వున్నావు?" అడిగాడతను.

క్లుప్తంగా జరిగింది చెప్పింది స్నిగ్ధ

"మంచిదేకదా। హాయిగా రెస్ట్తీసుకో...ఇంట్లో తోచకపోతే చదువు కోడానికి షెల్ఫ్లో బోలెడు పుస్తకాలున్నాయి — అన్నాడు పవన్ తేలిగ్గా నవ్వేస్తూ.

సమాధానం చెప్పకుండా అక్కడ్నించి వెళ్ళిపోయింది స్నిగ్ధ. భోజనాల టైందాకా బెడ్రూంలో పవన్ బీర్వా సర్దుతూ ఉండిపోయింది.

పవన్ భోంచేసి ఆఫీసుకి బయల్దేరుతుంటే అతడికి బ్రీఫ్కేస్ అందించింది స్నిగ్ధ.

"జూబ్లీ హిల్స్లో మా ఫ్రెండు ఒకమ్మాయి ఉంది. ఓసారి వెళ్ళిరానా?" అడిగింది.

"వై నాట్। తప్పకుండా వెళ్ళు...డ్రాప్ చేయమంటావా?" అడి గాడు పవన్.

"అఖర్లేదు...నేనే వెళ్తాను కాసేపాగి" అంది స్నిగ్ధ.

• • •

స్నిగ్ధ జూబ్లీ హిల్స్నించి ఇంటికి తిరిగి వచ్చేప్పటికి సాయంత్రం అయిదున్నరయింది. తిన్నగా బెడ్రూంలోకి వెళ్ళి చీర మార్చుకుని మొహం కడుక్కుందామె. ఆ తర్వాత డ్రెస్సింగ్ టేబిల్ దగ్గర కూర్చుని తీరిగ్గా జుట్టు దువ్వుకుని వోదులుగా జడవేసుకుంది.

సుస్మితను కలుసుకున్నాక మనసు తేటగా ఉంది తనకు. ఇన్నా

ళ్ళుగా తాననుభవిస్తున్న సంక్షోభాన్ని సానుభూతితో సుస్మిత వింటుంటే కొండంత ధైర్యం వచ్చినట్టయింది. సుస్మిత చెప్పినట్టు ప్రతీ విషయం జరిగింది జరిగినట్టు డయరీలో రాసుకుంటే గజిబిజి ఆలోచనలు కొంత వరకు తగ్గుతాయి.

హ్యాండ్ బ్యాగ్‌లోంచి డయరీ తీసుకుని అక్కడ్నించి లేచి పవన్ స్టడీ టేబిల్‌దగ్గర కుర్చీ లాక్కుని కూర్చుంది స్నిగ్ధ. ఏ రోజుకారోజు దినచర్య రాసేముందు గత మూడు వారాలుగా జరిగినదంతా క్లుప్తంగా రాయాలి అనుకుంటూ డయరీలో రాయడం మొదలెట్టింది.

పవన్‌తో ఖండాలాకి కారులో వెళ్తున్నపుడు జరిగిన సంఘటనలు. రాస్తూ ఆగిపోయింది స్నిగ్ధ—

మొట్టమొదటిసారిగా కరకింకర ఆలయంలో అడుగుపెట్టినపుడు ఏమనిపించింది తనకు? ఆ విగ్రహాన్ని చూసినపుడు తన మనసులో మెదిలిన ఆలోచనలు ఏమిటి?

జరిగిన సంఘటన కంటే మనసు మీద దాని ప్రభావం ఏ విధంగా ఉందో అర్థం చేసుకోవడం ముఖ్యం.

కళ్ళు మూసుకుని ఆలోచిస్తూ కూర్చుంది స్నిగ్ధ. అలా ఎంతసేపు కూర్చుందో ఆమెకే తెలియదు. కళ్ళు తెరచి చూస్తే గదిలో చీకటిగా ఉంది.

కరెంటు పోయిందా?

రెండు నిమిషాలు కదలకుండా అక్కడే కూర్చుంది స్నిగ్ధ. మొహంచుట్టూ దోమలు ముసిరి రొదపెడ్తుంటే చికాగ్గా లేచి గదిలోంచి బయటకు వచ్చింది. హాల్లోకూడా బాగా చీకటిగా ఉంది. మండువా మధ్య గార్డెన్ ఛైర్ వేసుకుని రాజేశ్వరీదేవి కూర్చుని ఉండటం మసగ్గా కనిపించింది...

స్నిగ్ధకూడా అక్కడకే వెళ్ళి గట్టుమీద కూర్చుంది. అలుముకుంటున్న ముని చీకట్లో రాజేశ్వరిదేవి మొహం అస్పష్టంగా కనబడుతోంది.

"కరెంటు ఇప్పుడే రాదనుకుంటాను..." అంది స్నిగ్ధ

సమాధానంగా రాజేశ్వరిదేవి తలూపిందేమోకాని స్నిగ్ధకు కనబడలేదు.

"క్యాండిల్స్ ఉన్నాయా అత్తయ్యగారూ? వెలిగించనా?" అడిగింది మళ్ళీ స్నిగ్ధ.

"మైనంవొత్తి వంటింట్లో ఉండాలి..." అంది రాజేశ్వరిదేవి.

స్నిగ్ధ లేవబోతుంటే వారించింది రాజేశ్వరిదేవి "నీకు తెలియదు... నేనే వెళ్తాను."

రాజేశ్వరిదేవి లేచి చీకట్లో తడుముకుంటూ వంటింటికేసి బయల్దేరింది.

అంతలో...

స్తంభం చాటునించి నల్లటి ఆకారమొకటి కదలి మండువావైపుకి రావడం గమనించింది స్నిగ్ధ.

"ఎ...ఎవరూ..." అరిచిందామె బిగ్గరగా.

ఆ ఆకారం సమాధానం చెప్పలేదు...గాలిలో తేలివస్తున్నట్టు తిన్నగా మండువాలోకి వచ్చేసింది. అంత దగ్గరకు వచ్చినా అది ఆడామగా అర్థంకావడంలేదు.

"ఎవరు నువ్వు? ఏం కావాలి?" అడిగింది మళ్ళీ స్నిగ్ధ.

కానీ ఆ ఆకారం ఆగలేదు...వేగంగా ముందుకి కదిలి స్నిగ్ధని ఒక్కతోపు తోసి వంటింటి గుమ్మం దగ్గరే ఆగిపోయిన రాజేశ్వరిదేవి కేసి వెళ్ళింది. క్షణంలో ఆమెను చేరుకుని గట్టిగా పట్టుకుంది.

రాజేశ్వరిదేవి హడలిపోయి బిగ్గరగా అరుస్తూ ఆ పట్టునించి విడిపించుకోవాలని గింజుకోసాగింది. కానీ తన పట్టు విడవలేదా ఆకారం. రాజేశ్వరిదేవిని తనతోపాటు లాక్కుంటూ మండువాలోకి వచ్చేసింది.

మండువాలోకి రాగానే చటుక్కున రాజేశ్వరిదేవిని వదిలేసి ఒక పక్కగా నిలబడ్డా ఆకారాన్ని విస్మయంతో చూస్తూ ఉండిపోయింది స్నిగ్ధ.

"ఎవరునువ్వు?" తడారిన గొంతుకతో అడిగింది రాజేశ్వరిదేవి.

"నేను..." పలికిందా ఆకారం...ఏదో రహస్యం చెప్తున్నట్టుగా ఉందా పలుకు.

"నేనంటే?" ధైర్యం చిక్కబట్టుకుని అడిగింది రాజేశ్వరిదేవి.

సమాధానం కోసం ఉత్కంఠతో ఊపిరి బిగబట్టి ఎదురుచూస్తున్న

క్షణంలో లైట్లు వెలిగాయి. వెలుగుకి చెదిరిపోతున్న కళ్ళతో ఎదురుగా నిలబడ్డ నల్లటి అమ్మాయికేసి ఆశ్చర్యంగా చూసింది స్నిగ్ధ.

శిలా విగ్రహంలా నిశ్చలంగా నిలబడ్డ ఆ అమ్మాయి వయసు ఇరవై ఏళ్ళు అయ్యుండొచ్చు అనుకుంది స్నిగ్ధ. నల్లటి ఆమె మొహంలో కళ్ళు విచిత్రంగా మెరుస్తున్నాయి. అంత నల్లగా ఉన్నా కళగానే ఉందా మొహం. చవక రకం నేతచీర కట్టుకుని ఉందా అమ్మాయి...ఎత్తయిన వక్షోరుహాలు సన్నటి నడుం...శరీర వొంపుల్ని దాచడంలేదు చీరకట్టు.

ఎందుకో...ఆ అమ్మాయి గురించి సదభిప్రాయం ఏర్పడలేదు స్నిగ్ధకి.

"నన్ను గుర్తుపట్టలేదా అమ్మగారూ?" అడిగిందా ఆ అమ్మాయి రాజేశ్వరిదేవిని.

లేదన్నట్టు తలూపింది రాజేశ్వరిదేవి కొంచెం తేరుకుంది.

"మీరు ఆసిఫాబాదులో ఉన్నపుడు ఇంటికి వచ్చేదాన్ని మరచి పోయారా అమ్మగారూ? జట్కా నడిపే బాషా మనవరాల్ని!..." అందా అమ్మాయి.

"నువ్వంటే!...ఇంత పెద్దదానివై పోయావు! ఎలా వచ్చావిక్కడికి మీ తాతకూడా వచ్చాడా?" అడిగింది రాజేశ్వరిదేవి.

"...మా తాత...చచ్చిపోయాడమ్మా...నెల్లోజులయింది.

"అరెరె...బాషా చచ్చిపోయాడా...!అయ్యో!"

"అవునమ్మగారూ!...తనకేమయినా అయితే హైదరాబాదులో మీ దగ్గరకు వెళ్ళమని చెప్పేవాడమ్మా...అందుకే మీ ఇల్లు వెతుక్కుంటూ వచ్చేసాను—"అంది ఆ అమ్మాయి.

"మంచిపనిచేసావు — ఇక్కడేఉందువుగాని — అద్సరేకాని— ఇందాక చీకట్లో ఎందుకలా నన్ను పట్టిలాగావు?" అడిగింది రాజేశ్వరిదేవి.

స్నిగ్ధకేసి, రాజేశ్వరిదేవికేసి మార్చిమార్చి చూసిందా అమ్మాయి.

"అదేంటి అమ్మగారూ అర్థంకాలేదా మీకు? వంటింట్లోంచి గ్యాస్ వాసన రావడంలేదా మీకు?—చీకట్లో మీరు అగ్గిపుల్ల అంటిస్తే ఏమయ్యేది?"

"వంటింట్లో గ్యాస్ లీక్ అవుతోందా?" అంది రాజేశ్వరిదేవి ఆశ్చర్యంగా.

ఒకసారి ఊపిరి పీల్చుకుంది స్నిగ్ధ అప్రయత్నంగా—నిజమే! గ్యాస్ వాసన వస్తోంది.

గబగబ వంటింటికేసి నడిచింది స్నిగ్ధ—అప్పటికే వంటింట్లో గ్యాస్ నిండిపోయి ఉండటంతో ఊపిరిసల్పుకోలేక పోయిందామె. ముక్కుకి కొంగు అడ్డంపెట్టుకుని వంటింట్లోకివెళ్ళి గ్యాస్ సిలిండర్ డిస్కనెక్ట్ చేసి కిటికీలు తెరిసింది స్నిగ్ధ—

అంతసేపు ఊపిరి బిగపట్టి ఉండటంతో ఉక్కిరి బిక్కిరయిపోతూ మండువాలో రాజేశ్వరిదేవి నిలబడ్డ చోటుకి వచ్చేసింది స్నిగ్ధ—

"సిలిండర్ లీక్ అవుతోంది అత్తయ్యగారూ — క్లోజ్ చేసేసాను కాసేపు వంటింట్లోకి వెళ్ళకండి—"అంది—

స్నిగ్ధ మాటలు వినబడలేదు రాజేశ్వరిదేవికి—దిగ్భ్రమంతో ఎదురుగా నిలబడ్డ అమ్మాయికేసి చూస్తూ ఉండిపోయింది.

"సమయానికి నువ్వు వచ్చి ఉండకపోతే—" అంటూ ఆగిపోయింది.

"ఇందాక పెరుమెనంవొత్తి తెస్తానంటూ లేచినపుడే వచ్చానమ్మా నేను—వంటింట్లోకి వెళ్తే ఏమవుతుందోనని అలా పట్టుకున్నాను—" అంది ఆ అమ్మాయి.

"భలేదానివే!—" అంటూ గార్డెన్‌ఛైర్‌లో కూర్చుంది రాజేశ్వరిదేవి.

స్నిగ్ధ మాత్రం ఆ అమ్మాయికేసి విచిత్రంగా చూస్తూ నిలబడింది—

అప్పుడే గుమ్మంలోంచిలోపలికి వచ్చిన ఆ అమ్మాయికి వంటింట్లో గ్యాస్ లీక్ అవుతోందని ఎలా తెలిసింది? అంతకు ముందు నుంచి మండువాలో కూర్చున్న తనకి రాజేశ్వరిదేవికి గ్యాస్ వాసన సోకలేదే.

ఎందుకో ఆ అమ్మాయిరాక కాకతాళీయంగా జరిగిందనిపించలేదు. స్నిగ్ధకి.

"అన్నట్టు నీ పేరేవిటో మరచిపోయానే—"అంది రాజేశ్వరిదేవి

ఆ నల్లటి అమ్మాయిని చూస్తూ.

"మస్తానమ్మ"

# 7

అఫీసు టేబిల్ దగ్గర కూర్చుని కాగితాలేవో తిరగేస్తున్నాడు పవన్.

అంతలో అటెండరు తెచ్చిన విజిటింగ్ కార్డు అందుకుని అందులోని అపరిచితమైన పేరు చదివాడతను.

"పనేమిటట?"

"చెప్పలేదుసార్! అర్జెంటుగా మిమ్మల్ని కలుసుకోవాలి అంటున్నారు..." అన్నాడు అటెండరు.

"సరే—లోపలకు పంపించు" అన్నాడు పవన్.

అటెండరు వెళ్ళిన కాసేపటికి రూం తలుపు తెరుచుకుంది—

"హల్లో మిస్టర్ పవన్‌కుమార్!" అని చిరునవ్వుతో లోపలికివచ్చింది అందమయిన ఒకట్టి అమ్మాయి.

పలకరింపుగా నవ్వి కూర్చోమని కుర్చీ చూపించాడు పవన్.

"మీరూ—?"

"స్నిగ్ధా నా బెస్ట్ ఫ్రెండ్!" సమాధానం ఇచ్చిందా అమ్మాయి.

"ఈజ్ ఇట్?" కొంచెం రిలాక్స్‌డ్‌గా నవ్వాడు పవన్.

"బొంబాయిలో ఇద్దరం ఒకే కాలేజీలో చదివాం"

ఆ అమ్మాయి మాటలు వింటూ విజిటింగ్ కార్డుకేసి యధాలాపంగా చూసాడు పవన్. డాక్టర్ (మిస్) సుస్మిత, ఎం. డి, ఫ్లాట్ నెం 269, జూబ్లీహిల్స్—

"మీరుండేది జూబ్లీహిల్స్‌లోనా! అయితే మొన్న స్నిగ్ధ వెళ్ళింది మీ ఇంటికే అనుకుంటాను?" అడిగాడతను.

అవునన్నట్టు తలూపింది సుస్మిత.

"పవన్‌గారూ...నేను ప్రాక్టీసింగ్ సైకియాట్రిస్ట్‌ని! స్నిగ్ధకి నా ప్రొఫెషనల్ హెల్ప్ అవసరమయి మా ఇంటికి వచ్చింది."

స్నిగ్ధ ఏ విషయం గురించి మాట్లాడటానికి వెళ్ళి ఉంటుందో

ఊహించాడు పవన్.

"యూ మీన్...మీకా విగ్రహం గురించి చెప్పిందా స్నిగ్ధ?" అడిగాడతను.

అవునని తల పంకించింది సుస్మిత.

"స్ట్రేంజ్! ఈ మధ్య ఆ విగ్రహం గురించి అస్సలు మాట్లాడటం లేదు స్నిగ్ధ. దాన్నిబట్టి ఆ ఆలోచనల్లోంచి బయటపడిందనుకున్నాను. బొంబాయిలో ఉండగా సైకియాట్రిస్టుకి చూపిద్దాం అంటే వద్దంది... అలాంటిది" అంటూ ఆగాడు పవన్.

"మీరు తన మాటలు నమ్మడంలేదని చాలా విషయాలు చెప్పడం లేదు మీకు."

డాక్టర్ సుస్మిత మాటలువిని ఏమనాలో అర్థంకాలేదు పవన్‌కి.

"బొంబాయిలో ఒకరోజు మీరు సెంటూర్ హోటల్‌లో బసచేసారు కదూ? ఆ రాత్రి మీకు తెలియకుండా ఖండాలా దగ్గరున్న పాడుబడ్డ భవనానికి వెళ్ళివచ్చిందట స్నిగ్ధ. అక్కడ తను చూసింది...చేసింది వివరంగా చెప్పింది నాకు."

"వ్వాట్! స్నిగ్ధ మళ్ళీ ఆ భవనానికి వెళ్ళివచ్చిందా. ఐకాంట్ బిలీవ్ ఇట్."

"నేనూ నమ్మలేకపోయాను పవన్‌గారూ. మనం స్నిగ్ధ మాటలు నమ్మినా నమ్మకపోయినా ఆమె మనస్సంతా అల్లకల్లోలంగా ఉందన్నది నిజం. షీ ఈజ్ రియల్లీ కన్‌ఫ్యూజ్‌డ్!" అంది డాక్టర్ సుస్మిత.

"ఇంత కన్‌ఫ్యూషన్ ఉన్నా స్నిగ్ధ నాకేమీ చెప్పలేదా!...డాక్టర్ సుస్మిత. మీకేమనిపిస్తోంది? స్నిగ్ధకు సైకొసిస్ లాంటిది?" అంటూ ఆమెకేసి చూసాడు పవన్.

సుస్మిత నవ్వి ఊరుకుంది.

"స్నిగ్ధతో మాట్లాడానంటున్నారు కదా. మరి మీ డయోగ్నొసిస్ ఏమిటి?" అడిగాడు పవన్ మళ్ళీ.

ఒక్క క్షణం అతనికేసి చూసి సమాధానం చెప్పింది డాక్టర్ సుస్మిత.

"సూడో స్కిజో-ఫ్రినిక్, అబ్సెసివ్ - కంపల్సివ్ పాసివ్—డిపెండెట్ ఆంక్సైటీ న్యూరోసిస్."

తత్తరపాటుతో ఆమెకేసి చూసాడు పవన్. అతడి చూపులు గమనించి చిన్నగా నవ్వేసింది సుస్మిత.

"అర్థంకాలేదు కదూ?"

"లేదన్నట్టు తలూపాడు పవన్.

"సైకియాట్రీలో మానసిక అస్వస్థతకి డయోగ్నాసిస్ అడిగితే ఇలాగే చెప్పాల్సివస్తుంది మరి. అందుకే మా ప్రాక్టీస్‌లో డయోగ్నాసిస్‌కి ప్రాధాన్యత ఇవ్వం. అస్వస్థతకి కారణం ఏమిటో కనుక్కొని దానికి చికిత్స చేయడమే మా పని..." అంది డాక్టర్ సుస్మిత.

"అయితే ఇప్పుడు మీరు చెప్పిన రోగం పేరు?"

"స్నిగ్ధకు అంతపెద్ద ప్రాబ్లెమ్ ఏమీలేదు లెండి. అందరిలా మీరు కూడా డయోగ్నాసిస్ ఏమిటని అడుగుతుంటే సరదాకి అలా అన్నాను." అందామె నవ్వుతూ.

పవన్‌కూడా హాయిగా నవ్వేసాడు.

"కానీ డాక్టర్ సుస్మిత...మీరు స్నిగ్ధకి ట్రీట్‌మెంట్ ఇస్తారు కదా?" అడిగాడు పవన్ ఒక్కక్షణం ఆగి.

"నేనేం చేయాలనుకున్నా మీ సహకారం చాలా అవసరం. స్నిగ్ధ పెళ్ళయిన మరుక్షణంనించే ఈ గొడవలు ప్రారంభమయ్యాయి కాబట్టి మీ ఇద్దరినీ కలిపి ట్రాన్సాక్షనల్ అనాలిసిస్ చేయాల్సి ఉంటుంది—చిన్నప్పట్నించి ఎన్నో కష్టాలను ఎదుర్కొని ఒంటరిగా పెరిగిన స్నిగ్ధకి పెళ్ళయ్యాక తనజీవితం ఎలా పరిణామంచెందుతుందో నన్న భయం ఉండి ఉండాలని నా ఊహ. ఇకమీదట మీరిద్దరూ కలిసి నాదగ్గరకు వస్తే బావుంటుంది—" అంది డాక్టర్ సుస్మిత.

"నా గురించి—నా ప్రేమ గురించి స్నిగ్ధకు అనుమానాలు ఏవయినా ఉన్నాయా?" అడిగాడు పవన్ కుర్చీలో ముందుకు ఒరిగి.

"తను నాకేమీ చెప్పలేదు. కానీ సబ్‌కాన్ప్‌స్‌గా...మనసులో ఏదో ఒక మూల ఇలాంటి భయాలుంటే నిత్యప్రవర్తనలో ఏదో ఒక రూపంలో

అవి బయట పడతాయి. స్నిగ్ధ భ్రమలగురించి అర్థంచేసుకోవాలంటే ముందా భయాలను వేర్లతోసహా ఊడపీకాలి."

"ఓ.కె... ఇకనించి నేను కూడా స్నిగ్ధతోపాటు వస్తాను... అన్నట్టు ఎల్లుండి మా పెళ్ళి సందర్భంగా చిన్న పార్టీ ఏర్పాటు చేస్తున్నాం—స్నిగ్ధకూడా చెప్తుందనుకుంటాను...మీరు తప్పకుండారావాలి." అన్నాడు పవన్.

"ష్యూర్...అయితే మనం ఆ తర్వాతే కల్సుకోవచ్చు...అప్పటి దాకా మీరు స్నిగ్ధతో ఈ విషయాలేవీ చర్చించకండినార్మల్‌గా ఉండండి." అంది సుస్మిత లేచి నిలబడుతూ—

ఆమెను సాగనంపడానికి తలుపుదాకా నడిచాడు పవన్.

"థాంక్యూ డాక్టర్ సుస్మిత!" అన్నాడు తలుపుతెరచి పట్టుకుంటూ

"సుస్మిత అని పిలవండి చాలు!" అందామె నవ్వుతూ.

"ఓ.కే. థాంక్యూ సుస్మిత..." అన్నాడు పవన్ మళ్ళీ.

"యూ ఆర్ వెల్కమ్" అంటూ వెళ్ళిపోయింది సుస్మిత.

• • •

అనుకున్న ప్రకారం గుళ్ళో పెళ్ళి జరిపించింది రాజేశ్వరిదేవి. పెళ్ళికి శ్యామసుందర్ అతడిభార్య సుమిత్రతోపాటు బొంబాయినించి వచ్చాడు.

ఆ రోజు సాయంత్రమే వినయ్‌ఫంక్షన్ పాలెస్‌లో రిసప్షన్ ఏర్పాటు చేసాడు పవన్. పార్టీకి ఆర్కియాలజీ డిపార్టుమెంటు వాళ్ళు, స్నేహితులు, దగ్గర బంధువులు హాజరయ్యారు.

పార్టీముగిసాక...

కార్లో ఇంటికి తిరిగివస్తూ అన్నాడు శ్యాంసుందర్—

"పార్టీ చాలానీట్‌గా జరిగింది పవన్—మీ అమ్మగారు కూడా వచ్చి ఉంటే బావుండేది..."

పెళ్ళి ముహూర్తం తెల్లవారుజామున కావడంతో నిన్నరాత్రంతా మేల్కొని బాగా అలిసిపోయింది. ఇవాళ రెస్టుతీసుకోవడం మంచిదని నేనే చెప్పాను" అన్నాడు పవన్.

ఇంటిగేటు దగ్గరాపిన కార్లోంచి పవన్‌తో పాటు దిగి నిలబడింది స్నిగ్ధ.

"మీరిద్దరూ మరో రెండ్రోజులుండి వెళ్తే బావుండేది" అన్నాడు పవన్ కార్లోనే కూర్చున్న శ్యాంసుందర్‌ని అతడి భార్యని ఉద్దేశించి...

"ఫార్మల్‌గా పెళ్ళి చేసుకుంటే కాని కుదర్దంటూ మీ అమ్మగారు ఈ వారంరోజులు మిమ్మల్నిద్దర్నీ విడిగా ఉంచారు. మరో రెండు రోజులుండి మీ అమూల్యమయిన సమయాన్ని వృథా చేయడం మాకిష్టం లేదు." అన్నాడు శ్యాం సీరియస్‌గా మొహం పెట్టుకుని.

అతడిమాటలకు నవ్వేసి పిడికిలి బిగించి భుజంమీద తమాషాగా కొట్టాడు పవన్.

కారు కిటికీలోంచి బయటకి తొంగిచూస్తూ స్నిగ్ధని దగ్గరకు పిలిచింది సుమిత్ర.

"పవన్ వాళ్ళమ్మగారికి ఎంత ఎటాచ్‌డ్‌గా ఉంటాడో నీకీపాటికి అర్థమయ్యే ఉంటుంది. ఆవిడ పెద్దమనసుతో మీపెళ్ళికి ఒప్పుకుంది కాబట్టి ఆవిడ మనసు నొప్పించకుండా ఉండాలి నువ్వు"

అలాగేనని తలూపింది స్నిగ్ధ

"రేపొద్దున మిమ్మల్ని ఎయిర్‌పోర్టులో దిగబెడ్తాను" అన్నాడు పవన్ తన మిత్రుడితో.

"డోంట్ బాదర్. మాకేం ప్రాబ్లమ్ ఉండదు. బొంబాయి చేరాక ఫోన్ చేస్తాను" అంటూ కారు పోనీమని డ్రైవర్ వీపు తట్టాడు శ్యాం సుందర్.

కారు కనుమరుగయ్యాక ఇంట్లోకి నడిచారిద్దరూ. పవన్‌ని అనుసరిస్తూ రాజేశ్వరిదేవి పడకగదిలోకి నడిచింది స్నిగ్ధ.

రాజేశ్వరిదేవి కళ్ళు మూసుకుని పడుకుని ఉంది. ఆవిడ కాళ్ళు వొత్తుతూ కూర్చుని ఉన్నాడు ఎనిమిదేళ్ళ కుర్రాడొకడు. పవన్, స్నిగ్ధ గదిలోకి రావడంచూసి చటుక్కునలేచి నిలబడి సన్నగా నవ్వాడు. పవన్‌కి సలాం లాంటిది చేసి బయటకి పరుగు తీసాడాకుర్రాడు.

ఆ కుర్రాడు వెళ్ళినవైపు చూసింది స్నిగ్ధ।

ఆ కుర్రాడు ఎప్పుడూ అంతే...క్షణంలో కనబడి మాయమవుతుంటాడు. పక్క సందులో ఎవరింట్లోనో పని చేస్తున్నాడట. తీరిక దొరికినపుడు ఈ ఇంటికి వచ్చి చిన్నచిన్న పనులేమయినా ఉంటే చేసి పోతుంటాడు. హుషారుగా అటూఇటూ తిరిగే ఆ కుర్రాడంటే స్నిగ్ధకు చూడముచ్చటగా ఉంటుంది.

గదిలో అలికిడికి కళ్ళు తెరిచింది రాజేశ్వరిదేవి. లేచి కూర్చుంటూ అడిగింది...

"పార్టీ బాగా జరిగిందా?"

"బాగానే జరిగింది కాని నీకు ఒంట్లో ఎలావుందో చెప్పు?" ఆమె పక్కనే కూర్చుంటూ అడిగాడు పవన్.

"కొంచెం ఆయాసంగా ఉందిరా ... అంతే..." అంది రాజేశ్వరిదేవి.

ఆమె చెయి ఆప్యాయంగా నిమురుతూ కూర్చున్నాడు పవన్।

గదిమధ్యనే నిలబడిపోయిన స్నిగ్ధకేసి చూసింది రాజేశ్వరిదేవి.

"గదిలోకి వెళ్ళమ్మాయి। బాగా అలిసిపోయి వుంటావు."అందామె.

అలాగేనని తలూపి బయటకు నడిచింది స్నిగ్ధ. హాల్లోంచి బెడ్ రూంకేసి వెళ్తూ చటుక్కున ఆగిందామె. వెనకనించి తననెవరో గమనిస్తున్నారనిపించిందెందుకో...గ్రక్కున వెనక్కి తిరిగి చూస్తే స్తంభానికి ఆనుకుని నిలబడి ఆమెకేసి తీక్షణమైన చూపులు చూస్తోంది మస్తానమ్మ।

స్నిగ వెనక్కి తిరగ్గానే చూపులు తిప్పుకొని వంటింటికేసి వెళ్ళిపోయిందామె.

చికాగ్గా తల విదిలించి బెడ్‌రూంలోకి వెళ్ళింది స్నిగ్ధ. హ్యాండ్ బ్యాగ్ షెల్ఫ్‌మీద పడేసి ఆశ్చర్యంగా గదంతా కలయచూసిందామె.

మంచంమీద తెల్ల సిల్కు దుప్పటి పరచి పూల మాలలతో అందంగా అలంకరించారెవరో। మంచంపక్కన బల్లమీద సువాసనలు వెదజల్లుతున్న అగరొత్తులూ, పళ్ళెంలో పళ్ళు...స్నిగ్ధ మనసు పులకరించింది।

వారం రోజుల్నించి ఒకే ఇంట్లో ఉంటున్నా పరాయిదానిలా పవన్‌కి దూరంగా ఉండవలసివచ్చింది. అతడితో మనసువిప్పి మాట్లాడే అవకాశం దొరకలేదు ఇక ఈ ఎడబాటు ఎంతసేపు?...మరికాసేపట్లో పవన్ బెడ్‌రూంలోకి వస్తాడు...తమ బెడ్‌రూంలోకి.

ఖండాలా కాటేజీలోకాని, బొంబాయి హోటల్లోకాని పవన్‌కి దగ్గరయి నపుడుమనస్సంతా దిగులుగా ఉండి పూర్తిగా రిలాక్స్ కాకపోయింది. కానీ ఈ రాత్రి?

ఈ రాత్రి అలా జరగదు.

ఈ రాత్రి పవన్‌కి అణువణువు నిస్సంకోచంగా, నిశ్చింతగా సమ ర్పించు కుంటుంది తను.

ఆమె పెదాలమీద చిరునవ్వు మెదలింది...

పవన్‌కి తన సంగతి పూర్తిగా తెలియదు. చిలిపి చేష్టలతో అతడ్ని పూర్తిగా ఉక్కిరి బిక్కిరి చేయకలదు! తను తనూ కవ్విస్తే అతడుకూడా పూర్తిగా రిలాక్స్ అయిపోతాడు.

భార్యాభర్తల మధ్య పూర్తి అవగాహన ఏర్పడేది పడకగదిలో అలా రిలాక్స్ అయినప్పుడే!

హాల్లో అడుగుల చప్పుడు వినబడి గబగబ వెళ్ళి మంచంమీద కళ్ళుమూసుకుని పడుకుంది స్నిగ్ధ. నిద్రపోతున్నట్టు నటించి కాసేపు పవన్‌ని ఆటలు పట్టించాలి.

"స్నిగ్ధా!" అంటూ లోపలికి వచ్చాడు పవన్.

నవ్వాపుకుంటూ అలాగే పడుకుంది స్నిగ్ధ.

మంచంమీద కూర్చుంటూ మళ్ళీ పిలిచాడు పవన్. నిద్రనటిస్తూ తిరిగి పడుకుంది స్నిగ్ధ. తనది దొంగనిద్రని అర్థంచేసుకుని మీదకు వాలి పోయి బుగ్గమీద ముద్దిచ్చేస్తాడనిపించి మొహానికి అడ్డంగా చెయిపెట్టుకుంది.

"నిద్ర పట్టేసిందా?" అడిగాడతను స్నిగ్ధ జుట్టు సవరిస్తూ.

"ఊఁ" అంది అస్పష్టంగా.

"బాగా అలసిపోయినట్టున్నావ్?" సిన్సియర్‌గా అడిగాడు పవన్.

"ఊఁ" అంది స్నిగ్ధ మళ్ళీ...ఇక నవ్వాగడం లేదా మెకు. తనకు నిద్రపట్టేసిందని పవన్ అప్పుడే నీరుకారిపోతున్నాడు!...చటుక్కున వెనక్కి తిరిగి అతడి మెడ చుట్టూ చేతులువేసి తనకేసి లాక్కోవాలని పించింది.

పవన్ మరుక్షణం మాట్లాడకుండా ఉంటే అంతపని చేసిఉండేది.

"స్నిగ్ధా! అమ్మకు ఆయాసం ఎక్కువయింది"

పవన్ మాటలు వినగానే కళ్ళుతెరచింది స్నిగ్ధ...కానీ అతడికేసి తిరగలేకపోయింది.

"నువ్వుకూడా బాగా అలిసిపోయినట్టున్నావు" అంటూ ఆగాడు పవన్.

నెమ్మదిగా లేచికూర్చుని అతడికేసి చూసింది స్నిగ్ధ.

"ఇవాళరాత్రి ఆవిడదగ్గర ఎవరయినా పడుకోవడం మంచిదేమో!" అన్నాడు పవన్.

ఏమని సమాధానం చెప్పాలి? ఏదో చెప్పబోయి తమాయించుకుంది స్నిగ్ధ.

"అలాగే..." అని నీరసంగా అంది చివరికి-

ఒక్కక్షణం సందేహించి లేచి నిలబడ్డాడు పవన్. స్నిగ్ధకూడా లేచి నిలబడింది.

"పోనీ...అత్తయ్యగారి గదిలో నేను పడుకోనా?"

"వద్దు స్నిగ్ధా! నేనే పడుకుంటాను" అంటూ కదిలాడు పవన్. తలుపు దగ్గర ఆగి వెనక్కి తిరిగి చూసాడు.

స్నిగ్ధ కదలకుండా అక్కడే నిలబడి ఉంది.

"సారీ..."

"ఫర్వాలేదు పవన్...గుడ్‌నైట్!"

• • •

మర్నాడు సాయంత్రం ఆరున్నర ప్రాంతంలో బయటకి వెళ్తూ మస్తానమ్మని పిలిచింది రాజేశ్వరిదేవి.

"తలుపు గడియవేసుకో మస్తానమ్మా! అబ్బాయిగారు వస్తేపక్కింటి

సరోజినిగారిదగ్గర కెళ్ళానని చెప్పు." అని బయటకు నడిచింది.

రాజేశ్వరిదేవి గేటుదాటగానే తలుపులు మూసి గడియవేయబోయింది మస్తానమ్మ...కానీ అంతలోనే ఏదో ఆలోచనవచ్చి గడియవేయకుండానే వెనక్కి తిరిగింది.

మండువాలోంచి మెట్లెక్కి డాబామీదకు వెళ్ళి నిలబడింది మస్తానమ్మ...కాలనీలో పలచగా చీకట్లు అలుముకుంటున్నాయి. వీధి దీపాలు వెలగలేదింకా...రోడ్డుకవతల వైపున్న చింతచెట్టుమీద పక్షులు వచ్చి వాలుతున్నాయి అప్పుడే...అసురసంధ్యవేళ అయింది. వాడు వచ్చే ఘడియ సమీపించింది.

పిట్టగోడకానుకుని నిలబడి రోడ్డు చివరిదాకా దృష్టి సారించింది మస్తానమ్మ. మలుపుదగ్గర్నించి బుడిగి బుడిగి పరుగుతో వస్తున్న ఆ కుర్రాడిని చూసి చిన్నగా నవ్వుకుంది. వీధి తలుపు తోసుకుని ఆ కుర్ర వాడు ఇంట్లోకి రావడం డాబామీదనించే చూసిందామె.

ఒక్క నిమిషమాగి నెమ్మదిగా మెట్లుదిగి కిందికి వచ్చిందామె. హాల్లో ఆ కుర్రవాడు కనబడలేదు. అంటే పెద్దావిడ గదిలోకి వెళ్ళుండాలి. లేదా వాళ్ళబ్బాయి పడకగదిలో జోళ్ళకు పాలిష్ చేస్తుండాలి.

గబగబ వెళ్ళి వీధి తలుపు గడియవేసేసింది మస్తానమ్మ.

గడియవేసిన తలుపుమీద చూపుడు వేలితో అంకెలు ఏవోవేసి వాటి చుట్టూ గుండ్రంగా చక్రమొకటివేసి సంతృప్తిగా నవ్వుకుంది... ఇప్పుడు వాడు ఈ ద్వారం దాటలేడు.

నెమ్మదిగా అక్కడ్నించి కదిలి రాజేశ్వరిదేవి గదికేసి వెళ్ళి లోపలికి తొంగిచూసింది. అక్కడ లేడువాడు. అంటే...వాడు రెండవ పడకగదిలోనే ఉన్నాడన్నమాట! తనక్కావలసిందికూడా అదే. అడుగు ముందు అడుగులేస్తూ నెమ్మదిగా పవన్ గదికేసి వెళ్ళింది మస్తానమ్మ.

గుమ్మం దగ్గర ఒక్కక్షణం ఆగిపోయిందామె. చిన్నప్పట్నించి నేర్చుకున్న విద్యని మొట్టమొదటిసారిగా ఉపయోగించబోతోంది తను... ఏ మాత్రం పొరపాటు జరిగినా తన ప్రాణాలకే ప్రమాదం. కానీ... ఇలాంటి అవకాశం మళ్ళీరాదు! వాడిలా ఒంటరిగా దొరకడు.

పైగా తనని ఆపదల్నించి కాపాడడానికి మెదకి దాదాసాహెబు ఇచ్చిన తాయత్తు ఉందికదా? మెళ్ళోని తాయత్తుని కళ్ళకద్దుకుని ముందుకి నడిచింది మస్తానమ్మ.

గదిలో పవన్ బీర్వాం ఎదురుగా మోకరిల్లి ఉన్నాడు కుర్రాడు. మస్తానమ్మ అడుగుల చప్పుడికి చటుక్కున తలెత్తి చూసాడతను. గుమ్మంలో మస్తానమ్మని చూడగానే అద్దిరిపడి లేచాడు.

"ఏంచేస్తున్నావిక్కడ?" అంటూ వెళ్ళి మంచంమీద కూర్చుంది మస్తానమ్మ.

గుమ్మం దగ్గర్నించి మస్తానమ్మ జరగ్గానే ఆటు పరుగుతీయ బోయాడు ఆ కుర్రాడు.

"నువ్వు గది బయటకు వెళ్ళలేవు 'ఖబీస్'!" అంది మస్తానమ్మ అలాగే కూర్చుని.

ఖబీస్...ఖబీస్...ఖబీస్... ఖబీస్...

గుమ్మం దగ్గర ఠక్కున ఆగిపోయాడు ఆ కుర్రాడు వెనక్కి తిరిగి మస్తానమ్మకేసి అదోలా చూసాడు.

"నీ అసలు పేరు నాకెలా తెలిసిపోయిందనుకుంటున్నావా? నాకంతా తెలుసు. నిన్ను ఈ ఇంట్లో మొట్టమొదటిసారి చూసినపుడే నాకనుమానం వచ్చింది. అసురసంధ్యవేళతప్పు నువ్వు రాకపోవడం చూసి నా అనుమానం బలపడింది. రా...ఇలారా..." అని తనకేసి పిలిచింది మస్తానమ్మ.

ఖబీస్ కదల్లేదు. ధిక్కారంగా ఆమెకేసి చూసి మళ్ళీ బయటకు వెళ్ళబోయాడు.

సరిగ్గా అప్పుడే మొదలెట్టింది మస్తానమ్మ మంత్రోచ్చారణ.

వివశుడై వెనక్కి తిరిగాడు ఖబీస్.

మంత్రోచ్చారణ కొనసాగిస్తూ తీక్షణంగా అతడికేసి చూస్తోంది మస్తానమ్మ.

దీనంగా మొహం పెట్టుకుని నన్ను వొదిలేయి అన్నట్టు చేతులు జోడించాడు.

మస్తానమ్మ నాడీ మంత్రం ఆపలేదు.

ఖబీస్ మొహంలో భయం చోటుచేసుకుంది...గదిలో అటూ ఇటూ గాభరాగా పరుగెత్తసాగాడు...

వాడలా ఎంతోసేపు పరుగెత్తలేడని మస్తానమ్మకి తెలుసు,... మంత్రోచ్చారణ కొనసాగించిందామె.

అయిదు నిముషాలసేపు గదిలో పిచ్చిగా పరుగులు తీసిన ఆ కుర్రాడు సొమ్మసిల్లి గది మధ్యన చతికిలబడ్డాడు.

గెలుపు తనదేనని అర్థమయింది మస్తానమ్మకి. ఇప్పుడు చేయవలసినదే అసలుపని!

నాడీ మంత్రోచ్చారణ ఆపి తన దగ్గరకు రమ్మని ఖబీస్‌ని పిలిచింది మస్తానమ్మ.

"భయపడకు...రా...! నీకేం అపకారం చెయ్యను. నాదగ్గర నీకు భయంవద్దు..." అంటూ ప్రేమగా పిలిచింది.

ఖబీస్ లేచి నెమ్మదిగా ఆమె దగ్గరకు వచ్చాడు. మంచం పక్కన నిలబడ్డ ఆ కుర్రాడి జుట్టులోకి ప్రేమగా వేళ్ళు పోనిచ్చింది మస్తానమ్మ... మనస్సులో ఒక పక్క మారువా మంత్రం పఠిస్తూ మాట్లాడ సాగింది.

"నువ్వు నా దగ్గరే ఉండాలి...ఇకనుంచి కేవలం నాకే సేవలు చేయాలి. నేను రమ్మన్నప్పుడు రావాలి."

అన్నింటికి సరే అన్నట్లు నీరసంగా తలూపాడు ఖబీస్.

అప్పుడు తగిలింది మస్తానమ్మ చేతికి ఖబీస్ తలమీద చొచ్చుకుని ఉన్న మేకు.

ఖబీస్ నెత్తిమీద ఇంత పెద్ద మేకు!

మారువా మంత్రం పైకి చదువుతూ. ఆ మేకుని వేళ్ళతో గట్టిగా పట్టుకుంది మస్తానమ్మ...

గిలగిలలాడిపోయాడు ఖబీస్.

మస్తానమ్మ పట్టు విడిపించుకోవడానికి గింజుకోసాగాడు. మస్తానమ్మ ఆ మేకుని పైకి లాగుతూ మారువా మంత్రం పెద్దగా ఉచ్చరించ సాగింది...

మేకు తలలోంచి పైకి లాగేస్తుంటే ఖబీస్ ఆకారంలో క్రమంగా మార్పు వచ్చింది.

గుండ్రంగా ఉన్న అతడి మొహం కోలగా మారసాగింది...ఎని మిదేళ్ళ కుర్రాడి లేత మొహం ముడతలుపడి డెభైఏళ్ళ వృద్ధుడి మొహంలా మారిపోయింది...

మస్తానమ్మ ఇక ఆగలేదు. చివుక్కున మేకుని పైకి లాగేసింది... అంతే!

చూస్తుండగానే ఖబీస్ పూర్తిగా మారిపోయాడు ... నాలుగడుగుల బుడత ఏడడుగుల ఉద్దండుడిలా ఎదిగాడు. ఒకే ఒక్క క్షణంలో అక్క డ్నించి కదిలి గదిమూలన వెళ్ళి నిలబడిపోయాడు. అలా వెళ్ళినిలబడ గానే మేకును పైన వాసానికి లాగి కట్టింది.

భయంకరమయిన ఆ ఆకారంకేసి గర్వంగా చూసింది మస్తానమ్మ.

అన్నాళ్ళు పిల్లవాడి ఆకారంలో తిరుగుతున్న 'ఖబీస్' అనే అతీత శక్తిని అవలీలగా బంధించగలిగింది తను! ఇక మీదట ఈ ఖబీస్ తన చెప్పుచేతల్లో ఉంటుంది. ఆ గదిలోనే బంధించి ఉన్నా తనకు తప్ప మరె వరికీ అగుపడదు ఖబీస్! తన అనుమతిలేనిదే ఖబీస్ ఆ మూలనించి కద లదు!

విజయగర్వంతో అక్కడ్నించి బయటకు నడిచింది మస్తానమ్మ.

కబీస్ ఎత్తి నిలిపిన దూలంలా ఆ మూలనే నిలబడిపోయింది.

అది ఆ గదికి ఈశాన్యం మూల.

ఏ ఇంట్లోనయినా అసురసంధ్యవేళలో ఖబీస్ మసలుకొనే చోటది.

ముని చీకట్లు అలముకునే వేళలో ఖబీస్ లాంటి అతీత శక్తులు స్వేచ్ఛగా విహరిస్తుంటాయనే కాబోలు ఆసంధి సమయాన్ని అసురసంధ్య అంటారు.

అందుకే కాబోలు బాగా చీకటి పడకముందే గదిలో దీపం వెలిగించాలంటారు.

ముఖ్యంగా గదిలో ఈశాన్యంమూల ఎప్పుడూ చీకటిగా ఉండ కూడదు.

# 8

మస్తానమ్మ ఖబీస్‌ని వశం చేసుకుంటున్న సమయంలో.

డాక్టర్ సుస్మిత కన్సల్టింగ్ రూంలో కూర్చుని ఉన్నారు స్నిగ్ధ, పవన్.

సైకో అనాలసిస్ అంటే చాలా ఇబ్బందికరంగా ఉంటుందేమోనని భయపడ్డాడు పవన్. గంటన్నరసేపు "కౌచ్" మీద మెదలకుండా పడుకుని సుస్మిత ప్రశ్నలకు సమాధానం చెప్తుండాలేమోనని ఊహించుకున్నాడు. కానీ డాక్టర్ సుస్మిత "సెషన్" అలాలేదు. ఆమెతో మాట్లాడుతుంటే కొన్నేళ్ళుగా ఆమె తనకు తెలుసన్నట్లు అనిపించింది. ఒక ఫ్రెండుతో... శ్రేయోభిలాషితో మనస్సువిప్పి మాట్లాడుతున్నట్టు, హాయిగా కబుర్లు చెప్తున్నట్లుంది.

ట్రాన్సాక్షనల్ అనాలిసిస్ ధ్యేయం వ్యక్తికి వ్యక్తికి మధ్య సంబంధాన్ని మెరుగుపరచడమేనని ముందుగానే స్పష్టం చేసింది డాక్టర్ సుస్మిత.

ఆమె ప్రోత్సాహంతోనే జరిగిందంతా మరోసారి దాపరికాలు లేకుండా మాట్లాడుకున్నారు స్నిగ్ధ, పవన్.

వాళ్ళ మాటలు ముగిసాక అంది సుస్మిత.

"స్నిగ్ధా! మనం మాట్లాడుకున్నది రెండు వేర్వేరు విషయాల గురించి అని నువ్వు మరచిపోకూడదు. మొదటిది, ఖండాలా వెళ్ళినపుడు అనుకోకుండా చేతికి చిక్కిన ఆ విగ్రహం. రెండవది...నిన్ను కలవరపెడుతున్న పీడకలలు, భ్రమలు. ఆ విగ్రహం గురించి ఆర్కియాలజిస్ట్‌గా పవన్ చేస్తున్న రిసెర్చ్‌లో నువ్వుకూడా సహకరిస్తానని ఇందాక మాటిచ్చావు. అదే సరయిన పద్ధతి. రియలిస్టిక్ అప్రోచ్! డూ యూ సీ మై పాయింట్?" అడిగింది సుస్మిత.

ఒక్కక్షణం మాట్లాడలేదు స్నిగ్ధ.

"...కానీ, నా కలలకి వాస్తవానికి తేడా వున్నట్టు నాకు అనిపించడంలేదు.

"అంటే?"

"ఇవాళ నీదగ్గరకి మేమిద్దరం ఇలారావడం...నీతో కూర్చుని

మాట్లాడటం ఎంత రియల్‌గా ఉందో నేను చెప్పిన సంఘటనలు కూడా అంత రియల్‌గాఉన్నాయి."

"అందులో విచిత్రం ఏముంది స్నిగ్ధా!? మనలో చాలా మందికి అలాంటి 'వివిడ్ డ్రీమ్స్!' వస్తూనే ఉంటాయి. హోటల్‌లో కూర్చుని భోంచేస్తున్నట్టు కలకంటూ చటుక్కున మెలకువవస్తే నిజంగానే భోంచేసామన్నట్టు ఆ వంటకాల రుచి చాలా సేపటిదాకా నోటిలో ఉంటుంది... అలాగే..."

సుస్మిత మాటలకు అడ్డువచ్చింది స్నిగ్ధ.

"నో! నో సుస్మితా! అలాంటి కలలు కావు నావి! ఖండాలాదారిలో ఆపాడుబడ్డ ఇంటిదగ్గర నేను చూసిన అద్భుతంతో ప్రారంభమయ్యాయి. ఈ సంఘటనలు."

చిన్నగా నవ్వి జవాబిచ్చింది సుస్మిత.

"ఆ పాడుబడ్డ ఇంటి ఫోటోలు తీస్తున్నప్పుడేకదా నీకా అద్భుతం కనబడింది? నువ్వు తీసిన ఫోటోలను డెవలప్ చేయిస్తే ఆ రోల్ మొత్తం బ్లాంక్‌గా ఉందని చెప్పావుకదా! అంటే అది కేవలం ఇల్యూషన్ అనుకోవచ్చు. ఇక నువ్వు చెప్పిన మిగతా వివరాలనుబట్టి చూస్తే నువ్వక్కడతెలివి తప్పి పడిపోయి ఉంటావని భవనంలోకి వెళ్ళి కరకింకర ఆలయం చూసినట్టు ఊహించి ఉంటావని అనకానికి ఆస్కారం లేకపోలేదు...ఆ తర్వాత గెస్ట్‌హౌస్ గదిలో పొరపాటున మీకు తెచ్చిన విగ్రహంచూసి బెదిరిపోయావు? వికృతంగా ఉన్న ఆఆంటిక్ బొమ్మను చూసి అది నీ ఊహల్లో మసలుతున్న ఆకారంలాంటిదేనని భయపడిపోయావు. మెంటల్ ట్రిక్! అదే విధంగా సెంటూరు హోటల్‌నించి మళ్ళీ ఆ భవనానికి వెళ్ళినట్టు ఊహించావు!"

పేలవంగా నవ్వి తలవిదిలించింది స్నిగ్ధ...

"నీ ఎక్స్‌ప్లనేషన్ బాగానేవుంది సుస్మిత. కానీ లాభంలేదు." ఖండాలా చేరాక నా చేతిమీద నల్లటిదారం, హోటల్‌రూంలో ఒంటిమీద రక్తం మరకలు...వీటన్నింటికీ ఎక్స్‌ప్లనేషన్ ఏముంటుందీ. ప్లీజ్ నీదగ్గర కొచ్చే న్యూరోటిక్ పేషెంట్స్‌ని చూసినట్టు చూడకునన్ను!" అందామె

ప్రాధేయపడుతున్నట్టు.

సుస్మిత ముందుకు వొంగి స్నిగ్ధ చెయి తన చేతుల్లోకి తీసుకుంది.

"నేను నీ మాటలు కొట్టిపారేయడంలేదు స్నిగ్ధా. నీకీకలలు ఎందుకు వస్తున్నాయో అర్థం చేసుకోవడానికి సైకియాట్రిస్ట్‌గా నా ప్రయత్నం నేను చేస్తున్నాను. అలాగే నువ్వు ఈ కన్‌ఫ్యూషన్‌నించి బయటపడాలని నీ స్నేహితురాలిగా కోరుకుంటున్నాను."

అంతవరకూ వాళ్ళమాటలు వింటున్న పవన్ అడిగాడు.

"ఇంతవరకూ మీరు స్నిగ్ధప్రాబ్లమ్ గురించి అర్థం చేసుకున్న దేవిటో చెప్తారా!"

ఏదో ఆలోచిస్తూ అతడికేసి చూసింది సుస్మిత...

"నా అనాలిసిస్ ఇంకా పూర్తికాలేదు పవన్‌గారూ? అస్పష్టంగా ఒక థియరీ నా మనసులో మెదులుతోంది ఏది ఏమయినా, స్నిగ్ధ దీని నించి బయటపడాలంటే మీరు, మీ అమ్మగారూ పూర్తిగా సహకరించాల్సి ఉంటుంది!"

"మా అమ్మగారా?" ఆశ్చర్యంగా అడిగాడు పవన్.

"స్నిగ్ధ చిన్నప్పట్నుంచి ఎదుర్కొన్న ప్రాబ్లమ్స్ మీకు తెలుసు కదా! పసితనంలోనే వాళ్ళ అమ్మా నాన్నా చనిపోవడంతో ఏడేళ్ళవయసు వరకు దూరపు బంధువు ఒకావిడ ఇంట్లోవుంది. ఆవిడొక సాడిస్టు! వాళ్ళాయన కూడా ఆమెకు తీసిపోలేదు. వాళ్ళిద్దరి హింసలకు తట్టుకుంటూ మానసికంగా కృంగిపోయింది స్నిగ్ధ...ఆ తర్వాత హాస్టల్లో చేర్పించారు స్నిగ్ధని. అక్కడి వాతావరణానికి సర్దుకోలేక ఇమోషనల్ ఇన్‌సెక్యూరిటీ ఏర్పడిందామెకు...ఇప్పటికి కూడా ఆ ఇన్‌సెక్యూరిటీ సబ్-కాన్‌షస్ లెవెల్‌లో ఉంది! అందుకే ఒకపక్కన జీవితంలో అడ్వెంచర్. థ్రిల్ ఉండాలని, ధైర్యంగా ముందుకు సాగిపోవాలని ఉన్నా...మరోపక్క కొత్త పరిస్థితులన్నా...కొత్త మనుషులన్నా జంకు. అదే ఆమెను వెనక్కి లాగేస్తుంటుంది. అందుకే అన్నాను...మీరూ మీ అమ్మగారూ స్నిగ్ధ అంతరంగంలోని ఆ బెరుకుని ఆదరణతోనూ ప్రేమతోనూ పోగొట్టాలి అని" అంటూ ఆగింది డాక్టర్ సుస్మిత.

"స్నిగ్ధకి ఇకముందు అలాంటి ప్రాబ్లమ్ ఉండదు. అమ్మ స్నిగ్ధని ఇంటి కోడలిగా స్వీకరించింది—కానీ దీనికీ స్నిగ్ధ చూస్తున్న పీడకలకీ సంబంధం ఏమిటి?" అడిగాడు పవన్.

"మీరు వినే ఉంటారు...పదేళ్ళు జైలుశిక్ష అనుభవించిన వాడిని విడుదల చేస్తే బయటప్రపంచంలో తనకి అలవాటులేని వాతావరణాన్ని, కొత్తమనుషుల్ని చూసి భయపడుతుంటారు. బయట ప్రపంచంకంటే పదేళ్ళుగా అలవాటయిన జైలుగోడలే నయమనిపిస్తాయి అతడికి...స్నిగ్ధ పరిస్థితి కూడా దాదాపు అలాంటిదే। ఒకపక్క మీ ప్రేయసిలా, భార్యలా సుఖపడాలనే కోరిక...మరోపక్క తనకు తెలియని ప్రపంచంలోకి అడుగిడుతున్నదని భయం। ఆమె అంతరంగంలో జరుగుతున్న ఈ సంఘర్షణ ప్రతిఫలమే ఈ పీడలలు. మా సైకియాట్రీ పరిభాషలో చెప్పాలంటే- **bes adultego is contaminated by the child ego।**" అని ముగించింది సుస్మిత.

తన స్నేహితురాలి మాటలు వింటూ ఆలోచనల్లోకి జారుకుంది స్నిగ్ధ.

సుస్మిత మాటల్లో లాజిక్ ఉంది. చిన్నప్పట్నించి తనకు ఇన్సెక్యూరిటీ ఉన్నమాట వాస్తవమే।...సుస్మిత అనాలిసిస్‌తో తన కలల పరమార్థం తెలుసుకోవచ్చు-అలాగే పవన్ దగ్గర ఇకఏదీ దాచదలచుకోలేదు కాబట్టి కరకింకర గురించి స్వేచ్ఛగా చర్చించి వాని చరిత్ర ఏమిటో తెలుసుకోవచ్చు...తనని వేధిస్తున్న సమస్యలన్నింటికి ఇలా సమాధానం దొరికితే అంతకంటే కావల్సిందేముంటుంది?

• • •

డాక్టర్ సుస్మితతో మాటలు ముగించి ఇంటికి చేరేప్పటికి రాత్రి ఎనిమిదయింది.

"ఏమ్మిటా ఇంత ఆలస్యం అయింది" అంటూ ఎదురొచ్చింది రాజేశ్వరిదేవి.

"జూబ్లీహిల్స్‌లో స్నిగ్ధ ఫ్రెండ్ ఇంటికెళ్ళామమ్మ...నువ్వు ఫోంచేసావా?" అడిగాడు పవన్.

"లేదింకా...కాళ్ళు కడుక్కుని రండి అంతా రెడీగా ఉంది" అంది రాజేశ్వరిదేవి.

భోజనాలయ్యాక ప్లేట్లు తీయబోయింది స్నిగ్ధ.

"ఫర్వాలేదమ్మాయి ... పనిపిల్ల ఉందికదా తీస్తుందిలే" అని మస్తానమ్మని పిలిచింది రాజేశ్వరిదేవి.

అక్కడ్నించి హాల్లోకి వచ్చేసింది స్నిగ్ధ.

రాజేశ్వరిదేవి మాటతీరు చాలా సహజంగా ఉందీరోజు. తనుకూడా లేనిపోని ఆలోచనలు పెట్టుకోకుండా ఉండాలి. క్రితంరాత్రి పవన్ ఆవిడ గదిలో పడుకుంటే అపార్థం చేసుకుంది తను. పెళ్ళికి ఒప్పుకున్నా పవన్ తనకి దగ్గరవ్వడం ఆవిడ సహించడంలేదని అపోహపడింది!... పాపం ఆవిడకు క్రితం రాత్రి నిజంగానే సుస్తీగా ఉందేమో!...తన గురించి సుస్మిత చెప్పింది నిజమే! గతంలో తనెదుర్కొన్న కష్టాలని ఆశాభంగాలని దృష్టిలో పెట్టుకుని భవిష్యత్తులో ఏం జరుగుతుందోనని అనుక్షణం భయపడుతూ బతుకుతోంది తను. ఇప్పుడు ... ఈ క్షణం తనకు దొరికే సుఖాన్ని గుర్తించి సంతోషాన్ని ఆస్వాదించాలంటే తన వైఖరి మార్చుకోవాలి.

డైనింగ్ రూంలోంచి రాజేశ్వరిదేవితోపాటు పవన్‌కూడా బయటకు వచ్చాడు. ఇద్దరికీ వక్కపొడి అందించి బెడ్‌రూంలోకి వెళ్ళింది స్నిగ్ధ.

పవన్‌కూడా వస్తాడేమోనని కాసేపు ఎదురుచూసి మంచంమీద పడుకుంది స్నిగ్ధ. కాసేపు మాగజైన్ తిరగేసింది కాని అన్యమనస్కంగా ఉండి చదవలేకపోయింది. మాగజైన్ పక్కనపడేసి లేచివెళ్ళి గదిలో లైట్ ఆర్పేస్తూ హాల్లోకి చూసింది. పవన్ అక్కడలేడు! అంటే వాళ్ళ అమ్మ గారితో కబుర్లు చెప్తూ ఆవిడ గదిలోనే ఉండిఉంటాడు...అయితే ఈరోజు కూడా?...మనసులో చోటు చేసుకుంటున్న చికాకుని పక్కకు నెట్టేస్తూ వెళ్ళి మంచంమీద బోర్లా పడుకుంది స్నిగ్ధ.

కొన్ని నిమిషాలక్రితం మనోవైఖరి మార్చుకోవాలని తీర్మానించుకున్న తన మనసులో మళ్ళీ ఈ అలజడి ఏమిటి? బుర్రలోని ఆలోచనల్ని తీసిపారేసే ప్రయత్నంలో కళ్ళుమూసుకుని నిశ్చలంగా పడుకుందామె.

ఇవాళ కూడా పవన్ తన దగ్గరకిరాడు. ఇవాళేకాదు ఎప్పటికీ రాక పోయినా సందేహాలకి, అనుమానాలకి చోటివ్వకూడదు తను.

అంతలో...మంచంమీద తనపక్కన ఏదో కదలినట్టయి వెనక్కి తిరగబోయింది స్నిగ్ధ.

ఆమెకు దగ్గరగా...ఎంతో దగ్గరగా పవన్.

ఆమె తేరుకునేలోగా కౌగిలించుకుని మెడమీద వెచ్చటి ముద్దొకటి ఇచ్చాడతను.

"ఆలస్యం అయిందని కోపం వచ్చిందా?" అడిగాడు పవన్.

లేదని తలూపి అతడికేసి తిరిగి పడుకుంది స్నిగ్ధ.

"ఇవాళ అత్తయ్యగారి దగ్గర ఎవరుంటారు?" అడిగింది స్నిగ్ధ.

"అమ్మకివాళ బాగానేఉంది. అయినా ఏదైనా అవసరం ఉంటే ఆ పనిపిల్ల ఉందికదా..." అంటూ ఆమెను దగ్గరకు లాక్కున్నాడు.

అతడి భుజంమీదుగా తలుపుకేసి చూసింది స్నిగ్ధ. గడియ వేసి ఉంది. నిశ్చింతగా ఊపిరిపీల్చుకుని అతడి బుగ్గమీద ముద్దెట్టుకుంది.

ఆమెను మరింత దగ్గరకు లాక్కుంటూ అన్నాడు పవన్. "సారీ స్నిగ్ధా...ఇన్నిరోజులు నీకు దూరంగా ఉండవలసి వచ్చింది. ఈ వారం రోజులు ఒక ఎత్తు...నిన్న రాత్రి జరిగింది మరో ఎత్తు."

పవన్ పెదాలకి చూపుడువేలు ఆనించి అతడి మాటలు ఆపింది స్నిగ్ధ.

"ప్లీజ్ పవన్! మనమధ్య సారీలు వద్దు!...గతం గురించి ఆలోచిస్తూ మనసు పాడుచేసుకోకూడదని ఇందాకే అనుకుంటున్నాను. నీకు చేరువయిన ఈ ఆనందాన్ని పూర్తిగా అనుభవించనీ."

"నేను ఎప్పుడూ నీ దగ్గరే ఉంటే?" అడిగాడు పవన్.

"ఆనందం అవధులు దాటుతుంది" అంది స్నిగ్ధ.

ఆమె పెదాలను గట్టిగా ముద్దెట్టుకుంటూ జాకెట్ మీదకు చెయి పోనిచ్చాడు పవన్. అడ్డు చెప్పలేదు స్నిగ్ధ.

స్నిగ్ధ హైదరాబాదుకు వచ్చి వారంరోజులయినా తమకు ఎడబాటు తప్పలేదు ఇక తనకెటువంటి ఆటంకాలు లేవనుకుంటూ స్నిగ్ధ బట్టలు

విప్పేస్తూ భుజంమీద ఛాతీమీద ముద్దులు కురిపించాడు పవన్.

బెడ్‌లైట్ కాంతిలో స్నిగ్ధ శరీరం వొంపులు చూస్తుంటే తన్మయత్వం వచ్చింది పవన్‌కి...లేచికూర్చుని ఆమె వొళ్ళంతా తడుముతూ అడిగాడు "ఈ సామ్రాజ్యానికి నేనే అధినేతను కదూ?"

సమాధానం చెప్పలేదు స్నిగ్ధ.

"ఈ రాత్రంతా ఇలాగే నిన్ను చూస్తూ గడిపేయాలని ఉంది."

స్నిగ్ధ తలతిప్పుకుని పడుకుంది...మసక చీకట్లో ఆమె మొహం లోని భావాలు గమనించలేకపోయాడు పవన్. ఆమెమీదకు వాలిపోయి పూర్తిగా దగ్గరకు కావాలని హత్తుకుపోయాడు పవన్.

"ప్లీజ్ పవన్!..."అంటూ అతడ్ని వెనక్కి తోసింది స్నిగ్ధ.

పవన్ వెంటనే జరగలేదు.

"పవన్...ప్లీజ్ లీవ్ మీ!" అని లేవబోయింది స్నిగ్ధ...కానీ పవన్ శరీరం ఆమెను ఆక్రమించుకుని ఉండటంతో కదల్లేకపోయింది.

"ఏమయింది స్నిగ్ధా?" జరిగి పడుకుంటూ అడిగాడు పవన్.

స్నిగ్ధ వెంటనే సమాధానం చెప్పకపోయేసరికి అతడిలో కంగారు మొదలయింది.

"ఏమయింది? ఒంట్లో బాగాలేదా? డిడ్ ఐ హర్ట్ యూ?

నెమ్మదిగా తలూపింది స్నిగ్ధ. చటుక్కున దుప్పటి కప్పుకుంటూ అంది.

"పవన్...మనల్ని ఎవరో చూస్తున్నారు..."

ఉలిక్కిపడి లేచి కూర్చుని తలుపుకేసి చూశాడు పవన్ తలుపు గడియవేసేవుంది. లేచి లైట్ వేసాడతను.

"ఏమిటి స్నిగ్ధా నువ్వంటోంది?" అయోమయంగా చూస్తూ అడిగాడు పవన్.

స్నిగ్ధ అతడికేసి చూడటంలేదు...భయంగా బీర్వా ఉన్న గది మూలకేసి చూస్తోంది.

"స్నిగ్ధా సిన్నే" రెట్టించాడు పవన్.

"ఈ గదిలో...నేనూ నువ్వు కాక...మరెవరో మరేదో ఉన్నట్టు

ఫీలింగ్..." అంది స్నిగ్ధ అస్పష్టంగా...

"వాట్ నాన్సెన్స్" అన్నాడు పవన్ నవ్వేస్తూ.

స్నిగ్ధ చూపులు మారలేదు...యధాలాపంగా అటుకేసి చూసిన పవన్‌కి ఏదో తట్టింది.

"స్నిగ్ధా...నా బీర్వా తెరచి చూసావా నువ్వు?" అడిగాడతను కళ్లు చిన్నవిచేస్తూ.

"ఊఁ?"

"నా బీర్వా లాకర్‌లో ఆ విగ్రహం ఉన్నట్టు నీకు తెలుసుకదూ?" అడిగాడు పవన్.

అతడి అనుమానం అర్థమయింది స్నిగ్ధకి.

"పవన్...నీ లాకర్‌లో విగ్రహం ఉందని తెలుసు నాకు" అంది నెమ్మదిగా.

రిలాక్స్‌డ్‌గా నవ్వేసాడు పవన్.

"అదీ సంగతి. ఆ విగ్రహం ఇక్కడే ఉందని భయపడుతున్నావా! డోంట్ వర్రీ—రేపే ఆఫీసుకి తీసుకెళ్ళిపోతాను..." అని ఇంకేదో అనబోతున్న పవన్‌ని మధ్యలో ఆపేసింది స్నిగ్ధ...

"నో పవన్! నేనా విగ్రహానికి భయపడటంలేదు. ఇక్కడికి వచ్చిన మొదటిరోజే లాకర్ తీసి చూసాను..."

"మరి దేనిగురించి నీ భయం? ఏమవుతోంది నీకు?"

"తెలీదు పవన్! చెప్పలేకపోతున్నాను...ఐకాంట్ ఎక్స్‌ప్లయిన్... కానీ...ఇందాక మనల్ని ఎవరో గమనిస్తున్నట్టు...ఆ మూల నిలబడి ఉన్నట్టు..." ఆగిపోయింది స్నిగ్ధ...

ఆమెకేసి అదోలా చూస్తూ నిలబడ్డాడు పవన్ కాసేపు...

"స్నిగ్ధా! ఎందుకిలా లేనిపోనివి ఊహించుకుని భయపడతావునువ్వు? గదిలో మనం తప్ప ఎవరూ లేరని తెలిసాక కూడా ఎందుకీ బెదురు?"

స్నిగ్ధ సమాధానం చెప్పలేదు. దుప్పటి భుజాలదాకా కప్పుకుని కూర్చుంది.

లైట్ ఆఫ్‌చేసి వచ్చి ఆమెపక్కన కూర్చున్నాడు పవన్.

"రిలాక్స్ స్నిగ్ధా...నేనున్నానుకదా నీకు భయందేనికి—పడుకో" అంటూ ఆమెను పడుకోబెట్టి తను కూడా పడుకున్నాడు.

అయిదు నిమిషాలు కళ్ళు తెరచుకునే పడుకుంది స్నిగ్ధ.

కొత్తగా మనసులో చోటుచేసుకుంటున్న ఈ భయం ఏమిటో అర్థంకావడంలేదామెకు.

గది మూలకేసి చూస్తుంటే...అక్కడెవరో నిలబడి ఇటుకేసి తీక్షణంగా చూస్తున్నట్టుగానే ఉంది.

పక్కన వొత్తిగిలి పడుకున్న పవన్‌కేసి వోరగా చూసింది స్నిగ్ధ.

"పవన్...అయామ్ సారీ!"

సమాధానం చెప్పలేదు పవన్.

"పవన్!" మళ్ళీ పిలిచింది స్నిగ్ధ.

పవన్ ఉచ్ఛ్వాస నిశ్వాసలనుబట్టి అతడు నిద్రలోకి జారుకున్నాడని అర్థమయింది స్నిగ్ధకి.

మరోసారి గది ఈశాన్యం మూలకేసి భయంగా చూసి పవన్ భుజంమీద తలపెట్టుకుని పడుకుందామె.

అదృశ్యంగా నిలబడిఉన్న ఖబీస్ వంకర నవ్వు నవ్వుకుంది.

• • •

మర్నాడు ఉదయం పది గంటలకి ఆఫీసుకి వెళ్ళడానికి తయారయ్యాడు పవన్. లాకర్ తెరచి అందులోని కరకింకర విగ్రహం బయటకితీసి ఎయిర్ బ్యాగ్‌లో పెట్టుకుని బయల్దేరుతూ అన్నాడు.

"స్నిగ్ధా! ఈ విగ్రహాన్ని మా ఆఫీసులో పెడ్తాను. ఇది ఇక్కడ ఉంటే నీకు దానిగురించిన ఆలోచనలే వస్తుంటాయి."

రాత్రి తను భయపడింది ఆ విగ్రహం గురించి కాదని మరోసారి చెప్దామనుకుంది స్నిగ్ధ కానీ, అలా చెప్తే పవన్‌తో వాదన పెట్టుకోవలసి వస్తుందేమో అని ఊరుకుంది.

ఎయిర్ బ్యాగ్ భుజానికి వేలాడేసుకుని బెడ్‌రూంలోంచి బయటకి నడిచాడు పవన్.

"అమ్మా...ఆఫీసుకి వెళ్ళొస్తాను ..." అన్నాడు హాల్లోకూర్చున్న

రాజేశ్వరిదేవిని చూసి.

అంతలో... స్తంభం చాటునించి ఇవతలకి వచ్చింది మస్తానమ్మ.

తన పక్కనించి పవన్ బయటకి నడచి వెళుతుంటే అతనికేసి కళ్ళు పెద్దవిచేసి చూసింది.

"అమ్మగారూ...అబ్బాయిగారిని ఇవాళ ఆఫీసుకెళ్ళొద్దనిచెప్పండి!" అంది చటుక్కున.

గుమ్మందగ్గరే ఆగిపోయి వెనక్కి తిరిగి చూశాడు పవన్.

"ఏమిటే అది?" ఆశ్చర్యంగా అడిగింది రాజేశ్వరిదేవి కుర్చీలోంచి లేస్తూ.

స్నిగ్ధ కూడా బెడ్‌రూంలోంచి బయిటకు వచ్చి నిలబడింది.

అందరూ తననే ఆశ్చర్యంగా చూస్తుంటే తటపటాయిస్తూ చెప్పింది మస్తానమ్మ...

"ఇవాళ అబ్బాయిగారు ఆఫీసుకి వెళ్ళడం మంచిది కాదమ్మా..."

"ఏం ఎందుకూ?" అడిగింది రాజేశ్వరీదేవి. మస్తానమ్మ పనిలో చేరినరోజు జరిగిన సంఘటన ఇంకా మరచిపోలేదామె.

"నా...నాకు తెలీదు...అబ్బాయిగారు వెళ్ళకూడదంతే" అంది మస్తానమ్మ.

గుమ్మం దగ్గర్నుంచి గబగబ వెనక్కి తిరిగి వచ్చాడు పవన్. మస్తానమ్మకేసి చికాగ్గా చూసాడతను...

"నువ్వెళ్ళు...పని మానేసి ఇక్కడేం చేస్తున్నావ్?"

ఏదో చెప్పబోయి మానుకుంది మస్తానమ్మ...ఒక్క క్షణం సందేహిస్తూ నిలబడి అక్కడ్నించి వెళ్ళిపోయిందామె.

"ఒరేయ్ కన్నా?...పోనీ ఇవాళ ఆఫీసుకి సెలవుపెట్టేయరా!..." అంది రాజేశ్వరిదేవి కంగారుపడిపోతూ.

మొహంలో నవ్వు తెచ్చిపెట్టుకుంటూ అన్నాడు...

"ఏమిటమ్మా ఇది! ఆ పిల్ల ఏదో అందని అలా హడలిపోతావేమిటి?"

"అదికాదురా..."

"లేదమ్మా...ఇవాళ అర్జెంటుపనులు చాలా ఉన్నాయి నేనువెళ్ళక తప్పదు..." అంటూ వెనక్కి తిరిగాడు పవన్.

గుమ్మంకేసి నడుస్తూ మళ్ళీ అన్నాడు.

"అయినా...పనిపిల్లకు అంత చనువిస్తా వెందుకమ్మా నువ్వు?"

మరోమాట మాట్లాడటానికి అవకాశం ఇవ్వకుండా వెళ్ళిపోతున్న పవన్‌కేసి చూస్తూ నిలబడిపోయింది రాజేశ్వరిదేవి...

• • •

మధ్యాహ్నం రెండుగంటలకి కాలింగ్‌బెల్ విని తలుపు తెరచింది స్నిగ్ధ.

ఎదురుగా నిలబడ్డ అపరిచితుడకేసి చూసి "ఎస్? ఎవరండీ" అన డిగింది.

"నేను ఆర్కియాలజీ డిపార్టుమెంటునించి వస్తున్నానమ్మా..."అని సందేహించి ఆగిపోయాడు ఆ వ్యక్తి.

"చెప్పండి" అడిగింది స్నిగ్ధ...అప్పటికే ఆమె మనసులో అస్ప ష్టంగా ఏదో అనుమానం చోటుచేసుకుంది...

"గంటక్రితం ఆఫీసునించి సెక్రటేరియట్‌కి బయల్దేరాడు పవన్ గారు...బషీర్‌బాగ్ దగ్గర మోటార్ సైకిల్ స్కిడ్ అయింది..."

"నో" బిగ్గరగా అరిచింది స్నిగ్ధ.

## 9

ఆర్కియాలజీ డిపార్టుమెంటునించి వచ్చిన వ్యక్తి స్నిగ్ధని, రాజేశ్వరి దేవిని బషీర్‌బాగ్ దగ్గర్లో ఉన్న శీతల్ నర్సింగ్‌హోంకి తీసుకెళ్ళాడు.

"పవన్‌గారు సెకెండ్ ఫ్లోర్ స్పెషల్ వార్డులో ఉన్నారు. మీరిద్దరూ వెళ్ళండి నేను డాక్టర్ గౌతమ్‌గారిని కలుసుకుని వస్తాను." అంటూ ఎంక్వైరీ కౌంటర్ దగ్గరే ఆగిపోయాడతను.

లిఫ్ట్ ఎక్కి రెండవ అంతస్తుకి చేరుకున్నారు స్నిగ్ధ, రాజేశ్వరిదేవి. కారిడార్‌లో ఎదురుపడ్డ మేట్రన్‌ని అడిగి పవన్‌ని అడ్మిట్ చేసిన స్పెషల్ వార్డు ఎటుందో తెలుసుకుంది స్నిగ్ధ.

వార్డులో ఒంటరిగా పడుకుని ఉన్నాడు పవన్.

గబగబ లోపలికి నడిచివస్తున్న రాజేశ్వరిదేవిని, స్నిగ్ధనిచూసి లేవ బోయాడు పవన్.

"ఏమయిందిరా కన్నా! దెబ్బలు ఎక్కడ తగిలాయి?" కంగారుగా మంచం దగ్గరకు చేరుకుంది రాజేశ్వరిదేవి. ఆమెకు రెండడుగుల వెనక నిలబడిపోయిన స్నిగ్ధ మంచంమీద పడుకున్న అతడికేసి ఆతురతగా చూసింది. అతడి వొంటిమీద గాయాలేవీ కనబడలేదామెకు.

"దెబ్బలేమీ అంతగా తగల్లేదమ్మా!...కాలికి చిన్న గాయమయిం దంతే..." అంటూ షీట్ జరిపేసి మోకాలుదగ్గర కట్టిన కట్టు చూపెట్టాడు పవన్.

"చిన్నగాయం అంటావేంటిరా! ఇంత పెద్ద కట్టుకట్టి ఉంటేనూ! కుట్లు వేసారా?" అడిగింది రాజేశ్వరిదేవి గద్గదంగా.

లేదంటూ తలూపాడు పవన్.

రాజేశ్వరిదేవి భుజంమీదుగా పవన్ కాలికి కట్టిన కట్టు చూసి తేలిగ్గా ఊపిరి పీల్చుకుంది స్నిగ్ధ. బ్యాండేజిని చూస్తుంటే పవన్‌కి పెద్ద దెబ్బ తగల్లేదనే అనిపిస్తోంది...కానీ ఎందుకో అనుమానం వచ్చింది స్నిగ్ధకి.

"ఇంకెక్కడయినా దెబ్బలు తగిలాయా?" అడిగిందామె.

"లేదే" చూపులు తిప్పుకుంటూ సమాధానం చెప్పాడు పవన్.

"మరి ఇంటికివెళ్ళిపోవచ్చు కదా! అడ్మిట్ అయ్యావెందుకు?" అడిగింది స్నిగ్ధ మళ్ళీ.

"డాక్టర్ గౌతమ్ పరీక్షచేసి రెండురోజులు అబ్సర్వేషన్ అవసర మన్నారు" అన్నాడు పవన్ నెమ్మదిగా.

"రెండురోజులు అబ్సర్వేషన్! ఎందుకూ?"

వెంటనే సమాధానం చెప్పలేదు పవన్.

రాజేశ్వరిదేవికి కంగారు ఎక్కువయింది. "అసలేమయింతిరా?" అడిగిందామె.

"ఏంలేదమ్మా...కిందపడ్డప్పుడు తల అదిరి కళ్ళు తిరిగాయి.

ఎందుకయినా మంచిదని తలకి స్కానింగ్ చేయించుకోమన్నారు డాక్టరు గారు. ఈ రెండురోజులు రొటీన్ చెక్ అప్‌కూడా చేయిస్తామన్నారు." అన్నాడతను.

పవన్ యధాలాపంగా మాట్లాడుతున్నప్పటికీ స్నిగ్ధ మనసులో కలవరమేదో మొదలయింది. బ్రెయిన్ స్కానింగ్ చేయిస్తున్నారంటే డాక్టర్ గౌతమ్ అనుమానం ఏమయి ఉంటుంది? మెదడులో 'క్లాట్' లాంటిదేదో ఏర్పడిందని అనుకుంటున్నారా?...పవన్ వివరాలు చెప్పడం లేదు. తల్లి భయపడుతుందని కాబోలు 'రొటీన్ చెక్ అప్' అని తేలిగ్గా చెప్తున్నాడు। మోటార్ సైకిల్ స్కిడ్ అయి పడినపుడు బహుశఃస్పృహ తప్పి ఉంటాడు. ఇలాంటి రోడ్డు ఆక్సిడెంట్ల గురించి లోగడ విన్నది తను. పైకి గాయాలేవీ కనబడకపోయినా మెదడులో రక్తం 'క్లాట్' అవుతుంది. ఒకొక్కసారి ఆపరేషన్‌కూడా చేయవలసి వస్తుంది. పవన్‌కి అలాంటి పరిస్థితి ఏర్పడితే.?

ఆ ఆలోచనకి తట్టుకోలేక కుర్చీలో వాలిపోయింది స్నిగ్ధ.

"ఒరేయ్। పొద్దున ఆ పిల్ల నిన్ను వెళ్ళొద్దని ఆపింది గుర్తుందా?" అడిగింది రాజేశ్వరిదేవి చటుక్కున.

బిగ్గరగా నవ్వేసాడు పవన్.

"నువ్వీమాటంటావని ఇందాకట్నించి ఎదురు చూస్తున్నానమ్మా" అన్నాడతను నవ్వు ఆపుతూ.

రాజేశ్వరిదేవి ఏదో చెప్పబోయింది కానీ గదిలోకి డాక్టర్ గౌతమ్ రావడంచూసి పక్కకు తప్పుకుని నిలబడింది.

"హౌ ఆర్ యూ ఫీలింగ్ నౌ పవన్?" అంటూ మంచందగ్గరకు వచ్చాడతను.

"ఫర్వాలేదు"

"గిడ్డీనెస్, తలనొప్పి ఎలా ఉన్నాయి?" అడిగాడు డాక్టర్.

కొ"కొంచెం తగ్గిందండీ" చెప్పాడు పవన్.

పవన్ కళ్ళలో టార్చ్‌లైట్ వేసి పరీక్ష చేసాక చెప్పాడు డాక్టర్ గౌతమ్.

"ఇవాళ, మీరు పూర్తిగా విశ్రాంతి తీసుకోవాలి ఎటువంటి మెంటల్ ఆక్టివిటీ పెట్టుకోవద్దు. అన్నట్టు రాత్రి మీతోపాటు ఎవరుంటారు ఇక్కడ?"

"నేనుంటాను బాబూ!" ముందుకు వచ్చి చెప్పింది రాజేశ్వరిదేవి.

తల్లిని, స్నిగ్ధని పరిచయం చేసాడు పవన్. వాళ్ళకేసి పలకరింపుగా నవ్వాడు డాక్టర్ గౌతమ్.

"ఇవాళ రాత్రి కొంచెం జాగ్రత్తగా చూసుకోవాలమ్మా వీరిని తలనొప్పి ఎక్కువయిందన్నా, వాంతులు చేసుకున్నా, డ్యూటీ నర్స్‌కి చెప్తే నాకు కబురుచేస్తుంది.

కంగారు పడవలసిందేమీలేదులెండి—కీడెంచి మేలెంచడం నా అలవాటు. అంతే!" అని బయటకు కదిలాడతను.

గుమ్మందగ్గర ఆగి మళ్ళీ చెప్పాడు.

"మిస్టర్ పవన్! సి.టి. స్కాన్ ఏర్పాటు చేసాను: హాస్పిటల్ అంబులెన్స్‌లో డయాగ్నాస్టిక్ సెంటర్‌కి వెళ్ళిరండి."

డాక్టర్ గౌతమ్ వెళ్ళిన కాసేపటికి జూనియర్ డాక్టర్ ఒకతనువచ్చి డయాగ్నాస్టిక్ సెంటర్‌కి బయల్దేరమన్నాడు పవన్‌ని.

పవన్‌తోపాటు రాజేశ్వరిదేవి, స్నిగ్ధ కూడా అంబులెన్స్‌లో వెళ్ళారు.

స్కానింగ్ చేసాక అందరూ మళ్ళీ షీతల్ నర్సింగ్‌హోంకి తిరిగి వచ్చేసారు.

"అత్తయ్యగారూ! ఇవాళరాత్రి నేను పడుకోనా ఇక్కడ?" సందేహిస్తూ అడిగింది స్నిగ్ధ.

"ఫర్వాలేదమ్మాయి నేనుంటానులే" అంది రాజేశ్వరిదేవి.

"అదికాదు అత్తయ్యగారూ! ఇక్కడుంటే మీకు రాత్రంతా నిద్ర ఉండదు...ఆరోగ్యం పాడవుతుందేమో!"

రాజేశ్వరిదేవి సమాధానం చెప్పేంతలో పవన్ మాటందుకున్నాడు

"అవునమ్మా! నువ్వింటికెళ్ళు...స్నిగ్ధ ఉంటుందిలే"

"అదికాదురా కన్నా—"మళ్ళీ ఏదో అనబోయిందామె.

"నాకేం ఫర్వాలేదమ్మా—! రేపు స్కానింగ్ రిపోర్టు వచ్చేస్తుంది! అందులో తప్పకుండా నార్మల్‌గానే ఉంటుందిలే! నువ్వు కంగారు పడకు!

వీలైతే డాక్టర్ గారికి చెప్పి రేపే ఇంటికి వచ్చేస్తాను కదా!" అన్నాడు పవన్ ఆమెకు నచ్చచెప్తున్నట్టు—

చటుక్కున లేచి నిలబడింది రాజేశ్వరిదేవి—

"సరే—నేను బయలెరతాను—" అని పవన్ సమాధానంకోసం ఎదురుచూడకుండానే తలుపుకేసి నడిచిందామె.

"అత్తయ్యగారూ—ఉండండి నేనొచ్చి ఆటో పిలుస్తాను" అంటూ స్నిగ్ధ కూడా లేచింది.

అవసరం లేదమ్మాయి నేను తీసుకుంటానులే" అంటూ వెళ్ళిపోయింది రాజేశ్వరిదేవి.

వార్డులోంచి బయటకి వెళ్తున్నప్పుడు ఆమె కొంగుతో కళ్ళు వొత్తుకోవడం గమనించలేదు. పవన్, స్నిగ్ధ—

నర్సింగ్‌హోం గేటులోంచి బయటకు నడిచి ఆటోఎక్కి కూర్చుంది రాజేశ్వరిదేవి. ఆటో ముందుకి సాగుతుంటే ఆలోచనల్లో పడిపోయిందామె—

చిన్నప్పుడు తనుపెట్టిన గోరుముద్దలు తిని ఒళ్ళో నిశ్చింతగా పడుకుని కథలు చెప్పుకునే వాడు పవన్—ఎప్పుడయినా వాడికి ఒంట్లో బావుండకపోతే తన చెయి వొదిలిపెట్టేవాడు కాదు "నాకు మందులు. డాక్టర్లు వద్దమ్మా" నువ్వు నా పక్కన కూర్చో జ్వరం దానంతటదే తగ్గిపోతుంది అనేవాడు!—ఏమయి పోయిందా అనురాగం? ఎందుకిలా రోజురోజుకీ దూరమయిపోతున్నాడు? అతడిమీదే తను ఆశలు పెట్టుకుందని తెలిసి కూడా ఎందుకిలా చేస్తున్నాడు? ఇంట్లోకి పెళ్ళాం రాగానే తల్లి పరాయిదయి పోయిందా?—ఇన్నాళ్ళు ఏది ఎలా జరిగినా పవన్ మనస్సులో ప్రథమస్థానం తనదేనన్న విశ్వాసం ఉండేది. కానీ—ఈమధ్య...భార్య పక్కనుంటేచాలు మరేమీ అవసరం లేదన్నట్టు ఉంటున్నాడు పవన్.

ఉక్రోషం తమాయించుకోలేక ఏడవసాగింది రాజేశ్వరిదేవి

• • •

రాత్రి పదిగంటలకి డ్యూటీ డాక్టర్ రౌండ్స్ పూర్తయ్యాక గది తలుపు గడియవేసి వచ్చింది స్నిగ్ధ.

"లైట్ ఆర్పేయనా?" అడిగింది పవన్‌ని,

"ఊఁ"

లైట్ ఆఫ్‌చేసి పడుకోడానికి సోఫాకమ్ బెడ్‌కేసి కదులుతున్న స్నిగ్ధ చెయి పట్టుకుని తన మంచంమీదకు లాక్కున్నాడు పవన్...ఆమె ఆశ్చర్యంనించి తేరుకునేలోగా పెదాలమీద గట్టిగా ముద్దెట్టుకున్నాడు.

"ఏమిటిది?" అంటూ అతడి కౌగిట్లో ఒదిగిపోయింది స్నిగ్ధ.

సమాధానం చెప్పకుండా ఆమెను మరింత దగ్గరకు లాక్కున్నాడు పవన్.

డాక్టర్‌గారు ఆక్టివిటీ పెట్టుకోవద్దు, రెస్టు తీసుకో అని చెప్పారు... మరచిపోయావా?" అడిగింది స్నిగ్ధ కొంచెం వెనక్కి జరిగి పడుకుంటూ.

"డాక్టరుగారు వద్దని చెప్పింది మెంటల్ ఆక్టివిటీ! ఫిసికల్‌కాదు" నవ్వుతూ జవాబిచ్చాడు పవన్.

"అయితే ఇందుకన్నమాట అబ్బాయిగారు నేను తోడుగా పడుకుంటానంటే వెంటనే ఒప్పుకున్నారు." చిరుకోపం నటిస్తూ అంది స్నిగ్ధ.

పవన్ నవ్వలేదు. కొంచెం సీరియస్‌గా మాట్లాడాడు" స్నిగ్ధా! నీకో ముఖ్యమయినవిషయం చెప్పాలి. అందుకే అమ్మ ఉంటానని చెప్తున్నా ఒప్పుకోలేదు.

"చెప్పు పవన్..."

"ఆ విగ్రహం పోయింది."

ఉలిక్కిపడింది స్నిగ్ధ.

"అంటే?"

"పోగొట్టుకున్నాను! మధ్యాహ్నం మోటార్ సైకిల్ స్కిడ్ అయి పడినపుడు నా భుజానికే ఉందా బ్యాగ్. కిందపడ్డాక అయిదు నిమిషాలసేపు స్పృహలేదు నాకు...ఎవరో నన్ను కారులో పడుకోబెట్టుకుని ఈ నర్సింగ్ హోంకి చేర్చారు. నేను పూర్తిగా తేరుకుని బ్యాగ్‌కోసం చూస్తే కనబడ లేదు." అన్నాడు పవన్.

"ఆ విగ్రహం ఆఫీసులో పెడ్తానన్నావు కదా...మరి దాన్ని తీసుకుని ఎక్కడికి బయల్దేరావు?" అడిగింది స్నిగ్ధ.

"ఆ విగ్రహం సెక్రటరీగారికి అప్పచెప్దామని సెక్రటేరియట్‌కి

వెళ్తున్నప్పుడే జరిగింది ఆక్సిడెంట్."

"సెక్రటరీగారికెందుకు?" ఆశ్చర్యంగా అడిగింది స్నిగ్ధ.

"అసలు ఆ విగ్రహాన్ని పోలీస్ డిపార్టుమెంట్ వాళ్ళకి ఇచ్చేద్దా మనుకున్నాను. కానీ, ఇన్నాళ్ళు తమకెందుకు ఇవ్వలేదని వాళ్ళడిగితే ఏమని సమాధానం చెప్పేది? ఆర్కియాలజిస్ట్‌గా నాకున్న జిజ్ఞాసనివాళ్ళు అర్థం చేసుకోకపోతే కాంప్లికేషన్స్ వస్తాయి. అందుకే జరిగిందంతా సెక్రటరీగారికి చెప్పి ఆయన ద్వారా పోలీసులకి ఆ విగ్రహం అప్పచెప్పా మనుకున్నాను. కానీ ఇంతలో ఇలా జరిగింది..." అని ఆగాడు పవన్.

"ఆ విగ్రహం మనకు అనుకోని విధంగా దొరికింది అలాగే పోయింది....పవన్. ఇక దాని గురించి ఆలోచించకు. ఎవరికీ ఈ విషయం చెప్పొద్దు. ఇక మనకుకూడా కొంత రిలీఫ్ వస్తుంది. ఆ విగ్రహం మనదగ్గరున్నంతకాలం మనమధ్య దాని గురించే కదా వాదోపవాదాలు!" అంది స్నిగ్ధ.

ఆమె మాటలు విని హాయిగా ఊపిరి పీల్చుకున్నాడు పవన్.

"గుడ్! నేను కూడా అదే అనుకున్నాను—"

అన్నాడు మళ్ళీ ఆమెను దగ్గరకు లాక్కుంటూ.

కానీ...కాసేపు ఏదో ఆలోచిస్తూ ఉండిపోయింది స్నిగ్ధ.

"ఏమిటి మాట్లాడటంలేదు?" అడిగాడు పవన్ ఆమె భుజం తట్టి

ఆలోచనల్లోంచి బయటపడి అడిగింది స్నిగ్ధ...

"పవన్. నువ్వు స్పృహతప్పి పడివుంటే ఎవరో నిన్ను ఇక్కడికి చేర్చారన్నావు—ఆ వ్యక్తి ఎవరో గుర్తులేదా నీకు?"

లేదు సరిగ్గా గుర్తులేదు...ఎవరో అమ్మాయి నన్ను కారులో పడు కోబెట్టుకుని వచ్చిందని మాత్రం తెలుసు—కారులో నాకు స్పృహ వచ్చింది కానీ మాట్లాడే పరిస్థితిలో లేను నేను!"

"అమ్మాయా? అయితే ఆ అమ్మాయికి నీ బ్యాగ్ తప్పకుండా దొరికుండాలి. పవన్ ఆ అమ్మాయి ఎవరో—ఎలా ఉంటుందో గుర్తు తెచ్చుకో—" అడిగింది స్నిగ్ధ మళ్ళీ

కొంచెం సేపు గుర్తు తెచ్చుకోవడానికి ప్రయత్నించి చెప్పాడు

పవన్.

"ఆ అమ్మాయి ఎవరో నాకు తెలియదు స్నిగ్ధా...ఇంతకు ముందె పుడూ చూడలేదు. ఆ అమ్మాయిరూపం అస్పష్టంగా మెదలుతోంది నా బుర్రలో...సన్నగా పొడుగ్గా ఉంది...తెల్లచీర కట్టుకుంది...ఆc... నుదుటిమీద రూపాయికాసంత బొట్టుపెట్టుకుని ఉంది. ఇది మాత్రం బాగా గుర్తుంది."

అతడిమాటలు విని అవాక్కయి పోయింది స్నిగ్ధ...పవన్ వర్ణి స్తున్నది ఎవర్నో కాదు...

కరకింకర భక్తురాలు కాత్యాయనిని!

• • •

పవన్‌కి చేయించిన సి.టి. స్కాన్ రిపోర్టులో 'నార్మల్' వచ్చిం దని చెప్పాడు డాక్టర్ గౌతమ్ మర్నాడు. నర్సింగ్‌హోంనించి డిస్చార్జ్ అయ్యాక రెండు రోజులు సెలవు పొడిగించి ఇంటిదగ్గర విశ్రాంతి తీసు కున్నాడు పవన్.

డ్యూటీలో చేరిన రోజు సాయంత్రం ఇంటికివచ్చాక కాఫీ తాగుతూ. రాజేశ్వరిదేవికి చెప్పాడు పవన్... "రేపొద్దున వికారాబాద్‌కి టూర్ వెళ్తు న్నానమ్మా!"

"నీ కాలికి తగిలిన దెబ్బ ఇంకా తగ్గలేదే. ఎలా వెళ్తావురా" అభ్యం తరం చెప్పింది రాజేశ్వరిదేవి.

"లేదమ్మా తప్పకుండా వెళ్ళాలి అక్కడ అడవుల్లో పాతకాలం నాటి నాణాలు దొరికాయట. వెంటనే అక్కడికెళ్ళి తవ్వకాలు మొదలెట్ట మని ఆర్డర్స్ వచ్చాయి."

"తవ్వకాలంటే పనిచాలా ఉంటుందికదా!"పైగా ఆ అడవుల్లో సమ యానికి అన్నం కూడా దొరకదు...నామాటవిని టూర్ కాన్సిల్ చేయిం చుకో..." అంది రాజేశ్వరిదేవి మళ్ళీ.

"నాకేం ఫర్వాలేదమ్మా. అడవుల్లో మరీ లోపలిదాకా వెళ్ళఖర్లేదు అనంతగిరి గెస్ట్‌హౌస్‌లోనే నా కాంప్ ఉంటుంది."

"అయినా నువ్వు ఒంటరిగా వెళతానంటే నాకెందుకో బెంగగా

ఉంది. నువ్వు పనిలో పడిపోతే ఆరోగ్యంగురించి అస్సలు పట్టించుకోవు"

"నాతోపాటు స్నిగ్ధకూడా వస్తానంటోందమ్మా...తను కూడా ఇదివరకు మా డిపార్టుమెంటేకదా. నా పనిలో సాయపడ్తుంది." అన్నాడు పవన్.

ఆ మాట వినగానే రాజేశ్వరిదేవి మొహం వివర్ణమయింది. పవన్ ఖాళీచేసిన కాఫీ కప్పు అందుకుంటూ "ఇద్దరూ వెళదామనుకుంటున్నారా... సరే...వెళ్ళిరండి" అంటూ వంటింటికేసి వెళ్ళిపోయింది.

• • •

జీపులో వికారాబాద్ చేరుకునేసరికి మధ్యాహ్నం పన్నెండు గంట లయింది. తహిసిల్ ఆఫీసుదగ్గర అర్కియాలజీ డిపార్టుమెంటుకు చెందిన ఇద్దరు జూనియర్ ఆఫీసర్లు కలిసారు.

"లొకేషన్ ఎక్కడుందో తెలుసుకున్నారా?" అడిగాడు పవన్ వాళ్ళని.

"లొకేషన్ తెలుసుకున్నాం కానీ తవ్వకాలంటే ఇక్కడి లేబర్ ఎవరూ రావడంలేదు!" అన్నాడు సూపర్‌వైజర్ శ్రీనివాసమూర్తి.

"ఎందుకూ?" అడిగాడు పవన్ జీపు దిగుతూ.

"ఆ ఏరియాలో రాకాసి గుళ్ళు ఉన్నాయంటున్నారు. తవ్వకాలుచేస్తే ప్రాణాలు పోతాయని భయపడుతున్నారు సార్! మేము ఎంత చెప్పినా వినడంలేదు" అన్నాడు శ్రీనివాసమూర్తి.

ఒక్కక్షణం ఆలోచించి చెప్పాడు పవన్.

"అయితే ఒక పనిచేయండి. ఇక్కడి వాళ్ళని వొదిలేసి షాబాద్ నుంచి అయిదుగురు లేబర్‌ని పిలుచుకురండి...అక్కడా కుదరకపోతే హైదరాబాద్ నించయినా సరే పిలుచుకుని రండి. నేను గెస్ట్‌హౌస్‌లో ఎదురు చూస్తుంటాను.

శ్రీనివాసమూర్తిని అతడి సహోద్యోగిని పంపించేసి జీపుని అనంత గిరి గెస్టుహౌస్‌కేసి పోనిచ్చాడు పవన్.

"పవన్...రాకాసి గుళ్ళంటే?..." అడిగింది పక్కన కూర్చున్న స్నిగ్ధ.

"పాతకాలంనాటి స్మశానాలు. వాటినే ఇక్కడివాళ్ళు రాకాసి గుళ్ళని పాండవుల గుళ్ళని అంటుంటారు. వాటి జోలికెళ్ళాలంటే వొణికిపోతారు. ఈ మూఢ నమ్మకాలు ఇలా ఉన్నవాళ్ళ మన దేశానికి ప్రొగ్రెస్ ఉండదు" అన్నాడు పవన్ కొంచెం చికాగ్గా.

గెస్టుహౌస్ చేరుకుని లంచ్ ముగించి కాసేపు రెస్ట్ తీసుకున్నారు పవన్, స్నిగ్ధ.

సాయంత్రం ఏడుగంటలయినా శ్రీనివాసమూర్తి రాకపోయేసరికి పూర్తిగా విసిగి పోయాడు పవన్.

"ఇవాళ రోజంతా వృధా అయిపోయింది! కనీసం ఫారెస్ట్ డిపార్ట్‌మెంట్ వాళ్ళ గైడ్‌ని తీసుకుని నేనే లోకేషన్ చూసి రావలసింది." అన్నాడు.

గెస్టుహౌస్ వరండాలో గార్డన్ ఛైర్ వేసుకుని కూర్చున్న స్నిగ్ధ మరో లోకంలో ఉంది. అనుకోకుండా పవన్‌తో ఇలా టూర్‌కి రావడం ఆమెకెంతో బావుంది.

పవన్‌తో పెళ్ళయి అన్నీ అనుకున్న ప్రకారమే జరుగుతున్నా ఆ ఇంట్లో మనశ్శాంతి ఉండటంలేదు తనకు. పవన్‌తో ఒంటరిగా గదిలో ఉన్నా ఏవో భయాలతో అతడికి దగ్గరకాలేకపోయింది తను. అతడు ఎన్నిసార్లు రీజనింగ్ చూపించినా పడకగదిలో ఎవరో ఉన్నట్టే అనిపిస్తోంది తనకు.

ఇక్కడ? ఇక్కడలా లేదు! అనంతగిరి వాతావరణం ప్రశాంతంగా ఉంది...రొమాంటిక్‌గా ఉంది.

"ఏమిటి స్నిగ్ధా ఆలోచిస్తున్నావ్?" అన్న పవన్ మాటలకి ఆలోచనల్లోంచి బయటపడింది స్నిగ్ధ.

"పవన్! అటు చూడు!" అంటూ కొండలచాటునించి పైకివస్తున్న పున్నమి చంద్రుడికేసి చూపించింది.

"బ్యూటిఫుల్!" అన్నాడు పవన్ వెన్నెలకాంతిలో మరింత అందంగా తయారయిన అనంతగిరిని చూస్తూ.

"మరింత బ్యూటిఫుల్ వాతావరణాన్ని వృధాచేస్తే ఎలా. పద... జీపులో అలా వెళ్దాం..." అంది స్నిగ్ధ చిరునవ్వుతో.

"సరే...పద నాక్కూడా ఈచికాకు నించికొంత రిలీఫ్ అవసరం" అంటూ బయల్దేరాడు పవన్.

కొండల నడుమ ఇరుకయిన రోడ్డుమీదుగా మలుపులు తిరుగుతూ జీపు ముందుకి సాగిపోతోంది.

కొంతదూరం పోయాక జీపు ఆపేసాడు పవన్.

"ఈ రోడ్డు ఇక్కడితో ఆగిపోతుంది...ఆపైనంతా అడవే."

జీపులోంచి కిందికి దిగింది స్నిగ్ధ.

"పవన్ అలా అడవిలోకి నడుద్దామా?" అడిగింది స్నిగ్ధ ఎదురుగా ఉన్న సరుగుడు చెట్ల కేసి చూస్తూ.

పవన్‌కూడా జీపు దిగాడు. కబుర్లు చెప్పుకుంటూ ఇద్దరూ దట్టంగా పెరిగి ఉన్న సరుగుడు చెట్లకేసి నడిచారు.

"స్నిగ్ధా...ముందు మరీ చీకటిగా ఉన్నట్టుంది. ఇక వెనక్కి తిరుగుదామా?" అడిగాడు పవన్, సరుగుడు చెట్లు దాటాక.

"ఏం అలసిపోయావా? ఆర్కియాలజిస్టువి ఆ మాత్రం స్టామినా లేదా?" అడిగింది స్నిగ్ధ నవ్వుతూ.

"అదికాదు."

"అయితే ఆ మర్రిచెట్టుదాకా రేస్ చేస్తావా? నువ్వు గెలిస్తే నీకు స్టామినా ఉందని ఒప్పుకుంటాను!" అంది స్నిగ్ధ.

పవన్‌కూడా నవ్వేసాడు. "నాతో రన్నింగ్ రేస్‌లో ఓడిపోతావు." అన్నాడు.

"అంత నమ్మకమా? సరే చూద్దాం!" అంటూ అతడి సమాధానం కోసం ఎదురుచూడకుండా ముందుకి పరుగుతీసింది. దారి కనబడక ఆమె పడిపోతుందేమోనని పవన్‌కూడా పరుగెత్తాడు.

మాను దగ్గరకు చేరుతుంటే ఆమెను దాటుకుంటూ వెళ్ళి వెనక్కి తిరిగాడు పవన్. పరుగున వస్తున్న స్నిగ్ధ అతడిమీద పడటంతో ఇద్దరూ మెత్తటి పచ్చికలో ఒరిగాను

స్నిగ్ధను పొదివిపట్టుకున్నాడు పవన్ కాసేపు...చటుక్కున ఆమె మీదకు వొంగి పెదాలు కలిపాడు. స్నిగ్ధ అతడ్ని పెనవేసుకుంది.

అతడి పెదాలు మెడమీదుగా కిందికి జారుతుంటే స్నిగ్ధ తనువు పుల కించింది.

"గెస్టుహౌస్‌కెళ్ళేదాకా ఆగలేరా దొరబాబు?"

"ఇలాంటి ప్రైవసీ గెస్టుహౌస్‌లోనూ, మన ఇంటి బెడ్‌రూంలోనూ ఉండదు స్నిగ్ధా! అయినా, ఇలాంటి అడ్వెంచర్ అంటే నీక్కూడా ఇష్టమే కదా!" అంటూ ఆమెను దగ్గరకు తీసుకుని ముద్దాడుతూ ఒక్కొటంటూ బట్టలు విప్పసాగాడు.

అతడ్ని పక్కకు తోసేసింది స్నిగ్ధ.

"స్నిగ్ధా ఏమయింది?" అడిగాడతను ఆశ్చర్యంగా.

"నీ ప్రేమంతా ఒలకబోస్తున్నావ్...నాకో చిన్న కోరిక ఉంది తీరుస్తావా?" అడిగింది స్నిగ్ధ పేచీపెడ్తున్నట్టు.

"ఏమిటది?"

"నాకో బాబు కావాలి."

"అది మన చేతిలో ఉందా?" అంటూ పకపక నవ్వేసాడు పవన్.

"ప్లీజ్ పవన్. అలా నవ్వకు. నేను సీరియస్‌గానే అడుగు తున్నాను. నాకో బాబు కావాలి! ఇవాళ నువ్వుకూడా నాలాగే కోరుకుంటే మనకు పుట్టబోయే బాబు గొప్ప జీనియస్ అవుతాడని అనిపిస్తోంది నాకు." అంది స్నిగ్ధ ప్రాధేయపడుతున్నట్టు.

స్నిగ్ధ ఎంత సరదాగా మాట్లాడ్తుందో అంత సెంటిమెంటల్‌గానూ మాట్లాడుందని పవన్‌కి తెలుసు.

"ఓ.కే! స్నిగ్ధా. నువ్వు కోరుకుంటున్న బాబు నీకు పుట్టాలి... అందంలోనూ, తెలివి తేటల్లోనూ మన బాబుకి ఎవరూ సాటి రారు!" అన్నాడు సిన్సియర్‌గా.

హాయిగా నవ్వేసి వెనక్కి వాలిపోతూ పవన్‌ని తనమీదకు లాక్కుంది స్నిగ్ధ.

భవిష్యత్తులోకి తొంగిచూస్తూ...చల్లని వెన్నెలలో...ప్రకృతికి ఎంతో దగ్గరగా అందమయిన అనుభవాన్ని చవిచూస్తున్న వాళ్ళిద్దరికీ ఒక విషయం తెలియదు...

చెట్ల నీడల్లో కదలిక లేకుండా నిలబడ్డ మూడు ఆకారాలు వారినే గమనిస్తున్నాయని.

ఒక గంటసేపు హాయిగా, నిశ్చింతగా అక్కడే పడుకున్నారు పవన్, స్నిగ్ధ.

"ఇక వెళ్దామా?" అంటూ లేచాడు పవన్.

స్నిగ్ధకూడా లేచి చీర సవరించుకుని అతడ్ని అనుసరించింది.

"థాంక్యూ పవన్" అంది అతడి చెయి పట్టుకుని నడుస్తూ.

"వాళ్ళు వెళ్ళిన రెండు నిమిషాలకి ఆ మూడు ఆకారాలు ఇవతలకి వచ్చాయి.

వాళ్ళలో ఒకతను మర్రిచెట్టు దగ్గరకు నడిచాడు. పాదాలదాకా నల్లటి గౌను తొడుక్కుని ఉన్నాడతను. తెల్లటి గెడ్డం, భుజాలదాకా గిరిజాలు. అతడి అనుచరులు ఇద్దరూ కూడా నల్లటి గౌన్లు వేసుకున్నారు. కానీ వయసులో అతడికంటే చిన్నవాళ్ళలా ఉన్నారు. అంతవరకూ స్నిగ్ధ, పవన్ పడుకున్న చోటుకేసి సైగచేసాడతను. అర్థమయిందని తలాడించి ఆ అనుచరులు ఇద్దరూ అక్కడ పచ్చిక కొంచెం తవ్వారు. అక్కడిమట్టిని తమ నాయకుడు పరచిన ఎర్రటి గుడ్డమీద కుప్పగాపోసారు.

గౌనులోంచి ఒక సీసాబయటకుతీసి అందులోని తైలాన్ని మంత్రోచ్చారణచేస్తూ ఆ మట్టిమీద చల్లాడు.

ఎర్రటి గుడ్డని జాగ్రత్తగా మూటకట్టి తన అనుచరులకి అందించాడు.

"ఇవాళ ఇలాంటిది దొరుకుతుందని భస్త్రీనాయక్‌కి ముందే తెలుసు. వచ్చే అమావాశ్యదాకా భద్రపరచి ఆయనకి అందించాలి. మన కార్యక్రమానికి ఇదే మూలాధారం కాగలదు..." అంటూ ముందుకు కదిలి... చెట్లనీడల్లో అదృశ్యమయ్యాడతను.

అతను వెళ్ళినవైపు గౌరవంగా ప్రణమిల్లి మరోవైపు బయల్దేరారు అనుచరులిద్దరూ.

## 10

వికారాబాదు అడవుల్లో పవన్‌కి స్నిగ్ధ దగ్గరవుతూ, 'నాకో బాబు

కావాలి' అంటున్న తరుణంలో...

అక్కడికి షుమారు డెబ్బై కిలోమీటర్ల దూరంలో ఉన్న వాళ్ళ ఇంటి బెడ్‌రూంలో...

ఈశాన్యం మూలన మస్తానమ్మ బంధించి నిలబెట్టిన ఖబీస్ అసహనంగా కదిలింది.

బంధం తెంచుకుని బయట పడ్డానికి గింజుకుంది.

స్నిగ్ధ పవన్ సంగమిస్తున్న ప్రదేశానికి వెళ్ళలేక పోతున్నందుకు కోపంతో ఊగిపోయింది.

పట్టరాని ఉక్రోషంతో ఖబీస్ మొహం మరింత వికృతంగా మారుతుంటే...దాని ఉచ్ఛ్వాస నిశ్వాశలకు గదంతా వేడిగా తయారయింది.

ఆ క్షణాన స్నిగ్ధ అక్కడుండి ఉంటే?!

ఆ దుష్టశక్తి ఉనికిని విస్మరించి దాని సమక్షంలోనే పవన్‌కి చేరువయి ఉంటే?

ఖబీస్‌నించి వెలువడుతున్న ద్వేషాగ్నికి ఆమె మతి భ్రమించి ఉండేది మెదడులోని నరాలు చిట్లిఉండేవి.

ఖబీస్ తన పెనుగులాట ఆపలేదు.

విషసర్పంలా బుసలుకొడుతూ మెలికలు తిరగసాగింది!...

దూలానికి మస్తానమ్మ వేలాడేసిన మేకు సన్నగా కంపించింది.

అది గమనించిన ఖబీస్ తన శక్తినంతా ఆ మేకు మీదికే మళ్ళించింది.

మేకు అటూ, ఇటూ ఊగనారంభించింది...

దానంతటది ఊడిపడిపోతే ఖబీస్‌కి విముక్తి లభిస్తుంది!...

సరిగ్గా ఆసమయానికి-

ఆ చీకటి గదిలోకి తలుపులు తోసుకుని అడుగుపెట్టింది మస్తానమ్మ

ఖబీస్ ఘాటయిన చూపులు తాకిడికి క్షణకాలం తొట్రిల్లిందామె. కానీ, అంతలోనే సంభాళించుకుని దానికేసి తీవ్రంగా చూసింది.

ఖబీస్ ప్రయత్నం దేనికో మరుక్షణం అర్థమయిందామెకు.

అయితే, ఇలాంటి సందర్భాల్లో దాన్ని అదుపులోకి తీసుకుని రావడానికి ఏం చేయాలో వెంటనే తట్టలేదామెకు.

మస్తానమ్మలో సందిగ్ధం గమనించి పేట్రేగింది ఖబీస్. 'ఇంకెంత కాలం నన్నిలా కట్టిపడేయకలవు' అంటునట్టు విసురుగా తల ఎగరేసి చూసిందామెను.

మారువా మంత్రం వేసి బంధించినా ఖబీస్ తనని ధిక్కారంగా చూస్తోంది.

మారువా చాలా శక్తివంతమయిన మంత్రం...దాని పట్టుకూడా సడలుతోంది అంటే ఈ ఖబీస్‌లో తను గుర్తించని శక్తులేవో ఉన్నాయన్న మాట.

ఖబీస్‌కి విముక్తి లభిస్తే అది తనని కబళించివేయడం ఖాయం.

అలా కాక...

ఖబీస్‌ని లొంగదీసుకుని అధీనంలో పెట్టుకోగలిగితే జీవితాంతం అది తనకు సేవలు చేస్తుంది.

పసితనం నించి నేర్చుకున్న మంత్ర విద్యకు ఇదొక పరీక్ష. నెగ్గితే తనకిక తిరుగుండదు

బాబా ఆదర్శాలకు విరుద్ధంగా ఖబీస్‌లాంటి క్షుద్రశక్తిని బంధించి పెట్టిందిప్పుడు. ఖబీస్ విడిపించుకుని...దయతలచి తనని వొదిలిపెట్టినా తన మంత్ర శక్తులన్నీ హరించుకుని పోతాయి.

అలా కాకూడదు. ఇన్నేళ్ళ కృషి బెడిసికొట్టకూడదు.

మస్తానమ్మ నిలబడ్డచోటునించి కదలకపోయేసరికి ఖబీస్ విజృంభించింది.

"నన్ను వొదిలేయ్. నీ మంత్ర ప్రభావం క్షీణించి పోయింది. నన్నిలా మరెంతోసేపు ఉంచలేవు. నీ అంతట నువ్వు వొదిలేస్తే నాదారిన నేను పోతాను. లేకపోతే ఏం జరుగుతుందో నీకు బాగా తెలుసు." పెదాలు కదపకుండానే చెప్పింది ఖబీస్.

ఖబీస్‌ని అదుపులోకి తీసుకుని రావడానికి మార్గం ఆలోచిస్తున్న మస్తానమ్మ కోపంగా చూసింది. ఖబీస్‌నించి వెలువడుతున్న దుష్టభావ

తరంగాలు ఆమె ఆలోచనలకి అడ్డు వస్తున్నాయి.

"నన్ను బంధించి ఉంచితే నీకే నష్టం! ఆ అడమనిషి ఎప్పుడు ఏం చేస్తుందో గమనించి నీకు చెప్పమన్నావు అలాగే చేసానిన్నాళ్ళు...కానీ ఇవాళ నా చూపులకి దూరిమయి మగాడితో సంభోగించింది. నన్నిలా కట్టి పడేసావు కాబట్టే వాళ్ళని ఆపలేకపోయాను." నోరువిప్పకుండానే పలికింది ఖబీస్ మళ్ళీ.

మస్తానమ్మకు తెలుసు ఖబీస్ ఎత్తులు, మాయమాటల్లో పెట్టాలని చూస్తోందది. ఒక్కక్షణం వృధాచేసినా ఖబీస్ ధిక్కారం మితిమీరిపోవచ్చు. మెడలోని తాయత్తుని ఒకసారి కళ్ల కద్దుకుని అడుగు ముందుకు వేసింది మస్తానమ్మ.

"అబద్ధం!...నీ మాటలు నేను నమ్మను." అంది.

"నా మాటలు అబద్ధంకావు! ఇవాళ వాళ్ళిద్దరూ అడవిలో సంభోగించారు. అంతేకాదు...ఆడదాని గర్భంపండింది."

మస్తానమ్మ ఆలోచనలోపడిపోవడం గమనించి మళ్ళీ మొదలెట్టింది ఖబీస్.

"ఆడదంటే నాకు కసిగావుంది. దానిసంగతి నాకు వొదిలేయి. ఆ పిండాన్ని వమ్ముచేస్తాను నేను...మగాడి మీద నీ మనసు మళ్ళిందా? నువ్వు మోహించినవాడ్ని జీవితాంతం నీ కాళ్ళదగ్గర పడుండేటట్టు చేయ కలను...

ఖబీస్‌కేసి చురుగ్గా చూసింది మస్తానమ్మ. బానిసగాపడుండి పనులు చేసిపెట్టవలసిన ఖబీస్ తన మనసులోని భావాలను పసిగట్టి వాటి ఆసరాతో తననే లొంగదీసుకోవాలని చూస్తోంది. తనను ప్రలోభంలోపెట్టి లాభం పొందాలని చూస్తోంది.

క్షణం ఆలస్యం చేయికుండా చూపుడువేలు గాలిలో గుండ్రంగాతిప్పి ఖబీస్ చుట్టు వృత్తాకారంలో గిరిగీస్తూ ఫేరా మంత్రం మొదలెట్టింది మస్తానమ్మ.

నికృష్టమైన సిఫిలి అమల్ కోవకు చెందిన మంత్రం ఫేరా?

కొమ్ములు తిరిగిన మాంత్రికులు సైతం ఆ మంత్రం జోలికి

వెళ్ళరు. ఎంతో అవసరమైతే కాని ఉపయోగించని మంత్రమది.

ఎంత గొప్ప మాంత్రికుడయినా తన జీవితకాలంలో ఒకే ఒకసారి ఉపయోగించకలుగుతాడు. ఆ మంత్రాన్ని. దాని ఉచ్చారణచేస్తే సాక్షాత్తు సైతానుతో చేతులుకలిపినట్టే.

మంత్రశక్తికి పారితోషికంగా సైతానుకి అమ్ముడు పోవలసి ఉంటుంది.

ఆ తర్వాత...

సైతాను చూపిన బాటతప్పితే, మాంత్రికులు ఎదుర్కొనే ఘోరమయిన పరిణామం కంటే చావేనయం అన్నసంగతి మస్తానమ్మకు బాగా తెలుసు...

అయినా...మొండిగా ఆ మంత్రాన్నే చేపట్టింది.

ఎట్టిపరిస్థితుల్లోనూ తనది కింది చెయి కాకూడదు. అన్న ఆలోచనే ఆక్రమించుకుని ఉందామె మనసుని...

ఘోరా మంత్రోచ్చారణ ప్రారంభం కాగానే వెనక్కి తగ్గి గోడకు అతుక్కుని నిలబడిపోయింది ఖబీస్...

"వొద్దు! ఆపని చేయకు...నీమాట జవదాటను నీతోవాదనలు పెట్టుకోను" ప్రాధేయపడింది ఖబీస్.

ఆ మాటలకు కరిగిపోకుండా పని కొనసాగించింది మస్తానమ్మ... ఆమె ఏకాగ్రతను భంగం చేయడానికి అన్ని విధాలుగా ప్రయత్నిస్తోంది ఖబీస్...

"నీ గురువాజ్ఞ లేకుండా ఈపని చేస్తున్నావ్. ఘోరపాట్లుదొర్లితే రక్తం కక్కుకుని చస్తావ్! నా మాటవిని నీ ప్రయత్నం ఆపు! నీకేం కావాలంటే అదిస్తాను!" ఆశచూపించింది ఖబీస్.

మంత్రోచ్చారణ ఆపక ఖబీస్ చుట్టూ గిరిగీయసాగింది మస్తానమ్మ...ఖబీస్ నడుంచుట్టూ ఏర్పడుతున్న ఎర్రటి కాంతిని గమనించి తన మంత్ర ప్రయోగం ఫలిస్తోందని అర్థం చేసుకుంది.

గజగజలాడిపోయింది ఖబీస్.

మస్తానమ్మకు వొంగి సలాములు చేస్తూ తనను వొదిలేయమని

చివరిసారిగా ప్రాధేయపడింది. మస్తానమ్మ పట్టించుకోలేదు. ఘేరా మంత్రం ఎనిమిదిసార్లు ఉచ్ఛరించగానే ఎర్రటి కాంతి మరింత ప్రకాశవంతంగా మెరుస్తూ ఖబీస్‌ని గదికి ఈశాన్యం మూలన అష్టదిగ్బంధం చేసింది.

గర్వంగా తలపైకెగరేసి ఖబీస్‌ని చూసింది మస్తానమ్మ.

"ఖబీస్! నువ్వు నా బానిసవి! ఘేరా నిన్ను ఎప్పుడూ చుట్టుముట్టే ఉంటుంది. గుర్తుంచుకో...ఇకపైన ఎట్టి పరిస్థితుల్లోనూ నన్ను ధిక్కరించకు. ఏ మాత్రం పొగరుచూపించినా నిన్ను ఇబ్లీస్‌రాజ్యంలో వెయ్యేళ్ళు తలక్రిందులుగా వేలాడేస్తాను. జాగ్రత్త." అంటూ ఖబీస్‌కి వేసిన చక్ర బంధాల్ని మరింత పటిష్టం చేసింది మస్తానమ్మ.

ఖబీస్‌ని తన ఆధీనంలోకి తెచ్చుకున్నాక మస్తానమ్మ ఆలోచనల్లో పడిపోయింది.

ఘేరా సామాన్యమయిన మంత్రంకాదు. అది ప్రయోగించినందుకు సైతానుతో శాశ్వత అనుబంధం ఏర్పడింది. ఇకపైన ఏపనిచేసినా సైతాను అనుగ్రహం పొందనిదే చేయడానికిలేదు. ఇష్టం ఉన్నా లేకపోయినా సైతాను మార్గంలోనే నడవాలి!...ఆ మార్గంలో నడిచే వారిది తిరుగులేని ప్రయాణం.

ఖబీస్‌ని బంధించి తన మంత్రశక్తిని నిరూపించుకోకలిగినా అనాలోచితంగా సైతాను ఊబిలో పడిపోయిందా తను?

"మస్తానమ్మా!"

గది బయటనించి రాజేశ్వరిదేవి పిలుపుకి ఆలోచనల్లోంచి తేరుకుంది మస్తానమ్మ.

తలుపులు తెరుచుకుని బయిటకి వస్తే హాల్లో రాజేశ్వరిదేవి నిలబడి ఉంది. నెమ్మదిగా ఆమెకేసి నడుస్తూ మొహంలో ఎటువంటి భావాలు కనపడనీకుండా జాగ్రత్త పడింది.

"ఇంకా నిద్రపోలేదా అమ్మగారూ?" అడిగింది.

మస్తానమ్మకేసి అదోలా చూసింది రాజేశ్వరిదేవి.

"ఆ గదిలో ఏం చేస్తున్నావే?" అడిగిందామె.

"ఖర్చం చేస్తున్నానమ్మగారూ ... పొద్దునపూట కుదరడంలేదు."

అంది ఏ మాత్రం తడబడకుండా.

"అద్సరేగానీ ... ఇదెలా విరిగింది?" అడిగింది రాజేశ్వరిదేవి టేబిల్ మీదున్న ఒక పెద్ద సైజు ఫోటో ఫ్రేంకేసి చూపించి.

"ఇదా! సాయంత్రం బూజు దులుపుతుంటే జారిపడిందమ్మగారూ!"

"ఫొటో ఫ్రేం విరిగి ముక్కలయినా నాకు చెప్పనక్కర్లేదా? గప్ చిప్‌గా స్టోర్ రూంలో దాచేసావెందుకూ?" అడిగింది రాజేశ్వరిదేవి కొంచెం కోపంగా.

"రేపు చెప్దాం అనుకున్నానమ్మా"

మస్తానమ్మ సమాధానం విని మండిపడింది రాజేశ్వరిదేవి.

"అసలు ఈ ఫొటో ఎవరిదో తెలిసే మాట్లాడుతున్నావా?"

"తెలుసమ్మగారూ! పెద్దయ్యగారిదే కదా!" అంది తేలిగ్గా.

మస్తానమ్మ ధోరణి అర్థంకాలేదు రాజేశ్వరిదేవికి.

"పెద్దయ్యగారి ఫోటో అని తెలిసికూడా అంత నిర్లక్ష్యంగా మాట్లాడ్తావా? అసలేమయిందే నీకివాళ?" గొంతు పెద్దదిచేసి అడిగింది.

నవ్వి ఊరుకుంది మస్తానమ్మ.

"ఏమిటే సమాధానం చెప్పకుండా నవ్వుతావు?" మరింత కోపంగా అడిగింది రాజేశ్వరిదేవి.

ఫొటో ఫ్రేం విరిగిపోయినంతమాత్రాన మీరింత కోపం తెచ్చుకుంటే ఏం చెప్పమంటారు అమ్మగారూ? పెద్దయ్యగారు పోయారని ఫొటోకి ఇంత పెద్ద ఫ్రేం కట్టించి వేలాడేసారు...పెద్దయ్యగారే తిరిగి వస్తుంటే ఆయన ఫొటోలతో పనేమిటమ్మా?" అంది మస్తానమ్మ ఎటో చూస్తు.

కోపం మరచి ఉలిక్కిపడింది రాజేశ్వరిదేవి.

"ఎ...ఏమిటే నువ్వంటోంది?" ఆశ్చర్యంగా అడిగింది.

హాయిగా నవ్వేసి సమాధానం చెప్పింది మస్తానమ్మ.

"అవునమ్మగారూ! అందుకే కదా ఇందాక ఆ ఫ్రేం విరిగినా మీకు చెప్పలేదు...గోడమీద బొమ్మ ఉంటేనేం లేకపోతేనేం! అసలు మనిషే వస్తుంటే."

మతిపోయినట్టయింది రాజేశ్వరిదేవికి.

"పోయిన మనిషి తిరిగి రావడం ఏమిటే? నీకేమయినా పిచ్చి పట్టిందా ఇలా మాట్లాడుతున్నావ్?"

"కాదమ్మగారూ... పెద్దయ్యగారు మళ్ళీ వస్తారు...నాకు తెలుసు. మిమ్మల్ని అబ్బాయిగారిని వొదిలిపెట్టి ఉండలేరు అయన..."అని ఆగింది మస్తానమ్మ.

"ఏమిటే అంటున్నావ్?"

"పెద్దయ్యగారు మళ్ళీ ఈ ఇంట్లో పుడ్తారమ్మగారూ!...మీ మన వడిలా." అంది మస్తానమ్మ.

ఒక్కక్షణం ఆమెకేసి తేరిపారిచూసి వివర్ణమయిన మొహంతో అక్కడ్నించి గబగబ వెళ్ళిపోయింది రాజేశ్వరిదేవి.

• • •

అనంతగిరి గెస్టుహౌస్ ఖాళీచేసి హైదరాబాదుకి తిరుగు ప్రయాణం అవుతుంటే స్నిగ్ధ మూడ్ అదోలా అయిపోయింది. ఆమె అలా ఎందుకు బాధపడ్తుందో పవన్‌కి బాగా తెలుసు.

వికారాబాదులో ఉన్న ఆ వారం రోజులు ఎంతోహాయిగా గడిచి పోయాయి వాళ్ళిద్దరికీ. జీవితంలో ఎప్పుడూ లేనంత సంతోషాన్ని చవి చూసింది ఆ వారం రోజుల్లోనే!...పొద్దున గెస్టుహౌస్‌లో టిఫిన్‌చేసి జీపులో అడవుల్లోకి వెళ్ళిపోతే సాయంత్రందాకా ఆ అందమయిన వాతావరణంలోనే ఉండేవారిద్దరూ! తవ్వకాల్లో ఊహించిన దానికంటే ఎక్కువ సంఖ్యలో నగలు, పాత్రలు, పనిముట్లు బయట పడ్తుంటే సాయంత్రం వాటిని గెస్టుహౌస్‌కి తరలించేవారు. అక్కడ ఇద్దరూ కలిసి వాటిని శుభ్రంచేసి క్లాసిఫై చేస్తూ భద్రపరిచేవారు...అ తర్వాత స్నానాలు డిన్నరు... ఒకొక్కసారి రాత్రి ఒంటిగంటదాకా కబుర్లు చెప్పుకుంటూ లేదా పేకాట ఆడుతూ గడిపేవారు...అన్నీ తీయటి అనుభూతులే!...జీవితాంతం ఆ అందమయిన 'రోమాంటిక్ రొటీన్' కొనసాగితే బావుణ్ణు అనిపించేది ఇద్దరికీ.

హైదరాబాదు చేరుకుంటుంటే పవన్ భుజంమీద తలపెట్టుకుని

అడిగింది స్నిగ్ధ "నాకో మాటిస్తావా?" అని.

"ఏమిటది?" జీపు నడుపుతూ అడిగాడు పవన్.

"ఇలా నీకు టూర్ ప్రోగ్రాం వచ్చినప్పుడల్లా నన్నుకూడా తీసుకెళ్తుండాలి!...యూనో! నా టెన్షన్స్ అన్నీ తగ్గి నార్మల్‌గా ఉండాలంటే నన్నిలా అపుడపుడు మంచి చేసుకోవాలి నువ్వు." అంది నవ్వుతూ.

పవన్‌కూడా మనసారా నవ్వి ఆమె బుగ్గమీద చిన్నగా గిల్లాడు.

"నువ్వు నార్మల్‌గా ఉంటానంటే నాకంతకంటే కావల్సిందేముంటుంది స్నిగ్ధా."

ఇంటి కాంపౌండ్‌లో జీపు ఆపి దిగుతుంటే రాజేశ్వరిదేవి ఎదురయి ముభావంగా పలకరించింది ఇద్దర్నీ. ఆవిడలా ఎందుకుందో అర్థంకాలేదు పవన్‌కి. భోజనాల దగ్గరకూడా పొడిపొడిగానే మాట్లాడిందావిడ.

భోజనాల తర్వాత స్టడీ టేబిల్‌దగ్గర కూర్చుని చాలాసేపు టూర్ రిపోర్ట్ తయారు చేసాడు పవన్. రిపోర్టు రాయడం పూర్తయ్యాక బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంటూ లేచాడు, బీరువాదగ్గర బట్టలు సర్దుతున్న స్నిగ్ధకేసి తిరిగి "పడుకుందామా?" అని అడిగాడు.

సరేనని తలూపింది స్నిగ్ధ. లైట్ ఆఫ్‌చేసి ఇద్దరూ మంచంమీద పడుకున్నారు. స్నిగ్ధబుగ్గమీద మృదువుగాచుంబించి దగ్గరకు లాక్కుంటూ.

"గుడ్‌నైట్ డార్లింగ్...స్వీట్ డ్రీమ్స్" అన్నాడు.

"గుడ్‌నైట్" అని అతడి మెడచుట్టూ చెయి వేసుకుని పడుకుంది స్నిగ్ధ.

.........

.........

ఒక రాత్రివేళ మెలకువ వచ్చింది పవన్‌కి.

తనపక్కన స్నిగ్ధ పడుకుని లేదని గ్రహించి కళ్ళు తెరచాడతను.

మెడదాకా దుప్పటి కప్పుకుని మంచం చివరన కూర్చుంది స్నిగ్ధ.

"స్నిగ్ధా" పిలిచాడతను...

ఉలుకు పలుకు లేకుండా అలాగే కూర్చుంది స్నిగ్ధ.

బెడ్‌లైట్ మసక వెలుతురులో స్నిగ్ధ చూస్తున్న వైపుకి దృష్టి సారిం

చాదతను! ఏమీ లేదక్కడ.

స్నిగ్ధ ఆ మూలకేసి ఎందుకుచూస్తోందో అర్థంకాలేదతనికి. వికారాబాదుకి వెళ్ళకముందు కూడా ఎన్నోసార్లు ఆ మూలకేసే భయంగాచూసేది స్నిగ్ధ. అక్కడేం కనబడుతోందని అడిగితే సరైన సమాధానం చెప్పేది కాదు...ఇవాళ కూడా మళ్ళీ ఆ వెర్రి చూపులే.

కాదు...!

ఇవాళ ఏదో మార్పు ఉంది తనలో.

స్నిగ్ధ అటే చూస్తోంది కానీ ఆమె మొహంలో మునపటి భయం లేదు...శ్రద్ధగా ఎవరిమాటలో వింటున్నట్టుంది.

బెడ్‌లైట్ మసక వెలుతురులో తనలా ఊహించుకుంటున్నాడా అనుకుంటూ లేచి కూర్చున్నాడు పవన్.

'స్నిగ్ధా' పిలిచాడు మళ్ళీ

అతడికేసి తిరగలేదు స్నిగ్ధ. ప్రతిమలా అలాగే కూర్చుంది.

"స్నిగ్ధా! నిన్నే - ఏమిటి చూస్తున్నావ్?" అడిగాడు పవన్ కొంచెం చిరాగ్గా...

లేదన్నట్టు తలూపింది స్నిగ్ధ తల తిప్పకుండానే.

స్నిగ్ధ తలూపింది తన మాటలకు సమాధానంగా కాదని గ్రహించడానికి మరో రెండు క్షణాలు పట్టాయి పవన్‌కి.

మరెవరికో సమాధానం ఇస్తోంది స్నిగ్ధ.

గదిమూలన ఎవరితోనో మాట్లాడుతున్నట్టుంది ఆమె మొహంలో ఎక్స్‌ప్రెషన్.

అంతలో...

చేతులు ఆడిస్తూ ఏవో సైగలు చేయనారంభించింది స్నిగ్ధ.

ఇక ఆగలేకపోయాడు పవన్.

"స్నిగ్ధా! ఏమిటిదంతా!..." అని బిగ్గరగా అరచి భుజాలు పట్టుకుని ఊపేసాడామెను.

నెమ్మదిగా తలతిప్పి అతడ్ని చూసింది స్నిగ్ధ.

"వ్హాట్ ఈజ్ ద ప్రాబ్లమ్?" ఆమెను అలాగే పట్టుకుని అడిగాడు.

బ్లాంక్‌గా చూసిందామె.

"ఏముందా మూలన? ఎందుకలా చూస్తున్నావ్?" అని మంచం దిగి వెళ్ళి లైట్ ఆన్ చేసాడు పవన్.

లైటు వెలగ్గానే అప్రయత్నంగా ఈశాన్యం మూలకేసి చూసా డతను.

"చూడు...అక్కడేమీలేదు ... మరెందుకు చూస్తున్నావ్..." అంటూ స్నిగ్ధకేసి తిరిగాడు.

స్నిగ్ధ పడుకుని ఉంది.

"స్నిగ్ధా!!..."

సమాధానం ఇవ్వలేదు. అప్పటికే గాఢంగా నిద్రపోతోందామె.

* * *

మర్నాడు నిద్రలేస్తూనే అడిగాడు పవన్.

"నిన్నరాత్రి ఏమయింది నీకు?"

"ఏమిటి పవన్!" అంటూ అతడికేసి ఆశ్చర్యంగా చూసింది స్నిగ్ధ.

క్రితం రాత్రి జరిగింది క్లుప్తంగా గుర్తుచేశాడు పవన్.

"నాకేం గుర్తులేదు పవన్!...నిద్రలోలేచి కూర్చున్నానేమో!..." అంది స్నిగ్ధ.

కాసేపు ఏదో ఆలోచించి చెప్పాడు పవన్...

"ఇవేళ్టినించి మనం ఈ గదిలో పడుకోవద్దు...నీ కెందుకో ఈ గదిలో భయమేస్తున్నట్టుంది...గెస్ట్‌రూం ఖాళీగానే ఉంది కదా. నేను ఆఫీసుకెళ్ళాక మన సామాన్లు ఆ గదిలోకి మార్చేయి సరేనా?"

శూన్యంలోకి చూస్తూ కూర్చున్న స్నిగ్ధ భుజం తట్టాడు పవన్.

"నిన్నే!"

అతడికేసి చూడకుండానే జవాబిచ్చింది స్నిగ్ధ.

"గెస్ట్‌రూంలో కావలిస్తే నువ్వు పడుకో పవన్. నా కిక్కడే బావుంది!..."

సరిగ్గా అప్పుడు స్నిగ్ధ ఊహించినదీ, భయపడుతున్నదీ జరిగింది.

# 11

డాక్టర్ సుస్మిత ఇంటి డోర్‌బెల్ ఒకసారి నొక్కి నిలబడ్డాడు పవన్.

కాసేపయ్యాక తలపు తెరచిన డాక్టర్ సుస్మిత సెక్రటరీని చూసి పలకరింపుగా నవ్వాడు పవన్.

"సుస్మితగారున్నారా?" అడిగాడతను.

తలపంకించి అతడ్ని లోపలికి పిలుచుకెళ్ళిందా అమ్మాయి. డ్రాయింగ్ రూంసోఫాలో అతడ్ని కూర్చోమని చెప్పి డాక్టర్ సుస్మితని పిలవడానికి లోపలికి వెళ్ళిందామె.

రెండు నిమిషాల తర్వాత అక్కడకు వచ్చింది డాక్టర్ సుస్మిత.

"అరె...మీరా!" అంటూ వచ్చి అతడి ఎదురుగా సోఫాలో కూర్చుంది.

"మీతో అర్జెంటు పనుండి వచ్చాను...బిజీగా ఉన్నారా?" అడిగాడు పవన్.

"ఫర్వాలేదు...చెప్పండి"

"స్నిగ్ధకు మళ్ళీ..." సందేహించి ఆగిపోయాడతను.

"ఏమయింది స్నిగ్ధకు?" అడిగింది సుస్మిత.

కొన్నిరోజులుగా బెడ్‌రూంలో ఉన్నప్పుడు స్నిగ్ధ ఎలా భయపడుతోందో చెప్పసాగాడు పవన్.

"—ఇదంతా కొన్నాళ్ళక్రితం వరకు జరిగేది. ఎన్ని విధాలుగా రీజనింగ్ చెప్పినా రిలాక్స్ అయ్యేదికాదు. బెడ్‌రూంలో ఎవరో నిలబడి తనకేసే చూస్తున్నారని అనవసరంగా భయపడిపోయేది. అందుకే వాతావరణం మారినట్టుగా ఉంటుందని తనని నాతోపాటు వికారాబాదు టూర్‌కి తీసుకెళ్ళాను. అక్కడున్నవారంరోజులు చీకూచింత లేకుండా గడిచిపోయాయి మా ఇద్దరికీ. టూర్‌నించి తిరిగిరాగానే స్నిగ్ధ ప్రవర్తన మరోలా మారింది."

"ఏమిటామార్పు?" వృత్తిపరమయిన ఆసక్తి చూపింది సుస్మిత.

"గది మూలకేసి చూస్తే తనకేం కనబడుతుందో నాకు తెలియదు కానీ, ఇంతకుముందు అటుచూసి వొణికిపోయేది అలాంటిది...నిన్నరాత్రి నాకు మెలకువ వచ్చినపుడు చూస్తే...స్నిగ్ధ ఎవరితోనో మాట్లాడుతోంది ఆమె చూపులు మాత్రం ఆ మూలకేసే ఉన్నాయి. పొద్దున లేచాక అడిగాను ఇకమీదట గెస్ట్‌రూంలో పడుకుందామా అని. ససేమిరా ఒప్పుకో లేదు. సుస్మితగారూ. నాకు స్నిగ్ధ గురించి బెంగగా ఉంది. ఇదంతా దేనికి దారితీస్తుందో!" అని ఆగాడు పవన్.

సుస్మిత మాట్లాడకుండా ఆలోచిస్తూకూర్చుంది కాసేపు...ఆతర్వాత అంది.

"మీరు చెప్తున్న దాని బట్టి ఇది న్యూరోసిస్ ప్రారంభదశ అనిపిస్తోంది..."

"న్యూరోసిస్!" అదిరిపడ్డాడుపవన్.

"అవునండీ! న్యూరోసిస్‌లో ఇలాంటి డెల్యూషన్స్ వచ్చే అవకాశం ఉంది. ఎవరివో కంఠస్వరాలు, ఆకారాలు కనబడ్తుంటాయివాళ్ళకి. అయినా మీరు కంగారు పడకండి. ఇది ప్రారంభదశే కాబట్టి పైగా స్నిగ్ధ మనతో సహకరిస్తోంది కాబట్టి చికిత్స చేయడం కష్టంకాదు." అంది సుస్మిత.

పవన్ తల అడ్డంగా తిప్పాడు.

"స్నిగ్ధ ఇపుడు మనతో సహకరించే పరిస్థితిలోలేదు సుస్మితగారూ? తన ప్రవర్తన రోజురోజుకి ఇలా అసహజంగా మారిపోతోందన్న సంగతి కూడా గ్రహించడం లేదు తను...షీఈజ్ గోయింగ్ క్రేజీ!" అన్నాడతను బాధగా.

మీరు మరీ కంగారు పడిపోతున్నారు. స్నిగ్ధ నార్మల్‌గా ఉండటం లేదన్నమాట నిజమేకానీ...తన పరిస్థితేమిటో ఆమెకు బాగా తెలుసు."

"అంటే" అడిగాడు పవన్.

"మీకో సర్‌ప్రైజ్ ఇస్తాను రండి" అంటూలేచి తన కన్సల్టింగ్ రూంకేసి దారితీసింది సుస్మిత.

"సర్‌ప్రైజ్ ఏమిటి?" అంటూ ఆమెను అనుసరించి కన్సల్టింగ్ రూంలోకి వెళ్ళి ఠక్కున ఆగిపోయాడు పవన్.

అక్కడ కూర్చున్న స్నిగ్ధకేసి అపనమ్మకంగా చూసాడతను.

"నువ్వెప్పుడు వచ్చావు?" ఆశ్చర్యంగా అడిగాడు.

"గంటసేపట్నించి ఇక్కడే ఉంది స్నిగ్ధ. నీవు వచ్చినపుడు తన తోనే మాట్లాడుతున్నాను."

"మరి నాకు చెప్పలేదేం?" అడిగాడు పవన్.

స్నిగ్ధ పక్కన ఖాళీ కుర్చీలో అతడ్ని కూర్చోమని సైగచేసి తన రివాల్వింగ్ ఛైర్‌లో కూర్చుంది సుస్మిత.

"మీరు దేని గురించి మాట్లాడటానికి వచ్చారో ఆ విషయం డిస్కస్ చేయడానికే వచ్చింది స్నిగ్ధకూడా!...అందుకే, మీతో విడిగా మాట్లా డాలనుకున్నాను" అందామె.

"అయితే స్నిగ్ధా! నువ్వుకూడా..." ఆగాడు పవన్. అవునన్నట్టు తలూపి చెప్పింది స్నిగ్ధ.

"వికారాబాద్ నించి తిరిగివచ్చాక బెడ్‌రూంలో నాకు కనబడుతున్న వింత ఆకారం గురించి సుస్మితకు చెప్పడానికి వచ్చాను"

"ఆకారమా? ఏమిటది?" కంగారు పడిపోతూ అడిగాడు పవన్.

"అది ఇల్యూషన్ అయ్యుండొచ్చని అనుకోడానికి నువ్వు సిద్ధంగా ఉన్నావు! అవునా?" అడిగింది డాక్టర్ సుస్మిత.

ఏదో ఆలోచిస్తూ తలూపింది స్నిగ్ధ.

"ఆ ఆకారం నాకు మాత్రమే కనిపించింది కాబట్టి అది ఇల్యూషనే కావచ్చు...కానీ ఇలా ఎందుకు జరుగుతోందో అర్థం కావడంలేదు నాకు. ముందు ఆ విగ్రహం...ఇపుడిది."

"అర్థమవుతుంది. తప్పకుండా అర్థమవుతుంది. అంతేకాదు దీన్నించి ఎలా బయటపడాలో నీ అంతట నువ్వే తెలుసుకుంటావు. నువ్వు చెయవలసిందల్లా...ఇంతకుముందు నేను చెప్పినట్టు నియమం తప్పకుండా ట్రాన్సాక్షనల్ అనాలిసిస్‌కి రావడం!..." అంది సుస్మిత.

పవన్ తన కుర్చీలో ముందుకి జరిగాడు.

"డాక్టర్ సుస్మితా! మీ ట్రీట్‌మెంట్ ఎన్నిరోజులు పడ్తుంది?"

"మా ప్రాక్టీసులో చికిత్స ఇన్నిరోజుల్లో పూర్తవుతుందని ముందే

చెప్పలేమండీ. ఒకొక్కసారి ఇలాంటి కేసులు కొన్ని సంవత్సరాలయినా పూర్తిగా నయంకావు. కానీ...స్నిగ్ధ విషయంలో నాకా భయంలేదు. మరో ఎనిమిది నెలల్లో తను పూర్తిగా కోలుకుంటుంది." అంది సుస్మిత చిరునవ్వుతో.

"అంత ఖచ్చితంగా ఎలా చెపున్నారు?"

"మరో ఎనిమిది నెలల్లో తను తల్లి కాబోతోంది కాబట్టి! తనకి మాతృత్వం లభిస్తే అంతరంగంలోని టెన్షన్స్ వాటంతటవే మాయమవుతాయి!"

సుస్మిత మాటలు విని ఆశ్చర్యంగా స్నిగ్ధకేసి చూసాడు పవన్.

ఎరుపెక్కిన బుగ్గలతో తలదించుకుంది స్నిగ్ధ.

వాళ్ళ చూపులు గమనించిన సుస్మిత అడిగింది.

"పవన్‌గారికి ఇంకా చెప్పలేదా శుభవార్త?"

"లేదు...ఇవాళే కదా గైనకాలజిస్ట్ చెప్పింది నాకు" అంది స్నిగ్ధ తలవంచుకునే.

"కంగ్రాచ్యులేషన్స్!" అంది సుస్మిత.

"థాంక్స్" అన్నాడు పవన్ ఆనందంగా.

ఆ తర్వాత...ట్రాన్సాక్షనల్ అనాలిసిస్‌కి ఏ రోజుల్లో తనదగ్గరకి రావాలో డేట్స్ ఇచ్చింది డాక్టర్ సుస్మిత. డయరీలో తేదీలు నోట్ చేసుకుని లేచాడు పవన్.

"ఇక బయల్దేరతామండీ"

"ఓ కె" అంది సుస్మిత.

స్నిగ్ధ లేవలేదు—

"ఇదంతా బాగానే ఉంది కానీ, ట్రీట్‌మెంట్ ప్రారంభించేవరకూ నేనేం చేయాలి? ఇంటికెళ్ళాలంటే భయంగా ఉంది. ఈ రాత్రి ఎలాగడుస్తుందోనని దిగులు..."

ప్రిస్క్రిప్షన్ పాడ్‌మీద మందులేవో రాసి కాగితం స్నిగ్ధ కందించింది సుస్మిత.

"ఈ మందులు డోసేజి మించకుండా జాగ్రత్తగా వాడాలిరాత్రిళ్లు

హాయిగా నిద్రపడ్తుంది. దాంతో టెన్‌షన్స్ చాలా మట్టుకు తగ్గిపోతాయి." అందామె.

కాగితం మడచి బ్యాగ్‌లో పెట్టుకుని లేచింది స్నిగ్ధ.

"ఇవేళ్టి నించి నియమం తప్పకుండా వాడతానీ మాత్రలు."

పవన్‌ని అనుసరిస్తూ బయటకు నడిచిందామె.

స్నిగ్ధకు నిద్రమాత్రలు రాసిచ్చిన సైకియాట్రిస్ట్ డాక్టర్ సుస్మితకు 'సైకిక్ అటాక్' గురించి తెలియదు. తెలిసి ఉంటే తన స్నేహితురాలిని అవి వాడమని చెప్పి ఉండేది కాదు.

ఎవరిమీదైనా 'సైకిక్ అటాక్' లేదా 'బ్లాక్ మాజిక్' ప్రయోగంజరుగు తున్నపుడు ఆ వ్యక్తి నిద్రమాత్రలు మింగి ఆదమరచి నిద్రపోతే జరిగే నష్టం గురించి చాలామందికి తెలియదు.

సాధారణంగా నిద్రలో...భౌతిక శరీరంలోంచి సూక్ష్మ శరీరం (ఆస్ట్రిల్ బాడీ) వెలికి వచ్చి స్వేచ్ఛా విహారం చేస్తుంది. అలా 'అస్ట్రిల్ బాడీ' స్వతంత్రంగా విహరిస్తున్నపుడే, సైకిక్ అటాక్,' 'సిఫిలి అమల్,' 'చేతబడి' లాంటి నికృష్టమయిన ప్రయోగాలు ఫలిస్తాయి. అలాంటి సందర్భాల్లో సూక్ష్మ శరీరం బెదరిన జింకపిల్లలా నిదురిస్తున్న భౌతిక శరీరంలోకి ఛెంగున వచ్చి చేరుకుంది.

అప్పుడా వ్యక్తికి మెలకువవస్తే జరిగిందంతా భయంకరమయిన కలలా తోస్తుంది.

కానీ...

నిద్రమాత్రలు వేసుకుని అసహజంగా నిద్రపోతున్న వ్యక్తిపైన సైకిక్ అటాక్ జరిగితే?

సూక్ష్మ శరీరం, భౌతిక శరీరంలోకి వచ్చి చేరినా ఆ వ్యక్తికి మెలకువరాదు। మెలకువ రానంతవరకూ సైకిక్ అటాక్ విధ్వంసం కొన సాగుతూనే ఉంటుంది.

అంతకంటే అవాంఛనీయమయిన పరిస్థితి మరేముంటుంది?

• • •

అసహనంగా మంచంమీద కదిలి లేచి కూర్చుంది రాజేశ్వరిదేవి

రాత్రి పదకొండు గంటలయినా ఆ రోజు నిద్ర పట్టడంలేదామెకు.

మంచం పక్కనున్న కిటికీ తెరచి బయటకి చూసింది...

రివ్వున గాలివీస్తోంది బయట. వీధిలోని చెత్తంతా గాలిలోకి పైకి లేస్తుంటే వీధి దీపాలు మసకగా కనబడుతున్నాయి. ఎదురింట్లో కొబ్బరిచెట్లు అటూ ఇటూ ఊగిపోతున్నాయి.

ఉన్నట్టుండి ఆకాశంలో ఎర్రటి మెరుపొకటి మెరిసి ఫెడీల్‌మని ఉరిమింది.

మరికాసేపట్లో వర్షం ప్రారంభమవుతుందని అనుకుంటున్నంతలోనే పెద్ద పెద్ద చినుకులతో కిటికీ మీదకి వర్షం జల్లుకొట్టింది.

కిటికీ తలుపులు గడియవేసి లేచి నిలబడింది రాజేశ్వరిదేవి.

బయట వాతావరణానికి తగ్గట్టుగానే ఉంది ఆమె మనసులోని అల్లకల్లోలం...

సాయంత్రం పవన్ చెప్పిన వార్త సృష్టించిన అల్లకల్లోలమది.

స్నిగ్ధకు నెలతప్పిందని పవన్ చెప్పినపుడు అతడితో ఆనందాన్ని పంచుకోలేకపోయింది తను...మనసంతా వికలమయి భయంలాంటిది మొదలయింది.

పవన్ తండ్రయితే తనను మరింత నిర్లక్ష్యం చేస్తాడని కాదా భయం!...ఆ భయానికి కారణం పవన్ మాటలే.

"మగ బిడ్డ పుడ్తే నాన్నగారి పేరు పెడదాం"

ఆ మాటలు తలపకురాగానే కంగారుగా గదిలో అటూ ఇటూపచార్లు మొదలెట్టింది రాజేశ్వరిదేవి.

రెండ్రోజుల క్రితం ఫొటో ఫ్రేం విరిగినపుడు మస్తానమ్మ చెప్పిన మాటలకు తగ్గటుగా ఏమిటిదంతా?

పచార్లు ఆపి గదిమధ్యన ఆగిపోయింది రాజేశ్వరిదేవి. కాసేపు ఏదో ఆలోచిస్తూ అక్కడే నిలబడి నెమ్మదిగా గది బయటకు నడిచింది.

వరండాలోంచి మెట్లకింద గడికేసి నడుస్తుంటే వర్షం జల్లుకి పూర్తిగా తడిసిపోయిందామె.

మెట్లదగ్గర ఒక్కక్షణమాగి పవన్ బెడ్‌రూంకేసి దృష్టి సారించింది

తలుపులు వేసి ఉన్నాయి.

చప్పుడు చేయకుండా మెట్ల కింద గది తలుపు తోసింది రాజేశ్వరి దేవి. తలుపు తెరచుకుంటుంటే గుప్పున ఘాటైన సాంబ్రాణి వాసన ఆమె నాసికాపుటాలని తాకింది.

జుట్టు విరబోసుకుని గదిమధ్యన మోకరిల్లిన మస్తానమ్మను చూసి ఉలిక్కిపడింది రాజేశ్వరిదేవి!...గదిలో ఒక మూలన మిణుకుతున్న దీప కాంతికి మస్తానమ్మ నీడ గోడమీద వింతగా కదుల్తోంది.

నోటమాటరాక నిలబడిపోయింది రాజేశ్వరిదేవి.

మోకరిల్లిన మస్తానమ్మ చటుక్కున తలెత్తి రాజేశ్వరిదవికేసి చూసింది.

మస్తానమ్మ కళ్ళు తెల్లగా మెరిసాయి!...అందులో కనుగుడ్లు పత్తాలేదు.

భయంకరమయిన ఆ చూపులకి అద్దిరి ఒక అడుగు వెనక్కి వేసింది రాజేశ్వరిదేవి.

"ఎ...ఏమిటే ఇది!" అనగలిగింది తడారిన గొంతుకతో.

మస్తానమ్మ కదల్లేదు...తేలవేసిన గుడ్లతో అలాగే కూర్చుంది కాసేపు...! నెమ్మదిగా కళ్ళు మూసుకుని తలవిదిలించి మళ్ళీ కళ్లు తెరచి మామూలుగా చూసింది రాజేశ్వరిదేవికేసి.

"అమ్మగారూ! మీరా!—" సౌమ్యంగా లేచి అడిగింది మస్తానమ్మ.

తేలిగ్గా ఊపిరి పీల్చుకుంది రాజేశ్వరిదేవి

"ఏం చేస్తున్నావే?" అడిగింది కొంచెం ధైర్యంగా

సమాధానం చెప్పకుం.. ఆమె దగ్గరకు వచ్చి అమాయకంగా కళ్ళలోకి చూసింది మస్తానమ్మ.

"నిద్రపట్టలేదా అమ్మగారూ!" అడిగింది.

ఏదో అనబోయిన రాజేశ్వరిదేవి చెయి ఆప్యాయంగా పట్టుకుంది మస్తానమ్మ.

"పదండి అమ్మగారూ! మీ గదిలోకి వెళ్దాం..." అని ఆమె చెయి వొదిలి బయటకు దారితీసిందామె.

రాజేశ్వరిదేవి ఆమె వెంట తన గదిలోకి వెళ్ళింది.

బెడ్‌రూం తలుపులు లోపల్నించి గడియపెట్టి వచ్చి మంచంమీద కూర్చున్న రాజేశ్వరిదేవి కాళ్ళదగ్గర చతికిలబడింది మస్తానమ్మ.

"ఏమిటే ఇందాక ఆ గదిలో నువ్వు చేస్తున్నది?" అడిగింది రాజేశ్వరిదేవి మళ్ళీ.

తెల్లటిపలువరస చూపిస్తూ చిన్నపిల్లలా నవ్వేసిందిమస్తానమ్మ.

"ఏమిటోనమ్మగారూ! ఇందాక ఉరుముల శబ్దం విని ఉలిక్కిపడి లేచాను!" యట అంత జోరుగా గాలిపీస్తూవానకురుస్తుంటే ఎందుకో అలా కూర్చుండి పోయానమ్మగారూ! ... అలా కూర్చుంటే హాయిగా ఉంటుందనిపించింది" అంది నెమ్మదిగా.

ఆ మాటలు విని ఆశ్చర్యంగా మస్తానమ్మకేసి చూసింది రాజేశ్వరి

మస్తానమ్మ మాటలే అనుకుందిన్నాళ్ళు...ఆమె చేష్టలుకూడా వింతగానే ఉన్నాయి.

పనిలో చేరినరోజు వంటింట్లో గ్యాస్ లీక్ అవుతుంటే తన ప్రాణాలు కాపాడింది మస్తానమ్మ...ఆ తర్వాత పవన్‌కి ఆక్సిడెంట్ అవుతుందని కూడా ముందే తెలిసిపోయిందామెకు. అలాగే...స్నిగ్ధకు నెల తప్పిందన్న విషయంకూడా తెలుసుకో కలిగింది! ఇప్పుడీ వింత ప్రవర్తన...ఏమనుకోవాలి ఈ పిల్లను గురించి?.—

"జరగబోయేవన్నీ నీకు ముందే ఎలా తెలిసిపోతున్నాయే?!" అడిగిందామె చటుక్కున.

ఒక్కక్షణం ఆలోచించి పెదవి విరిచింది మస్తానమ్మ.

"ఏమోనమ్మా...నాకు తోచిందేదో చెప్పేస్తుంటాను" అని సన్నగా నవ్వి ఊరుకుంది.

మస్తానమ్మని పరిశీలనగా చూసింది రాజేశ్వరిదేవి. ఆ పిల్లి మాటలు యదార్ధమేననిపించిందామెకు.

ఆ పిల్లకు భవిష్యత్తులోకి చూడకలిగే శక్తేదో ఉంది కానీ, ఆ విషయం తనకే తెలియదు!...తెలియకుండానే మనసుకి తోచినదేదో చెప్పేస్తోంది!...ఆ పిల్ల పెదవి దాటినమాట నిజమవుతోంది. ఇలా ఏదో

ఒకటి చెప్పేయడమేకాని అది తను పలికిన మాట నిజమయిందో లేదో తెలుసుకోవాలని కుతూహలంకూడా లేదు.

"నువ్వు చెప్పినట్టే జరిగిందే మస్తానమ్మా! అమ్మాయికి నెల తప్పింది" అంది రాజేశ్వరిదేవి మంచంమీద పడుకుంటూ.

"అలాగా అమ్మగారూ!..." అంది మస్తానమ్మ.

"అయితే పుట్టబోయే ఆ పిల్లవాడు...?" సందేహిస్తూ అడిగింది రాజేశ్వరిదేవి.

"పెద్దయ్యగారేనమ్మా!"

ఆ సమాధానం వినగానే రాజేశ్వరిదేవికి ఏదోలా అయిపోయింది. నోరెండిపోయి మాట రాలేదు వెంటనే.

"అంత...ఖచ్చితంగా ఎలా చెప్తున్నావ్" అడిగింది చివరకి.

"అదేమిటమ్మా అలా అడుగుతున్నారు? పెద్దయ్యగారు మనింట్లో కాక మరెక్కడ పుడ్తారు!?" అంది మస్తానమ్మ మామూలుగా.

మస్తానమ్మ మాటలగురించి ఏమనుకోవాలో బోధపడలేదు రాజేశ్వరి దేవికి. పవన్ తండ్రి మళ్ళీపుడ్తాడని మాటవరసకంటుందా మస్తానమ్మ?... ఏమో?!

మస్తానమ్మకి మనసు విప్పి అన్నీ చెప్పేయలనిపించింది రాజేశ్వరి దేవికి ఒక్కక్షణం.

ఒక్కక్షణం మాత్రమే.

పదిహేనేళ్ళ క్రితం నాటి సంగతులన్నీ ఎలా వివరిస్తుంది తను ఆ పిల్లకి?

ఆ సంగతులన్నీ చెప్తే...తన భయం దేనిగురించో చెప్తే...ఆ పిల్లముందు తను చులకనై పోదా?.

"అమ్మగారూ!..." మస్తానమ్మ పిలుపుకి తిరిగి చూసింది రాజేశ్వరిదేవి.

"ఏమిటి!"

"అమ్మాయిగారు బిడ్డ కనడం మీకు ఇష్టంలేదుకదూ!" అంది మస్తానమ్మ నెమ్మదిగా.

రాజేశ్వరిదేవి గుండె వేగంగా కొట్టుకోసాగింది. తన మనసులో మాట చెప్పకుండా ఎలా పసిగట్టిందా పిల్ల!

"భయపడకండమ్మగారూ...బిడ్డ భూమ్మీద పడదు." అంది మస్తానమ్మ మళ్ళీ.

## 12

పవన్ నిద్ర లేచేప్పటికి ఏడు దాటింది.

"గుడ్ మార్నింగ్!" అని చిరునవ్వుతో కాఫీ అందించింది స్నిగ్ధ.

కాఫీ సిప్‌చేస్తూ నిద్రమత్తులోంచి బయటపడ్డాడు పవన్.

"అప్పుడే స్నానంకూడా చేసినట్టున్నావే!" అడిగాడు ఆమెకేసి చూస్తూ.

"స్నానం చేయకుండా వంట ఎలా చేసేది?" అంది స్నిగ్ధ నవ్వుతూ.

ఆశ్చర్యపోయాడు పవన్.

"వంట నువ్వు చేస్తున్నావా?"

"అత్తయ్యగారు బయటికి వెళ్తూ ఇవాళ వంట పనంతా నాకప్ప చెప్పారు?"

"ఇంత పెందలాడే ఎక్కడికెళ్ళిందమ్మ?" కాఫీ గ్లాసు ఖాళీచేసి లేచాడు పవన్.

"డాక్టర్ దగ్గరికి వెళ్తున్నానన్నారు..." అంది స్నిగ్ధ మంచం మీదున్న బ్లాంకెట్ మడతవేస్తూ.

"ఏమయిందమ్మకు?" కంగారుగా అడిగాడు పవన్.

"మేడ్చెల్‌లో ఎవరో డాక్టర్‌కి నెలకొకసారి చూపించుకోవాలట కదా!...నేను తోడు రానా అని అడిగితే ఫర్వాలేదని మస్తానమ్మతో వెళ్ళారు" అంది స్నిగ్ధ.

ఆ మాట విని తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాడు పవన్

"మేడ్చల్‌కా!...సదానంద్ పట్వర్ధన్ అని ఆయుర్వేదం డాక్టర్ ఒకాయన ఉన్నాడులే. ఆయనంటే అమ్మకు భలే గురి." చెప్పాడతను.

టూత్‌బ్రష్ తీసుకుని అతను బాత్‌రూంలోకి వెళ్ళాక వంటింటిలోకి వెళ్ళింది స్నిగ్ధ.

ఆ ఇంట్లో మొట్టమొదటి సారిగా వంట చేయబోతోంది తను... ఇంట్లో మరెవరూ లేకుండా పవన్‌తో ఉండటంకూడా మొదటిసారే! పవన్‌కి ఇష్టమయిన వంటలుచేసి అతడితో కలిసి కూర్చుని హాయిగా కబుర్లు చెప్తూ భోంచేయాలివాళ పవన్ ఆఫీసుకి వెళ్ళేదాకా అత్తయ్యగారు ఇంటికి తిరిగిరాకపోతే బావుణ్ణు

ఆలోచనల్లో పడిపోయి కూరలు తరుగుతున్న స్నిగ్ధని హఠాత్తుగా వెనకనించివచ్చి కౌగిలించుకున్నాడు పవన్. ఉలిక్కిపడి అతడికేసి తిరగబోయింది స్నిగ్ధ...వదలకుండా మరింత దగ్గరకు లాక్కుని మెడ మీద ముద్దిచ్చాడు పవన్. పరవశించి మత్తుగా కళ్ళు మూసుకుంది స్నిగ్ధ.

"ఏయ్! పవన్...ఏమిటిది!...అత్తయ్యగారు వచ్చేస్తారు."

పవన్ నవ్వేసాడు...స్నిగ్ధను తనకేసి తిప్పుకుని పెదాలమీద ముద్దెట్టుకున్నాక చెవిలో గుసగుసలాడాడు.

"నీకా కంగారు అనవసరం. మేడ్చల్ చాలా దూరం. ఆ వైద్యుడ్ని కల్సుకుని అక్కడే దగ్గర్లో ఉన్న మా చుట్టాల్ని పలకరించి నెమ్మదిగా మధ్యాహ్నం వొంటిగంటకిగాని రాదు అమ్మ."

"అయినా కిచన్‌లో ఏమిటీ ఆ ల్లరి?" అంది స్నిగ్ధమొహంకోపంగా పెట్టుకుంటూ.

"అలా అన్నావు బావుంది...అయితే స్టవ్ ఆఫ్ చేసి పద."

"ఎక్కడికి?"

"మన గదిలోకి అల్లరి ఇక్కడ బావుండదంటే అక్కడ!" అన్నాడు పవన్ నవ్వుతూ.

"ఛీ పో" అతడ్ని వెనక్కి తోసేస్తూ మళ్ళీ పని అందుకుంది స్నిగ్ధ!

పవన్ కదలకుండా అలాగే నిలబడి ఉండటం చూసి అడిగింది మళ్ళీ... "ఏం చూస్తున్నావ్?"

"నిన్నే! ... ఇలా నువ్వు ఇంటిపనులు చేస్తుంటే నాకెంత

బాగుందో తెలుసా? ... అమ్మ నిన్ను వంటపని చూసుకోమనడంటే తను పూర్తిగా రిలాక్స్ అయిందన్నమాట!" అన్నాడు పవన్ చిరునవ్వుతో.

..."నాకూ అదే అనిపించింది!...అసలు అత్తయ్యగారు ఒప్పుకుంటే పనులన్నీ నేనే చేసుకోగలను. ఆవిడ పూర్తిగా విశ్రాంతి తీసుకోవచ్చు." అంది స్నిగ్ధ.

"సరే నువ్వు త్వరగా పని ముగించుకుని రా నేను షేవ్ చేసుకుని స్నానంచేసి వస్తానీలోగా..." ఆమె బుగ్గమీద మరో చిన్న ముద్దిచ్చి అక్కడ్నించి కదిలాడు పవన్.

కిచన్‌లో పనిపూర్తిచేసుకుని గంటలో బయటకు వచ్చింది స్నిగ్ధ. హాల్లో పేపర్ చూస్తూ కూర్చున్న పవన్‌కేసి నడుస్తూ అంది.

"మరో పావుగంటలో భోజనం రెడీ అయిపోతుంది"

పేపర్ పక్కన పడేసి స్నిగ్ధ చెయి పట్టుకుని తనమీదకు లాక్కున్నాడు పవన్. అతడి కౌగిట్లో ఒదిగిపోతూ కంగారుగా వీధి తలుపుకేసి చూపిందామె.

"డోంట్ వర్రీ!...తలుపు గడియ వేసే ఉంది" అంటూ స్నిగ్ధ మెడమీద ఛాతీ మీద ముద్దులు కురిపించాడు పవన్.

"పవన్! ప్లీజ్!..." అని స్నిగ్ధ అభ్యంతరంచెప్తుండగానే ఆమెతో సోఫాకంబెన్‌లో వాలిపోయాడు పవన్. ఇరుకుగా ఉండి స్నిగ్ధ కిందకు జారిపోబోతుంటే ఆమెను దగ్గరకు లాక్కుని పెదాలు కలిపాడు.

"ఏమౌతోంది నీకివాళ?" అడిగింది స్నిగ్ధ తల వెనక్కి జరుపుకుంటూ సమాధానం చెప్పకుండా. ఆమె వక్షోజాలమీదకు చెయి పోనిచ్చాడు పవన్...అతడ్ని వారించబోయింది స్నిగ్ధ. ఆమె పెదాల మీద గట్టిగా ముద్దెట్టుకుంటూ బ్లౌజ్ హుక్కులు తీసేసాడతను.

పవన్ అప్పుడే షేవ్ చేసుకున్నాడేమో...అతను వాడిన ఆఫ్టర్ షేవ్ లోషన్ ఘాటయిన వాసనకి స్నిగ్ధ కళ్ళు మత్తుగా మూసుకున్నాయి! అతడికి మరింత దగ్గరకు జరిగి పడుకుందామె?

స్నిగ్ధని అలాగే పొదివి పట్టుకుని ఆమె చనుకట్టుని గుప్పెట్లో బంధించాడు పవన్. ఆమె పెదాలను పళ్ళతో నొక్కి పట్టుకుని పూర్తిగా

తడిపేసాడు.

అంతలోనే పెదాలను వొదిలేసి కిందకు జారాడు పవన్. మెడమీద నుంచి ఛాతీ వరకు ముద్దులు కురిపిస్తూ..అక్కడ ఆగిపోయాడు చన్మొనని వేలితో మీటుతూ ఆడుకో నారంభించాడు పవన్. అతడి చిలిపి చేష్టలకి ప్రాణం పోయినట్టయింది స్నిగ్ధకి.

"ఇవ్వాళ ఆఫీసుకి వెళ్ళవా?" అడిగింది తడారిన గొంతుతో.

"ఇలా మనమిద్దరమే ఇంట్లో వుంటే రొమాంటిక్‌గా ఉంది. ఇంత మంచి అవకాశాన్ని జారవిడుచుకుంటానా? పైగా నిన్న నువ్వు చెప్పిన శుభవార్తకి అభినందించాలి కదా..." అన్నాడు పవన్.

"అభినందిస్తావా? ఎలాగబ్బా?" అడిగింది స్నిగ్ధ అతడి జుట్టుని రేపుతూ.

"ఇలా" అంటూ ఆమెను పూర్తిగా ఆక్రమించుకున్నాడు పవన్.

రెండున్నర గంటలసేపు లోకాన్ని మరచిపోయారు ఇద్దరూ.

గడియారం పదకొండు కొడ్తుంటే మత్తుగా కళ్ళు తెరచింది స్నిగ్ధ. ఆమె భుజంమీద తలపెట్టుకుని పడుకున్నాడు పవన్.

"పవన్!"

"ఊ" అన్నాడతను అలాగే పడుకుని.

నడుం చుట్టూ ఉన్న అతడి చేతిని కడుపుమీదకి జరుపుకుంది స్నిగ్ధ.

"థాంక్యూ ఫర్ ద బేబీ!"

"సిల్లీ గర్ల్!"

"నీకు తెలియదు నా కెంత ఆనందంగా ఉందో ఇక్కడ...నా కడుపులో మనిద్దరి రూపం పెరిగి పెద్దదౌతోంది. మన ప్రేమ ఫలిస్తోంది. ఆ ఆలోచనే ఎంతో థ్రిల్లింగ్‌గా ఉంది నాకు. ఇంకెన్నాళ్ళు?...మరో రెండు వందల ముప్ఫయి ఎనిమిది రోజులే" అంది స్నిగ్ధ మనసులో లెక్కకడ్తూ.

స్నిగ్ధ కళ్ళలోకి తృప్తిగా చూసాడు పవన్. ఆమెలో ఇలాంటి మూడ్ రావాలనే ఆశిస్తున్నాడతను. అలాంటి మూడ్‌లోనే తను చెప్పబోయే

మాటలు అర్థంచేసుకో కలుగుతుంది తను.

"స్నిగ్ధ...మనకు పుట్టబోయే బాబు పెరుగుదల నీమీదే ఆధారపడి ఉంటుంది. నువ్వు ఆరోగ్యంగా ఉంటేనే వాడు ఆరోగ్యంగా పుడతాడు. నీకోసం కాకపోయినా మన బాబుకోసం నీ ఆరోగ్యాన్ని జాగ్రత్తగా చూసుకోవాలి. నీ ఆలోచనల ప్రభావం కూడా మన బాబుమీద పడుతుం దని తెలుసు కదా!...అందుకే మనసులో ఎటువంటి భయాలు టెన్షన్‌లు లేకుండా ఉండాలి నువ్వు." అన్నాడు పవన్ ఎంతో నెమ్మదిగా.

పవన్ మెడచుట్టూ చేతులు వేసి అతడి మొహాన్ని ఛాతీమీదకు లాక్కుంది స్నిగ్ధ.

"తెలుసు పవన్!...ఈ ఎనిమిది నెలలు హాయిగా బాబు గురించి కలలు కంటూ గడిపేస్తాను...అన్నట్టు మన బాబు పేరేమిటో తెలుసా నీకు?"...అడిగింది స్నిగ్ధ.

"అప్పుడే బాబుకి పేరుకూడా పెట్టేసావా? ఏం పేరు పెట్టావు?" అడిగాడు పవన్ ఆనందంగా నవ్వుతూ.

స్నిగ్ధ సమాధానం చెప్పబోయేంతలో...

దబదబ మని వీధి తలుపులు బాదారెవరో...

ఉలిక్కిపడి లేచారిద్దరూ...

"అత్తయ్యగారువచ్చేసారనుకుంటాను..." అందిస్నిగ్ధ కంగారుగా చీర సర్దుకుంటూ.

"అప్పుడే ఎలా వచ్చేస్తారూ..." అంటూ వెళ్ళి తలుపు గడియ తీసాడు పవన్.

ఎదురుగా తలుపుదగ్గర నిలబడ్డ రాజేశ్వరిదేవిని మస్తానమ్మని చూసి తడబడిపోయాడతను.

"అమ్మా...వచ్చేసావా?"

అతడికేసి కొంచెం ఆశ్చర్యంగా చూస్తూ లోపలికి నడిచింది రాజే శ్వరిదేవి.

"ఆఫీసుకి వెళ్ళలేదా నువ్వు?" అడిగిందామె.

"లేదమ్మా...ఇప్పుడు బయల్దేరుతున్నాను...మొన్న వెళ్ళొచ్చిన

టూర్ రిపోర్టు పూర్తిచేసి ఇవ్వాలి. అదే రాస్తూ ఉండిపోయాను" తడబాటు కప్పిపుచ్చుకుంటూ బెడ్‌రూంకేసి వెళ్ళిపోయాడు పవన్.

రాజేశ్వరిదేవి వెనక నిలబడ్డ మస్తానమ్మ స్నిగ్ధని అదోలా చూడ సాగింది. అంతవరకూ అక్కడ జరిగిందేమిటో తనకు తెలుసన్నట్టున్నాయి. ఆ చూపులు...నలిగిన తన చీరకేసి ఇబ్బందిగా ఒకసారి చూసుకుంది స్నిగ్ధ.

"అత్తయ్యగారూ...కాళ్ళుకడుక్కుని వస్తారా అన్నం వడ్డిస్తాను?" అంటూ వంటింటికేసి నడిచిందామె.

రాజేశ్వరిదేవితోపాటు సూర్యని భోజనం ముగించాడు పవన్.

"ఇక నేను ఆఫీసుకెళ్తానమ్మా...ఆలస్యం అవుతోంది "వాష్ బేసిన్‌లో చెయి కడుక్కుంటూ అన్నాడు పవన్.

స్నిగ్ధ తెచ్చిన బ్రీఫ్‌కేస్ అందుకుంటూ "సాయంత్రం త్వరగా వచ్చేస్తానులే" అన్నాడు నెమ్మదిగా.

చిరునవ్వుతో అతడిని సాగనంపి వెనక్కు తిరిగింది స్నిగ్ధ.

"అమ్మాయి! నువ్వు భోంచేయవా?" అడిగింది రాజేశ్వరిదేవి డైనింగ్ టేబిల్ దగ్గర్నించి లేస్తూ.

"ఇప్పుడు భోంచేస్తానత్తయ్యగారూ..." అంది స్నిగ్ధ కంచాలు జరుపుతూ.

"అన్నట్టు నీ కోసంకూడా మందు ఒకటి తెచ్చాను. ఆయుర్వేదం లేహ్యం. భోజనానికి ముందు ఒక స్పూన్ నిండా పుచ్చుకోవాలి. ఇప్పుడు నీ ఆరోగ్యానికి మంచిదని డాక్టర్‌గారిని అడిగి పట్టుకొచ్చాను" అంది రాజేశ్వరిదేవి.

"సరే పుచ్చుకుంటానత్తయ్యగారూ..." అంది స్నిగ్ధ.

అంతలో అటువైపు మస్తానమ్మ రావడంచూసి పిలిచింది రాజేశ్వరిదేవి.

"మస్తానమ్మా!...ఇందాక డాక్టరుగారు అమ్మాయి కోసం ఇచ్చిన మందు బల్లమీద పెట్టాను తెచ్చిపెట్టు" అంది.

లేహ్యం సీసా తీసుకుని రావడానికి రాజేశ్వరిదేవి గదిలోకి వెళ్ళింది

మస్తానమ్మ.

• • •

ఆఫీసులో కూర్చుని ఫైల్సు తిరగేస్తున్నాడు పవన్. అంతలో ఫోన్ మోగితే అందుకున్నాడు.

"హెల్లో"

అవతల వైపునుంచి అస్పష్టంగా ఎవరిదో కంఠం వినబడింది.

"హెల్లో! పవన్‌కుమార్ హియర్. ఎవరు మాట్లాడుతున్నారు" అడిగాడు కొంచెం బిగ్గరగా.

"నేను..." నీరసంగా వినబడింది సమాధానం. ఆ గొంతెవరిదో అర్థం చేసుకోడానికి మరికొంతసేపు పట్టింది పవన్‌కి.

స్నిగ్ధా!" కొంచెం కంగారుగా అడిగాడు.

ఊ...

"ఎక్కడ్నుంచి మాట్లాడుతున్నావ్? ఏమయింది?"

అవతల్నించి స్నిగ్ధ చెప్తున్న సమాధానాన్ని నిశ్చేష్టుడయి విన్నాడు పవన్...చివరికి అన్నాడు

"నువ్వు కంగారు పడకు! అక్కడే ఉండు పది నిమిషాల్లో వచ్చేస్తాను"

ఫోన్ పెట్టేసి బెల్ నొక్కాడు. తలుపు తెరుచుకుని అటెండర్ వచ్చి నిలబడ్డాడు.

"నేను సెలవుపెట్టి వెళ్ళిపోతున్నాను ...హాస్పిటల్‌లోనించి అర్జెంటు ఫోనేదో వస్తే వెళ్ళానని కాంతారావుగారికి చెప్పు." అంటూ లేచి గబగబ బయటికి నడిచాడు.

• • • •

హైదర్‌గూడాలో డాక్టర్ ప్రేమా థామస్ నర్సింగ్‌హోమ్ ముందు మోటార్ సైకిల్ పార్క్‌చేసి పరుగులాంటి నడకతో మెట్లెక్కి లోపలికి వెళ్ళాడు పవన్.

"డాక్టర్ ప్రేమాథామస్ ఉన్నారా?" అడిగాడు రిసెప్షనిస్టుని.

"మీరు స్నిగ్ధగారి కోసం వచ్చారా?" అడిగిందామె అతనెవరో

అర్థం చేసుకుని.

అవునని తలూపాడు పవన్.

"అయితే ఫస్ట్ ఫ్లోర్‌లో వార్డ్ నెంబర్ ట్వెంటీలో ఉన్నారు వెళ్ళండి. డాక్టర్‌గారు కూడా అక్కడే ఉన్నారు." అంది రిసెప్షన్ అమ్మాయి.

కంగారుపడిపోతూ మేడ మెట్లెక్కి పైకెళ్ళాడు పవన్...వార్డు కర్టన్ జరిపి లోపలికి చూసాడు. స్నిగ్ధ మంచంమీద పడుకుని ఉంది. మంచం పక్కన నిలబడ్డ లేడీ డాక్టర్ నర్సు సహాయంతో గ్లూకోజ్ డ్రిప్ పెడ్తోంది. ఆవిడే డాక్టర్ ప్రేమా థామస్ అయ్యుంటుందని ఊహించాడు పవన్.

"ఎక్స్‌క్యూజ్ మీ!" అంటూ లోపలికి వెళ్ళాడతను.

"ఎస్!..." అడిగింది డాక్టర్ ప్రేమ.

బెడ్‌మీద పడుకున్న స్నిగ్ధ తలకొంచెం పైకెత్తి పవన్‌ని చూసింది.

"మా వారు..." అంది డాక్టర్ ప్రేమతో.

"ఐసీ!...రండి మిస్టర్ పవన్. మీ మిసెస్ కంగారు పెట్టేసింది మమ్మల్నందర్నీ..." అని గ్లూకోజ్ డ్రిఫ్ పెట్టడం ముగించింది.

"ప్రాబ్లెమ్ ఏమిటి డాక్టర్!" అడిగాడు పవన్.

"నథింగ్ వెరీ సీరియస్!...మధ్యాహ్నం నించి ఎడతెరిపిలేకుండా వాంతులయ్యాయని కడుపులో నొప్పిగా ఉందని వచ్చింది స్నిగ్ధ. కొంచెం బ్లీడింగ్ కూడా అవుతోంది అందుకే ఇంజక్షన్ ఇచ్చి వెంటనే డ్రిప్ స్టార్ట్ చేసాను. ఇది పూర్తయ్యాక ఇంటి కెళ్ళిపోవచ్చు...బట్ కొంచెం జాగ్రత్తగా ఉండాలి. ఇవాళ రావడం కొంచెం ఆలస్యం అయ్యుంటే మిస్‌కారియేజ్ అయ్యుండేది" అని అక్కడ్నించి వెళ్ళిపోయింది డాక్టర్.

స్నిగ్ధ మంచం పక్కన కుర్చీ లాక్కుని కూర్చున్నాడు పవన్.

"ఇప్పుడెలావుంది డియర్!" అడిగాడు.

"ఫర్వాలేదన్నట్టు నెమ్మదిగా తలూపింది స్నిగ్ధ.

ఇలా ఎందుకు అయిందంటావు స్నిగ్ధా? ...పొద్దున మనిద్దరం సోఫాలో...దానివల్ల స్ట్రెయిన్ అయిందంటావా? అడిగాడు ఆమె తల నిమురుతూ.

పేలవంగా నవ్వి కాదన్నట్టు తలూపింది స్నిగ్ధ.

"మరి" మళ్ళీ అడిగాడు పవన్.

సమాధానం చెప్పకుండా కళ్ళుమూసుకుని పడుకుంది స్నిగ్ధ.

• • •

స్నిగ్ధను ఇంటికి తీసుకొచ్చేప్పటికి రాత్రి ఎనిమిదయింది.

స్నిగ్ధను పడుకోబెట్టి బెడ్‌రూంలోంచి బయటకు వచ్చిన పవన్‌ని తన గదిలోకి పిలిచింది రాజేశ్వరిదేవి.

గదిలోకిరాగానే అతడి చేతులు పట్టుకుని ఏడవసాగింది.

"ఏమయిందమ్మా!" కంగారుగా అడిగాడు పవన్.

"ఇదంతా నా మూలంగానే జరిగిందిరా! అంది రాజేశ్వరిదేవి కళ్ల తుడుచుకుంటూ.

"అదేమిటమ్మా?"

"పొద్దున్న డాక్టర్‌గారి దగ్గరకెళ్ళినప్పుడు అయన్నడిగి అమ్మాయి కోసం లేహ్యం తెచ్చాను. ఈ సమయంలో అమ్మాయి వొంటికి రక్తం పట్టాలి కదా అనే అభిప్రాయంతో తెచ్చానురా! కానీ ఆ మస్తానమ్మ పొర పాటున నా కోసం తెచ్చుకున్న కీళ్ళనొప్పి మందు అమ్మాయి కిచ్చేసింది నేను కూడా చూసుకోలేదు..." అంది అలాగే ఏడుస్తూ.

ఆమె భుజంచుట్టూ చేయివేసి మంచంమీద కూర్చోబెట్టాడు పవన్.

"దేవుడి దయవల్ల అమ్మాయికి ఏం కాలేదు కాబట్టి సరిపో యింది...ఒకవేళ గర్భం పోయి ఉంటే...!" గద్గదంగా అడిగింది రాజే శ్వరిదేవి.

ఆమె కళ్ళు తుడుస్తూ ఓదార్చాడు పవన్.

"నువ్వు బాధపడకమ్మా! అయినా స్నిగ్ధ అనారోగ్యానికి కారణం నువ్వు తెచ్చిన మందేనని ఎలా అనుకుంటున్నావు? ఆ మందు నువ్వు ఎప్పుడూ వాడేదే కదా!" అన్నాడు.

• • •

రాజేశ్వరిదేవితో మాట్లాడాక బెడ్ రూంలోకి వెళ్ళి స్నిగ్ధ పక్కన కూర్చున్నాడు పవన్.

"ఎలా ఉంది నీ కిప్పుడు?" అడిగాడు.

"కొంచెం వీక్‌గా ఉంది–అంతే." అతడికేసి చూస్తూ అంది స్నిగ్ధ.

తన మనసులోని మాటలు నిర్మొహమాటంగా అతడితో చెప్పాలని పించింది స్నిగ్ధకు...సుస్మిత తనకిచ్చిన సలహా అదేకదా! పవన్‌తో ఎప్పటి కపుడు మనసువిప్పి మాట్లాడుకుంటే టెన్షన్స్ చాలా మట్టుకు తగ్గిపోతా యంది కదా!

# 13

రాత్రి ఒంటి గంటయింది.

కాలనీలో నిర్మానుష్యంగా ఉంది. డాక్టర్ పీటర్ ఇసాక్ ఇంటి కాంపౌండ్ గోడ మీదనుంచి నల్లటి ఆకార మొకటి వీధిలోకి దూకింది... డాక్టర్ ఇసాక్ పెంపుడు కుక్క బ్రూటస్ అది. లాబ్రడార్ సీమ ప్రాంతా నికి చెందిన ఆ జాతి కుక్కల్ని వేటకి అడవుల్లోకి తీసుకెళ్తుంటారు.

భయమెరుగని జాతి ఆ కుక్కది.

బ్రూటస్ కాలనీలో విహారానికి బయల్దేరింది. రోడ్డు మధ్యనించి ఠీవీగా నడుస్తున్న బ్రూటస్‌కి చెత్తకుండీలోంచి ఏవో బయటకి పీక్కుని తింటున్న ఊరకుక్క ఒకటి కనిపించింది. తలతిప్పుకుని యధాలాపంగా ముందుకి నడిచింది బ్రూటస్.

బ్రూటస్‌ని చూడగానే కొంపలంటుకున్నట్టు మొరగసాగింది. చెత్త కుండీదగ్గరున్న కుక్క. అంతవరకూ ఎటున్నా మోకాసి సందుల్లోంచి మొరు గుతూ మరినాలుగు కుక్కలు బ్రూటస్ చుట్టుముట్టాయి. వాటిని ఖాతరు చేయకుండా నడిచింది బ్రూటస్. పంతులుగారి తెల్ల కుక్క నాయకత్వం వహించి ధైర్యంగా బ్రూటస్ మీదకు ఉరికింది మిగతా కుక్కలు దాని తోడుకు పరుగున వచ్చాయి.

అంతవరకూ పట్టించుకోని బ్రూటస్ 'గుర్రు' మని వెనక్కి తిరి గింది. అంతే. గోలపెడ్తున్న కుక్కలన్నీ బిత్తరపోయి వెనక్కి తగ్గాయి. పంతులుగారి కుక్క పాపం అప్పటికే బ్రూటస్‌కి మరీ దగ్గర చేరుకోవ డంతో అది మాత్రం పట్టుబడి పోయింది! కాలనీ దద్దరిల్లేలా పెద్దగా మొరిగి పంతులుగారి కుక్కని ఒక్క దెబ్బతో నేలకూల్చింది బ్రూటస్.

రోడ్డుమీద పడి దొర్లుతూ కుయ్యోంమని క్షమాపణలు చెప్తున్నట్టు అరవసాగిందా కుక్క. దాన్ని మరికాసేపు అలాగే నొక్కిపట్టి వొదిలేసింది బ్రూటస్. బ్రూటస్ వొదిలేయగానే తోకముడుచుకుని దూరంగా పరుగు తీసింది పంతులుగారి కుక్క. చెత్తకుండీ దగ్గర నిలబడ్డ కుక్క దాన్ని పరామర్శించడానికి ముందుకి వెళ్తే తప్పంతానీదే అన్నట్టు కసిరికొట్టింది.

ఆ తర్వాత బ్రూటస్ జోలికి పోలేదు ఆ కుక్కలు.

అక్కడ్నించి రాజేశ్వరిదేవి ఇంటిసందులోకి తిరిగింది బ్రూటస్.

మిగతాసందుల్లో అన్ని కుక్కలున్నా ఆ సందులో ఒక కుక్క పిల్ల కూడా లేదు ఎందుకో.

ఆ సందులోకి రాగానే ఏదో అనుమానం వచ్చినట్టు నడక వేగం తగ్గించింది బ్రూటస్. గాలిలో వాసనేదో పసికడ్తున్నట్టు తల అటూ ఇటూ తిప్పిందొకసారి. నెమ్మదిగా నడచి వెళ్తూ రాజేశ్వరిదేవి ఇంటి గుమ్మం దగ్గర ఆగిపోయింది.

నిటారుగా నిలబడి నిక్కపొడచిన చెవులతో ఆ గుమ్మంకేసే చూసింది.

రెండడుగులు వెనక్కివేసి గుర్రుమంది...

మానవ జ్ఞానేంద్రియాలకు అచేత మయినదేమిటో అక్కడ గ్రహించగలిగింది బ్రూటస్।...

...భయంగా వెనక్కి తగ్గుతూ ఆకాశంలోకి చూసి బిగ్గరగా అరుపొకటి అరచింది...ఎవరో తనని అటాక్ చేస్తున్నట్టుగా కిందకు వొంగిపోయి అక్కడ్నించి పరుగు లంఘించింది। ఎవరో తరుముతున్నట్టుగా ఆ వీధి వొదిలి పారిపోయింది.

సరిగ్గా ఆ సమయంలో...

మెట్లకింద చీకటి గదిలో...మస్తానమ్మ మంత్రోచ్చారణ మొదలెట్టింది।...

గది మధ్యన విచిత్రమయిన ముగ్గు ఒకటి వేసుకుని దాని మధ్యభాగంలో కూర్చుందామె.

అలా ఎందుకు కూర్చుందో...ఆమెకే సరిగ్గా తెలియదు.

కళ్ళు మూసుకుని ఏకాగ్రతతో మంత్రం జపిస్తున్న మస్తానమ్మ

మనస్సంతా ద్వేషభావంతో నిండి ఉంది.

స్నిగ్థ నాశనమయిపోవాలని కోరుకుంటోందామె మనసు.

అంతదారుణంగా ఎందుకు ఆలోచిస్తోందో కూడా ఆమెకు తెలియదు.

స్నిగ్థ తన కపకారం చేయలేదు. అయినా తను ఆమె వినాశనాన్ని కోరుకుంటోంది.

మస్తానమ్మ తనుకి చేపట్టిన "సిఫిలి అమల్" ఎటువంటి దారుణ మయిన పరిణామాలకి దారితీస్తుందోనన్న ఆలోచన లేదు. తను చిన్న పట్నించినేర్చుకున్న విద్య ఉపయోగించాలని మాత్రమే అనుకుంటోందామె.

అందుకు స్నిగ్థ ఆహుతి అయిపోతుందన్న చింతలేదామెకు.

ఖబీస్‌ని బంధించకలగడం తను సాధించిన మొదటి విజయం అయితే...

స్నిగ్థని నాశనంచేసి సైతానుని ప్రసన్నుడిని చేయడం రెండవ విజయం అవుతుంది.

అభం శుభం ఎరుగని పసివాడి చేతికి మారణాయుధం ఇస్తే ఎలా ఉంటుందో సరిగ్గా అలాగే ఉంది మస్తానమ్మ పరిస్థితి!

కానీ... ...

అంతలోనే...

మస్తానమ్మ మస్తిష్కంలో అలజడి లాంటిది ప్రారంభమయి... క్రమంగా... అది అంతర్యుద్ధంలా తయారయింది.

అంతవరకూ ... నిశ్చలంగా, రాతిబొమ్మలా జుట్టు విరబోసుకుని కూర్చున్న మస్తానమ్మ శరీరం కంపించింది...

అంతవరకూ... నికృష్టమయిన మంత్రోచ్చారణ చేసిన ఆమె పెదాలనించి హృదయ విదారకమయిన ఆర్తనాదం వెలువడింది.

అనిర్వచనీయమయిన మనోవేదన ... గుండెల్ని పిండేస్తుంటే పెద్దగా మూలుగుతూ అటూ ఇటూ ఊగిపోయిందామె!

ఇక తట్టుకోలేక—

కిందపడి పెద్దగా ఏడుస్తూ దొర్లసాగింది... అలా దొర్లుతూ కాళ్లు కొట్టుకుంటుంటే... అంతకు ముందు గదిమధ్యన వేసిన ముగ్గు పూర్తిగా

చెరిగిపోయింది!...దీపానికి కాలు తగిలి అది ఆరిపోయింది!...

చాలాసేపు అలాగేదొర్లి ... చివరికి సొమ్మసిల్లి పడుకుంది మస్తానమ్మ...చీర తొడలదాకా పైకి జరిగిపోయిందన్న ధ్యాసకూడా లేదామెకు. అలాగే కళ్లుమూసుకుని పడుకుని సన్నగా మూలుగుతోందామె. విరబోసిన ఆమెజుట్టు తనంతట తాను జడలు కట్టింది.

సృష్టి, స్థితి, లయ సమన్వితమయినది ఈరస జగత్తు!...స్నిగ్ధ వినాశనాన్ని అంతవరకు కోరుకున్న మస్తానమ్మలో అంతర్గతంగా దాగి ఉన్న స్థిరలయాన్ని ప్రతిఘటించింది.

సృష్టికీ లయానికీ మధ్యసమతౌల్యం సాధించడం వల్లనే జగద్వ్యాపారం కొనసాగుతోంది!

జగత్తుకీ, ప్రకృతికీ...అందులో భాగమయిన మనిషికి కూడా ఈ సూత్రం వర్తిస్తుంది.

మస్తానమ్మ విషయంలో జరిగింది కూడా అదే!...

అ. ఉ. మ్!

ఓం!

• • •

ఆ రోజు సాయంత్రం ఏడు గంటలయినా పవన్ ఆఫీసునించి రాలేదని ఆత్రుతగా గేటుకేసి చూస్తూ కూర్చుంది స్నిగ్ధ.

క్రితం రోజురాత్రి తొందరపడి పవన్ముందు మాట జారింది తను. పవన్ దగ్గర ఏ విషయం దాచకూడదనుకుని మనసువిప్పి మాట్లాడిందే కాని అతడి మనసుని నొప్పించడం తన అభిమతం కాదు. పొద్దున నిద్ర లేవగానే అతడికి సంజాయిషీ చెప్పుకోవచ్చనుకుంది కానీ, నిద్రమాత్రల ప్రభావంలో ఉండిపోయి త్వరగా మెలకువరాలేదు! పవన్ ఆఫీసుకి బయల్దేరబోతూ తనని నిద్రలేపి వెళ్ళిపోయాడు...ఇప్పుడతను ఇంటికి రాగానే అతడికి క్షమాపణలు చెప్పుకోవాలి!

అసలు...

రాజేశ్వరిదేవి గురించి ఎటు వంటి ఆధారం లేకుండా ఎందుకలా ఊహించుకుంది తను? అయిష్టం అంటూ ఉంటే తనపట్ల ఉంటుంది కానీ,

పుట్టబోయే మనవడిపైన కక్ష ఎందుకుంటుంది? ... ఇంత దారుణమయిన ఆలోచనలకు మనసులో తావివ్వడమేకాక, పవన్ తన అనుమానాల్ని సమర్థిస్తాడని ఎలా అనుకుంది తను?

అంతలో...గేటులోంచి పవన్ మోటర్ సైకిల్ రావడం చూసి లేచి నిలబడింది స్నిగ్ధ.

మోటర్ సైకిల్ పార్కు చేసి వరండాలోకి మెట్లెక్కి వచ్చాడుపవన్.

"గుడ్ ఈవినింగ్! ఆలస్యమయిందేం!" పలకరించింది స్నిగ్ధ.

"మ్యూజియంలో పనేదో ఉండి లేటయింది... నీకిపుడు ఒంట్లో ఎలా ఉంది? అడిగాడు పవన్ లోపలికి నడుస్తూ.

"ఫర్వాలేదు" అంది స్నిగ్ధ అతడ్ని అనుసరిస్తూ.

పవన్ ధోరణి పొడిగా ఉందనిపించి సంజాయిషీ చెప్పుకోడానికి అది సమయం కాదనుకుంది స్నిగ్ధ.

భోజనాల దగ్గర కూడా పవన్ ముభావంగానే ఉన్నాడు. ఇక ఆ రోజుకి తనా ప్రస్తావన ఎత్తడం కూడా మంచిది కాదేమోఅనుకుంది స్నిగ్ధ.

రాత్రితొమ్మిదిన్నర దాటాక లైట్ ఆర్పేసి స్నిగ్ధపక్కన వచ్చి పడుకున్నాడు పవన్.

"స్నిగ్ధా! నీతో కొంచెం మాట్లాడాలి!" అన్నాడతను.

"ఏమిటి?" అతడికేసి చూస్తూ అడిగింది స్నిగ్ధ.

వెంటనే మాట్లాడలేదు పవన్. మంచంపైన తిరుగుతున్న ఫ్యాన్‌కేసి చూస్తూ పడుకున్నాడు.

"బిర్లా ఆర్కియాలాజికల్ అండ్ కల్చరల్ సొసైటీ ఛైర్మన్‌ని కల్సుకున్నానివాళ ... ఆయనొక ఆఫర్ ఇచ్చారు...యూకేలో యూనివర్సిటీ ఆఫ్ న్యూక్యాసిల్ అపాన్‌టైన్‌లో విజిటింగ్ ప్రొఫెసర్‌గా నన్ను వెళ్ళమంటున్నారు." అన్నాడతను.

"...ఏమన్నావు నువ్వు?"

"యూ.కే.లో అయిదారు నెలలుండాల్సి ఉంటుంది. నిన్ను కూడా నాతో తీసుకెళ్ళవచ్చా అని అడిగాను. యూనివర్సిటీకి ఉత్తరం రాసి కనుక్కుంటానన్నాడాయన. అక్కడ్నించి అప్రూవల్ వస్తే ఇద్దరం వెళ్ళాల్సి

ఉంటుంది." అన్నాడు పవన్.

స్నిగ్ధ లేచి కూర్చుంది.

"మనిద్దరం వెళ్ళిపోతే మరి ఇక్కడ అత్తయ్యగారు...ఒంటరిగా?" అని ఏదో అనబోయింది స్నిగ్ధ.

దెబ్బతిన్నవాడిలా ఆమెకేసి చూసాడు పవన్.

"...ఫర్వాలేదులే...ఆరునెలలే కదా..."

"ఆరునెలలు ఆవిడ ఒంటరిగా ఎలా ఉంటారు పవన్?"

"తప్పదు స్నిగ్ధా. ఇలాంటి మంచి అవకాశం మళ్ళీరాదు కాబట్టి నేను వెళ్ళక తప్పదు...ఇక నువ్వు కూడా ఇక్కడుండకపోవడమే మంచిది." అన్నాడు పవన్.

బెడ్‌లైట్ మసక వెలుతురులో అతడి మొహంలోని భావాలను చదవడానికి ప్రయత్నించింది స్నిగ్ధ.

"...మన పెళ్ళయ్యాక మనింటిని ఆదర్శవంతంగా తీర్చిదిద్దాలని ఆశపడ్డాను. అమ్మకు నువ్వు కంపెనీ ఇస్తావని ... ఆమె సాంగత్యంలో నీకు తల్లి లేని లోటు తీరుతుందని అనుకున్నాను...కానీ ... ఇది జరిగేది కాదని అర్థమైంది నాకు. ఇక మీ ఇద్దరి మధ్య..."

"ప్లీజ్ పవన్!" అంటూ అతడి మాటకు అడ్డు వచ్చింది స్నిగ్ధ.

"నిన్న నేను చెప్పిందాన్ని మనసులో పెట్టుకుని మాట్లాడుతున్నావు కదు ఇలా' అత్తయ్యగారి గురించి నేనెందుకలా అన్నానో నాకే తెలియడం లేదు. నా మాటలు నిన్నెంతగా హర్ట్ చేసాయోనని నిన్నట్నించి కుమిలిపోతున్నాను...పవన్! అత్తయ్యగారికి నేనంటే ఇష్టంలేదని ఇప్పటికీ అంటాను. నేనెంత ప్రయత్నించినా ఆవిడకు ఇంతకంటే దగ్గర కాలేకపోతున్నాను. కానీ...ఇప్పుడు నీతోపాటు విదేశాలకు బయల్దేరితే ఈ పరిస్థితి మరింత అధ్వానంగా తయారవ్వదంటావా! మా ఇద్దరి మధ్య నువ్వు ఆశిస్తున్న అవగాహన ఏర్పడాలి అంటే నేను ఇక్కడే... ఆవిడ తోనే ఉండటం మంచిది కాదంటావా?" అని ఆగింది స్నిగ్ధ.

"అయితే...నేనుకూడా వెళ్ళను..." అన్నాడు పవన్.

"నో! పవన్...నువ్వీ అవకాశం వొదులుకోవద్దు... అత్తయ్య

గారికి నేను దగ్గర కావాలంటే ఇంతకంటే చక్కటి అవకాశం మరే ముంటుంది? అయినా ఎన్నాళ్ళు? ఆరు నెలలేకదా!...చూస్తుండగానే అయి పోతాయి. నువ్వొచ్చేప్పటికి...నా వొళ్ళో మన బాబు ఉంటాడు. అంతే కాదు ఆ తర్వాత నాకూ అత్తయ్యగారికి పొత్తు కుదరడంలేదన్న బాధ కూడా ఉండదు నీకు!" అంది స్నిగ్ధ.

ఆమె మాటలు విని ఆలోచనలో పడిపోయాడు పవన్.

"నువ్వుచెప్తున్నది బాగానే ఉంది స్నిగ్ధా...అయినా, నిన్ను ఇక్కడ ఒంటరిగా వొదిలిపెట్టడానికి మనస్కరించడంలేదు..." అన్నాడు కాసేపాగి.

"ఇక దీని గురించి ఆలోచించకు పవన్. మేక్ అప్ యువర్ మైండ్!...నువ్వు యూ.కె. వెళ్తున్నావ్. అంతే! ఇక్కడి విషయాలు నాకు వొదిలేయి. నా ఆరోగ్యం గురించికూడా నీకు బెంగ అనవసరం. ఏదయినా కావల్సితే నా ఫ్రెండు సుస్మిత ఉందికదా!" అని మళ్ళీ అతడికి హామీ ఇచ్చింది స్నిగ్ధ.

"సరే..." అన్నాడు పవన్ అస్పష్టంగా.

ఆ తర్వాత కాసేపు ఇద్దరూ మౌనంగా ఉండిపోయారు.

పవన్‌ని విదేశానికి ఒంటరిగా వెళ్ళమని కన్విన్స్ చేసిందేకాని, స్నిగ్ధ మనసులో ఏదో సందేహంగానే ఉంది.

పవన్ లేకుండా తను ఒంటరిగా ఉండకలదా అసలు? రానున్న ఎనిమిది నెలలు ఎలా గడుస్తాయి?

గర్భంలో రూపం దిద్దుకుంటున్న బిడ్డను ఊహించుకుని తను ఒక్కతే మురిసిపోవాల్సిందే!...తనతో ఆ ఆనందాన్ని పంచుకోడానికి పవన్ పక్కనుండడు. కష్టం సుఖం చెప్పుకుని సేద తీర్చుకోడానికి అతడి వెచ్చటి కౌగిలి ఉండదు తనకు.

అయినా...తప్పదు.

పవన్‌ని సంతోష పెట్టాలంటే...అతడికి టెన్‌షన్స్ ఏవీలేకుండా చేయాలంటే ముందు రాజేశ్వరిదేవిని మంచి చేసుకోక తప్పదు తనకు. పవన్‌తో విదేశాలకి వెళ్ళిపోతే అది సాధ్యపడదు.

"పవన్!" పిలిచింది స్నిగ్ధ.

"ఊఁ!"

"నువ్వు ఎపుడు బయల్దేరవలసి ఉంటుంది?" అడిగింది నెమ్మదిగా.

"ఆ యూనివర్శిటీవాళ్ళకి చాలా తొందర ఉన్నట్టుంది. ఇప్పుడు నిన్ను తీసుకెళ్ళేమాటలేదు కాబట్టి మనవైపునించి ఆలస్యం ఉండదు ఈ నెలాఖరుకి బయల్దేరాల్సి ఉంటుందేమో!" అన్నాడు పవన్.

నెలాఖరు!

అంటే? మరో పదిహేను రోజులే.

• • •

హైదరాబాద్ ఎయిర్‌పోర్టులో హడావిడిగా ఉంది...

న్యూఢిల్లీ కౌంటర్‌లో టిక్కెట్ చూపించి బోర్డింగ్ కార్డు తీసుకుని స్నిగ్ధ, రాజేశ్వరిదేవి కూర్చున్న కుర్చీలకేసి వచ్చాడు పవన్.

అతడు వచ్చి పక్కన కూర్చోగానే కన్నీళ్ళు తుడుచుకుంది రాజేశ్వరిదేవి.

"అక్కడికి చేరగానే ఉత్తరం రాస్తావుకదా కన్నా?" అడిగిందామె.

రాస్తానని తలూపాడు పవన్.

"నీ ఆరోగ్యం జాగ్రత్త. మందులు నియమం తప్పకుండా వాడుతుండమ్మా..." అన్నాడు పవన్.

ఎయిర్‌పోర్టు స్పీకర్లో ఢిల్లీ ప్రయాణీకులని సెక్యూరిటీ చెక్‌కి వెళ్ళమని అనౌన్స్‌మెంట్ విని రాజేశ్వరిదేవి కాళ్ళకు దండంపెట్టి లేచాడు పవన్.

స్నిగ్ధ చెయి పట్టుకుని "వెళ్ళిరానా" అని అడిగాడు.

చిరునవ్వు తెచ్చిపెట్టుకుంటూ తలూపింది స్నిగ్ధ.

"నాకిలా వెళ్ళడం ఏమీ బాలేదు!" అన్నాడు ఆమెకు మాత్రమే వినబడేలా...

"నువ్విలా మాట్లాడితే నాకేడుపు వచ్చేస్తుంది. ప్లీజ్! ఇక్కడ అందరి ముందు నన్నేడిపించకు" అంది స్నిగ్ధ.

"మొహం అదోలా పెట్టుకుని తల్లికేసి తిరిగాడు పవన్. అతడి

బాదేమిటో అర్థమయినదానిలా వీపునిమిరింది రాజేశ్వరిదేవి.

"అమ్మాయి గురించి నువ్వు కంగారుపడకురా కన్నా...రేపే ఆ లేడీ డాక్టర్ దగ్గరికిమరోసారి తీసుకెళ్తాను. ఆవిడ ఇచ్చిన మందులు దగ్గ రుండి అమ్మాయికిస్తాను సరేనా?" అంది...

అంతలో ఆర్కియాలజీ డిపార్టుమెంట్ డైరెక్టర్ సిన్హా, మరో నలుగురు ఆఫీసర్లతో అక్కడికి వచ్చి పవన్ మెడలో పూలదండ వేసాడు.

"ఆల్ ది బెస్ట్ అండ్ హ్యాపీజర్నీ" అన్నాడతను పవన్‌కి షేక్ హాండ్ ఇస్తూ.

పవన్ కొంచెం పక్కకు జరిగి తన సహోద్యోగులతో మాట్లాడ్తూ నిలబడ్డాడు.

ఎయిర్‌పోర్టు అనౌన్సర్ ఢిల్లీ ప్రయాణీకులకి 'లాస్ట్‌కాల్' ఇచ్చింది.

అందరికీ వీడ్కోలుచెప్పి స్నిగ్ధ దగ్గరకు వచ్చాడు పవన్.

"బై బై డియర్!...నా రిక్వెస్ట్ మరోసారి కన్సిడర్ చేస్తావుకదూ!" అడిగాడు సీరియస్‌గా మొహం పెట్టుకుని.

"ఏమిటది?"

"వీలైతే నాకోసం అమ్మాయినే కనాలి నువ్వు?"

ఆ మాటకి చిన్నగా నవ్వేసింది స్నిగ్ధ.

"ఇది నీ కోసంకాదు! కేవలం నాకోసమే...మనకు బాబేపుడ్తాడు!"

"సరే చూద్దాం!" అంటూ సెక్యూరిటీ చెక్‌కేసి నడిచాడు పవన్.

అతనలా నడిచి వెళ్ళిపోతుంటే నీరసంగా అక్కడున్న కుర్చీలో కూర్చుండిపోయింది స్నిగ్ధ.

దుఃఖం పొంగి కన్నీళ్ళలా చెంపలమీదుగా జారింది...అంతవరకు ప్రదర్శించిన ధైర్యం ఎటుపోయిందో?

• • • •

ఎయిర్‌పోర్టునించి తిరిగివచ్చాక రాజేశ్వరిదేవితో కలిసి కూర్చుని భోంచేసింది స్నిగ్ధ. భోజనాలయ్యాక టేబిల్ శుభ్రంచేసి బెడ్‌రూంలోకి నడిచింది స్నిగ్ధ.

పవన్ జయల్దేరిన హడావిడిలో పొద్దున్నించి గది సర్దనేలేదు.

అంతా అస్తవ్యస్తంగా ఉందక్కడ.

మంచంమీద పవన్ విప్పిపడేసిన చొక్కా అందుకుని అప్రయత్నంగా దాన్ని ముద్దెట్టుకుంది స్నిగ్ధ. పవన్ వాడే కొలోన్. వాసనతో అతడి శరీర పరిమళం కలసి తనువు పులకరింప చేసింది. స్నిగ్ధకి. ఆ పరిమళాన్ని ఆఘ్రాగిస్తూ, మంచంమీద బోర్లా పడుకుంది. అలా కళ్ళు మూసుకుని పడుకుని పవన్ తనకెంతో దగ్గర్లో ఉన్నట్టు ఫీలయింది... క్రితంరోజు రాత్రి అతడితో గడిపిన మధుర క్షణాలు గుర్తుకొచ్చాయి.

ఎంత హాయిగా గడచిపోయింది క్రితంరోజు రాత్రి!

మంచంమీద డల్‌గా కళ్ళుమూసుకుని తను పడుకుని ఉంటే పక్కన చేరాడు పవన్.

"స్నిగ్ధా...రేపు సాయంత్రం వెళ్ళిపోతున్నాను నేను...సెండ్ ఆఫ్ పార్టీ ఇవ్వవా?" అని చెవిలో గుసగుసలాడాడతను.

అతడికేసి తిరిగి అర్థంకాలేదన్నట్టు చూసింది తను.

"ఏమిటి తెలిపీ అలా చూస్తున్నావు? అర్థంకాలేదా? నాకు సెండ్ ఆఫ్ పార్టీ ఎలా ఇవ్వాలో తెలియదా నీకు?" అని తను కోరుకుంటున్న దేమిటో నెమ్మదిగా చెప్పాడు పవన్. అతను చెప్పిందంతా చిరునవ్వుతో వింది తను.

"మరో ఆరునెలలు గుర్తుండిపోయేంత థ్రిల్లింగ్‌గా ఉండాలి ఈ అనుభవం." అన్నాడు పవన్ మళ్ళీ.

పవన్ విచిత్రమయిన కోరిక ఏమిటో అర్థంకాలేదు తనకు వెంటనే. అతడు కోరుకున్నట్టు నిశ్చలంగా పడుకోవడంలో థ్రిల్ ఏముంటుందీ అనుకుంది మొదట్లో.

పవన్ ఒక్కొక్కటంటూ తన బట్టలన్నీ విప్పేస్తుంటే అభ్యంతరం చెప్పలేదు తను...నగ్నంగా పడుకున్న తనని పైనించి కిందదాకా అతను చూస్తుంటే సిగ్గు ముంచుకొచ్చింది.

"లైట్ ఆఫ్ చేయవా?" అడిగింది తను.

తల అడ్డంగా ఊపాడు పవన్.

"నీ శరీరంలోని అణువణువు ఇవాళ చూడాలి నేను...నీ శరీరం

వొంపులు...దానిమీదున్న చిన్నచిన్న పుట్టు మచ్చలతోసహా నాకు గుర్తుండాలి....ఇదిగో ఈ పుట్టుమచ్చ నాకెంత ఇష్టమో!..." అంటూ ముందుకు వొంగి తొడమీదున్న మచ్చమీదనోరుపెట్టి చిన్నగా కొరికాడు పవన్.

"పవన్ ప్లీజ్..." అంటూ లేచి కూర్చోబోయింది తను.

తనని లేవనివ్వకుండా పడుకోపెట్టేసాడతను.

"అదిగో అదే వద్దన్నాను...నో రియాక్షన్స్! నేనేం చేసినా రియాక్ట్ కాకుండా పడుకోవాలి నువ్వు...నీ బాడీని పూర్తిగా నాకప్పచెప్పి పడుకోవాలి" అని తన తొడలమీద ముద్దులిస్తూ నెమ్మదిగా పైకి కదిలాడు.

అతడి చిలిపి చేష్టలకు తట్టుకోలేకపోయింది తను. అతడ్ని తన మీదకు లాక్కోవాలని...కౌగలించుకోవాలని మనసు కోరుకుంటున్నా... బలవంతంగా ఆ కోరికను అణచుకుంది తను.

ఇవాళ పవన్ కోరుకున్నట్టే ఉండాలి తను. ఈ బెడ్‌రూంగేంలో అతడితో పూర్తిగా సహకరించి అతను కోరుకుంటున్న ఆ థ్రిల్ అందించాలి.

పవన్ తనని రియాక్ట్‌కాకూడదన్నాడు కాబట్టి తలగడాని గట్టిగా గుప్పెట్లలో పట్టుకుని కళ్ళుమూసుకుంది తను.

ఆ తర్వాత పవన్ చేసిన అల్లరి ఇంతా అంతాకాదు ఒళ్ళంతా తడిమి తడిమిచూసి ముద్దాడాడు.

బొమ్మలా పడుకున్న తనమీదకు వాలిపోయి అతడు ఆడుకుంటుంటే పిచ్చెక్కినట్టయింది తనకి. వెచ్చటి అతడి శరీరం తనమీద కదుల్తుంటే ఆనందం పట్టలేక పోయింది తను. పవన్‌పట్ల ప్రేమ అవధులు దాటిపోతుంటే అతడికి వెంటనే దగ్గరవ్వాలని తహతహలాడి పోయింది తను.

"ప్లీజ్ పవన్...ఇకనేను ఇలా పడుకోలేను." అందితను అతడికి నమస్కారం పెడుతూ.

"రూల్స్ పాటించకపోతే నేను ఒప్పుకోను!...నేను అడిగినట్టుం టేనే నాకు నువ్వు ప్రేమతో వీడ్కోలు చెప్పినట్టు...లేకపోతే నామీద

నీకు ప్రేమ లేనట్టే" అన్నాడతను నవ్వుతూ...చేసేదిలేక మెదలకుండా పడుకుంది తను...పవన్ పూర్తిగా దగ్గరయిపోతుంటే కింద పెదవి పళ్ళ మధ్య గట్టిగా పట్టుకుని కళ్ళు మూసుకుంది తను. పవన్ కౌగిట్లో ఇమిడి పోయి, మస్తిష్కంలో 'బ్లాస్టింగ్' లాంటిదవుతున్నట్టు అనిపించి ఉక్కిరి బిక్కిరయిపోయింది తను.

తనని పూర్తిగా ఆక్రమించుకున్నాక నవ్వుతూ చెప్పాడు పవన్.

"యూ కెన్ రిలాక్స్ నౌ!...నాక్కావలసిన థ్రిల్ నాకు దొరికింది"

అంతే...అంతవరకూ అతి కష్టంమీద అణచుకున్న కోరికలన్నీ ఒక్కసారిగా విజృంభించాయి. పవన్‌ని గట్టిగా కౌగిలించుకుని పెనవేసు కునిపోయింది తను.

"పవన్...మైలవ్!...ఐ అడర్ యూ...ఐవర్‌షిప్ యూ...నన్ను వొదిలిపెట్టవద్దు...అంది తను బిగ్గరగా!...

ఆ తర్వాత...సొమ్మసిల్లి అతడి భుజంమీద తల పెట్టుకుని పడు కున్నపుడు అనుకుంది తను...పవన్ తనచేత ఆడించిన బెడ్‌రూంగేం కేవలం అతడి థ్రిల్ కోసం కాదు...

ఆ అందమయిన అనుభవం తను కూడా ఎప్పటికీ మరచిపో లేనిది!!

......

......

క్రితంరోజు రాత్రి జరిగిన ఆ సంఘటనని తలచుకుంటూ...అను కోకుండా ఏడవసాగింది స్నిగ్ధ!...

రోజులుకాదు.వారాలుకాదు! ఆరు నెలలు! ఎలా భరిస్తుంది ఎడబాటు?

పవన్ చెప్పినట్టు వెంటనే ఒప్పుకుని ఉంటే అతడితో ఆరునెలలు యూ.కే.లో గడిపే అవకాశందొరికేది! ఆ అవకాశాన్ని జారవిడుచుకున్న తనకి తగిన ప్రతిఫలం దొరుకుతుందా? రాజేశ్వరిదేవితో సఖ్యత ఏర్పడు తుందా.

ఏమో!!

ఆలోచనల్తోనే నిద్రలోకి జారుకుంది స్నిగ్ధ.

రాత్రి ఒంటి గంట ప్రాంతాల్లో ఎందుకో మెలకువ వచ్చి లేచింది స్నిగ్ధ అప్రయత్నంగా ఈశాన్యం మూలకేసి చూసింది.

ఎప్పటిలా...ఎత్తినిలిపిన దూలంలా...ఆ ఆకారం అక్కడే అస్పష్టంగా కనిపిస్తోంది! తనని చూసి ఆ ఆకారం నవ్వుతున్నట్టనిపించింది.

నవ్వదూమరి?!

పవన్‌కి తను దగ్గరకావడం సహించలేని దానికి ఇలా తను ఒంటరిగా ఉండటం చూస్తే ఆనందంగానే ఉంటుంది మరి!

ఇక-ఆ మూల వొదిలి కదలని ఆకారం గురించి కొన్నాళ్ళవరకూ అదే పవన్ తిరిగొచ్చేవరకూ ఆలోచించనవసరంలేదు? అదక్కడ వున్నా లేనట్టే లెక్క!

తలతిప్పుకుని పడుకుంది స్నిగ్ధ. నిద్రకి కళ్ళు బరువెక్కుతుంటే ఎత్తుచాలక కుడిచేయి తలగడ కింద పెట్టుకుని పడుకుంది స్నిగ్ధ...

అప్పుడు తగిలిందా చేతికి...

ఏదో...చల్లగా...తడిగా!!

ఏమిటది!??

కళ్ళు అలాగే మూసుకుని చేతికి తగుల్తున్నదాన్ని తడిమింది.

మెత్తగా తడిగా ఏదో కదుల్తోంది తలగడకింద!? ఏమిటది?—?!

అలాగే పడుకుని తనచేతికి తగుల్తున్నదేమిటో ఊహించడానికి ప్రయత్నించింది స్నిగ్ధ.

అదేవిటో గాని—అటూ ఇటూ కొంచెం కదుల్తోంది.

దాన్ని చేత్తో పట్టుకోవడానికి ప్రయత్నించింది. చేతికి తడంటింది.

అప్పుడు తగిలాయి చేతికి పళ్ళు! పళ్ళమధ్య అటూ ఇటూ కదుల్తున్న నాలిక!

స్నిగ్ధ గుండె వేగంగా కొట్టుకుంటూ మొహానికి చెమటలు పట్టేసాయి.

తను ముట్టుకున్నది ఎవరిదో నోరు! అవును! ఆ పెదాల చుట్టూ గుబురుగా పెరిగిన జుట్టు గరుగ్గా చేతికి తగుల్తుంటే—ఆ నోరు స్నిగ్ధ వేళ్ళని చప్పరిస్తోంది. ఓ గాడ్! తలగడకిందనుంచి చెయి లాగేసుకుంటూ లేచి కూర్చుని బిగ్గరగా అరవసాగింది స్నిగ్ధ!

# 14

నవంబర్ 1

పవన్ దగ్గర్నించి ఇవాళ ఉత్తరం వచ్చింది. పవన్ రాస్తున్న ఉత్తరాలు చూస్తుంటే అతనెంత సెంటిమెంటల్‌గా ఫీలవుతున్నాడో అర్థమవుతోంది నాకు. ప్రతి సోమవారం ఉదయం ఆరున్నరకి నియమంగా ఉత్తరం రాయాలటతనకి. సరిగ్గా అదే సమయానికి న్యూకాసిల్స్‌లో ఉన్న తను నాకు ఉత్తరం రాస్తుంటాడట....(సరిగ్గా అదే సమయం అంటే...అక్కడ ఆదివారం రాత్రి ఒంటిగంట అయి ఉంటుంది.) ఇలా ఇద్దరం ఒకే టైంకి ఉత్తరాలు రాసుకోవడం ఎంత రొమాంటిక్‌గా ఉంది. మిగతా రోజుల్లో అతను యూనివర్శిటీ పనుల్లో ఎంత బిజీగా ఉన్నా ఉత్తరం రాసేటపుడు పూర్తిగా నా గురించే ఆలోచిస్తున్నాడంటే ఎంతో థ్రిల్లింగా ఉంటుంది,...నా ఉత్తరంకూడా పవన్‌కి ఇవాళ అంది ఉండాలి. ఎల్లుండి సోమవారం జవాబు రాయాలి. బెడ్‌రూంలో ఇప్పుడు పడుకోవడంలేదనీ, గెస్ట్‌రూంలో పడుకుంటునప్పట్నించి పీడకలలు రావడంలేదని రాత్రుల్లో హాయిగా నిద్ర పడ్తోందని రాయాలి. పవన్ కొంచెం రిలీఫ్ ఫీలవుతాడు. ఇక్కడ నేనూ అత్తయ్యగారు బాగానే ఉన్నామనీ, ఆవిడలో చాలా మార్పు వచ్చిందని కూడా రాయాలి. ఇక్కడి విషయాల గురించి ఆలోచిస్తూ కూర్చుని తన అసైన్‌మెంట్ పాడుచేసుకో కూడదు పవన్. అప్పుడే పవన్ యూ.కే వెళ్ళి రెండు నెలలు దాటింది. ఇంకెంత? మరో మూడు, నాలుగు నెలలేకదా?.

రాస్తున్న డయరీ ఆపేసి కళ్ళు గట్టిగా మూసుకుంది స్నిగ్ధ.

కడుపులో బాబు కదుల్తున్నాడు.

ఎంత అందమయిన అనుభూతి.

పవన్ తనకు దూరంగా ఉన్నా...అతడి ప్రతిరూపం తనలో పెరుగుతోంది. తమ ప్రేమ ప్రతిఫలం. ఈ అయిదు ఆరు నెలలు నిమిషాల్లా గడిచిపోతే ఎంత బావుంటుంది. బాబుని ఛాతీమీద పడుకోబెట్టుకుని లాలిస్తూ ముద్దాడుతూ బోలెడు కబుర్లు చెప్పవచ్చు!...ఉహూఁ...

కాదు... ఈ అయిదు నెలలు అంత త్వరగా గడచిపోకూడదు. ఇప్పుడు బాబు తనలోని భాగం! నెలలు నిండితే బాబు తనలోంచి బయటకి వచ్చేస్తాడు...అప్పుడు బాబుని అందరూ ముట్టుకుంటారు...అందరూ ఆడిస్తారు. అందరూ తమ అధికారం చూపిస్తారు బాబు తనకే...తన ఒక్కదానికే అన్నట్టుగా ఉండేది నెలలు నిండేవరకే!...

కడుపులో బాబు మళ్ళీ కదిలాడు!

ఆనందం భరించలేక కిందపెదవి పళ్ళ మధ్య గట్టిగా నొక్కిపట్టుకుంది స్నిగ్ధ!...బాబు కదలిక కొంచెం తగ్గగానే డయిరీలో రాయడం మొదలెట్టింది మళ్ళీ...

...బాబు అనిరుద్ధ! నిద్రపట్టడంలేదా? బజ్జోరా!? అమ్మకడుపులోంచి బయటకు వచ్చేయాలని ఎందుకురా నీకు తొందర? అమ్మనుచూడాలని ఉందా నాకు కూడా నిన్ను చూడాలని ఉందిరా! కానీ, నువ్వుపుట్టాక నాకు దూరమయిపోతావని ఎందుకో దిగులుగా ఉంటుంది. ఏంచేయమంటావు చెప్పు? అందుకే ఎప్పటికీ నిన్ను నా కడుపులోనే దాచుకుని ఉండిపోవాలనిపిస్తుంది.

ఠక్కున రాయడం ఆపేసి శూన్యంలోకి చూస్తూ కూర్చుండిపోయింది స్నిగ్ధ...

తన ఆలోచనలు ఏమిటి ఇలా వెళ్ళిపోతున్నాయి? బాబు పుట్టాక తనకు దూరమయిపోతాడని ఎందుకు భయం? అసహజంగా ఆలోచిస్తోందా తను? అనిరుద్ధ్ తనకు ఎందుకు దూరమవుతాడు? ఎవరయినా బాబుని తీసుకెళ్ళిపోతారా? ఒకవేళ కరకింకర భక్తులు ఎవరయినా?...ఛ...ఛ... ఎందుకిలా అనుకుంటోంది తను?

పెళ్ళయిన కొత్తలో ఏవో అనూహ్యమయిన సంఘటనలు ఎదురొక్కవడంలో విచిత్రమైన ఆలోచనలు, పీడకలలు వేధించేవి తనని... కానీ ఈ మధ్య సుస్మిత సైకియాట్రీ చికిత్సతో' తను అలాంటి భ్రమల నించి బయటపడింది కదా? బెడ్‌రూంలో పడుకుంటే భయంగా ఉంటోందని వారంరోజుల క్రితం గెస్టురూంలోకి మారింది తను. అప్పట్నించి మనస్సు ఏ చీకూ చింతా లేకుండా ప్రశాంతంగానే ఉంటోంది.

అలాంటిది...మళ్ళీ ఎందుకు కొత్తగా బాబు గురించి భయం?

సైకియాట్రీ చికిత్సతో మటుమాయం అయ్యాయనుకున్న భ్రమలు ఇంకా మనస్సు అట్టడుగు పొరల్లో మిగిలి ఉన్నాయా?...ఏమో?

టేబిల్ మీద తలవాల్చి పడుకుంది స్నిగ్ధ...

• • •

స్నిగ్ధకి పి.వి. పరీక్షచేసి రబ్బర్ గ్లౌవ్స్ తీసేసి వాష్‌బేసిన్‌లో చేతులు కడుక్కుంది గైనకాలజిస్ట్ డాక్టర్ ప్రేమ.

స్నిగ్ధ బల్ల మీదనించి దిగి చీర సర్దుకుంటూ నిలబడింది.

"కమ్ స్నిగ్ధా! కూర్చో" అంటూ తనెదురుగా కుర్చీ చూపిస్తూ అంది డాక్టర్ ప్రేమ.

స్నిగ్ధ వచ్చికూర్చున్నాక చిరునవ్వుతో అంది.

"జేబీ ఆక్టివ్‌గా ఉందమ్మా! నథింగ్ టు వర్రీ. నేను క్రితంసారి రాసిచ్చిన విటమిన్ కాప్సూల్స్ టానిక్కులు వాడుతున్నావు కదా?"

వాడుతున్నానట్టు తలూపింది స్నిగ్ధ.

"గుడ్...అన్నట్టు నీకొకటి చూపించాలి పద." అంటూ లేచి కన్సల్టింగ్ రూంలోంచి బయటకి దారితీసింది డాక్టర్ ప్రేమ.

ఆమెను అనుసరించింది స్నిగ్ధ.

మొదటి అంతస్తులో లేబర్ రూందాటుకుంటూ మరో గదిలోకి వెళ్ళింది డాక్టర్ ప్రేమ.

విశాలమయిన ఆ గదిని పరిశీలనగా చూసింది స్నిగ్ధ.

గదిమధ్య రెండు కుర్చీలు అమర్చి ఉన్నాయి. వాటి పక్కనే ఫైబర్ గ్లాస్‌తో చేసి గుండ్రటి డోమ్స్ పెట్టి ఉన్నాయి. మరోపక్కన ఆకుపచ్చ రంగులో ఆపరేషన్ డ్రెస్సుల్లాంటివి వేలాడేసి ఉన్నాయి.

"ఇదేమిటో తెలుసా?" అడిగింది డాక్టర్ ప్రేమ.

లేదన్నట్టు తలూపింది స్నిగ్ధ.

"ఇది డీ కంప్రెషన్ యూనిట్...దీన్ని ఫీటల్ ఆక్సిజనేషన్ **(Foetal Oxygenation)** యూనిట్ అనికూడా అంటారు. ఇలాంటి యూనిట్స్ మనదేశంలో చాలా తక్కువగా ఉన్నాయి. నేనుకూడా ఈ

మధ్యనే తెప్పించుకున్నాను ఈ యూనిట్ని...ఇంతవరకూ నా పేషెంట్లు ఎవరూ ఉపయోగించలేదిది. నీకిష్టమయితే ప్రారంభోత్సవం నీతో నే చేద్దామనుకుంటున్నాను" అంటూ ఆగింది డాక్టర్ ప్రేమ.

"అసలు ఈ పరికరాలు...అదే ఈ యూనిట్ దేనికి వాడతారు?" అడిగింది స్నిగ్ధ.

"ఇది క్రమం తప్పకుండా వాడితే కాన్పు చాలా సులభమవు తుందమ్మాయి....దీని గురించి క్లుప్తంగా చెప్తాను. మన శరీరంపైన చదరపు అంగుళానికి పదిహేను పౌండ్ల చొప్పున వాతావరణ పీడనం ఉంటుంది. ఈ యూనిట్తో ఆ పీడనాన్ని తగ్గించడమేకాక కడుపుమసిల్స్ **(Abdovuinal muscles)** పీడనాన్ని కూడా ఇది తగ్గిస్తుంది. దీనివల్ల గర్భంలో ఉన్న శిశువుకి ప్రాణవాయువుతో కూడిన రక్తం సరఫరా ఎక్కువకావడమేకాక తల్లికి కాన్పు సులభమవుతుంది." అంది డాక్టర్ ప్రేమ.

ఆమె మాటలు ఆసక్తితో వింటూ నిలబడింది స్నిగ్ధ.

"ఇంతేకాదు. ఈ యూనిట్ గురించి మరో విశేషంకూడా ఉంది. ఇంతవరకు ప్రపంచంలో ఈ యూనిట్ ఉపయోగించి ప్రసవించిన తల్లులు ఏకగ్రీవంగా చెబుతున్నదేమిటంటే వాళ్ళకు పుట్టిన బిడ్డలకి అసాధార మయిన తెలివితేటలున్నాయని..." అంటూ ఆగింది డాక్టర్ ప్రేమ.

ఆమెకేసి ఆశ్చర్యంగా చూసింది స్నిగ్ధ.

"అంటే?"

"కేవలం కాన్పు సులభం కావడానికి ఈ యూనిట్ని రు దించిన డాక్టర్ ఓ.ఎస్ హైన్స్ **(O.S Heyns)** అనుకోకుండా సూ బేబీ తయారుచేసేపద్ధతి కనిపెట్టాడు. అంది డాక్టర్ ప్రేమ.

"కానీ...అదెలా సాధ్యం డాక్టర్గారూ? పిల్లల తెలివితేటలు వంశ పారంపర్యంగా వచ్చే "జీన్స్ట్రిక్చర్?" పైనఆధారపడి ఉంటాయనివిన్నానే? ఆ జీన్స్ట్రిక్చర్ని ఈ యంత్రం ఎలామారుస్తుంది?" సందేహం వెలిబు చ్చింది స్నిగ్ధ.

ఆమె భుజంమీద మెచ్చుకుంటున్నట్లు తట్టింది డాక్టర్ ప్రేమ,

"యూ ఆర్ రైట్ మై ఛైల్డు కానీ ఈ యూనిట్ జీన్స్‌ని మారుస్తుందని చెప్పడంలేదు నేను. ఈ డీకంప్రెషన్ టెక్నిక్ ఉపయోగిస్తే నీ బిడ్డ జీన్స్‌లో అంతర్గతంగా ఉన్న పొటెన్షియల్ వెలికి వచ్చి బిడ్డ చురుగ్గా తెలివిగా ఉంటుంది. ఇంతవరకూ ఈ టెక్నిక్ వాడిన పిల్లల I.Q చాలా గొప్పగాఉందని రిపోర్టులు అందాయి." అందామె.

స్నిగ్ధ ఆనందంగా చూసింది ఆమెకేసి తనకు పుట్టబోయే అనిరుద్ధ్ జీనియస్‌గా పుట్టాలనిఅందంలోనూ తెలివితేటల్లోనూ ఎవరూ వాడికిసాటి కాకూడదని ఇన్నాళ్ళు కలలుకంటున్న తనకు దేవుడు ఇచ్చిన వరంలా ఈ అవకాశం దొరుకుతోందంటే అంతకంటే కావల్సిందేముంటుంది?

"డాక్టర్ ఐ విల్ టేక్ ఇట్!...క్రమం తప్పకుండా ఈ యూనిట్‌తో ట్రీట్‌మెంట్ తీసుకుంటాను? ఖర్చు ఎంతయినా సరే..." ఉత్సాహంగా చెప్పింది స్నిగ్ధ.

"ఈ యూనిట్ ఎలా పనిచేస్తుందో తెలుసుకోవాలని నాక్కూడా కుతూహలంగానే ఉంది స్నిగ్ధా! ఆ ఖర్చుల గురించి ఆలోచించకు" అంది డాక్టర్ ప్రేమ.

• • •

డాక్టర్ ప్రేమ నర్సింగ్‌హోంనించి ఆటోలో ఇంటికి బయల్దేరింది ...గ.

కానీ బంజారా హిల్స్ మీదగా ఆటో వెళ్తుంటే ఎందుకో వెంటనే ...కి వెళ్ళకూడదనిపించింది.

మరికాసేపు మనసులో పొంగి పొర్లుతున్న అందమయిన ఆలోచన...తో అలాగే ఉండాలనిపించింది.

ఆటోవాడ్ని ఆటో ఆపమని కిందకుదిగి మీటరు డబ్బులు చెల్లించింది స్నిగ్ధ.

ఆటో వెళ్ళాక చుట్టూ కలయచూసింది స్నిగ్ధ.

బంజారా హిల్స్ రోడ్ నెంబర్ మూడు నిర్మానుష్యంగా ఉంది. అప్పుడే పెద్ద వర్షంకురిసి తగ్గుముహంపట్టి తుంపరగా పడుతోంది. చలిగాలి తగుల్తుతుంటే భుజంచుట్టూ చీరకొంగు కప్పుకుని నెమ్మదిగా ముందుకు

నడిచింది స్నిగ్ధ. మనసులోని ఆలోచనల్లాగే వాతావరణం కూడా ఆహ్లాదాన్ని ఇస్తోందా మెకు...

అనిరుద్ధ్

అనుకోకుండా ఎంత అందమయిన పేరు ఎన్నుకుంది తను! అనిరుద్ అంటే సాటిలేనివాడు.

అనిరుధ్‌ని వాడిపేరుకి తగ్గట్టుగా తీర్చిదిద్దటానికి ఇవాళ పునాదులు వేసింది తను. డాక్టర్ ప్రేమ డీ కంప్రెషన్ యూనిట్ అనుకున్న ఫలితాలిస్తే అనిరుధ్ 'సూపర్ బేబీగా' పుడ్తాడు.

డాక్టర్ ప్రేమ డీ కంప్రెషన్ యూనిట్‌లో తనని కూర్చోబెట్టి డోమ్ పైనించి ప్లాస్టిక్ సూట్ తొడిగాక వాక్యూమ్ పంప్ ఆన్ చేసింది. ప్రెషర్‌ని ఎలా కంట్రోల్ చేయాలో చెప్పి పక్కకు జరిగి నిలబడింది డాక్టర్ ప్రేమ. ప్రెషర్ ముప్పై మిల్లీమీటర్లకు తగ్గినపుడు ఊపిరి అందక కొంచెం ఉక్కిరిబిక్కిరయింది. ఆ తర్వాత ధైర్యంచేసి ప్రెషర్‌ని నలభై మిల్లీ మీటర్లదాకా తగ్గించింది...గాలిలో తేలిపోతున్నట్టు ఎంతో హాయిగా అనిపించిందపుడు.

అంతలో...

దూరంగా...ఎక్కడ్నించో డప్పుల శబ్దం వినబడింది.

పుట్టబోయే బిడ్డ గురించి కలలు కంటూ ముందుకు నడుస్తున్న స్నిగ్ధ నడకవేగం అప్రయత్నంగా తగ్గింది.

ఆలోచనలు లయతప్పాయి.

డప్పుల శబ్దం దగ్గరయింది...రోడ్డు మలుపు తిరిగిన ఊరేగింపు ఒకటి స్నిగ్ధకు కనబడింది. డప్పులు వాయిస్తూ నలుగురు ముందు నడుస్తుంటే వెనక ముగ్గురు కుర్రాళ్ళు ఈలలువేస్తూ నాట్యమాడుతూ వస్తున్నారు. వాళ్ళందరీ వెనక యాభై మంది జనం నిశ్శబ్దంగా నడచి వస్తున్నారు...ఏదో మోసుకుని వస్తున్నారు. ఏమిటది?

మామూలు ఊరేగింపుకాదది.

శవయాత్ర.

ఆ జనం దగ్గరవుతుంటే స్నిగ్ధకి నోరంతా చేదుగా అనిపించింది.

మనస్సంతా వికలమయిపోయింది.

ఏమయిందని ఇప్పుడు?

ఉన్నట్టుండి ఎందుకు తన మూడ్ ఇలా మారిపోయింది!

అందమయిన భవిష్యత్తు గురించి ఆలోచిస్తునపుడు శవయాత్ర ఎదురురావడం అపశకునమనుకుంటోందా తను?

శవయాత్ర ఎదురయినంత మాత్రాన అది అపశకునం అనుకోవడం చాలా సిల్లీగా ఉంటుంది. పుట్టిన ప్రతిప్రాణీ చావక తప్పదు. జాతస్య మరణం ధృవం పుట్టడం సహజమయితే చావడంకూడా సహజమే మరి?

శవయాత్ర దగ్గరవుతుంటే రోడ్డుకి ఎడమవైపుకి జరిగి నిలబడింది స్నిగ్ధ.

వాళ్ళు మోసుకెళ్తున్న శవంకేసి చూసింది స్నిగ్ధ. మొహానికి పూసిన పసుపు కుంకుమలు, మెడలోవేసిన పూలమాలల మధ్య మొహం సరిగ్గా కనబడటంలేదు కానీ అది వయసు మళ్ళిన స్త్రీ శవమని తెలుస్తూనే ఉంది.

శవయాత్ర జనం రోడ్డు కవతలివైపునించి వెళ్తుంటే అనిపించింది స్నిగ్ధకి...వాళ్ళందరూ ఆడామగా కలిపి వందమందిపైనే ఉంటారని.

అక్కడే నిలబడి వాళ్ళు నడిచివెళ్తున్నవైపుకి చూస్తూ ఉండిపోయింది స్నిగ్ధ...

అంతమంది జనం మధ్య తెల్లచీర కట్టుకుని ఒక అమ్మాయి నడిచి వెళ్తోంది...

సన్నగా...పొడుగ్గా ఉంది ఆ అమ్మాయి...ఆ నడక స్నిగ్ధకు బాగా తెలుసు. ఉలిక్కిపడి ఆ అమ్మాయి నడచివెళ్తున్నవైపు పరిశీలనగా చూసింది స్నిగ్ధ.

వెతికనించి చూస్తే అచ్చు అలాగే ఉంది.

ఇది తన భ్రమ కాదు కదా!?

ఇక ఒక్కక్షణం ఆలస్యం చేయకుండా వెనక్కి తిరిగి గబగబ నడిచింది స్నిగ్ధ...

ఏలాగైనా ఆ అమ్మాయి మొహం చూడాలి తను...వీలైతే ఆ

అమ్మాయితో మాట్లాడాలి! ... తప్పదు లేకపోతే తన మనసులోని కన్‌ఫ్యూషన్ అలాగే ఉండిపోతుంది.

నడకవేగం పెంచి రోడ్డుకవతలివైపునించి నడుస్తున్న జనంమధ్య తెల్లచీర కట్టుకున్న అమ్మాయికోసం ఆతృతగా వెతకసాగింది స్నిగ్ధ.

అంతలో జనం మోసుకెళ్తున్న శవం పక్కనే నడుస్తున్న తెల్ల చీర అమ్మాయి మళ్ళీ కనబడింది.

అనుమానంలేదు! ఆమే!

అయినా...ఎందుకో నమ్మకం కుదరడంలేదు. మనిషిని పోలిన మనుషులుండవచ్చుకదా? ఈ అమ్మాయి తనకు పదిహేను అడుగుల దూరంలో ఉంది...అయినా మొహం సరిగ్గా కనబడటంలేదు. ఒక్కసారి తనకేసి చూస్తే తనకనుమానం తేలిపోతుంది.

గబగబ ముందుకునడిచి అమ్మాయి మొహం చూడటానిని ప్రయత్నించింది స్నిగ్ధ—జనంలో ఎవరో ఒకరు అడ్డుగా నడుస్తుండటంతో అది సాధ్యపడలేదు...

"ఏయ్" పిలిచింది స్నిగ్ధ...

డప్పుల శబ్దంలో స్నిగ్ధ పిలుపు కలసిపోయింది...ఆ అమ్మాయి తిరిగి చూడలేదు...

స్నిగ్ధ ఆగలేదు. శవ యాత్రతోపాటు అలాగే నడుస్తోంది...ఆమె చూపు మాత్రం ఆ అమ్మాయి మీదే ఉంది.

"ఏయ్" మళ్ళీ పిలిచింది స్నిగ్ధ బిగ్గరగా.

అప్పుడు తిరిగి చూసిందా అమ్మాయి స్నిగ్ధకేసి.

విరబోసుకున్న జుట్టు మొహంమీద పడుతుంటే...చేత్తో దాన్ని వెనక్కి తోసుకుంటూ స్నిగ్ధకేసి సూటిగా చూసిందా అమ్మాయి...తీర్చి దిద్దిన కనుబొమ్మల పైన రూపాయి కాసంత తిలకం.

కాత్యాయని!

కాత్యాయని!!

కాత్యాయని!!!

కిరకింకర భక్తురాలు కాత్యాయని!!

ఓ గాడ్!

కాళ్ళు చేతులు మంచుగడ్డలా చల్లబడ్డాయి స్నిగ్ధకి.

దానికి తోడు....

కాత్యాయని...నవ్వింది!!

తనని గుర్తుపట్టినట్టు నవ్వింది!

ఇది కలకాదు!...నిజంగానే తను కాత్యాయనిని చూస్తోంది

కాత్యాయనితో మాట్లాడాలి.

ఆమెతో మాట్లాడితేనే తనని వేధిస్తున్న ప్రశ్నలకు జవాబు దొరుకుతుంది.

"కాత్యాయనీ!" బిగ్గరగా అరచింది స్నిగ్ధ.

తనకేసే చూసి అలాగే నవ్వుతూ ముందుకు నడుస్తోంది కాత్యాయని.

"కాత్యాయనీ ఆగు!" అంటూ రోడ్డు దాటబోయింది స్నిగ్ధ.

కానీ...అంతలో

పెద్దమోతతో రోడ్డుమీద లారీ ఒకటి రావడంచూసి ఆగిపోయింది.

దుమ్ము లేపుతూ లారీ వెళ్ళాక కాత్యాయనికోసం చూసింది స్నిగ్ధ.

కాత్యాయని కనబడలేదు.

శవయాత్ర జనం ముందుకు నడచివెళ్ళి పోతున్నారు. వాళ్ళలో మళ్ళీ కలిసిపోయి ఉండాలి.

పరుగున రోడ్డు దాటి...ఆ జనంలో కలిసిపోయి...వాళ్ళని పక్కకు తోసుకుంటూ ముందుకెళ్ళింది స్నిగ్ధ.

ఆమె మనసులో మరో ఆలోచన లేదు...ఎలాగయినా కాత్యాయనిని కలుసుకుని ఆమెతో మాట్లాడాలి.

"కాత్యాయనీ!...కాత్యాయనీ!" అరుస్తూ ముందుకెళ్ళింది స్నిగ్ధ.

అంతమంది జనంమధ్య అలా దూసుకుని పోబోతూ రెండుసార్లు పడబోయింది. అయినా ఆగలేదు ఆగదలచుకోలేదు.

ఇవాళ ఏదో ఒకటి తేల్చుకోవాలి.—

"కాత్యాయనీ" మళ్ళీ పిలిచింది స్నిగ్ధ—

కాత్యాయని కనపడలేదు—

అంతమంది జనంలో ఎక్కడుందో.

అందర్నీ తోసుకుని శవం మోసుకేళుతున్న వాళ్ళని కూడా దాటు కుంటూ ముందుకెళ్ళింది స్నిగ్ధ.

కాత్యాయని పత్తాలేదు.

ఎక్కడికెళ్ళిపోయింది. ఏమయిపోయింది అంతలోనే?

"కాత్యాయని ఎక్కడ. కాత్యాయని ఎక్కడ?" పిచ్చిగా అరుస్తూ జనం మధ్య నడుస్తున్న ఒక ముసలాయన చేయి పట్టుకుంది స్నిగ్ధ

స్నిగ్ధకేసి జాలిగా చూసి ముందుకు నడిచాడు ఆ ముసలాయన—

అతడిచేయి వొదిలిపెట్టలేదు స్నిగ్ధ—

"చెప్పండి కాత్యాయని ఎక్కడ? ఎక్కడుంది కాత్యాయని—నాకు కాత్యాయని కావాలి" అరిచించి స్నిగ్ధ మళ్ళీ.

"ఇంకెక్కడి కాత్యాయని మమ్మల్ని వొదిలి వెళ్ళిపోయింది!" అని శవంకేసి చూపించి బోరుమన్నాడాముసలాయన!!!

# 15

"నా మాటలు నమ్మడంలేదుకదూ! ఇది కూడా నేను చూసిన ఇల్యూషన్ అని కొట్టి పారేస్తావా?

కొంచెం ఆవేశంగా స్నిగ్ధ మాట్లాడిన మాటలు విని ఆలోచనలో పడిపోయింది డాక్టర్ సుస్మిత.

"...ఈ మధ్య నేను నార్మల్‌గా ఉంటున్నాను గెస్ట్‌రూంలో పడు కుంటున్నప్పట్నుంచి రాత్రిపూట ఎటువంటి భయాలు లేకుండా హాయిగా నిద్రపోతున్నాను. నిన్నసాయంత్రం నేను చూసిందాని గురించి నీ సైకియా ట్రీపరిభాషలో ఎక్స్‌ప్లైయిన్ చేసి నన్ను ఓదార్చడానికి ప్రయత్నించకు ఇప్పుడు నాక్కావాల్సిందదికాదు!" అంటూ ఆగింది స్నిగ్ధ.

చిరునవ్వు నవ్వింది డాక్టర్ సుస్మిత.

"మరేంకావాలి నీకు."

"ఇన్నాళ్ళూ నేను చూసినవన్నీ పీడకలలనీ, భ్రమలనీ సర్దిచెప్పు కుంటూ వచ్చాను...కానీ, నిన్న ఆశవయాత్రలో కాత్యాయినిని చూసాక

నా మనసులో మళ్ళీ అల్లకల్లోలం ప్రారంభమయింది. రియాలిటీ ఏమిటో నేను వెంటనే తెలుసుకోవాలి. అందుకు నీ సహాయం కావాలి... సైకియాట్రిస్టుగా కాదు, నా స్నేహితురాలిగా హెల్ప్ చేయాలి నువ్వు!" అంది స్నిగ్ధ.

"స్నేహితురాలిగా అయినా, సైకియాట్రిస్టుగా అయినా నేను కోరుకునేది అదే స్నిగ్ధ. రియాలిటీ ఏమిటో నువ్వు తెలుసుకోగలిగితే నాకంతకంటే ఏం కావాలి!...చెప్పు ఏం చేయాలి?" అడిగింది సుస్మిత.

"నాతోపాటు ఖండాలా రావాలి నువ్వు."

స్నిగ్ధ జీవితంలో అనూహ్యమయిన సంఘటనలు ఖండాలా వెళ్ళినప్పట్నుంచే ప్రారంభమయ్యాయి. అందుకే అక్కడికి మళ్ళీ వెళదామని అంటోంది. స్నిగ్ధని ప్రోత్సహించడమే మంచిదనిపించింది సుస్మితకి.

"తప్పకుండా వస్తాను! ఎప్పుడు వెళదాం అంటావు?" అడిగింది.

"రేపు పొద్దునే. ఫ్లయిట్‌లో బొంబాయి వెళ్ళాలి. అక్కడ్నించి ఖండాలాకి."

• • • •

బొంబాయి సాంతాక్రూజ్ ఎయిర్‌పోర్ట్‌నించి ఫోన్‌చేసి ప్రైవేట్ టాక్సీ రప్పించుకుంది స్నిగ్ధ.

టాక్సీలో సుస్మితతోపాటు ఎక్కి కూర్చుని

"ఖండాలా పోనీ" అంది డ్రైవర్‌తో.

"అలాగే మేడమ్" అని కారు స్టార్టుచేసాడు తెల్ల యూనిఫారం తొడుక్కున్న డ్రైవర్.

టాక్సీ ఖండాలాకేసి సాగిపోతుంటే సుస్మితకేసి చూసింది స్నిగ్ధ. ఏదో పుస్తకం చదువుతూ కూర్చుందామె. ఆమెను డిస్టర్బ్ చేయడం ఇష్టంలేక సీటులో వెనక్కిజారి కళ్ళుమూసుకుంది స్నిగ్ధ.

మరి కాసేపట్లో ఖండాలా చేరుకోబోతోంది తను.

ఈ సారి ఆ భవనంలోకి తను ఒంటరిగా వెళ్ళడంలేదు. తనతోపాటు సుస్మిత కూడా ఉంటుంది. అసలు ఈపని ఎప్పుడో చేసి ఉండవలసింది. ఇన్నాళ్ళుగా తనని వేధిస్తున్న ప్రశ్నలన్నింటికి సమాధానం ఆ భవనంలో తప్పకుండా దొరుకుతుంది తనకి.

కళ్ళు తెరచి కిటికీలోంచి బయటకి చూసింది స్నిగ్ధ.

టాక్సీ న్యూ బొంబాయి దాటి వేగంగా ముందుకి సాగిపోతోంది. గాలికి జుట్టురేగిపోతుంటే ఖాతరు చేయకుండా కిటికీలోంచి బయటకి తొంగిచూస్తూ కూర్చుంది స్నిగ్ధ.

అంతలో...

వెనకనించి పెద్దగా మోతచేస్తూ జీపు ఒకటి టాక్సీని ఓవర్ టేక్ చేసింది. జీపులో నలుగురు కుర్రాళ్ళు బిగ్గరగా నవ్వుకుంటూ పాటలు పాడుకుంటూ వెళ్తున్నారు.

జీపు వెనకసీటులో కూర్చున్న కుర్రాడు టాక్సీలో స్నిగ్ధని సుస్మితని చూసి మిగతావాళ్ళకేదో చెప్పాడు. డ్రైవ్‌చేస్తున్నతను జీపుస్లో చేసి టాక్సీ పక్కనించే నడపసాగాడు.

ఆ నలుగురూ తనకేసే కన్నార్పకుండా చూస్తుంటే చికాగ్గా మొహం పెట్టుకుని సీటులో వెనక్కి జరిగి కూర్చుంది స్నిగ్ధ.

"ఇడియట్స్!" అంది తలతిప్పుకుంటూ.

"వాళ్ళను పట్టించుకోకు" అంది పక్కనే కూర్చున్న సుస్మిత.

"ఆ జీపువాళ్ళని ముందుకి పోనీ!" అంది స్నిగ్ధ డ్రైవర్‌తో.

టాక్సీ డ్రైవర్ స్పీడు బాగా తగ్గించేస్తూ జీపులోని కుర్రాళ్ళకేసి ఉరిమి చూసాడు. జీపుకూడా వేగం తగ్గింది.

"ఏం ఒళ్ళెలా ఉంది?!" అని హిందీలో బిగ్గరగా అరిచాడు టాక్సీ డ్రైవర్.

ఏమనుకున్నారో ఏమో...డ్రైవ్ చేస్తున్న కుర్రాడు వేగం పెంచి టాక్సీ దాటుకుంటూ జీపుముందుకి పోనిచ్చాడు.

దూరమయిపోతున్న జీపుకేసి చూస్తూ అన్నాడు డ్రైవర్.

"వొట్టి రౌడీమూకలా ఉన్నారమ్మా...తినితిరగడం తప్ప వీళ్ళకు మరో పనుండదనుకుంటాను"

సమాధానం చెప్పకుండా మౌనంగా కూర్చున్నారు స్నిగ్ధ, సుస్మిత.

టాక్సీని టాప్‌గేర్‌లోకి మార్చి వేగం పెంచాడు డ్రైవర్. నాలు గయిదు కిలోమీటర్లు ముందుకి వెళ్ళాక...రోడ్డు మలుపు తిప్పి తక్కున

బ్రేక్ వేసాడతను. ఆ ఊపుకి ముందుకి పడబోయి తమాయించుకుని రోడ్డుకేసి చూసింది స్నిగ్ధ.

రోడ్డు మధ్యన ఎర్ర టీషర్ట్ వేసుకుని ఒక కుర్రాడు నిలబడి ఉన్నాడు... అంతకుముందు తను టాక్సీని ఓవర్ టేక్ చేసిన జీపు రోడ్డుకి అడ్డంగా నిలబెట్టి ఉంది. ఆ కుర్రాడు ఆ అల్లరిమూకలోనివాడేనని అర్థమయింది స్నిగ్ధకి.

టాక్సీ ఆగగానే దగ్గరకు పరుగున వచ్చాడతను. సుస్మితకూర్చున్న కిటికీ దగ్గరకొచ్చి ఇంగ్లీషులో మాట్లాడాడు.

"మేడమ్ మా జీపులో పెట్రోల్ అయిపోయింది! ఖండాలాదాకా మాకు లిఫ్ట్ ఇస్తారా? ప్లీజ్!" అన్నాడతను ప్రాధేయపడుతున్నవాడిలా.

సుస్మిత కోపంగా చూసిందతనికేసి.

"నో నథింగ్ డూయింగ్!"

స్నిగ్ధ ఆమె మాట పూర్తిచేయనివ్వలేదు.

"ఇట్స్ ఆల్ రైట్! మేముకూడా ఖండాలాకే వెళ్తున్నాం... మీ జీపు పక్కకు జరిపి రండి" అంది ఎంతో సౌమ్యంగా.

తన పన్నాగం సాగుతోందని ఆ కుర్రాడి కళ్ళు ఆనందంగా మెరిసాయి.

"థాంక్యూ యంగ్ లేడీ!" అంటూ గిర్రున వెనక్కితిరిగి జీపులో కూర్చున్న తన స్నేహితులకేసి వెళ్ళాడు.

సుస్మిత పూర్తిగా అప్సెట్ అయిపోయింది.

"ఓ గాడ్! ఏమిటి స్నిగ్ధా ఇది! వాళ్ళను చూస్తేనే తెలుస్తోంది రౌడీలని వాళ్ళకి లిఫ్ట్ ఇస్తావా!"

సమాధానం చెప్పకుండా ఎదురుగా రోడ్డుకేసి చూస్తోంది స్నిగ్ధ.

ఆ కుర్రాళ్ళు నలుగురూ జీపు దిగి, దాన్ని తోస్తూ రోడ్డుపక్కకి జరిపారు.

జీపు రోడ్డు పక్కకు జరగ్గానే టాక్సీ డ్రైవర్ భుజంమీద చెయి పెట్టింది స్నిగ్ధ.

"డ్రైవర్ కారుస్టార్ట్ చేసి ఫాస్టుగా పోనీ, క్విక్! అంది.

క్షణం ఆలస్యం చేయకుండా కారుని ఫుల్‌స్పీడ్‌లో ముందుకి పోనిచ్చాడు డ్రైవర్.

టాక్సీ జీపుని దాటి వెళ్ళిపోతుంటే ఎర్ర టీ షర్ట్ కుర్రాడు కోపంగా ముందుకి ఉరకబోయి ఆగిపోయాడు.

"యూ బిచ్!" అని అరిచాడతను వేగంగా వెళ్ళిపోతున్న కారుకేసి చూస్తూ.

ఆ టెంషన్‌నించి తేరుకోడానికి స్నిగ్ధకి, సుస్మితకి కొంతసేపు పట్టింది.

"నిజంగానే వాళ్ళకి లిఫ్ట్ ఇవ్వడానికి నువ్వు ఒప్పుకున్నావని కంగారు పడ్డాను స్నిగ్ధా!" అంది సుస్మిత తేలిగ్గా ఊపిరి పీల్చుకుంటూ.

"మేడమ్! చాలా తెలివిగా జీపు జరిపించారు. లేకపోతే రోడ్డుమీద రభస అయ్యేది" అన్నాడు టాక్సీ డ్రైవర్.

"క్రెడిట్ గోస్‌టు యూ" అని అభినందించింది సుస్మిత

సన్నగా నవ్వి కిటికీలోంచి బయటకు చూస్తూ కూర్చుంది స్నిగ్ధ. కాసేపయ్యాక.

"మనం ఆగవలసిన చోటు దగ్గర పడుతున్నట్టు ఉంది...ఎస్... ఇక్కడే!...డ్రైవర్ కారాపు!" అంది స్నిగ్ధ, రోడ్డుకి ఎడమవైపున్న బంజరు పొలంకేసి చూస్తూ.

"ఇక్కడా?" అడిగాడు డ్రైవర్ కారాపుతూ...

"ఆఁ...ఇక్కడ చిన్నపనొకటి ఉంది అరగంటలో వచ్చేస్తాం" అంటూ డోర్ తెరచి కిందికి దిగింది స్నిగ్ధ.

సుస్మితకూడా కారుదిగి స్నిగ్ధ పక్కన వచ్చి నిలబడింది?

"ఆర్ యూ షూర్? ఆ చోటు ఇదేనా?"

"ఈ చోటెలా మరచిపోతానూ రెండుసార్లువచ్చాను కదా ఇక్కడికి అంది స్నిగ్ధ.

రెండుసార్లుకాదు ఒక్కసారే తనక్కడికి వచ్చిందన్న సంగతి గుర్తు చేద్దామనుకుంది డాక్టర్ సుస్మిత. కానీ స్నిగ్ధతో చర్చించడానికి అది సమయం కాదనుకుని ఊరుకుంది.

బంజరు పొలంలోంచి స్నిగ్ధ ముందుకు నడచి వెళుతుంటే ఆమెను అనుసరించింది సుస్మిత. కొంతదూరం వెళ్ళాక ఎదురుగా కనిపిస్తున్న గుట్టకేసి చూపించింది స్నిగ్ధ.

"అదిగో అదే ఆ భవనం!" అంటూ నడకవేగం పెంచింది

ఆమెతోపాటు నడుస్తూ అంది సుస్మిత.

"తొందరేమిటి కొంచెం నెమ్మదిగా నడు."

కానీ, స్నిగ్ధ ఆ మాటలు వినిపించుకున్నట్టులేదు. పరుగులాంటి నడకతో గుట్టకేసి వెళ్ళింది.

ఆమెకేసి వింతగా చూస్తూ నడిచింది సుస్మిత కూడా అంతవరకూ నార్మల్‌గానే ఉన్న స్నిగ్ధ ఆ భవనం కంటపడగానే వేగిరపాటు చూపిస్తోంది. ఎన్నేళ్ళుగానో దూరమయిన తనకెంతో ఇష్టమయిన చోటుకితిరిగి వెళుతున్నట్టు ఎక్సైటెడ్‌గా ఉంది స్నిగ్ధ.

సుస్మితకోసం ఆగకుండా, కనీసం వెనక్కి తిరిగైనా చూడకుండా గబగబ గుట్టమీదకు వెళ్ళే మెట్లు ఎక్కసాగింది స్నిగ్ధ.

ఆమెనే గమనిస్తూ నడుస్తున్న సుస్మిత కూడా వెనక్కి తిరిగి చూడలేదు.

అలా చూసి ఉంటే...

దూరంగా రోడ్డుమీద టాక్సీ పక్కన జీపు వచ్చి ఆగడం అందులోంచి ఆ నలుగురు కుర్రాళ్ళు దిగడం గమనించి ఉండేది.

ఎగుడు దిగుడుగా ఉన్న మెట్లమీద బాగా అలవాటున్నదానిలా చకచకా పైకెళ్ళుతున్న స్నిగ్ధని వెనకనుంచి మరోసారి పిలిచింది సుస్మిత.

"ఆగు స్నిగ్ధా...నేనూ వస్తున్నా..."

స్నిగ్ధ మధ్యలో ఎక్కడా ఆగకుండా గుట్టమీదకు చేరుకుని పాడు బడ్డ ఆ భవనం సింహద్వారం దగ్గర నిలబడింది. బాగా వెనకబడిన సుస్మిత అయాసపడుతూ అక్కడికి వచ్చి చేరింది.

"ఏమిటి...ఎంత పిలిచినా ఆగవూ?" అందామె. పిలిచావా? ఎందుకూ?" పరధ్యానంగా అడిగి భవనంలోకి దారితీసింది స్నిగ్ధ.

సుస్మిత కూడా లోపలికి వెళ్ళింది.

లోపల చీకటిగా ఉంది. బయట ఎండలోంచి లోనికి రావడంతో కాబోలు ఏమీ కనబడటంలేదు.

"స్నిగ్ధా!" పిలిచింది సుస్మిత.

"ఇక్కడ" సమాధానం ఇచ్చింది స్నిగ్ధ చీకట్లోంచి.

అస్పష్టంగా కనబడుతున్న స్నిగ్ధకేసి నడచింది సుస్మిత.

"ఇక్కడేమీ ఉన్నట్టు లేదే." అందామె.

"ఇక్కడకాదు అటువైపు మెట్లున్నాయి పద." అని సుస్మిత చెయి పట్టుకుని ముందుకు కదిలింది స్నిగ్ధ.

అప్పటికి చీకటి అలవాటు పడ్డ కళ్ళతో చుట్టూ కలయ చూసింది సుస్మిత. చాలా విశాలమయిన హాలులా ఉందది.

ఆ హాలు మూలనున్న గట్టుదగ్గర ఆగింది స్నిగ్ధ.

"ఇక్కడ కిందకు దిగే మెట్లున్నాయి జాగ్రత్తగా దిగు" అని సుస్మిత చెయి విడవకుండా నెమ్మదిగా మెట్లు దిగింది స్నిగ్ధ.

మెట్లు దిగాక సుస్మిత చెయి వొదిలిపెట్టి ఆగిపోయింది స్నిగ్ధ.

అక్కడ మరింత చీకటిగా ఉంది.

మునుపు తను అక్కడికి వచ్చినపుడు అక్కడ బాగా వెలుతురుగా ఉండేది. మరి ఇవాళ? కాగడాలు వెలిగించలేదెందుకూ?

ఈరోజు కరకింకర ఆరాధనలు జరపడంలేదా?

చీకట్లో తడుముకుంటూ ముందుకి నడిచింది స్నిగ్ధ.

"స్నిగ్ధా! నాకేమీ కనబడటంలేదు" అంది సుస్మిత వెనకనించి.

"ఇదే కరకింకర ఆలయం" అంది స్నిగ్ధ. ఆ మాటలు విచిత్రంగా ప్రతిధ్వనించేసాయి.

మరికొంత ముందు నడిచి కళ్ళు పెద్దవిచేసి చూసింది స్నిగ్ధ.

"ఇక్కడ పెద్ద విగ్రహం ఉందన్నావు?" అడిగింది సుస్మిత.

స్నిగ్ధ సమాధానం చెప్పకుండా చీకట్లో అటూఇటూ చూడసాగింది.

చీకట్లో తనకు కరకింకర విగ్రహం కనబడటంలేదా?

మెట్లు దిగి భూగృహంలోకి వచ్చాక తను కనీసం ఇరవై అడుగులు నడచి ఉంటుంది. ఆ లెఖన కరకింకర విగ్రహం తన కెదురుగా...చెయి

చాచితే తాకేటంత దగ్గర్లో ఉండి ఉండాలి...

మరేమయింది?

కరకింకర విగ్రహం అక్కడ్నించి ఎలా మాయమవుతుంది? అంత పెద్ద విగ్రహాన్ని ఎలా జరుపుతారెవరయినా?

"స్నిగ్థా! మాట్లాడవేం? ఏం చేస్తున్నావు? చీకట్లో" అడిగింది సుస్మిత మళ్ళీ.

"ఆ విగ్రహం ఇక్కడే ఉండాలి...ఏమయిందో అర్థంకావడం లేదు." అంది స్నిగ్థ నెమ్మదిగా.

"వెళదాం పద" అంది సుస్మిత తను నిలబడ్డ చోటునించి కదలకుండా.

అసలిది...కరకింకర ఆలయం కాదేమో..." అంటూ ఆమె దగ్గరకు వచ్చి నిలబడింది స్నిగ్థ.

"అంటే?"

"పైన గట్టుపక్కనించి మరోవైపుకి వేరే మెట్లున్నాయేమో!..." అంది స్నిగ్థ.

"డోంట్ బీఫస్సీ స్నిగ్థా...ఇక్కడేమీ లేదు ఉన్నా ఇంతచీకట్లో ఏమీ కనబడటంలేదు. కనీసం టార్చ్‌లైట్ అయినాలేదు మన దగ్గర." అని సుస్మిత అంటూ ఉండగానే...

మెట్లమీద నిలబడ్డ ఎవరో వాళ్ళ మొహాలమీద టార్చ్‌లైట్ వేశారు.

ఉలిక్కిపడి అటుకేసి చూసింది స్నిగ్థ...

"హల్లో యంగ్ లేడీస్! ఏం చేస్తున్నారక్కడ?...పైకి రండి పార్టీ చేసుకుందాం!" అందొక పురుష కంఠం. ఆ మాటలు విని మరెవరో వెనకనించి నవ్వారు!

స్నిగ్థ చెయి పట్టుకుంది సుస్మిత.

"ఓగాడ్! స్నిగ్థా...వాళ్ళే...ఇందాక జీపు దారికి అడ్డంగా పెట్టారే...వాళ్ళే!"

మెట్ల మీద టార్చ్‌లైట్ పట్టుకున్న కుర్రాడు రెండు మెట్లు కిందికి దిగాడు.

"కమాన్ ఐసే! మీరు వెంటనే పైకి రాకపోతే మేమే కిందికి వస్తాం!" అన్నాడతను.

సుస్మిత చెయి నొక్కి చెప్పింది స్నిగ్ధ.

"ఇక్కడ్నించి బయటకెళ్ళడానికి ఇంకో దారి ఉన్నట్టుంది. కానీ ఈ చీకట్లో అదెటో సరిగ్గా అర్థంకావడంలేదు."

అంతలో మెట్లమీద నిలబడ్డ కుర్రాడు కిందకి దిగసాగాడు.

"బాస్, వీళ్ళిద్దరూ నిలబడ్డ చోటు నించి కదలడంలేదు...మనమే వెళదారండి...కింద చీకట్లో వాళ్ళతో దొంగాట ఆడదాం!"

"అనునవును పార్టీ చేసుకునేముందు పార్టీ గేమ్స్ ఆడాలికదా!" అంటూ మరో కుర్రాడు కూడా కిందికి దిగసాగాడు.

వాళ్ళందరూ బిగ్గరగా నవ్వుకుంటూ కిందికిదిగుతుంటే ఒక్కొక్క అడుగూ వెనక్కి నడవసాగారు స్నిగ్ధ, సుస్మిత?

అప్రయత్నంగా వెనక్కి తిరిగి చూసింది స్నిగ్ధ.

దూరంగా సన్నటి గీతలా వెలుతురు కనిపించింది...తలుపుసందుల్లోంచి వస్తున్నట్టు ఉందా వెలుతురు.

అంటే...అక్కడ తలుపేదో ఉండాలి.

అవును...ఆరోజు కాత్యాయని తనని ఆ తలుపు తెరచుకునే బయటకి వెళ్ళమని చెప్పింది.

కానీ, అది కరకింకర ఆలయంలో తను మొదటిసారి వెళ్ళినపుడు ఇది కరకింకర ఆలయం కాదు...కరకింకర ఆలయంలో ఇలా చిమ్మ చీకటిగా ఉండదు. ఏది ఏమయినా అటు వెలుతురు కనిపిస్తోంది అంటే బయటకివెళ్ళే మార్గం ఉండే ఉంటుంది తప్పకుండా.

"సుస్మితా రానాతో..." అంటూ సుస్మిత చెయి పట్టుకుని వెలుతురు కనిపిస్తున్న వైపుకి పరుగుతీసింది స్నిగ్ధ.

టార్చిలైట్ వాళ్ళమీదే వేసి ఉంచి గబగబ కిందకి దిగి వచ్చేసారు ఆ నలుగురు కుర్రాళ్ళు...

స్నిగ్ధతోపాటు పరుగెత్తబోయిన సుస్మిత కాలికి పెద్దరాయి కొట్టుకుని "అమ్మా" అంటూ కిందకు ఒరిగిందామె...

ఆమె చెయి తన చేత్లోంచి జారిపోవడంతో ఒంటరిగా ముందుకు పరుగెత్తింది స్నిగ్ధ.

అంతలోనే ఇద్దరు కుర్రాళ్లు సుస్మితను పట్టుకున్నారు.

"ఒరేయ్! ఒక పిట్ట దొరికిపోయింది ఆ రెండవదాన్నికూడా పట్టుకోండి పైకి తీసుకెళదాం" అన్నాడొకడు.

"లీవ్ మీ యూ స్కౌండ్రల్!" అంటూ బిగ్గరగా అరవసాగింది సుస్మిత.

టార్చ్‌లైట్ అటూ ఇటూ వేస్తూ తనకోసం గాలిస్తున్న వాళ్ళ కంట పడకూడదని గుడ్డిగా ముందుకి కదిలింది స్నిగ్ధ.

అలా దిక్కుతోచని పరిస్థితిలో ముందుకి నడుస్తూ ఒక గోడకి గట్టిగా గుద్దుకుంది.

అంటే...గది మూలకు వచ్చేసిందన్నమాట తను. మరిందాక కనిపించిన వెలుతురు? అదెటుందో?

పోనీ మెట్లకేసి పరుగెడితే?

లాభంలేదు క్షణంలో వాళ్ళకి చిక్కిపోతుంది తను.

"హల్లో స్వీట్‌హార్ట్ వేర్ ఆర్ యు." అంటూ ఆ కుర్రాళ్ళు తన కోసమే గాలిస్తున్నారు...టార్చ్‌లైట్ వెలుతురు తను ఆనుకుని నిలబడ్డ గోడమీదుగా తన కేసే వస్తోంది...

ఊపిరిబిగబట్టింది స్నిగ్ధ.

అంతలో...

ఆమె భుజంమీద బరువుగా ఒక చెయి పడింది...

భయపడి అరవబోతుండగా మరో చెయి ఆమెనోరు నొక్కేసి పక్కకు లాగింది.

ఏం జరుగుతుందో అర్థం చేసుకునేంతలో తన నోరు నొక్కిపట్టిన వ్యక్తి ఎవరో చిన్నగా నవ్వినట్టనిపించిందామెకు.

"కరకింకర దర్శనానికి వచ్చావుకదూ? నైవేద్యం పెట్టవా" అందొక కంఠం నెమ్మదిగా.

ఎవరతను?

ఆ కంఠస్వరం ఎవరిదో తనకు బాగా తెలుసు కానీ గుర్తు చేసుకునే పరిస్థితిలోలేదు తను.

ఆ వ్యక్తి నెమ్మదిగా తనపట్టు సడలించి స్నిగ్ధనోటిమీద చెయి జరిపేసాడు.

చటుక్కున తలతిప్పి అతడికేసి చూసింది స్నిగ్ధ...అతడంత దగ్గరగా నిలబడిఉన్నా మొహం సరిగ్గా కనబడటంలేదు. అతడికి గిరజాల జుట్టు ఉన్నట్టు మాత్రం అస్పష్టంగా కనిపించిందామెకు.

"ఎ...ఎవరునువ్వు" అని మాత్రం అడగకలిగింది.

సమాధానం చెప్పకుండా ఆమె చేతికి ఏదో అందించాడా వ్యక్తి.

తన చేతికందింది ఏమిటో అర్థం కాలేదు స్నిగ్ధకి...చల్లగా, బరువుగా ఉన్న ఆ వస్తువేమిటో? కర్రా? కాదు!...ఇనుప ఊచా?? కాదు. అదేవిటోతనకుబాగా తెలుసు! ఇంతకుముందు అది ఎప్పుడోపట్టుకుందితను.

"ఏమిటిది?" అని ఆ వ్యక్తికేసి తిరిగింది స్నిగ్ధ.

ఆశ్చర్యం!

ఆ వ్యక్తి అక్కడలేడు.

అంతలో సుస్మిత అరుపులు వినిపించాయి. ఆ నలుగురూ తనని వెతికే ప్రయత్నం మానుకుని సుస్మితచుట్టూ చేరి ఆమె చీర లాగేస్తున్నారు. ఒకతను టార్చ్‌లైట్ వేసిపట్టుకుంటే మిగతా ముగ్గురు మృగాల్లా సుస్మితను నలిపేస్తున్నారు.

స్నిగ్ధ ఆలోచనలు స్తంభించిపోయాయి. ఉక్రోషంతో వొణికిపోయింది.

పిచ్చిగా అరుపొకటి అరచి వాళ్ళకేసి పరుగు తీసింది.

అప్పటికే సుస్మిత జాకెట్ చింపబోతున్న కుర్రాడి చేతిమీద తన చేత్లో పట్టుకున్న బరువయిన వస్తువుతో గట్టిగా కొట్టింది.

ఖస్!...

"అబ్బా!" అని బిగ్గరగా కేకపెట్టి కిందకు వొరిగాడు కుర్రాడు అది చూసి.

"డోంట్ లీవ్ దిస్ బిచ్!" అని అరుస్తూ మరో కుర్రాడు స్నిగ్ధ

జుట్టు పట్టుకున్నాడు.

అతడి చెయిమీదకూడా ఒక దెబ్బ వేసింది స్నిగ్ధ.

"ఓషిట్!...నా చెయి నరికేసిందిరా!" అంటూ నేలకూలాడు వాడుకూడా.

మిగిలిన ఇద్దరూ స్నిగ్ధమీద టార్చ్‌లైట్ వేసారు...

వాళ్ళకేసి రెండడుగులు వేసింది స్నిగ్ధ...

"అంతే!...వాళ్ళిద్దరూ గిరుక్కున వెనక్కి తిరిగి మెట్లెక్కి బయటకు పరుగెత్తారు!

సుస్మితను పైకిలేపింది స్నిగ్ధ.

నేలమీద కూలిపోయి బాధతో పెద్దగా అరుస్తూ అటూఇటూ పొర్లుతున్న వాళ్ళిద్దర్ని దాటుకుంటూ సుస్మితతోపాటు మెట్లకేసి నడిచింది స్నిగ్ధ.

వెక్కిళ్ళు దిగమింగుతూ స్నిగ్ధ చెయి పట్టుకుని భవనంలోంచి బయటకి వచ్చింది సుస్మిత.

బయట వెలుతురికి కళ్ళు చెదిరినట్టయిందామెకు చీర సవరించుకుంటూ స్నిగ్ధకేసి చూసి అద్దిరిపడిందామె....

స్నిగ్ధ బట్టలంతా రక్తం మరకలు! ఆమె చేతిలో...ఓగాడ్!...ఏమిటది? "స్నిగ్ధా...ఏమిటది నీ చేతిలో!" అడిగిందామె.

యధాలాపంగా తన చేత్లో ఉన్నదాన్ని చూసింది స్నిగ్ధ.

"ఇదా...కరకింకర కొడవలి...నైవేద్యం పెట్టాలంటే ఇదికావాలి కదా!" అంటూ రక్తం కారుతున్న కొడవలిని తన చీరకొంగుతో శుభ్రంగా తుడవసాగింది.

## 16

రాత్రి పదయింది—

పున్నమి చంద్రుడు కొండలచాటునించి వెలికి వచ్చాడు.

ఖండాలా చెరియ వెన్నెల్లో మిలమిలా మెరిసిపోతోంది.

ఘాట్‌రోడ్డుమీద బండ్ల రాకపోకలు తగ్గి సద్దుమణిగింది.

శీతాకాలం కావడంతో ఖండాలా వాస్తవ్యులు అప్పుడే నిద్రకుపక్ర

మించారు...

ఆ రోజుకి వాళ్ళందరి కార్యక్రమాలు ముగిసినట్టే!

కానీ...

ఖంకాలా ఊరవతల, అడవి అంచుల్లో బటాటావాలా మాన్షన్‌లో కార్యక్రమాలు అప్పుడే మొదలవుతున్నాయి.

రావలసిన అతిథులందరూ వచ్చేసారు...ఇద్దరు తప్ప కాంట్రాక్టర్ జూబిన్, పారిస్‌నించి వచ్చిన అతడి ప్రియురాలు జోసెఫైన్.

డ్రాయింగ్ హాల్లో నల్లటి కొవ్వొత్తులు వెలిగించి పెట్టారు. వాటి వెలుతురులో అక్కడ ఉన్న పదిమంది మౌనంగా కూర్చున్నారు.

ఆడామగా తేడా లేకుండా వాళ్ళందరూ ఒకేలాంటి నల్లటి గౌనులు తొడుక్కుని ఉన్నారు.

పోర్టికోలో కారాగిన శబ్దం విని కాంట్రాక్టర్ జూబిన్‌కూడా వచ్చేసాడని తలుపుకేసి చూసారు వాళ్ళందరూ.

తలుపు తోసుకుంటూ సన్నగా పొడుగ్గా ఉన్న జూబిన్ లోపలికి వచ్చాడు. అతడిని అనుసరిస్తూ బెరుగ్గా వచ్చి నిలబడింది ఫ్రెంచి అమ్మాయి జోసెఫైన్ దాదాపు జూబిన్ అంత పొడవుండి భుజాలవరకు గోధుమరంగులో వొత్తయిన జుట్టు పడుతుంటే ఎంతో అందంగా ఉందామె. జూబిన్ సరసన నిలబడి అతడి చెయి పట్టుకుని అక్కడ కూర్చున్నవాళ్ళని విచిత్రంగా చూసిందామె. ఆమె భుజాల చుట్టూ చెయి వేసి లోపలికి నడిపిస్తూ అందరికీ వినబడేలా అన్నాడు.

"నా గర్ల్‌ఫ్రెండ్...జోసెఫైన్."

అక్కడ కూర్చున్న వాళ్ళెవరూ సమాధానం చెప్పలేదు. ఆ చోటుకి మొట్టమొదటిసారి వచ్చిన ఆ అమ్మాయికేసి పరిశీలనగా చూసారంతే.

జూబిన్ ఆ అమ్మాయితోపాటు ఖాళీగాఉన్న సోఫాలో కూర్చున్నాడు.

అతడుకూడా అందరిలా మౌనంగా కూర్చునేసరికి జోసెఫైన్ అసహనంగా కదిలింది.

"నాకెందుకో ఇక్కడ బాలేదు...వెళ్ళిపోదాం" అంది.

ఆమె నడుంచుట్టూ చెయివేసి తన దగ్గరకు లాక్కుని మెదమీద ముద్దు పెట్టుకున్నాడు జూబిన్.

అంతలో...లోపలి గదిలో ఏదో అలికిడి వినిపించి అందరూ అటు చూసారు.

గుమ్మంలో...

జుట్టు విరబోసుకుని, తెల్ల చీర కట్టుకుని నిలబడి ఉందో పాతికేళ్ళ అమ్మాయి. ఆమె చేతిలో కూడా నల్లటి కొవ్వొత్తి వెలుగుతోంది...

అందర్నీ కళ్ళతోనే పలకరించి జోసఫైన్ కూర్చున్న చోటుకి నెమ్మదిగా నడిచివచ్చిందామె. ఆమె దగ్గరకు రాగానే అప్రయత్నంగా లేచి నిలబడింది జోసెఫైన్.

కంట్రాక్టర్ జూబిన్ కూడా లేచి నిలబడ్డాడు.

"జోసెఫైన్...ఈమె గురించే నేన్నీకు ఇన్నాళ్ళనుంచి చెప్తున్నది అన్నాడతను.

చేతిలో పట్టుకున్న కొవ్వొత్తి బల్ల మీద పెట్టేసి జోసెఫైన్ భుజాల మీద రెండు చేతులు పెట్టి సూటిగా కళ్ళలోకి చూసిందామె.

"నాపేరు కాత్యాయని" అంది అలాగే చూస్తూ.

సమాధానం ఏం చెప్పాలో అర్థంకాక అలాగే నిలబడిపోయింది. జోసెఫైన్.

"మేమంతా నీ మిత్రులమే...నిన్ను కలుసుకోవడానికే వచ్చాం మేమంతా..." అంటూ వెనక్కి తిరిగింది కాత్యాయని.

అంత వరకూ మౌనంగా కూర్చున్న వాళ్ళందరూ చిరునవ్వులతో లేచి జోసెఫైన్ దగ్గరకు వచ్చారు.

కాత్యాయని వెళ్ళి టేబిల్ మీదున్న చిన్న మట్టి గుండ్లలో ఎర్రటి పానీయం పోసి అందరికీ అందించింది.

తనకందించిన గుండులోని పానీయాన్ని తాగకుండా అలాగేచూస్తూ నిలబడ్డ జోసెఫైన్‌తో అంది కాత్యాయని

"సందేహిస్తావేం? తాగు....మీ దేశంలో దొరికే ఏ పానీయానికి తీసిపోదిది..."

నెమ్మదిగా చప్పరించింది జోసెఫైన్. ఘాటుగా గొంతులోంచి ఆ పానీయం కిందికి దిగుతుంటే ఒక్క క్షణం ఉక్కిరి బిక్కిరయింది.

"కానీ, అంతలోనే తెప్పరిల్లి అందరిలా గడగడ తాగేసింది ఆ పానీయం... ఘాటుకి తట్టుకోలేక ఒక్కసారి గట్టిగా కళ్ళుమూసుకుంది.

అంతవరకూ మౌనంగా ఉన్నవాళ్ళందరూ నవ్వుతూ మాట్లాడుకో సాగారు.

జోసెఫైన్‌కూడా నెమ్మదిగా రిలాక్స్ అయింది అందరితో కలిసి పోయి స్నేహంగా మాట్లాడసాగింది.

కాసేపయ్యాక కాత్యాయని ఆమె చెయిపట్టుకుని ఆ గదిలోంచి లోపలికి తీసుకెళ్ళింది.

ఇప్పుడు జోసెఫైన్ మనసులో అంతకుముందున్న జంకులేదు. ఎంతో ఆనందంగా కాత్యాయని వెంటనడిచి వెళ్ళింది.

కాత్యాయని ఆమెను విశాలమయిన స్నానాల గదిలోకి తీసుకెళ్ళి తొట్టె స్నానం చేయించింది.

స్నానం ముగిసాక జోసెఫైన్ ఒళ్ళుతుడిచి ఒంటిమీద విచిత్ర మయిన సువాసన కల తైలం పూసింది.

"పద... అందరూ మనకోసం ఎదురు చూస్తుంటారు" అంటూ ఆమె చెయి పట్టుకుని బయటకు నడిచింది.

డ్రాయింగ్ రూంలో ఎవరూ కనబడలేదు.

ఎక్కడ్నించో నగారా నాదం వినిపించింది జోసెఫైన్‌కి.

ఇద్దరూ అటే నడిచారు.

నగారా నాదం వింటుంటే తన్మయత్వం ఎక్కువయింది జోసెఫైన్‌కి. తన ఒంటిమీద బట్టలులేవనే ధ్యాసకూడా లేదామెకు.

విశాలమయిన ఒక కూటంలో కొన్ని వందల సంఖ్యలో కాగడాలు, నల్లటి కొవ్వొత్తులు వెలిగించి ఉన్నాయి.

కాత్యాయనిని అనుసరిస్తూ కూటంలోకి నడిచింది జోసెఫైన్.

కూటం నడుమ ఎత్తయిన పరవంజ పైన రెండడుగుల కరకింకర విగ్రహం.

అప్పటికే...వాళ్ళందరూ విగ్రహంచుట్టూ నిలబడి ఉన్నారు... నగారానాదంతో వాళ్ళ మంత్రోచ్చారణ కలిసిపోయి ఒక హోరులా విని పిస్తోంది. జూబిన్ కూడా నల్ల గౌను వేసుకుని వాళ్ళతోపాటు నిలబడి ఉండటంతో అతడ్ని వెంటనే గుర్తుపట్టలేదు జోసెఫైన్.

వాళ్ళందరి మధ్యనించి తీసుకెళ్ళి కరకింకర విగ్రహం ముందు నిలబెట్టిందామెను కాత్యాయని—

"కరకింకర కళ్ళల్లోకి చూడు." అంది.

కరకింకర విగ్రహం కళ్ళలో ఆకుపచ్చరంగు కాంతి తళుక్కు మంది.

చూపు తిప్పుకోలేకపోయింది జోసెఫైన్.

ఆమె నిలబడ్డచోటు చుట్టూ గుండ్రంగా ముగ్గొకటి గీసింది కాత్యా యని.

"కరకింకర సన్నిధిలో ఉన్నావు నీవిపుడు. కరకింకరకు నీ సర స్వం సమర్పించుకోవడానికి సిద్ధంగా ఉన్నావా?" అడిగింది కాత్యాయని.

మంత్రముగ్ధురాలిగా తలూపింది జోసెఫైన్.

ఆమెను ముగ్గుమీద వెలకిలా పడుకోబెట్టింది కాత్యాయని.

విగ్రహం కాళ్ళదగ్గర చిన్నగిన్నెలోని రక్తంతో జోసెఫైన్ ఛాతీ మీద, బొడ్డుచుట్టూ, తొడలమీద గుర్తులేవో గీసింది.

"కరకింకరా...మహమ్మారీ!

అఘోరథా...కుంభీనసా...

ఛ్రద...ఛ్రాద...భయం భయా—

...ఈ ఆడది నీ పొందుకోరి, తన శరీరాన్ని ఆత్మని నీకు సమ ర్పించుకుంటోంది. ఇకమీదట నువ్వే ఈ ఆడదాన్ని దైవానివి—నీకుతప్ప మరెవరికీ తలవంచదు. నీ కోసం ఏదైనాచేయడానికి సిద్ధపడుతున్న ఈ భక్తురాలిని స్వీకరించు.

జోసెఫైన్ చూపులు కరకింకర కళ్ళనే చూస్తున్నాయి.

నగారానాదంతో ఆ కూటం మార్మోగిపోతుంటే నెమ్మదిగా కదిలింది ఆ అమ్మాయి.

ఒకవ్యక్తి మరొకవ్యక్తి గురించి తెలుసుకోవడానికి ఇంతకంటే మంచిమార్గం ఏముంటుంది?

వీళ్ళంతా తన సన్నిహితులు...వీళ్ళ స్నేహం కావాలి తనకు। మరి వీళ్ళకు దగ్గర కావాలంటే ఇన్ హిబిషన్స్ అన్నీ ఏరిపారేయాలితను

కైపెక్కిన ఒళ్ళుతో ఆ వ్యక్తిని దగ్గరకు లాక్కుంది మహిత.

జూబిన్ కళ్ళు కాత్యాయనిని వెతికాయి—

కరకింకర విగ్రహం ముందు ఆమె అలాగే మోకరిల్లి ఉంది.

ఆమెను వెనకనించి వెళ్ళి పట్టుకున్నాడతను.

"జూబిన్ నన్ను కోరుకోకు. భీష్మనాయక్ తప్ప మరెవరికీ ఆ అధికారంలేదు." అంది కాత్యాయని నెమ్మదిగా నచ్చచెప్తున్నట్టు.

"నీ అభ్యంతరాలు ఇవాళ వినను। ఇక్కడ అందరూ ఒక్కటే... నన్నాపకు..." అంటూ ఆమెను పట్టుకుని పక్కకు దొర్లాడతను.

"జూబిన్। నా మాటవినవా?" అడిగింది కాత్యాయని.

"వినను?" అంటూ ఆమె చీర పైకెత్తేసాడు జూబిన్.

"సరే..." అని అతడికి లొంగినట్టే లొంగి తక్కున లేచి నిలబడింది కాత్యాయని—

ఆమె తోసిన తోపుకి దూరంగా దొర్లాడతను...

అతడికేసి తీవ్రంగా చూసింది కాత్యాయని...

ఆ చూపుకి తట్టుకోలేకపోయాడు జూబిన్ లేచి నిలబడబోయి కింద పడిపోయాడు.

"జూబిన్। కరకింకర సమక్షంలోనే నన్ను ధిక్కరించావు నీకు శిక్షతప్పదు" అంటూ అతడికేసి కోపంగా కదిలింది కాత్యాయని.

కూటంలో రాసక్రీడలాడుతున్న వాళ్ళందరూ కళ్ళప్పచెప్పి ఆ దృశ్యం చూస్తూ ఉండిపోయారు.

కాత్యాయని ముందుకు నడిచి నేలమీదపడివున్న జూబిన్ నుదిటి మీద చూపుడువేలితో ఏదో రాసింది.

అంతే। జూబిన్ విరుచుకుని పడిపోయాడు...।

అతడి నుదుటిమీద కాత్యాయని గీసిన గుర్తు పచ్చబొట్టు ముద్రలా

ప్రస్ఫుటంగా కనిపించింది.

జూబిన్ నేలమీదపడి బాధతో అలాగే మూలుగు తుండగానే...

మిగతావాళ్ళు...ఏమీ జరగనట్టు మళ్ళీ కామక్రీడల్లోకి దిగారు.

కాత్యాయని వెళ్ళి మళ్ళీ కరకింకర విగ్రహం ముందు మోకరిల్లింది.

కరకింకర ఆరాధన కొనసాగిస్తున్న ఆమె మస్తిష్కంలో కొన్ని వందల మైళ్ళ దూరంలో ఉన్న స్నిగ్ధ రూపం మెదలింది.

• •

ఆ టైంకి హైదరాబాదులో—

పవన్ దగ్గర్నించి వచ్చిన ఉత్తరం మరోసారి చదువుకుంది స్నిగ్ధ.

పవన్ తిరిగి వచ్చేస్తున్నాడు.

అతడి రాకకోసం మరో నెలరోజులు ఓపిక పట్టాలి తను అంతే.

"బబ్లూ, అనిరుద్ధ్! మీ డాడీ వచ్చేస్తున్నార్రా!" అంది స్నిగ్ధ కడుపులో కదుల్తున్న పిల్లవాడితో.

గైనకాలజిస్ట్ ప్రేమాథామస్ లెక్క ప్రకారం బాబు పుట్టడానికి మరో మూడు వారాలుంది. అంటే...పవన్ వచ్చేప్పటికి అనిరుధ్ పుట్టి తను నర్సింగ్ హోంలో ఉంటుందా?...పవన్ వారం పదిరోజులు ముందు వచ్చేస్తే.

అసలు ఆ టైంకల్లా వచ్చేస్తాడేమో!

'నీకొక ప్లెసెంట్ సర్‌ప్రైజ్ ఇద్దామనుకుంటున్నాను' అని పవన్ ..రంలో రాసాడు. అంటే? అనుకున్నదానికంటే ముందే తిరిగి వచ్చేదా ..కుంటున్నావా?

పవన్ ఇచ్చే 'ప్లెసెంట్ సర్‌ప్రైజ్' అదే అయ్యుంటే...తనకంత కంటే కావల్సిందేముంటుంది?

కాన్పుకిముందు .పవన్ తనని చూసి ఏమంటాడో? గత ఆరు నెల్లో తన శరీరంలో చాలా మార్పులు వచ్చాయి. బాగా వొళ్ళుచేసి ..మునపటికంటే ఎనిమిది కిలోలు బరువు పెరిగింది..దాంతో జాకెట్లుకూడా ..న్నవయ్యాయి.

తన పరిస్థితి చూసి వేళాకోళంచేసి ఆటలు పట్టిస్తాడా పవన్?...

లేక మురిసిపోయి దగ్గరకు తీసుకుని ముద్దాడతాడా? అమ్మో!...ఇప్పుడెలా కుదుర్తుందడి?

ఇప్పుడేకాదు. కాన్పు తర్వాత నెలరోజులదాకా పవన్ తనని ముట్టుకోడానికిలేదు.

తనుమాత్రం అన్నాళ్ళు పవన్‌కి దూరంగా ఉండకలుగుతుందా?

నవ్వుకుంటూ ఉత్తరం కవర్‌లో పెట్టేసి, లైటార్పి నిద్రకుపక్ర మించింది స్నిగ్ధ.

......

అలా ఎంతోసేపు నిద్రపోలేదామె—

ఎందుకో...ఉన్నట్టుండి మెలకువ వచ్చేసిందామెకు

కరెంటుపోయి గదిలో పూర్తిగా చీకటిగాఉంది....మంచంమీద ఫ్యాన్ తిరగడంలేదు.

నిద్ర పూర్తిగా తేలిపోయి...అలా చీకట్లో పడుకున్న స్ని మనసులో అనిర్వచనీయమయిన బాధ చోటు చేసుకోసాగింది.

అంతకుముందు...కొన్ని నిమిషాలక్రితం దాకా పవన్ రా ఉత్తరం చదివి ఎంతో ఆనందంగా ఉందితను.

అలాంటిది...

ఒక్కసారిగా ఏమిటీ అలజడీ?

తనెంత ఒంటరిగా ఉంది!...అసలు పవన్ లేకుండా ఇన్ని నెల ఎలా గడప కలిగింది తను?!

పవన్‌తో ఇంగ్లండు వెళ్ళిఉంటే తనకీబాధ తప్పిఉండేది... హైదరాబాదులోనే ఉండిపోయి తను సాధించేదేవిటి?

రాజేశ్వరిదేవిలో ఇంతవరకు చెప్పుకోదగ్గ మార్పు ఏదీలేదు! పై పెచ్చు ఈ మధ్య ఆవిడ మరీ ముభావంగా ఉంటోంది.

ఆరోజు మధ్యాహ్నం పవన్ ఉత్తరం చదవగానే.

"అత్తయ్యగారూ! ఆయన వచ్చేనెల తిరిగి వచ్చేస్తున్నారట! అంది తను ఎంతో ఆనందంగా.

తన సంతోషాన్ని రాజేశ్వరిదేవికూడా పంచుకుంటుంది అనుకుం

...నీ, మొహం అదోలా పెట్టుకుని అక్కడ్నించి వెళ్ళిపోయిందామె.

కొడుకు తిరిగి వస్తున్నాడన్న సంతోషంకంటే అతడు తనకి దగ్గరవుతాడన్న బాధ ఎక్కువగా ఉన్నట్టుంది ఆవిడకి.

పవన్‌పట్ల ఆవిడకున్నది అనురాగమే అయితే అది చాలా సహజంగా ఉంది.

ఇలాంటి అసహజమయిన అటాచ్‌మెంట్‌ని సైకాలజీలో ఏమంటారో? "ఈడిపస్ కాంప్లెక్సా?"...కాదు...అది తల్లిపట్ల కొడుకుకి ...దే అసహజమయిన వాత్సల్యం...ఆ కాంప్లెక్స్ ఉన్నవాడు తల్లి ...క్కన తండ్రి కూర్చోవడంకూడా భరించలేడు...రాజేశ్వరిదేవి కాంప్లెక్స్ ...దికాకపోయినా ఆ కోవకు చెందిందే.

ఇది తన ఊహకాదు! పచ్చి నిజం...

రాజేశ్వరిదేవికి తను బిడ్డను కనడంకూడా ఇష్టంలేదా. ప్రతిసారి ...గైనకాలజిస్టు దగ్గరకు వెళ్ళి వచ్చి బిడ్డ పెరుగుదల బావుందని చెప్ప... ఆమె మొహం వివర్ణమయిపోవడం గమనిస్తూనే ఉంది తను.

...న రాజేశ్వరిదేవికి తనంటే అయిష్టంకాదు...ద్వేషభావం ఉంది.

అసహనంగా మంచంమీద కదిలింది స్నిగ్ధ.

తెగని ఆలోచనలతో మనసు వికలమయిపోతోంది.

.........

...లు పెళ్ళయినప్పట్నించి తన బ్రతుకులో అన్నీ అనూహ్యమయిన ...టనలే.

ప్రారంభంలో అన్నీ భ్రమలేనని సర్దిచెప్పుకుంది—

కానీ, ఏదీ భ్రమకాదు!!

అన్నీ వాస్తవాలే!

కర...కర...

మిహిర్‌కుట్టి...

కాత్యాయనీ—

తన ఇమాజినేషన్‌నుంచి పుట్టినవి కావు,

ఛాలా మట్టుకు ఇవి యదార్థాలేనని చెప్పడానికి...కొన్నాళ్ళక్రితం

సుస్మితతో ఖండాలాకి వెళ్ళినపుడు దొరికిన కొదవలి చాలు.

అలాగే...

రాజేశ్వరిదేవి గురించే తను అనుకుంటున్నది కూడా నిజమే.

పరిస్థితిని తలచుకుని దుఃఖం ముంచుకొచ్చింది స్నిగ్ధకి...

ఎందుకిలా తనని అంతరూ పీడిస్తున్నారు.

తనకు మాత్రమే ఎందుకుండాలి ఇలాంటి బాధలు? ఈ 'పెర్సిక్యూషన్'...'మెంటల్‌టార్చర్' ముగిసేదెపుడూ?

వీటినించి ఎప్పుడు దొరుకుతుంది విముక్తి.

విముక్తి?

చటుక్కున మంచంమీద లేచి కూర్చుంది స్నిగ్ధ...

తన పరిస్థితి నిజంగానే దుర్భరంగా ఉంది...

దీంట్లోంచి బయట పడ్డానికి వెంటనే ఏదయినా చేయాలి తను.

మార్గం ఉందా?...ఉంది?

మంచందిగి నెమ్మదిగా గదిలోంచి బయటకు నడిచింది స్నిగ్ధ—

స్నిగ్ధకు ఒక విషయం తెలియదు...

మనసుని కృంగదీస్తున్న ఆ ఆలోచనలు పూర్తిగా ఆమెవికావని!

పరిసరాలు, వాతావరణం, ఆరోగ్యపరిస్థితి...ఒక వ్యక్తి ఆలోచనా సరళిని ఎంత ప్రభావితం చేస్తాయో అంతకంటే ఎన్నోరెట్లు ఎక్కువ ప్రభావం ఇతరులనించి వెలువడే ద్వేష భావతరంగాలకి ఉంటుంది! అదే 'మెంటల్ పాయిజనింగ్'!...లేదా సైకిక్ అటాక్!"

అప్రమత్తతో ఉండకపోతే...వాటికి లొంగిపోవలసి ఉంటుంది...

హాల్లోకి వచ్చి నిలబడి రాజేశ్వరిదేవి గదికేసి చూసింది స్నిగ్ధ తలుపులు వేసే ఉన్నాయి. ఈపాటికి గాఢనిద్రలో ఉంటుందావిడ.

మెట్లకింద మస్తానమ్మ గదికేసి నడిచి లోపలికి తొంగి చూసింది.

గది మధ్యలో మోకరిల్లిఉంది మస్తానమ్మ ఎందుకో—

అర్ధరాత్రిపూట ఆమె అలా ఎందుకు చేస్తోందో అని కూడా ఆలోచించకుండా వంటింటికేసి నడిచింది స్నిగ్ధ.

వంటింట్లోకివెళ్ళి...

తలుపులు గడియవేసుకుని నిలబడింది...

లోపల చీకటిగా ఉంది...

తడుముకుంటూ వెళ్ళి గట్టుమీదున్న అగ్గిపెట్టె అందుకుని, అగ్గిపుల్ల వెలిగించి చుట్టూ చూసింది స్నిగ్ధ. కిటికీ తలుపులు వేసే ఉన్నాయి.

పవన్...మరో నెలరోజుల్లో వచ్చేస్తాడు...బాబుకూడా మరో నెలరోజుల్లోనే పుడ్తాడు. ఆ తర్వాత తన పరిస్థితులు సర్దుకుంటావేమో!?

నో! అలాంటిదేమీ జరగదు!...

చేతిలో వెలిగించి పట్టుకున్న అగ్గిపుల్ల పూర్తిగా కాలిపోతుంటే కిందపడేసింది స్నిగ్ధ.

ఒకే ఒక్క క్షణం ఆమె మదిలో మెదలిన ఆశాభావం...అంతలోనే తప్పుకుంది.

కింద పడేసిన అగ్గిపుల్ల ఆరిపోతుంటే...మళ్ళీ మనసులో అంధకారమే మిగిలింది.

గ్యాస్ స్టవ్ దగ్గరకెళ్ళి బర్నర్ 'ఆన్'లో తిప్పింది స్నిగ్ధ.

భస్స్...!

శబ్దంచేస్తూ గాస్ బయటకి వచ్చింది.

రెండవ బర్నర్‌కూడా తిప్పింది...

అయిదారు నిమిషాలు కదలకుండా నిలబడిపోయింది స్నిగ్ధ.

గ్యాస్ వాసనకి ఊపిరాడక దగ్గు ప్రారంభమయింది...అయినా అక్కడ్నించి కదల్లేదు.

వంటింట్లో గ్యాస్ నిండిపోతుంటే, స్నిగ్ధ ఆలోచనలు 'బ్లాంక్' అయిపోయాయి.

యాంత్రికంగా...అగ్గిపెట్టెలోంచి మరో అగ్గిపుల్ల తీసి పట్టుకుంది.

"పవన్ నన్ను క్షమించు...బాబూ అనిరుధ్ నువ్వుకూడా!... నువ్వు భూమ్మీద పడకముందే నాతోపాటు నిన్ను తీసుకెళ్ళిపోతున్నాను. అనుకుంది స్నిగ్ధ...

కళ్ళు మూసుకుని

అగ్గిపుల్ల వేళ్ళమధ్య గట్టిగా పట్టుకుని అగ్గిపెట్టెమీద సరుక్కున

గీసింది—

అంతే॥

## 17

ఆ క్షణంలో...

గ్యాస్‌తో పూర్తిగా నిండిపోయిన వంటింట్లో స్నిగ్ధను కబళించు కోవడానికి మృత్యువు సిద్ధంగా ఉంది—

స్నిగ్ధ అగ్గిపెట్టెమీద గీసిన అగ్గిపుల్లనించి రవ్వంత అగ్గి కణం పుటేచాలు—

ఆ వంటిల్లు క్షణంలో అగ్నిగోళంలా మారి అందులో స్నిగ్ధ ఆహుతయిపోతుంది—

స్నిగ్ధతోపాటు—

ఆమె గర్భంలో రూపం దిద్దుకుంటున్న శిశువుకూడా సజీవ దహనమయిపోతుంది.

స్నిగ్ధ మనసుని అన్నాళ్ళుగా పట్టిపీడిస్తున్న భయాలు, భ్రమలతో పాటు—

పవన్‌తో ఆమె చూసిన అందమయిన కలలు—ఆమె మనసు అట్టడుగున దాగివున్న కోరికలు—

రెప్పపాటులో...

భిన్నాభిన్నములై పోతాయి.

కానీ...

ఆ క్షణంలోనే

దబదబ అంటూ వంటింటి తలుపు బాదారెవరో!

స్నిగ్ధ అద్దిరిపడటంతో చేతిలోని అగ్గిపుల్ల సగానికి విరిగి కింద పడిపోయింది.

తలుపు బాదుతున్నదెవరో ఆలోచించడానికికూడా ఆగలేదు స్నిగ్ధ. వెంటనే మరో అగ్గిపుల్ల తీసిపట్టుకుంది.

ఎవరో...

తలుపు తడ్తున్నారు.

తలుపు తెరవకూడదు—సమాధానం చెప్పకూడదు. వెంటనే అగ్గి పుల్ల గీసేయాలి...

మళ్ళీ బయట్నించి తలుపుమీద బాదారెవరో...లోపల్నించి గడియ అదిరిపోతోంది.

ఇక ఆలస్యం చేయకూడదనుకుంది స్నిగ్ధ.

రెండవ అగ్గిపుల్ల గీయబోతుండగా...

ఫెళ ఫెళమని తలుపు గడియ విరిగి...లోపలికి వచ్చి పడింది మస్తానమ్మ.

అదే ఊపులో స్నిగ్ధమీద పడిపోయి ఆమె చేతిలోంచి అగ్గిపెట్టె లాక్కుంది.

అంతలోనే స్నిగ్ధ నడుంచుట్టూ బలంగా వాటేసుకుని వంటింట్లోంచి బయటకి లాగేసింది మస్తానమ్మ.

ఇదంతా జరగడానికి పదిసెకండ్ల కంటే పట్టిఉండదు.

గ్యాస్ నిండిన వంటింట్లోంచి అలా బయటపడగానే స్నిగ్ధ మొహానికి చల్లటి గాలి తగిలింది.

ఛాతీనిండా ప్రాణవాయువు పీల్చుకుంటుంటే ... నెమ్మదిగా మెదడులో మళ్ళీ ఆలోచనలు చోటు చేసుకోసాగాయి.

స్నిగ్ధను వంటింటిలోంచి బయటకు లాగేసిన మస్తానమ్మ మళ్ళీ లోపలికి వెళ్ళి గ్యాస్ స్టవ్ ఆఫ్‌చేసి కిటికీ తలుపులు తెరచేసింది.

అంతలో పడక గదిలోంచి బయటకు వచ్చి హాల్లో లైట్ వేసింది రాజేశ్వరిదేవి.

"ఏమయింది?" అడిగిందామె నిద్రకళ్ళతో—

ఆమెకు సమాధానం చెప్పే పరిస్థితిలో లేదు స్నిగ్ధ.

వంటింట్లోంచి బయటకువచ్చి నిలబడి ఆమెకేసి అదోలా చూసింది మస్తానమ్మ.

"ఏంలేదమ్మగారూ? అమ్మాయిగారు వంటింట్లోకి వెళ్ళిన అలికిడై నేను లేచాను. అంతలో గ్యాస్ వాసన తగిలి ఖంగారుపడి అమ్మాయిగారిని

"కరకింకర నిన్ను స్వీకరిస్తున్నాడు!...ఇకమీదట కరకింకర రక్షణ నీకుంటుంది. అతడ్ని ప్రసన్నుడిని చేసుకో!" అంది కాత్యాయని బిగ్గరగా.

నెమ్మదిగా లేచి విగ్రహం ముందు మోకరిల్లింది ఆ అమ్మాయి మెడలో వేలాడుతున్న ఏసుక్రీస్తు శిలువ లాకెట్టుతీసి కరకింకర కాళ్ళమీద పడేసి ముందుకి వాలిపోయింది ఆ అమ్మాయి.

అలా వాలిపోయి ఉన్న ఆ అమ్మాయి భుజంమీద అంతవరకూ నిప్పుల్లో ఎర్రగా కాలుతున్న ఇనుప ఊచతో తాకింది కాత్యాయని.

బాధభరించలేక బిగ్గరగా అరచి లేచి కూర్చుందా అమ్మాయి.

"కరకింకర గుర్తది! ఈ ముద్ర జీవితాంతం నీతోనే ఉంటుంది. నువ్వు ఈ దేశంలోనే ఉన్నా నీ దేశానికి వెళ్ళినా నీతోటి భక్తులు నిన్ను గుర్తు పట్టకలరు.—" అంది కాత్యాయని

కన్నీళ్ళు చెంపలమీదసించి కారిపోతున్నా నవ్వుతూ ఆమెకేసి చూసింది ఆ అమ్మాయి.

"మన మూర్ధాభిషిక్తుడు, మూల పురుషుడు. భీష్మీనాయక్ ఆదేశాల ప్రకారం ఇకనించి నీ పేరు మహిత!" అంది కాత్యాయని ఆమను లేపి నిలబెడ్తూ.

"మహిత! మహిత!" అంటూ అక్కడివాళ్ళంతా ఆమె చుట్టూ ముట్టారు.

అప్పటికే ఆ అమ్మాయి శరీరంపైన అంతకు ముందు తాగిన పానీయం ప్రభావం చూపిస్తోంది. హాయిగా వాళ్ళ అభినందనలందు కుందామె.

కాసేపయ్యాక కూటంలో ఒకపక్కగా ఉన్న టేబిల్‌కేసి నడిచా రందరూ.

"ఈరోజు మనకెంతో ముఖ్యమయినరోజు...మహిత మనలో కలసిన ఈ సందర్భాన్ని ఉత్సవంలా జరుపుకోవాలి." అంది కాత్యాయని అందరికీ వినబడేలా.

కాత్యాయని అలా అందోలేదో.

అందరూ...బల్లమీదున్న తిండిమీద పడ్డారు.

అందరిలా మహితకూడా మట్టిపాత్రల్లో వండిపెట్టిన మాంసం పీక్కుని తినసాగింది.

అంతలో వాళ్ళలోని ఒక అమ్మాయి ఆ బల్లమీద కెక్కి నిలబడి నాట్యమాడసాగింది. మిగతావాళ్ళు చప్పట్లుకొడ్తూ, కాత్యాయని అందిస్తున్న పానీయాన్ని సేవిస్తూ నవ్వసాగారు.

నాట్యమాడుతున్న అమ్మాయి ఉన్నట్టుండి మెడదగ్గర కట్టిన గౌను ముడి విప్పేసింది. గౌను కిందకు జారిపడిపోయాక నగ్నంగా నాట్యం కొనసాగించిందామె.

అంతవరకూ చప్పట్లు కొడ్తున్న ఒకతను తన గౌను కూడా విప్పి పడేసి బల్లమీద నాట్యం చేస్తున్న అమ్మాయిని ఎత్తుకుని కూటం మధ్యకి వెళ్ళాడు.

జూబిన్ మహిత నడుంచుట్టూ చేయి వేసాడు. అందరితోపాటు అతను కూడా గౌను తీసేసాడప్పటికే...

మరికాసేపట్లోనే—

కూటంలో అందరూ నగ్నంగా ఉన్నారు...కాత్యాయని తప్ప.

ఆమె మాత్రం కరకింకర విగ్రహం ముందు మోకరిల్లి కూర్చుంది

కాత్యాయనికి కొంతదూరంలోనే మహితను నేలమీద పడుకోబెట్టి ఆమెమీదకు వాలిపోయాడు జూబిన్. మహిత దేనికీ అభ్యంతరం చెప్ప లేదు! ఆ వాతావరణం ఆమెకు మత్తెక్కించేస్తోంది. ఫ్రీలైఫ్!...ఫ్రీసెక్స్! ఎటువంటి అరమరికలు లేకుండా అందరూ సంగమిస్తున్నారు!

జూబిన్ జరగ్గానే నెరసిన గెడ్డం ఉన్నతను మహిత చెయి పట్టు కుని లాగాడు.

తన ప్రియుడు వెళ్తున్నవైపు చూసింది మహిత.

"ఇక్కడ అందరం ఒక్కటే! అందరం అందర్నీ పంచుకుంటాం అంటూనే ఆమెను కౌగిట్లో బంధించేసాడతను.

అతడిమాటలు సబబుగానే తోచాయి మహితకు.

అవునుమరి!!

బయటకు లాగేసాను అంది నెమ్మదిగా.

స్నిగ్ధకేసి విచిత్రంగా చూసింది రాజేశ్వరిదేవి...

"ఇంతరాత్రివేళ వంటింట్లో ఏం చేస్తున్నావ్?" అడిగిందామె.

ఏదో చెప్పడానికి ప్రయత్నించి ఊరుకుంది స్నిగ్ధ.

"అమ్మాయిగారు కూడా గ్యాస్ వాసనకే లేచి వచ్చి ఉంటారు. అంతే కదూ అమ్మాయిగారూ?" అడిగింది మస్తానమ్మ చిరునవ్వుతో...

అవునన్నట్టు తలూపి నెమ్మదిగా తన గదికేసి నడిచింది స్నిగ్ధ.

ఆమె వెళ్తున్నవైపు చూస్తూ నిలబడిపోయింది రాజేశ్వరిదేవి—

బెడ్రూం తలుపు లోపల్నుంచి గడియపెట్టుకుని మంచంమీద బోర్లాపడుకుంది స్నిగ్ధ...

జరిగింది అవగాహన చేసుకోడానికి ప్రయత్నిస్తోంది ఆమె మనసు ఏమిటి తను చేయబోయింది.

ఆత్మహత్య!...

అంత దారుణమైన ఆలోచన ఎలావచ్చింది తనకి? తన చావు అన్నింటికీ పరిష్కారమవుతుందని ఎలా అనుకుంది?

ఉన్నట్టుండి ఆత్మహత్య చేసుకోవాలనే పిరికిఆలోచనకి ఎలా తల వంచింది తను?

ఇన్నాళ్ళూ...ఇలాంటి భయంకరమయిన ఆలోచనలు తన మనసులో ఉన్నట్టుకూడా తెలియదు.

ఆత్మహత్య చేసుకోవాలని అనుకోవడం మాత్రమేకాదు...ఏకంగా ఆత్మహత్యకు పూనుకుంది తను! ఎందుకు వచ్చింది తనలో ఆ తెగింపు?!

తను, తనలా ప్రవర్తించలేదు!...

మరోవ్యక్తిలా...ప్రవర్తించింది!

స్నిగ్ధకి మొట్టమొదటిసారిగా భయం వేసింది.

తనంటే తనకే భయంవేసింది.

మస్తానమ్మ రావడం ఒక్క క్షణం ఆలస్యం అయ్యుంటే ఈపాటికి...తను దహనమయిపోయి ఉండేది!...తనతోపాటు కడుపులో పెరుగుతున్న అనిరుద్ధ్కూడా మసయిపోయేవాడు!

కాస్తంతలో...ఎంత పెద్ద ప్రమాదం తప్పింది!

మస్తానమ్మ తనని రక్షించడమేకాదు...జరిగిన విషయం ఎంతో తెలివిగా రాజేశ్వరిదేవికి తెలియకుండా కప్పిపుచ్చింది...

వంటింట్లో తలుపులు గడియ వేసుకుని తను చేయదలచుకుందేమిటో మస్తానమ్మకు ఎలాగో తెలిసిపోయింది. అయినా ఆ విషయం రాజేశ్వరిదేవికి తెలియనివ్వలేదు.

ఇన్నాళ్ళు మస్తానమ్మని ఎంత తప్పుగా అర్థం చేసుకుంది తను.

నెమ్మదిగా మంచంమీద లేచి కూర్చుంది స్నిగ్ధ...ఎదురుగా డ్రెస్సింగ్ టేబుల్‌మీద పవన్ ఫొటో కనబడింది.

మంచం దిగివెళ్ళి ఆ ఫోటో అందుకుంది...

తన భర్త! తన ప్రియుడు...తన ఏకైక మిత్రుడు పవన్! మరో నెలరోజుల్లో తిరిగి వచ్చేస్తాడు.

అప్పటికి అనిరుధ్‌కూడా పుట్టి వుంటాడు.

ఇక ఆ తర్వాత తన జీవితం సాఫీగానే సాగిపోతుంది.

అంత అందమైన భవిష్యత్తుని ఎలా వొదులుకోవాలనుకుంది తను?

పవన్ ఫోటోని గట్టిగా ముద్దెట్టుకుంది స్నిగ్ధ.

"ఫర్ గివ్‌మీ పవన్!" అని ఫొటోని ఛాతీకి హత్తుకుని మంచం మీద పడుకుంది.

జరిగింది మళ్ళీ తలచుకుని వెక్కి వెక్కి ఏడవసాగింది స్నిగ్ధ.

అలా కొంతసేపు ఏడవటంతో అంతవరకూ ఆమెలో ఉన్న టెంషన్ పట్టుసడలి రిలీఫ్ అనిపించిందామెకు...

కన్నీళ్ళకు తడసిపోయిన తలగడామీద పవన్ ఫొటో పట్టుకుని సొమ్మసిల్లి నిద్రపోయింది స్నిగ్ధ.

• • •

ఆ సమయానికి రాజేశ్వరిదేవికూడా తన మంచంమీద పడుకుని ఉందికాని...ఆమె నిద్రపోవడంలేదు.

కళ్ళుమూసుకుని ఏదో ఆలోచిస్తోంది.

అంతలో గది తలుపు దగ్గర ఎవరోవచ్చిన అలికిడయింది. అయినా

కళ్ళు తెరవలేదు రాజేశ్వరిదేవి.

గదిలోకి నెమ్మదిగా నడచివస్తున్న ఆ అడుగుల చప్పుడు ఎవరిదో బాగా తెలుసామెకు.

"అమ్మగారూ...నిద్రపోయారా?" అడిగింది మస్తానమ్మ కంఠం.

సమాధానం చెప్పకుండా అలాగే పడుకుంది రాజేశ్వరిదేవి.

"వంటింట్లో తలుపులువేసుకుని ఆ అమ్మాయి ఆత్మహత్య చేసుకుందామనుకుంది. నేను ఆపకపోతే...అంతపనీ జరిగుండేది..." మంచం పక్కన కూర్చుని గుసగుసలాడింది మస్తానమ్మ.

రాజేశ్వరిదేవి కళ్ళు తెరవలేదు...కనీసం జవాబయినా ఇవ్వలేదు.

మస్తానమ్మ మళ్ళీ మాట్లాడింది.

నెలలు నిండిన ఆడది ఇలా చావకూడదు!...పైగా ఇవాళ నిండు చంద్రుడు ఆకాశమెక్కాడు. ఈరోజు ఇలాంటిది జరిగితే అంతా బెడిసి కొడ్తుంది. పన్నెండేళ్ళదాకా ఆమె ప్రేతాత్మ ఈ ఇంట్లో వాళ్ళకి మన శ్శాంతి లేకుండా చేయకలదు."

• • •

మర్నాడు ఉదయం పది గంటలకి గైనకాలజిస్ట్ డాక్టర్ ప్రేమ నర్సింగ్‌హోంకి బయల్దేరుతూ రాజేశ్వరిదేవి గదిలోకి వెళ్ళింది స్నిగ్ధ.

"అత్తయ్యగారూ—డాక్టర్ ప్రేమ అపాయింట్‌మెంట్ ఉంది గంటలో తిరిగి వచ్చేస్తాను" అంది.

"అలాగే..." అంది రాజేశ్వరిదేవి పొడిగా.

రాజేశ్వరిదేవి అలా ముభావంగా మాట్లాడటం స్నిగ్ధకి అలవాటయిపోయింది...

పవన్‌ని యూ.కే కి సాగనంపుతున్నపుడు తనని కనిపెట్టుకుని ఉంటానని అతడికి ధైర్యం చెప్పింది రాజేశ్వరిదేవి! కానీ, గైనకాలజిస్టు దగ్గరకెళ్తునపుడు "నేనూ తోడురానా?" అని ఒక్కసారయినా మాట వరసకు అడగలేదు గత అయిదు నెలల్లో.

ఇంటి కాంపౌండు గేటుకేసి నడుస్తున్న స్నిగ్ధ గేటు దగ్గర కారు లోంచి సుస్మిత దిగుతుండటంచూసి ఆశ్చర్యపోయింది.

"హాయ్ స్నిగ్ధా! ఎక్కడికి బయల్దేరావు?" అడిగింది సుస్మిత గేటు దగ్గరే నిలబడిపోయి.

"డాక్టర్ ప్రేమ నర్సింగ్‌హోంకి...రా...లోపలికి రా!...అంటూ గేటు తెరచిలోపలికి ఆహ్వానించింది స్నిగ్ధ.

"లోపలికెందుకులే...పద నేనుకూడా వస్తాను నీతో నిన్నక్కడ దింపి వెళ్ళిపోతాను" స్నిగ్ధ చేయి పట్టుకుని కారుకేసి నడిచింది సుస్మిత.

కారు స్టార్టుచేసి ముందుకు పోనిస్తూ అడిగింది సుస్మిత.

"ఎలాఉంది నీ ఆరోగ్యం?"

"ఫర్వాలేదు బాగానేఉంది .." అంది స్నిగ్ధ.

"నో...నీకు ఒంట్లో బావున్నట్టులేదు! మొహం అంతా అదోలా ఉంది ప్రాబ్లమ్ ఏమిటి?" అడిగింది సుస్మిత ఆమె మొహంలోకి చూస్తూ.

"ఏం...ఏంలేదే!" అంది స్నిగ్ధ చూపులు తిప్పుకుంటూ.

"స్నిగ్ధా ఏదో దాస్తున్నావ్!...నీ మొహం బాగా పీక్కుని పోయింది...రాత్రంతా ఏడ్చినట్టు కళ్ళు ఉబ్బి ఉన్నాయి...ఏమిటిసంగతి అడిగింది సుస్మిత మళ్ళీ...

సుస్మిత అంత ఆప్యాయంగా మాట్లాడుతుంటే కరిగిపోయింది స్నిగ్ధ. క్రితం రాత్రి జరిగిందంతా నెమ్మదిగా చెప్పింది.

"ఓ గాడ్!..." అంది సుస్మిత అంతా విన్నాక.

"నీకేమనిపిస్తోంది సుస్మి? నాకు పిచ్చి పడుతోందంటావా?" అడిగింది స్నిగ్ధ.

"ఛ...అవేంమాటలు" అంది సుస్మిత నవ్వు తెచ్చిపెట్టుకుంటూ

"లేకపోతే ఎందుకిలా చేస్తాను నేను? కారణంలేకుండా సూయిసైడ్ ప్రయత్నం చేసానంటే. నాకు బ్యాలెన్స్ ఆఫ్ మైండ్ పోతున్నట్టేకదా? ఎందుకవుతోందిలా?" సుస్మిత భుజం పట్టుకుని అడిగింది స్నిగ్ధ.

"సిగ్ధా! వర్క్ అప్ అయిపోకు! ప్రెగ్నెన్సీలో ఆడవాళ్ళకిఇలాంటి ఆలోచనలు రావడం మామూలే! కొన్ని కేసుల్లో ఇలా జరుగుతుంది. కొంతమంది గర్భిణీ స్త్రీలకు నెర్వస్ బ్రేక్‌డౌన్ కూడా వస్తుంది. దీనిగురించి కంగారుపడవలసిందేమీలేదు...కాన్పు తర్వాత అంతా సర్దుకుంటుంది."

అంది సుస్మిత ఓదార్పుగా.

స్నిగ్ధ కొంచెం రిలాక్స్ అయి కారుసీట్‌లో జారి కూర్చుంది అయినా ఆమె ఆలోచనలు తెగడంలేదు.

"నిన్నరాత్రి కాకతాళీయంగా మస్తానమ్మ వచ్చింది కాబట్టి సరిపోయింది...మరోసారి ఇలాజరిగితే?..." అడిగింది స్నిగ్ధ శూన్యంలోకి చూస్తూ.

"డోంట్ బీ ఫన్నీ...నీ కిపుడు కావల్సింది రిలాక్సేషన్ అలాంటి డిప్రెసింగ్ ఆలోచనలు వస్తున్నాయనిపించినపుడు నేనింతకుముందు రాసిచ్చిన నిద్రమాత్రలు వేసుకో...లేకపోతే మీ గైనకాలజిస్ట్‌ని అడిగి ట్రాంక్విలై జర్స్ ఏ వైనా వేసుకో..." అంది సుస్మిత గేరు మారుస్తూ.

సుస్మిత మాటలు స్నిగ్ధ విందో లేదో ... కళ్ళు మూసుకుని కూర్చుంది—

"ఒకవేళ నేను చచ్చిపోతే—?—పవన్ తట్టుకోకలడా? ఒంటరిగా బతకకలడా?" తనలోతనే మాట్లాడు కుంటునట్టుంది స్నిగ్ధ ధోరణి.

సుస్మిత ఏదో సమాధానం చెప్పబోయేంతలోనే చటుక్కునసీటులో లేచి కూర్చుని ఆమె చేయి పట్టుకుంది స్నిగ్ధ—

"సుస్మిత! ఒకవేళ నేను చచ్చిపోతే పవన్‌ని నువ్వు పెళ్ళి చేసుకుంటావా?...ప్లీజ్! కాదనకు!" అంది ప్రాధేయపడుతున్నట్టు.

సడన్ బ్రేక్‌వేసి రోడ్డు మధ్యన కారు ఆపేసింది సుస్మిత.

• • •

స్నిగ్ధకి పి.వి ముగించి చేతులు కడుక్కుని వచ్చింది డాక్టర్ ప్రేమ.

"అంతా నార్మల్‌గా ఉందమ్మాయి. ఈ నెలాఖరుకి డెలివరీ అవుతుంది. థర్డ్‌ఫ్లోర్‌లో నీ కోసం రూంకూడా అట్టిపెడతాను" అందామె చిరునవ్వుతో.

"థాంక్యూ డాక్టర్" అంది స్నిగ్ధ లేచినిలబడుతూ.

"డీ కంప్రెషన్ చేయించుకుని వెళ్తావుకదా? సిస్టర్ నీ కోసం అక్కడే ఉంది."

"అలాగే" అని స్నిగ్ధ కదలబోతూంటే ఆపింది డాక్టర్ ప్రేమ.

"అన్నట్టు నీకీ పుస్తకం చూపిద్దామని పెట్టాను..." అంటూ చిన్న పాకెట్‌బుక్ ఒకటి అందించింది.

పుస్తకం అందుకుని కవర్‌పేజీమీద బొమ్మ చూసింది స్నిగ్ధ.

ముద్దుగా ఉన్న రెండేళ్ళ పిల్లవాడి బొమ్మ అది...పైన **'How to make a Super baby?'** అక్షరాలు మెరుస్తున్నాయి.

"...నువ్వు తీసుకుంటున్న డీ కంప్రెషన్ ట్రీట్‌మెంట్ గురించి వివరంగా ఉందన్నాయి ఈ పుస్తకంలో! ఈ ట్రీట్‌మెంట్ తీసుకున్న తల్లిపిల్లలు ఎంత చురుగ్గా ఉంటారో సైంటిఫిగ్‌గా ఉంది. ఫ్రీగా ఉన్నపుడు చదువు. ఇన్నాళ్ళు క్రమం తప్పకుండా ఈ ట్రీట్‌మెంట్ తీసుకున్న నీకు పుట్టబోయే బిడ్డ ఎలా ఉంటాడో చూడాలని నాకు చాలా కుతూహలంగా ఉంది." అంది డాక్టర్ ప్రేమ.

ఆ పుస్తకం అట్నించి ఇటు ఒకసారి తిప్పి చూసింది స్నిగ్ధ.

"తప్పకుండా చదువుతానండీ ఈ పుస్తకం" అని డాక్టర్ ప్రేమ దగ్గర సెలవు పుచ్చుకుని డీ కంప్రెషన్ యూనిట్ ఉన్న గదిలోకి వెళ్ళింది స్నిగ్ధ.

నర్సింగ్‌హోంనుంచి బయటకి వచ్చేపటికి మధ్యాహ్నం పన్నెండయింది.

రోడ్డుమీద వెంటనే ఆటో కనపడక నడక ప్రారంభించింది స్నిగ్ధ.

మిట్టమధ్యాహ్నం ఎండలో నడుస్తుంటే ఆయాసంగా ఉంది. అయినా, ఆగకుండా నడవసాగిందామె.

అంతలో...

ఆమెను దాటుకుంటూ ఒక ఖాళీ ఆటో ముందుకు దూసుకుని వెళ్ళింది.

"ఆటో!" బిగ్గరగా పిలిచింది స్నిగ్ధ.

ఆటోవాడు సడన్ బ్రేక్‌వేసి రోడ్డు పక్కన ఆపి వెనక్కి తిరిగి చూసాడు.

'ఎక్కడికి?' అన్నట్టు అక్కడ నించే సైగచేసి అడిగాడు.

నడకవేగం పెంచి ఆటో దగ్గరకు చేరుకుని "బంజారాహిల్స్"

అంది స్నిగ్ధ.

ఆమెను ఆటో ఎక్కమని చెప్పి రోడ్డు పక్కన ఉన్న సిగరెట్టు కొట్టుకేసి వెళ్ళాడతను.

ఆటోవాడు తీరిగ్గా కిళ్ళీ కట్టించుకుని సిగరెట్టుముట్టించుకుని వస్తుంటే చికాగ్గా కూర్చుంది స్నిగ్ధ.

"ఇంత ఆలస్యం చేస్తే ఎలా? త్వరగాపోనీ!" అంది విసుగ్గా

స్నిగ్ధకేసి ఖాతరు చేయనట్టుగా చూసాడు వాడు.

"త్వరగా పోవాలా? అర్జెంటా?" అడిగాడు పళ్ళికిలిస్తూ.

అతడికేసి కోపంగా చూసింది స్నిగ్ధ.

"అవును! చాలా అర్జెంటు!" అంది

ఆమె అలా అందో లేదో సీటులో కూర్చుని ఆటో స్టార్టుచేసి ఫుల్ స్పీడ్‌లో ఆటో పోనిచ్చాడు డ్రైవర్.

క్షణక్షణానికి ఆటో వేగం పెరిగిపోతుంటే అటూ ఇటూ ఊగిపో తోంది స్నిగ్ధ.

ఆటోడ్రైవర్...కావాలనే అలాచేస్తున్నాడని అర్థమయిందిస్నిగ్ధకి. అతడ్ని ఆటో ఆపమన్నా...నెమ్మదిగా పోనివ్వమన్నా అనవసరమయిన వాదనలోకి దిగుతాడు.

ఏమీ పట్టించుకోనట్టు కూర్చోవడమే మంచిదని ఊపిరి బిగబట్టుకుని కూర్చుంది స్నిగ్ధ.

స్నిగ్ధ ఏమీ మాట్లాడకపోయేసరికి మరింత ప్రేరేగి, రోడ్డుమీద వెళుతున్న కార్లను, ఓవర్‌టేక్ చేస్తూ గతుకులని, స్పీడ్‌బ్రేకర్స్‌ని లెక్క చేయకుండా మరింత వేగంగా పోనిచ్చాడతను ఆటోని.

ఆటోవాడిమీద పట్టరాని కోపం వస్తోంది. స్నిగ్ధకి...కానీ చేసేది లేక సీటు పక్కనున్న రాడ్ గట్టిగా పట్టుకుని కూర్చుండిపోయింది.

ఇదంతా సరిపోదన్నట్టు—

ఎదురుగా వెళుతున్న ఒక సిటీబస్‌ని ఓవర్‌టేక్ చేద్దామని ఆటో వాడు బండిని రోడ్డు కుడివైపుకి పోనిచ్చాడు.

సరిగ్గా అప్పుడే...ఎదురుగా ఒక అంబాసడర్ కారు వస్తోంది!

అపుడరిచింది స్నిగ్ధ బిగ్గరగా—

కానీ,

అప్పటికే ఆటోవాడు చాలా ముందుకి వెళ్ళిపోయాడు.

అంత స్పీడులో వెళ్తూ ఆటోని పక్కకి తిప్పుకోలేకపోయాడు.

ఆటోముందుగా సిటీబస్‌ని గుద్దుకుని...ఆ దెబ్బకు కుడివైపుకి ఒరిగి ఎదురుగా వస్తున్న అంబాసడర్ కారుకి గుద్దుకుంది।

కళ్ళు గట్టిగా మూసుకుంది స్నిగ్ధ—

ఆ తర్వాత...

పెద్దమోత।

జనం...అరుపులు।...

బస్సుకి...అంబాసడర్ కారుకిమధ్య ఆటో చిలికి తుక్కయి పోతుంటే...ఎవరో విసిరేసినట్టు రోడ్డు పక్కన లైటు పోల్ దగ్గరకెళ్ళి పడింది స్నిగ్ధ।

కళ్ళు బైర్లు కమ్మినట్టయి ఒక్కక్షణం అలాగే ఉండి పోయింది. ఆ తర్వాత—నెమ్మదిగా కళ్ళుతెరచి చూసింది.

రోడ్డుకి ఒకవైపు చితికిపోయిన ఆటోరిక్షా... పడిఉంటే...బస్సు కింద రక్తం మడుగులో ఆటోడ్రైవర్।

అతడి ప్రాణాలు అప్పటికే పోయాయని తెలుస్తూనే ఉంది.

తను మాత్రం ... ఆటోలోంచి బయటకి ... ఏమో ఎలా వచ్చి పడిందో?।

అదృశ్య శక్తేదో తోడ్పడినట్టు...చెక్కు చెదరకుండా ప్రమాదం తప్పించుకుంది తను।

చెక్కు చెదరకుండానా?

తన వొంటికి గాయాలు కూడా తగల్లేదా?

అప్రయత్నంగా తనకేసి చూసుకుంది స్నిగ్ధ...

దెబ్బలు ఏమీ తగిలినట్టులేదు।

అప్పటికే రోడ్డుమీద జనం అక్కడ గుమిగూడుకున్నారు... ఇద్దరు ముగ్గురు తనక్కడ పడి ఉండటం గమనించి అటుకేసి వస్తున్నారు।

నెమ్మదిగా లేచి నిలబడిండి స్నిగ్ధ...

ఆక్సిడెంట్ జరిగిన షాక్‌కి కాబోలు కాళ్ళు వొణుకుతున్నట్టనిపించి లైట్ స్థంభానికి ఆనుకుని నిలబడింది ఒక్క క్షణం!

అపుడు ప్రారంభమయింది... మెరపులా కడుపులో భరించలేని నొప్పి.

ప్రేగులు నలిపేస్తున్నట్టు.

రంపం పెట్టి కోసేస్తున్నట్టు!

"అమ్మా!" అంటూ కడుపు పట్టుకుని ముందుకి వొంగింది స్నిగ్ధ.

రక్తం!...రక్తం!!

తను నిలబడ్డచోటు రక్తం కారుతోంది...తొడలమీదుగా...వెచ్చగా ప్రవహించి కాళ్ళమధ్యనించి రక్తం కారిపోతోంది.

అలా ధారగా కారిపోతున్న రక్తం వొంటిమీద తగిలిన గాయం లోంచి కారడంలేదు.

అసలు వొంటిమీద గాయాలు ఏమీ తగల్లేదు తనకి...!

మరి ఈ రక్తం??!...జరుగుతున్నది ఏమిటో అర్థమయి గుండె లయ తప్పినట్టయింది స్నిగ్ధకి.

"బాబూ!...అనిరుధ్!" అని బిగ్గరగా అరచి పొట్టపట్టుకుని కిందకు ఒరిగింది స్నిగ్ధ.

రోడ్డుమధ్య ఆక్సిడెంట్ జరిగినచోటు గాలికి రెపరెపలాడుతున్న ఒకచిన్న పుస్తకంకేసి బ్లాంక్‌గా చూస్తూ ఉండిపోయింది స్నిగ్ధ...డాక్టర్ ప్రేమ ఇచ్చిన పుస్తకం అది-**How to make a Super Baby**-

## 18

సాయంత్రం అరవుతుంటే రాజేశ్వరిదేవి ఇంట్లో కాలింగ్ బెల్ మోగింది.

మండువాలో గార్డన్ ఛైర్ వేసుకుని కూర్చున్న రాజేశ్వరిదేవి నెమ్మదిగా లేచివెళ్ళి తలుపుతీసింది.

"ఎవ్వరండీ?" అడిగిందామె ఎదురుగా నిలబడ్డ అపరిచితుడ్ని చూసి.

"స్నిగ్ధగారిల్లు ఇదేనాండీ?" అడిగాడతను.

మొహం చిట్లించుకుందామె.

"అవును. ఆ అమ్మాయి ఈ ఇంట్లోనే ఉంటుంది ఏం?"

"నేను డాక్టర్ ప్రేమా నర్సింగ్‌హోంనించి వస్తున్నానండీ. ఇవాళ మధ్యాహ్నం స్నిగ్ధగారు మా నర్సింగ్‌హోంనించి తిరిగివెళ్తుంటే ఆవిడ ఎక్కిన ఆటోకి ఆక్సిడెంట్ అయింది." అన్నాడతను.

"ఆక్సిడెంట్ అయిందా?" అడిగింది రాజేశ్వరిదేవి.

ఆవిడ మొహంలో కంగారేమీ కనబడలేదా వచ్చిన వ్యక్తికి. అయినా అన్నాడు.

"కంగారు పడాల్సినదేమీలేదమ్మా...స్నిగ్ధగారికి అదృష్టవశాత్తు పెద్ద దెబ్బలేమీ తగల్లేదు...కానీ...నెలలు నిండిన మనిషికదా ఆటోలోంచి బయట పడటంతో బాగా బ్లీడింగ్ మొదలయింది. డాక్టర్ ప్రేమ చాలా ప్రయత్నించారు అయినా తగ్గలేదు. వెంటనే సిసేరియన్ చేయాలంటున్నారు డాక్టర్‌గారు"

"సిసేరియన్ ఆపరేషనా?" అంది రాజేశ్వరిదేవి ఆశ్చర్యపోతూ.

"అవునమ్మా తప్పనిసరిగా చేయాల్సొస్తోంది మీరు వెంటనే బయల్దేరండి."

ఒక్కక్షణం తటపటాయించి అడిగింది రాజేశ్వరిదేవి.

"ఆపరేషన్ చేసి బిడ్డను బయటకి తీస్తున్నారంటే...బిడ్డ...?"

"ఇలాంటి ఎమర్జన్సీ కేసుల్లో తల్లి ప్రాణాలు కాపాడ్డానికే ప్రయత్నిస్తారు కదమ్మా!—అయినా అంత రక్తం పోయిందంటే ఇంత వరకూ బిడ్డ అసలు బతికే ఉందా అన్నదికూడా చెప్పలేం...ఇక ఆలస్యం చేయకండమ్మా మనం మిగతా విషయాలు దారిలో మాట్లాడుకోవచ్చు. మిమ్మల్ని తీసుకెళ్ళడానికి డాక్టర్‌గారి కారుతెచ్చాను." అన్నాడతను రాజేశ్వరిదేవిని తొందరపెడ్తూ.

"ఇదిగో ఇపుడే వచ్చేస్తాను. మీరు లోపలికి వచ్చి కూర్చోండి" అంటూ వెనక్కి తిరిగింది.

పడకగదిలోకి వెళ్ళి చీరమార్చుకుని హాల్లో నిలబడ్డ మస్తానమ్మని

పిలిచింది రాజేశ్వరిదేవి.

"అమ్మాయికి ఆక్సిడెంట్ అయిందిట..." అని ఏదో చెప్పబో యేంతలో ఆమె చేతికి చిన్న ఎయిర్ బ్యాగ్ ఒకటి అందిస్తూ చెప్పింది మస్తానమ్మ.

"విన్నానమ్మగారూ ... మీరు వెళ్ళిరండి నేను ఇల్లు చూసు కుంటాను."

మస్తానమ్మ అందించిన ఎయిర్ బ్యాగ్‌ని చూస్తూ అడిగింది రాజే శ్వరిదేవి "ఇదిదేనికి?" అని.

"ఆమె మార్చుకోవడానికి చీర అడుగుతారు కదా హాస్పిటల్‌వాళ్ళు అదే ఉంచాను." అంది మస్తానమ్మ.

"సరే" అని బయటకు నడవబోయి ఆగింది రాజేశ్వరిదేవి.

"మస్తానమ్మ!...బిడ్డ బతుకుతుందా?" అడిగిందామె సందేహిస్తూ.

మస్తానమ్మ నవ్వింది. నల్లటి ఆమె మొహంలో తెల్లటి పలువరస విచిత్రంగా మెరిసింది.

"ఇంకెంతమ్మా! మరో గంటన్నర...అంతే! జరిగేది జరిగితీరు తుంది!" అంది.

తేలిగ్గా ఊపిరి పీల్చుకుని అక్కడ్నించి కదిలింది రాజేశ్వరిదేవి.

డాక్టర్ ప్రేమ పంపించిన కారులో రాజేశ్వరిదేవి బయల్దేరివెళ్ళాక వీధితలుపు గడియవేసి స్నిగ్ధగదిలోకి నడిచింది మస్తానమ్మ.

ఏదో ఆలోచిస్తూ గదిమధ్యనున్న మంచంమీద వెల్లకిలా పడుకుం దామె.

ఇప్పటిదాకా, అన్నీ తను అనుకున్నట్టే జరుగుతున్నాయి!—

తన మంత్రశక్తి నిజంగా చాలా గొప్పది.

ఖబీస్‌ని బంధించి తన ఆధీనంలో పెట్టుకోకలిగింది.

స్నిగ్ధలాటి మొండి ఘటాన్ని ఇపుడు మతిలేనిదానిగాచేసి ఆడించ గలదు తను.

మరి కొంచెం సేపట్లో వమ్ము కానున్న స్నిగ్ధ శిశువు తను సైతా నుకు సమర్పించే మొదటి కానుక!—వచ్చే పౌర్ణమినాటికి కావలిస్తే స్నిగ్ధను

కూడా సైతానుకి సమర్పిస్తుంది తను.

ఇవన్నీ జరిగాక కాని రాడు పవన్.

అప్పుడతడ్ని వశం చేసుకోవడం ఏమంత పెద్ద సమస్యకాదు. అతను తనకు లోబడితే—ఈ ఇంటికి మహారాణిలా ఉంటుంది తను.

గది ఈశాన్యంమూల ఏదో కదలిక గమనించి అటుకేసి తీక్షణంగా చూసింది మస్తానమ్మ.

నిటారుగాలేచి నిలబడింది ఖబీస్!

'అన్నీ నీ కనుకూలంగా సాగిపోతున్నాయని విర్రవీగుతున్నావా అడిగింది ఖబీస్ పెదాలు కదపకుండానే.

దానికేసి కోపంగా చూసింది మస్తానమ్మ. ఖబీస్ ఎవరిమనసులో మాటైనా ఇట్టే పసిగడ్తుంది. కానీ యజమానురాలైన తన మనసులో ఏముందో తెలుసుకునే సాహసంచేసిందంటే శిక్షవేయక తప్పదు.

"నన్ను శిక్షిస్తే శిక్షించు. కానీ ముందు నా మాటకు సమాధానం చెప్పు" అంది ఖబీస్ తల ఎగరేస్తూ.

ఏమిటన్నట్టు చూసింది మస్తానమ్మ.

"నన్ను ఇన్నిరోజులుగా ఇలా బంధించి పడేసావే నీకేమిటి లాభం? కనీసం నాకేదైనా పనికూడా చెప్పవే!"

"నీకెప్పుడు ఏ పని చెప్పాలో నాకు తెలుసు" అంది మస్తానమ్మ నిర్లక్ష్యంగా.

"అదిగో అదే! అన్నీ నీకు తెలుసనుకుంటావు నీకేమీ తెలియదు. అన్నీ స్వయంగా చేద్దామనుకుంటావు ఏదీ సరిగ్గా చేయలేవు. నీకనుభవం తక్కువ అహం ఎక్కువ!" అని వంకరగా నవ్వింది ఖబీస్

దానికేసి అనుమానంగా చూసింది మస్తానమ్మ ... ఘోర మంత్రంవేసి ఖబీస్‌ని తను అష్టదిగ్బంధనం చేసింది ఒకపుడు. దాని ప్రభావం తగ్గుతోందా? ఖబీస్ ఇంత ధైర్యంగా మాట్లాడ్తోందంటే మరి దానికర్థం ఏమిటి?

ఆమె మనసులో మాటలు అర్థంచేసుకుని తల పంకించింది ఖబీస్.

"నేనిపుడు తప్పించుకోడానికి ప్రయత్నించడంలేదు. కానీ నీ

మంత్ర ప్రభావం పటాపంచలయ్యేరోజు చాలా దగ్గర్లోనే ఉంది. నీ మంత్ర శక్తిని మించిన మరో శక్తి నిన్ను కబళించడానికి సిద్ధంగా ఉంది.

"ఏమిటి నువ్వంటోంది?" గద్దించి అడిగింది మస్తానమ్మ.

"ఆ ఆడదాని గర్భాన్ని నాశనం చేయాలని నీకు తెలిసిన చిన్న మంత్ర ప్రయోగంచేసి నిశ్చింతగా కూర్చున్నావు నువ్వు. గర్భాన్ని వమ్ము చేసేది నీ మంత్రప్రయోగంకాదు. అంతకంటే ఎన్నోరెట్లు బల మయిన మరో శక్తి!" అంది ఖబీస్.

"అబద్ధం" అరిచింది మస్తానమ్మ మంచంమీద లేచికూర్చుంటూ.

"అహంకారివి! అలాగే అరుస్తావు. నన్ను ఒకసారి వొదిలిపెట్టు నీ పని నేను చేసిపెట్టి నీదే పైచెయి అయ్యేట్టు చేస్తాను." అంది ఖబీస్.

మస్తానమ్మ కళ్ళుమూసుకుని కూర్చుండిపోయింది ఒక నిముషం సేపు.

అవును! నిజమే!

ఖబీస్ చెప్తున్నది నిజమే!...

మరెవరో...ఏదో ప్రయత్నం మీదున్నారు.

ఎవరోగాని...నిష్ణాతుడే అయ్యుండాలి!

ఇన్నాళ్ళూ తనెందుకు అర్థం చేసుకోలేకపోయింది?

తనమీద తనకే కోపం వచ్చింది మస్తానమ్మకు. ఇలా జరగడానికి వీల్లేదు.

ఒక వరలో రెండు కత్తులా?

అవతలి వ్యక్తి ఎవరయి ఉంటారు?...ఎవరయినా సరే...ఆ వ్యక్తి ప్రయోగిస్తున్నది సిఫిలి అమల్ మాత్రం కాదు. మరేదో కోవకు చెందిన మంత్రజాలం అయ్యుంటుంది. అందుకే వెంటనే పసిగట్టలేకపోయింది తను.

చటుక్కున మంచందిగి, గబగబ గదిలోంచి బయటకు నడిచింది మస్తానమ్మ.

మండువాలో నిలబడి తలపైకెత్తి చూసింది. మునిచీకట్లు అలుము కుంటున్నాయి.

సిఫిలి అమల్ శక్తి ప్రదర్శించడానికి అనువయిన సమయమే.

తనకు తెలియకుండా—

తన్నాక్రమించుకున్న పరిధిని ఛేదించుకుని లోపలికిరావడమేకాక... సైతానుకి తను అందించాలనుకుంటున్న కానుకలను స్వాహా చేయాలనుకుంటున్న వారిని తరిమికొట్టాలి!

సిఫిలి అమల్ గొప్పదనాన్ని గుర్తించకుండా ఈ దురాక్రమణ చేయాలనుకుంటున్న వారికి ఇది గుణపాఠం కావాలి.

బందిష్!

అవును ఇప్పుడు 'బందిష్' ప్రయోగం చేయకతప్పదు!

బందిష్ వేస్తే స్నిగ్ధని తన మంత్రశక్తి తప్ప మరొకటి తాకడానికి వీలుండదు. ఒకవేళ ఎవరయినా దుస్సాహసం చేస్తే దారుణమయిన పరిణామాలు ఎదుర్కొంటారు.

మెట్లకింద తనగదిలోకి నడిచి అంతకుముందే వేసి ఉంచిన ముగ్గు మధ్యన కూర్చుంది మస్తానమ్మ. అప్పుడొక విచిత్రం జరిగింది.

బందిష్ మంత్రప్రయోగం ప్రారంభంలోనే ఆమెకళ్ళముందు బోసి నవ్వుల పిల్లవాడి మొహం ఒకటి మెదిలింది!—ఆ రూపాన్ని మస్తిష్కం లోంచి పక్కకు జరిపేస్తూ మంత్రోచ్చారణ కొనసాగించింది మస్తానమ్మ.

అంతలో...

మళ్ళీ...ఆ పసివాడి మొహం కళ్ళముందు ప్రత్యక్షమయింది.

ఎంత ప్రయత్నించినా ఆ రూపం మస్తానమ్మని వొదిలిపెట్టడంలేదు.

ఆ రూపం ఎవరిదో మస్తానమ్మకు అర్థమయింది అపుడు.

బందిష్ మంత్రోచ్చారణ ఆపి కళ్ళు మూసుకుని ఆ పసివాడి రూపాన్ని పరిశీలించింది మస్తానమ్మ.

చూస్తున్నంతలోనే మస్తానమ్మలో ఏదో అలజడి ప్రారంభమయింది అంతవరకూ ముగ్గుమధ్యన నిశ్చలంగా కూర్చున్నదల్లా అటూఇటూ ఊగనారంభించింది!

పళ్ళు బిగబట్టి పెద్దగా మూలగసాగింది!

ఆమె మస్తిష్కంలో మళ్ళీ అంతర్యుద్ధం మొదలయింది.

దాని ధాటికి తట్టుకోలేకపోతోంది ఆమె శరీరం.

పెద్దగా అరచి ముందుకు ఒరిగింది మస్తానమ్మ. జుట్టు ముడి ఊడి పోయి మొహంమీద చెమటలు పడ్తుంటే గదిమధ్యన "అయ్యో!... అయ్యో!" అంటూ పొర్ల సాగింది.

చాలా సేపు అలా అవస్థలుపడి...చివరికి కాళ్ళు చాపుకుని నిర్జీవంగా పడుకుంది మస్తానమ్మ. ఆమె గొంతుకలోంచి మాత్రం హృదయ విధారక మైన మూలుగు ఇంకా వెలువడుతూనే ఉంది.

సరిగ్గా అదే సమయానికి...

వికారాబాద్ అడవి ప్రాంతాలనించి బయల్దేరాయి పెద్ద పెద్ద గబ్బిలాలు మూడు.

చాటంత రెక్కలు ఆడిస్తూ నిశ్శబ్దంగా గాలిలో దూసుకుంటూ సాగి వస్తున్నాయి అవి హైదరాబాదుకేసి...

వెన్నెల కాంతిలో వాటి కోరలు తళుక్కుమని మెరుస్తున్నాయి.

• • •

రాజేశ్వరిదేవి నర్సింగ్‌హోం దగ్గర కారుదిగి లోపలికి నడిచింది.

ఆమెను ఇంటినించి పిలుచుకు వచ్చినతను స్పెషల్‌వార్డుకేసి దారి తీసాడు.

వార్డు ఖాళీగా ఉండటం చూసి అన్నాడతను

"బహూశ ఆపరేషన్ థియేటర్‌కెళ్ళి ఉంటారు...పదండి"

ఇద్దరూ ఆపరేషన్ థియేటర్ కెళ్ళారు. అక్కడ్నించి.

థియేటర్ గుమ్మం దగ్గర స్ట్రెచర్ ట్రాలీమీద ఆపరేషన్‌కు సిద్ధం చేసి పడుకోబెట్టారు స్నిగ్ధని. పక్కనే ఒక స్టాండుకి వేలాడేసిన బాటిల్ లోంచి రక్తం ఎక్కిస్తున్నారామెకు.

స్నిగ్ధను ఆ పరిస్థితిలో చూడగానే నడకవేగం తగ్గించేసి ఆయాస పడుతూ వెళ్ళి ఆమె పక్కన నిలబడింది రాజేశ్వరిదేవి.

"ఏమిటమ్మాయి ఇదంతా!...ఎలా జరిగిందీ? —నిన్ను చూసుకోమని వాడు నాకు మరీ మరీ చెప్పివెళ్తే నువ్వేటమ్మాయి ఇలా చేసుకున్నావు?" అని ఏడుపు మొదలుపెట్టింది.

అంతవరకూ కళ్ళు మూసుకుని పడుకున్న స్నిగ్ధ నీరసంగా కళ్ళు తెరచి చూసింది.

"అత్తయ్యగారూ...ఆయనకి కేబిల్...ఇస్తారా?" అడిగింది. ట్రాంక్విలైజర్ ప్రభావానికి ఆమె మాటలు ముద్దగా వచ్చాయి.

అంతలో డాక్టర్ ప్రేమ ఆపరేషన్ గౌను తొడుక్కుని గబగబ నడచి వచ్చింది.

"మీరేనా స్నిగ్ధ మదర్ ఇన్‌లా? మీకోసమే ఇంతసేపు ఎదురుచూసి ఆపరేషన్ కెళ్తున్నాం. మీరు మేట్రన్ గదిలోకెళ్ళి ఫారాలు సంతకం పెట్టండి."

"ఆపరేషన్ తప్పదాండీ?" అడిగింది రాజేశ్వరిదేవి.

"తప్పదమ్మా!...బిడ్డ అడ్డం తిరిగింది..." అంటూ స్నిగ్ధ స్ట్రెచర్‌తోపాటు థియేటర్‌లోకి వెళ్ళిపోయింది డాక్టర్ ప్రేమ.

ఒక్క నిముషం సేపు అక్కడే నిలబడి...ఆ తర్వాత నెమ్మదిగా మేట్రన్ గదికేసి నడిచింది రాజేశ్వరిదేవి.

మేట్రన్ గదిలోకివెళ్ళి టేబిల్‌దగ్గర పత్రిక చదువుకుంటున్న నర్సుని ఫారాలకోసం అడిగింది రాజేశ్వరిదేవి.

ఆమెకేసి ఆదోలా చూసింది ఆ నర్సు...

...ఏదీ సీరియస్ కేసేనా?" అడిగిందామె.

అవునన్నట్టు తలూపింది రాజేశ్వరిదేవి.

టేబిల్ మీదున్న ఫైల్లో రెండు మూడు చోట్ల సంతకాలు పెట్టించుకుంది నర్సు.

పని పూర్తి చేసుకుని వెనక్కి తిరుగుతుంటే మేట్రన్ గదిలోకివస్తూ రాజేశ్వరిదేవిని చూసి ఆగిపోయింది.

"అరే...మీరా?"

రాజేశ్వరిదేవి మేట్రన్ కేసి పరిశీలనగా చూసింది....

"సుభద్రమ్మగారు!" అంది గుర్తుపడ్తూ.

"హమ్మయ్య గుర్తుపట్టారా! రండి కూర్చోండి ఏమిటి ఇలా వచ్చారు అంటూ ఆప్యాయంగా రాజేశ్వరిదేవి చెయిపట్టుకుంది మేట్రన్ సుభద్రమ్మ.

తనని గుర్తుపట్టిన వ్యక్తి అలా ఆప్యాయంగా పలకరించేపటికి. ముక్కు చీదుకుంటూ మళ్ళీ ఏడుపు మొదలెట్టింది రాజేశ్వరిదేవి.

స్నిగ్ధకు జరిగిన ఆక్సిడెంట్ సంగతి విన్నప్పట్నుంచి తనెంత కంగారు పడిపోయిందో ఎలా భయపడిపోయిందో చెప్పిందామె సుభద్రమ్మకి.

"మీరేం కంగారు పడకండమ్మా! డాక్టర్ ప్రేమ చాలా ఎఫిషియంట్. మీ కోడలికి ఏమీకాదు. దేవుడు దయతలిస్తే బిడ్డకుకూడా ఏమీ కాదు." అని ధైర్యం చెప్పింది మేట్రన్ సుభద్రమ్మ.

"వాడేమో అమ్మాయి బాధ్యత నాకప్పచెప్పి ఫారిన్ వెళ్ళిపోయాడు. నా ఆరోగ్యం అసలే అంతంత మాత్రం. దానికితోడు ఈ అవాంతరం వచ్చిపడింది. దిక్కుతోచడంలేదు. ఇందాక మీ హాస్పిటల్ మనిషి వచ్చి ఈ వార్త చెప్పినప్పట్నించి నాకు గుండెదడ పట్టుకుని ఊపిరి అందడం లేదు..." అంటూ నీరసంగా అక్కడ కుర్చీలో వాలిపోయింది రాజేశ్వరి దేవి.

"అరెరె...మీరే ఇలా అయిపోతే ఎలాగమ్మా!...రండి...నా రెస్టు రూంలో పడుకోండి ఆపరేషన్ అయ్యాక మీకు చెప్తాం. ఆపరేషన్ పూర్తి కావడానికి ఎలా కాదన్నా ఒకగంట టైం పడ్తుంది" అని రాజేశ్వరిదేవి చెయిపట్టుకుని రెస్టురూంలోకి తీసుకెళ్ళింది.

రెస్టురూం బెడ్ మీద పడుకుని కళ్ళు మూసుకుంది రాజేశ్వరిదేవి.

మరో గంటసేపట్లో ఆపరేషన్ పూర్తవుతుంది. బిడ్డ భూమ్మీద పడదని మస్తానమ్మ ఎన్నోసార్లు ధైర్యం చెప్పింది తనకు. కానీ, కొత్తలో ఆమె చెప్పినమాటలే తన మనసులో నాటుకునిపోయి వేధిస్తున్నాయి.

'పెద్దయ్యగారు మళ్ళీ మనింట్లో పుడ్తారమ్మగారూ.'

ఆ మాటలే నిజమయి...నిజంగానే పవన్ తండ్రి మళ్ళీ పుడ్తాడా?

పవన్ తండ్రి!

ఇరవయి ఏళ్ళక్రితం ఆత్మహత్య చేసుకునేముందు తనని బెదిరించినట్టు మళ్ళీపుట్టి తనని హింసిస్తాడా? ఆయన బతికుండగా తను చేసిన పనులకి ఇపుడు శిక్ష వేస్తాడా?

అసహనంగా కదిలి ఒత్తిగిలి పడుకుంది రాజేశ్వరిదేవి.

కాసేపటికి కునుకు పట్టిందామెకు.

......

మేట్రన్ పిలుపుకి ఉలిక్కిపడి లేచికూర్చుంది.

"ఏ...ఏమయింది?"

"ఆపరేషన్ పూర్తయింది!" అంది మేట్రన్ సుభద్రమ్మ.

ఆమెకేసి బిత్తర చూపులు చూస్తూ లేచినిలబడింది రాజేశ్వరిదేవి.

"మీకు మనవడు పుట్టాడండీ!..." అంది సుభద్రమ్మ నవ్వుతూ.

ఆ మాట వినగానే కళ్ళు చీకట్లు కమ్మినట్టయింది రాజేశ్వరిదేవికి. మంచంమీద వాలిపోయింది నీరసంగా.

"అరె...ఏమయిందండీ? ఏమయింది..." అంటూ పడిపోకుండా పట్టుకుంది మేట్రన్.

"ఏమ్మా...మనవడ్ని చూద్దురుగాని రండి" అంటూ డ్యూటీ నర్సు అక్కడికి వచ్చిందంతలో.

"పాపం ఇందాకట్నించి టెంషన్‌లా ఉండటంవల్ల కాబోలు వార్త వినగానే ఆనందం పట్టలేక కూర్చుండిపోయారు!...బాబుని క్లీన్‌చేసాక ఇక్కడికే తీసుకురండి చూసుకుంటారీవిడ" అంది సుభద్రమ్మ.

డ్యూటీనర్సువెళ్ళి రెండే రెండు నిముషాల్లో తెల్లటి గుడ్డలాచుట్టి బాబుని ఎత్తుకుని వచ్చింది...

"చూస్కోండమ్మా మీ ముద్దుల మనవడ్ని! మిమ్మల్నందర్నీ ఎంత కంగారు పెట్టేసాడో ఈ బజ్జిగాడు!" అంటూ బాబుని రాజేశ్వరిదేవి చేతుల్లో పెట్టింది.

అబ్బాయి పుట్టాడు!

అబ్బాయే పుట్టాడు!!

మస్తానమ్మ తన మాట నిలబెట్టుకోలేకపోయింది.

అయిష్టంగానే ఒళ్ళో ఉన్న బాబుని చూసింది రాజేశ్వరిదేవి.

ముట్టుకుంటే మాసి పోతాడన్నంత తెల్లగా ఉన్నాడు బాబు—

నల్లగా మెరుస్తున్న పళ్ళతో అటూ ఇటూ హాయిగా చూస్తున్నాడు!

అపుడే పుట్టిన వాడు అలా చూడటం ఆశ్చర్యమనిపించింది రాజే శ్వరిదేవికి.

బాబుని చూస్తుంటే భయం కొంచెం తగ్గిందామెకు. ఇన్నాళ్ళూ తనేవేవో ఊహించుకుని కంగారుపడిందా? ఈ పసివాడు తననేం చేయ కలడు? ఆలనాపాలనా చక్కగాచేస్తే వాడుకూడా పెద్దవాడై తనని ఆదరి స్తాడు.

పవన్ వాళ్ళ నాన్నగారు మళ్ళీ పుట్టాడన్న ఆలోచన బుర్రలోంచి తీసేయడమే మంచిది।

ఎంత కాదన్నా వీడు తన మనవడు.

తన పవన్ బిడ్డ...।

అప్రయత్నంగా బాబుని ముద్దెట్టుకోడానికి ముందుకు వంగింది రాజేశ్వరిదేవి.

అలా ముందుకి వొంగిందే కానీ...

ఆ పసివాడిని ముద్దెట్టుకోలేదు...

కెవ్వున కేకపెట్టి వెనక్కి జరిగింది...

ఆమె చేతుల్లోంచి జారిపోతున్న శిశువుని పడిపోకుండా పట్టుకుంది. అక్కడే నిలబడ్డ మేట్రన్.

రాజేశ్వరిదేవి నిలువెల్లా ఒణికిపోతూ వెనక్కి తగ్గుతుంటే ఆమెకేసి ఆశ్చర్యంగా చూసిందామె.

. . .

అంతవరకూ కదలికలేకుండా పడుకున్న మస్తానమ్మ ఠక్కున లేచి కూర్చుంది...

రేగిపోయిన జుట్టు...ఎరుపెక్కిన కళ్ళతో పిశాచంనావుంది.

గాలిలో ఏదో వాసన పసికడ్తున్నట్టు తల పైకెత్తి అటూ ఇటూ తిప్పింది.

అంతలోనే లేచి...

పిచ్చిదానిలా అరుస్తూ బయటకు ఉరికింది। ధబేలున వీధి తలుపు తెరచి వీధిలోకి పరుగులీసింది.

రోడ్డుమీద నడుస్తున్న వాళ్ళని ఖాతరు చేయకుండా...ఎక్కడా ఆగకుండా పరుగెత్తున్న ఆమె చూపులు మాత్రం ఆకాశం కేసే ఉన్నాయి. ఆకాశంలో దేనికోసమో వెతుకుతున్నాయి ఆమె కళ్ళు.

• • •

"మిసెస్ స్నిగ్ధా!...మిసెస్ స్నిగ్ధా..." అనెస్థటిస్ట్ డాక్టర్ రావు తట్టి లేపాడు.

మగతగా కళ్ళు తెరచి చూసింది స్నిగ్ధ.

డాక్టర్ రావు పక్కన డాక్టర్ ప్రేమ నిలబడి ఉంది.

"కంగ్రాచ్యులేషన్స్ స్నిగ్ధా! కొడుకు పుట్టాడు నీకు!...యూ ఆర్ బ్లెసెడ్ విత్ బాయ్!" అంది చిరునవ్వుతో.

హాయిగా నవ్వేసింది స్నిగ్ధ...

తను మమ్మీ అయింది!

తన అనిరుద్ధ్ పుట్టాడు!!

తనకిక ఏమీ భయంలేదు!

చేతులెత్తి డాక్టర్ ప్రేమకు దండంపెట్టి ఏడవసాగింది స్నిగ్ధ... ఆనందంగా.

స్నిగ్ధకు ఆ క్షణంలో తెలియదు...

డాక్టర్ ప్రేమా నర్సింగ్‌హోం మూడవ అంతస్తు కిటికీల్లోంచి లోపలికి రావడానికి మూడు గబ్బిలాలు ప్రయత్నిస్తున్నాయని...ఆ గబ్బిలాలకి కావల్సింది అప్పుడే పుట్టిన తన బిడ్డ పసి రక్తమని.

## 19

"బాబుని చూడొచ్చా?" అడిగింది స్నిగ్ధ చెంపలమీదుగా జారుతున్న కన్నీళ్ళు తుడుచుకుంటూ.

చిరునవ్వుతో తలపంకించింది డాక్టర్ ప్రేమ.

"బాబుని వార్డుకి పంపించారమ్మా!...మీ అత్తయ్యగారుకూడా అక్కడే ఉంది" అందామె.

"థాంక్యూ డాక్టర్!" అంది స్నిగ్ధ ఆనందంగా కళ్ళు మూసుకుంటూ,

నర్సింగ్ హోం ఆయాలు స్ట్రెచర మీద పడుకోబెట్టి వార్డుకేసి తీసు కెళ్తుంటే మగతలోకి జారుకుంది స్నిగ్ధ మళ్ళీ. ఆపరేషన్ జరిగినపుడు ఇచ్చిన అనస్థీషియా మత్తు వదలడం లేదామెను.

వార్డులో మంచంమీద పడుకోబెట్టాక మంచం పక్కన ఊయ్యా లలో పడుకోబెట్టిన బాబుని ఎత్తుకుని వచ్చింది డ్యూటీ నర్సు.

"చూసుకోమ్మా నీ బాబును..."

డ్యూటీ నర్సు ఎత్తుకుని నిలబడ్డ తన బిడ్డకేసి నెమ్మదిగా కళ్ళు తెరచి చూసింది స్నిగ్ధ.

పిల్లవాడి మొహం సరిగ్గా కనపడాలని కొంచెం ముందుకువొంగింది నర్సు.

"అనిరుధ్..." అనబోయి నిశ్చేష్టురాలై పోయింది స్నిగ్ధ.

అంతవరకూ మొహంమీదున్న చిరునవ్వు మాయమయి కళ్ళలో భయం చోటు చేసుకుంది. అప్పుడు...

అప్రయత్నంగా...అరిచింది!

"నో! నో!—"

ఆ అరుపుకి అద్దిరిపడి రెండడుగులు వెనక్కివేసింది డ్యూటీనర్సు స్నిగ్ధ ఆమె చేతుల్లో ఉన్న శిశువుకేసే వెర్రిచూపులు చూస్తోంది—ఒక వైపు వొళ్ళంతా చెమటలు పట్టుంటే...మరోవైపు వీపులోంచి చలిప్రారంభ మయి వొణికి పోతోంది!

బిడ్డకేసి వేలు చూపిస్తూ ఏదో చెప్పడానికి ప్రయత్నిస్తోంది. కాని నోట మాట రావడంలేదు. అసహనంగా తల అటూ ఇటూ ఆడించి, భుజాలదాకా కప్పిన దుప్పటి జరిపి లేవబోయిందామె—

"అరెరె—లేవకమ్మా!" అంటూ అక్కడే నిలబడ్డ ఆయా ఆమెను పట్టుకుంది—

ఆమెపట్టునుంచి విడిపించుకోవడానికి గింజుకోసాగింది స్నిగ్ధ—

అంతలో...

"వ్వాట్ హ్యాపెన్—ఏమయింది?" అంటూ డాక్టర్ ప్రేమ వార్డు లోకి వచ్చింది—

ఆమెను చూడగానే ఉన్నట్టుండి బిగ్గరగా, చిన్నపిల్లలా ఏడపసాగింది స్నిగ్ధ.

"ఏమయింది స్నిగ్ధా!—" అంటూ ఆప్యాయంగా తలనిముపుతూ అడిగింది డాక్టర్ ప్రేమ.

సమాధానం చెప్పకుండా ఏడుపు కొనసాగించింది స్నిగ్ధ— మాటి మాటికి నర్సు నిలబడ్డవైపు సైగచేసి "వొద్దు—వొద్దు" అంటున్నట్టు చేతులూపుతోంది.

ఉన్నట్టుండి స్నిగ్ధ పరిస్థితి అలా ఎందుకు తయారయిందో అర్థం చేసుకోడానికి ప్రయత్నించింది డాక్టర్ ప్రేమ.

"రిలాక్స్ స్నిగ్ధా! టేక్ ఎలుక్ అట్ యువర్ సన్!...సిస్టర్ బాబుని చూపించు" అందామె.

డ్యూటీ నర్సు నిలబడ్డ చోటునించి కదల్లేదు.

"లేదు మేడమ్?...బాబుని చూపిస్తేనే భయపడిపోయినట్టు అరుస్తోందామె..." అంది.

"ఈజ్ ఇట్?" అని స్నిగ్ధని పరిశీలనగా చూసింది డాక్టర్ ప్రేమ

పిచ్చిపట్టినదానిలా ఏడుస్తూనే ఉంది స్నిగ్ధ.

"ఏమిటి స్నిగ్ధా ఇది? బాబునిచూసి సంతోషిస్తావని నేననుకుంటే ఇలా చేస్తావేమిటి? ఏమయిందని ఇపుడు?" అని చెప్పి చూసింది డాక్టర్.

—అయినా స్నిగ్ధ ఏడుపు ఆపలేదు.

స్నిగ్ధ అలా ఏడవడం మంచిదికాదని, సూచర్స్ తెగి బ్లీడింగ్ మొదలవ్వొచ్చని డాక్టర్ ప్రేమకు తెలుసు. ఆ ఏడుపుకి కారణం ఏదైనా ముందు ఆమెను రిలాక్స్ చేయించడం ముఖ్యం.

"బాబుని ఇక్కడ పడుకోబెట్టవద్దా?...తీసుకెళ్ళిపోనా?" అడిగిందామె.

చటుక్కున ఆమె చెయి పట్టుకుని అవునన్నట్టు తలూపింది స్నిగ్ధ.

"సరే...అయితే బాబుని ఇక్కడ్నించి తీసుకెళ్తాం. నువ్వు మాత్రం కాసేపు స్ట్రెయిన్ చేసుకోకుండా పడుకో..." అంది డాక్టర్ ప్రేమ.

తనక్కావల్సిందదే అన్నట్టు కృతజ్ఞతతో ఆమెకేసి చూస్తూ కొంచెం సర్దుకుంది స్నిగ్ధ...

నర్సుని సైగచేసి పక్కకు తప్పుకోమంది డాక్టర్ ప్రేమ.

స్నిగ్ధకేసి తిరిగి మళ్ళీ చెప్పింది—

"ఎందుకమ్మా అలా కంగారుపడతావు?! అంతా సవ్యంగానే జరిగిందికదా!—నీకు ఆక్సిడెంట్‌లో బ్లీడింగ్ అయిందని నేను కూడా భయపడ్డాను. అనుకున్న డ్యూడేట్ కంటే మూడు వారాలు ముందే పుట్టే పిల్లవాడు చాలా వీక్‌గా ఉంటాడని ఇన్‌క్యూబేటర్‌లో పెట్టాలనుకున్నాను. కానీ, అలాంటిదేమీ అవసరం లేకుండా హెల్తీగా పుట్టాడు నీ బాబు!— చూడ్డానికి కూడా ఎంత ముద్దొస్తున్నాడో! నువ్వకాసేపు రెస్ట్‌ఫుల్‌గా పడుకో. రాత్రి బాబుని నీ దగ్గరకు తీసుకుని రమ్మని సిస్టర్‌కి చెప్తాను. అప్పుడు పాలు పట్టు."

డాక్టర్ సముదాయింపుగా అన్నమాటలకు స్నిగ్ధ ఏడుపు ఆపింది. కానీ ఇంకా వెక్కిళ్ళు వస్తూనే ఉన్నాయి.

"సరే—నేను వెళతాను..." అని స్నిగ్ధ భుజంమీద ధైర్యం చెప్తున్నట్టు తట్టి వెనక్కి తిరిగింది డాక్టర్ ప్రేమ.

అప్పుడు కనపడిందామెకు గదిమూలన గోడకు అతుక్కుని నిలబడ్డ రాజేశ్వరిదేవి.

డ్యూటీనర్సు బాబుని ఎత్తుకుని పక్కనించి బయటికి నడుస్తుంటే ఆమె చేదు మందేదో తాగినట్టు మొహం పెట్టుకోవడం ఆశ్చర్యపరిచింది డాక్టర్ ప్రేమని.

అప్పుడే ఆపరేషన్ చేయించుకుని పెద్ద గండంలోంచి బయటపడ్డ స్నిగ్ధ హిస్టీరియా వచ్చినట్లు ప్రవర్తించిందంటే అర్థంచేసుకోకలదు తను. కానీ, స్నిగ్ధ అత్తగారు కూడా ఆ పసివాడిని చూసి అలా ఎందుకు చేస్తోందో బోధపడలేదు తనకి.

రాజేశ్వరిదేవిని అదోలా చూసి బయటకు నడిచింది డాక్టర్ ప్రేమ.

నిలబడ్డ చోటునుంచి నెమ్మదిగా కదిలి వెళ్ళి గది తలుపు దగ్గరకు వేసింది రాజేశ్వరిదేవి.

వార్డు మధ్యన ఉయ్యాల పక్కన కుర్చీ లాక్కుని కూర్చుందామె అయిష్టంగా...

వెంటనే అక్కడ్నించి బయటపడాలని ఉందామె మనసులో... స్నిగ్ధను కనిపెట్టుకుని అక్కడే కూర్చోవడం ఏమాత్రం ఇష్టంలేదామెకు పైగా పుట్టిన ఆ పిల్లవాడి మొహం చూసినప్పట్నుంచి గుండెదడ—ఆయాసంగా ఉందామెకు.

ఆ పిల్లవాడి కను ముక్కుతీరు...

అంతా...

పవన్ వాళ్ళ నాన్నగారిదే.

పెదాలకిందగా గుండ్రంగా దిద్దినట్టుండే పుట్టుమచ్చ కూడా ఆయనదే।

అనుమానంలేదు।...మస్తానమ్మ మొదట్లో చెప్పినట్టే...పవన్ తండ్రి మళ్ళీ పుట్టాడు.

తనని సాధించడానికి.

అవును...। మస్తానమ్మ ఆ బిడ్డ పుట్టకుండా ఉండాలని చేసిన ప్రయత్నాలేవీ ఫలించలేదు.

తలపట్టుకుని కూర్చుండిపోయింది రాజేశ్వరిదేవి.

......

......

అంతవరకూ నిద్రపోతున్న స్నిగ్ధకు మెలకువవచ్చింది నెమ్మదిగా కళ్ళుతెరచి చూసింది... వార్డు మధ్యన కుర్చీలో కూర్చున్న రాజేశ్వరిదేవి కునికిపాట్లు పడ్తోంది.

నర్సింగ్‌హోమ్‌లో ఎటువంటి అలికిడీలేదు అంతా నిశ్శబ్దంగా ఉంది. బాగా రాత్రయిందా?...తను చాలాసేపు నిద్రపోయిందా? ఏమో?।

అంతలో వార్డు కిటికీదగ్గర 'టపటప' అని శబ్దమేదో అయింది.

ఏమిటది?

బయట గాలికి చెట్టుకొమ్మలేవో కిటికీ తలుపులకు కొట్టుకుంటున్నాయా?

తలతిప్పి గడియపెట్టిఉన్న గాజుతలుపుల కిటికీకేసి చూసింది స్నిగ్ధ...

మళ్ళీ 'టపటప' అని శబ్దం అయింది।

అప్పుడు—

కిటికీ తలుపులమీద...

ఒక పెద్ద పక్షి నీడ లాంటిది క్షణ మాత్రం కనబడింది స్నిగ్ధకు.

"ఇంత రాత్రిపూట పక్షేమిటి?!...అనుకుంటూ ... తలతిప్పుకుని మామూలుగా పడుకుంది. మళ్ళీ ఆ శబ్దం గురించి ఆలోచించలేదు స్నిగ్ధ.

ఉయ్యాల ఖాళీగా ఊగుతుండటం చూసి మనస్సంతా వికలమయి పోయింది స్నిగ్ధకు.

అనిరుధ్ పుట్టాడు....।

మధ్యాహ్నం ఆటో ఆక్సిడెంట్ తర్వాత గర్భంలోంచి రక్తం కారిపోతుంటే ఇక అనిరుధ్ దక్కడనుకుంది తను...కానీ అలాంటి ఘోరమేదీ జరగలేదు। థాంక్ గాడ్।

వాడిని దగ్గరకు తీసుకుని గుండెలకు హత్తుకోవాలని ఉంది. ముద్దాడాలని...వాళ్ళొదాచేసుకోవాలని ఉంది.

అయినా...ఇందాక—

నర్సు వాడి మొహం చూపించగానే తను చేసిందేమిటి? అనిరుధ్‌ని తీసుకెళ్ళిపొమ్మని పిచ్చిదానిలా అరచింది...ఏడిచింది.

ఎంత దౌర్భాగ్యురాలు తను?!

గత ఎనిమిది నెలలుగా తన ప్రాణంలో ప్రాణంగా పెరిగిన తన కలల పంటను...తన బంగారు కొండను...వాళ్ళో వెచ్చగా పడుకోబెట్టు కోకుండా...తనతో ఏ సంబంధంలేనట్టు ఆ నర్సు చేతికిచ్చి పంపించేసింది.

ఒంటరిగా ఎక్కడ పడుకోబెట్టారో తన అనిరుధ్‌ని.

ఆకలయి ఏడిస్తే తన దగ్గరకి తెస్తారా? లేక...ఇందాకట్లా తను మళ్ళీ అరుస్తుందనుకుని భయపడి బాబు ఏడిస్తే ఏడిచాడులెమ్మని ఊరు కుంటారా? ఏమో।

ఏంచేయాలి తనిప్పుడు?

బాబుని వెంటనే చూడాలని ఒకవైపు మనసు తహతహలాడుతున్నా. వాడిసి తన దగ్గరకు తెస్తే ఏమౌతుందోనన్న భయం మరోవైపు నించి పీడిస్తోంది.

గత ఎనిమిది నెలలుగా తన అంతరంగంలోంచి ఏరిపారేయాలనుకుంటున్న భయంకరమయిన జ్ఞాపకాలు ఒక్కసారిగా మళ్ళీ విజృంభించాయి ఈరోజు.

బొంబాయి సెంటూర్ హోటల్‌నించి ఒంటరిగా కారు డ్రైవ్ చేసుకుంటూ ఖండాలా వెళ్ళడం...కరకింకర ఆలయంలో కాత్యాయనిని, మిహిర్‌కుట్టిని కలవడం...కరకింకర విగ్రహంచుట్టూ భక్తులు నిలబడి మంత్రోచ్చారణ చేస్తుంటే కాత్యాయని, శిశువుని అక్కడికి తీసుకుని రావడం...

అంతా మళ్ళీ మళ్ళీ గుర్తుకు వస్తోంది.

"కరకింకరకు నీ పొందు కావాలి। దానికోసం నువ్వు పరమోత్కృష్టమయిన సమర్పణ చేయాలి. అని తన చేతికి మెరుస్తున్న కొడవలి ఇచ్చాడు మిహిర్‌కుట్టి ఆరోజు.

ఆ కొడవలితోనేకదా తను బాబు చెయి నరికేసింది।?

రాక్షసిలా। కిరాతకిగా.

తన కన్నబిడ్డని అవిటివాడిని చేసుకుందారోజు.

ముద్దులొలికిస్తున్న ఆ బిడ్డ మొహం ఏనాటికీ తను మరచిపోలేదు. ఎలా మరచిపోతుందసలు?

ఇన్నాళ్ళూ...

అదో విచిత్రమయిన పీడకల అని సరిపెట్టుకోడానికి ప్రయత్నించింది.

ఇప్పటికీ...లాజికల్‌గా ఆలోచించిచూస్తే అది పీడకల కావడమే సబబుగా తోస్తోంది. వాస్తవంగా అలాంటిదేమీ జరగలేదనే అనిపిస్తోంది.

అలా జరిగే అవకాశం లేదపుడు...

అపుడు తన పెళ్ళయి రెండే రెండురోజులయింది। తనకు బిడ్డేమిటి? తనాబిడ్డ చెయి నరకడం ఏమిటి? అంతా అబ్సర్డ్...మెంటల్ ట్రిక్।

కానీ ... ఆ అబ్సర్డిటీ ... ఆ మెంటల్ ట్రిక్ ఇపుడు వాస్తవం కావచ్చు!

అక్షరాలా నిజం కావచ్చు!

కలలో చూసిన శిశువు ఎవరోకాదు...తన ముద్దుల కన్న అనిరుధ్.

అవును....

ఏమ్మాత్రం అనుమానంలేదు.

డ్యూటీ నర్సు చూపించిన వెంటనే గుర్తుపట్టేసింది తను.

ఎనిమిది నెలల్రకితం కలలో తను చూసింది అనిరుధ్‌నే.

కరకింకర పాదాలదగ్గర మిహిర్‌కుట్టి పడుకోబెట్టింది అనిరుధ్‌నే.

ఎనిమిది నెలల్రకితం అనిరుధ్ పుట్టకముందు...అసలు అనిరుధ్ ఎలా ఉంటాడో కూడా తనకు తెలియనపుడు అలాంటి కల చూసింది.

అంటే...

ఆ కల నిజమవుతుందనే కదా?! అందుకే బాబుని చూడగానే అలా అప్సెట్ అయింది తను...

మొదట్లో కాత్యాయని, మిహిర్‌కుట్టి...తను ఊహించుకున్న పాత్రలు అనుకుంది.

కానీ, వాళ్ళిద్దరూ నిజంగానే ఉన్నారు!

కాత్యాయినిని శవయాత్రలో చూసింది నిజమేకదా?!

సుస్మితతో కరకింకర ఆలయం వెతుక్కుంటూ వెళ్ళినపుడు...ఆ చీకటి భూ గృహంలో తనచేతికి కొడవలి అందించిందీ...'కరకింకరకు నైవేద్యం పెట్టవా?' అని చెవిలో గుసగుసలాడిందీ ఎవరు? మిహిర్‌కుట్టికాదా?

వార్డు తలుపు అలికిడికి ఆలోచనల్లోంచి బయటపడి అటుకేసి చూసింది స్నిగ్ధ.

"బాబుకి పాలుపడ్తారా?" అంటూ ఒక నర్సు తలుపుదగ్గరే నిలబడి అడిగింది.

ఒక్క క్షణం ఏమీ చెప్పలేదు స్నిగ్ధ.

అంతలోనే సర్దుకుని సమాధానం చెప్పింది...

"తీసుకురండి సిస్టర్."

ఆమాట వినగానే ఆ నర్సు కొంచెం రిలీఫ్‌గా మొహంపెట్టి తన వెనక బాబుని ఎత్తుకుని నిలబడ్డ ఆయాకి సైగచేసింది

ఆయా నెమ్మదిగా లోపలికి వచ్చింది. వాళ్ళిద్దరూ లోపలికివస్తుంటే అంతవరకూ కుర్చీలో కూర్చున్న రాజేశ్వరిదేవి కూడా లేచి రెండడుగులు ముందుకువేసింది.

"మీరు పట్టిస్తారాండీ?" అంటూ రాజేశ్వరిదేవికి బాబుని అదించబోయింది ఆయా.

వెంటనే వెనక్కి తగ్గిపోతూ లేదన్నట్టు తలాడించింది రాజేశ్వరిదేవి

"ఫర్వాలేదు సిస్టర్ ఇలా నా పక్కన పడుకోబెట్టండి..." అంది స్నిగ్ధ.

అనిరుద్ధ్‌ని స్నిగ్ధ పక్కన పడుకోబెట్టాక ఆమెను సిస్టర్, ఆయా కలిసి పక్కకు వొత్తిగిలి పడుకునేట్టు చేసారు. అలా పడుకోబెడ్తుంటే కడుపులో విపరీతమయిన నొప్పి ప్రారంభమయింది స్నిగ్ధకు. అయినా ఓర్చుకుంది...తన పక్కన బొమ్మలా పడుకుని కళ్ళు అటూ ఇటూ తిప్పి చూస్తున్న బాబుని చూసి తనువు పులకించింది స్నిగ్ధకు.

స్నిగ్ధ తొడుక్కుని ఉన్న ఆపరేషన్‌గౌన్ లేసు విప్పి బాబుని ఆమె ఛాతీ దగ్గరగా జరిగి పడుకోబెట్టింది నర్సు...

బాబు చిన్నారి నోరు తన వక్షోజాలని చప్పరించడానికి ప్రయత్నిస్తుంటే ఆనందం పట్టలేక పోయింది స్నిగ్ధ!...మురిసిపోతూ తనబిడ్డ కేసి చూస్తుంటే మత్తుగా వాలిపోతున్నాయి ఆమె కళ్ళు!—ఒక్కసారిగా ఆమెలోని అనురాగం పొంగి ఛాతీ పాలతో బరువెక్కింది.

అంతలో బాబునోరు పక్కకు జరిగితే వాడి లేత పెదాలకు మళ్ళీ చన్మొన అందించింది స్నిగ్ధ.

దివ్యమయిన ఆ అనుభూతికి మైమరచి కళ్ళు మూసుకుందామె.

అనిరుద్ధ్!

పవన్ తనకిచ్చిన ప్రేమకానుక!

వాడిమీద ఈగయినా వాలనివ్వకూడదు తను.

వాడికి ఎటువంటి ఆపదా రాకూడదు.

దారుణమయిన ఆ పీడకల నిజం కానివ్వకూడదు తను!—

"ఇక చాలమ్మా—బాబుని ఉయ్యాల్లో పడుకో బెడ్తాను!" అంటూ ముందుకు వచ్చింది ఆయా.

అనిరుధ్‌ని ఒకసారి దగ్గరకు లాక్కుని ముద్దాడింది స్నిగ్ధ—ఆయా తన బిడ్డని తీసుకెళ్తుంటే అయిష్టంగానే ఒప్పుకుంది.

ఆయా బాబుని ఉయ్యాలలో పడుకోబెట్టి నర్సుతో బయటకి వెళ్తుంటే అడిగింది రాజేశ్వరిదేవి—

"ఆ కిటికీ తలుపులు తెరచుకోవడంలేదు ఇందాకట్నించి. కొంచెం తెరుస్తారా?"

అలాగేనని తలూపి కిటికీ తలుపులు తెరచింది ఆయా...

వాళ్ళిద్దరూ వెళ్ళాక రాజేశ్వరిదేవిని పిలిచింది స్నిగ్ధ.

"అత్తయ్యగారూ! మీరు బాగా అలిసిపోయినట్టున్నారు. పోనీ... ఇంటికి వెళ్ళిపోకూడదా? నాకిపుడు ఫర్వాలేదు" అంది.

"ఇంత రాత్రి ఒంటరిగా ఎలా వెళ్తాను? ఇక్కడే పడుకుంటాను" అందామె పొడిగా...

"మీ ఇష్టం..." అంది స్నిగ్ధ.

వార్డులో లైటార్పి బెడ్‌లైటువేసి ఒకపక్కగా ఉన్న సోఫాకమ్‌బెడ్ మీద పడుకుంది రాజేశ్వరిదేవి.

బెడ్‌లైట్ వెలుగులో మసగ్గా కనిపిస్తున్న ఉయ్యాలకేసి సంతృప్తిగా చూస్తూ పడుకుంది స్నిగ్ధ.

సరిగ్గా ఆమెకు నిద్రపడ్తున్న సమయంలో—

"టప...టప" అని కిటికిదగ్గర శబ్దమయింది మళ్ళీ.

ఉలిక్కిపడి కిటికీకేసి చూసింది స్నిగ్ధ...

చాటంత నల్లటి ఆకారమొకటి వార్డులోకి తేలివచ్చింది.

ఏమిటది?

గబ్బిలం!!

స్నిగ్ధ ఆశ్చర్యంనించి తేరుకునేలోగానే మరోపెద్ద గబ్బిలం కిటికీలోంచి ఎగిరి వచ్చింది...

అంతలోనే మరొకటి!

మొత్తం మూడు గబ్బిలాలు!

ఇందాకట్నించి గడియవేసి పెట్టిన కిటికీలోంచి లోపలికి రావడానికి ప్రయత్నిస్తున్నవి ఈ గబ్బిలాలేనా?

ఎందుకో స్నిగ్ధ మనసు కీడు శంకించింది.

గుండె వేగంగా కొట్టుకుంటుంటే. "అత్తయ్యగారూ!...ప్లీజ్... లైటు వేయండీ?" అని బిగ్గరగా అరిచింది.

సోఫా కమ్ బెడ్‌లోంచి ఉలిక్కిపడి లేచింది రాజేశ్వరిదేవి.

"ఏ...ఏమయింది..."

"వెంటనే లైట్ వేయండి..." అరిచింది స్నిగ్ధ మళ్ళీ.

స్నిగ్ధ ఎందుకలా అంటోందో అర్థంకాకపోయినా కంగారుగా లైట్ స్విచ్ కేసి గబగబ అడుగులు వేసింది రాజేశ్వరిదేవి. దారిలో కుర్చీకి కాలు తగిలి ముందుకితూలి అంతలోనే తమాయించుకుందామె.

స్నిగ్ధ కళ్ళుమాత్రం వార్డులోచేరి అటూఇటూ నిశ్శబ్దంగా ఎగురుతున్న ఆ గబ్బిలాలనే చూస్తున్నాయి.

రాజేశ్వరిదేవి ఏదో విధంగా స్విచ్‌బోర్డు దగ్గరకు చేరుకుని లైట్ వేయబోయింది.

కానీ...గబ్బిలం ఒకటి బాణంలా దూసుకుంటూ ఆమెమీదకు వెళ్ళింది...

ఊహించని తీరులో అంతపెద్ద గబ్బిలం మీదకు రావడంతో భయపడి కెవ్వుమని అరచి నిలబడ్డచోటే కుప్పకూలిపోయింది రాజేశ్వరి.

అంతవరకూ గదిలో అటూఇటూ ఎగిరిన గబ్బిలాలు మూడు రెక్కలు చాపి గది మధ్యన ఉన్న ఊయ్యాలచుట్టూ ప్రదక్షిణం చేయసాగాయి.

"అత్తయ్యగారూ!...అత్తయ్యగారూ" గొంతు చించుకుని అరిచింది స్నిగ్ధ.

రాజేశ్వరిదేవి జవాబివ్వలేదు!

చటుక్కున లేచికూర్చోబోయింది స్నిగ్ధ...

కానీ...

పొత్తికడుపులో కత్తిపెట్టి పొడిచి మెలివేస్తున్నట్టు భరించలేనినొప్పి!

"అమ్మా!" అంటూ వెనక్కివాలిపోయింది!

అప్పటికే గబ్బిలం ఒకటి అనిరుధ్ పడుకున్న ఉయ్యాల ఊచను పట్టుకుని తలకిందులుగా వేలాడుతోంది! మిగతా రెండు గబ్బిలాలు ఇంకా అలాగే ప్రదక్షిణం చేస్తున్నాయి.

ఆ గబ్బిలాలు అనిరుధ్‌ని అలా చుట్టు ముట్టాయంటే...అవి... అనిరుధ్‌ని...? నో...! అలా జరక్కూడదు! ఓ గాడ్!...

"సిస్టర్!...సిస్టర్! హెల్ప్!" బిగ్గరగా అరిచింది స్నిగ్ధ.

నర్సింగ్‌హోం కారిడార్‌లో ఆమెగొంతు ప్రతిధ్వనించింది...కానీ ఎవరూ పలకలేదు?

అంతసేపు ప్రదక్షిణం చేసిన రెండు గబ్బిలాలు ఉయ్యాలకి చెరో వైపువాలి రెక్కలు చాచాయి.

అంత పెద్ద గబ్బిలాలు రెక్కలు చాచి కూర్చుంటే ఉయ్యాలమీద నల్లటి గొంగళి పడేసినట్టుంది.

ఏంచేయాలో తోచని పరిస్థితిలో మంచంమీదున్న తలగడా అందుకుని ఉయ్యాలకేసి విసిరింది స్నిగ్ధ—తలగడా గురితప్పి ఉయ్యాలకింద పడిపోయింది—

ఆ గబ్బిలాలు ఎక్కడ్నించి వచ్చాయో అర్థమయింది స్నిగ్ధకు—ఎందుకు వచ్చాయో కూడా అర్థమయింది—

గబ్బిలం—కరకింకర వాహనం.

ఖండాలా దగ్గర కరకింకర ఆలయంనిండా అవే!—

కరకింకర పంపిన ఆ రాకాసి గబ్బిలాలు తన కన్నబిడ్డ ప్రాణాలు తియ్యడానికేవచ్చాయి!

వాటిని ఎవరయినా తరిమి కొట్టకపోతే అనిరుద్ధ్ రక్తం తాగేస్తాయి అవి!—మళ్ళీ లేవబోయి లేవలేక కడుపుపట్టుకుని వెనక్కివాలిపోయింది స్నిగ్ధ!—

"అయ్యో! ఎవరూ రారేం!...ఏమయిపోయారందరూ...నాబిడ్డ...

నా బిడ్డ...ఎవరయినారండి —రక్షించండీ! — గుండెలవిసేలా ఏడుస్తూ అరవసాగింది స్నిగ్ధ——

గబ్బిలాలు మూడూ కోరలు చూపిస్తూ—ఉయ్యాలలో పడుకున్న శిశువుమీద పడ్డాయి!—

## 20

ఆ మూడు గబ్బిలాలు అనిరుద్ధ్ మీదపడగానే...భోరుమని ఏడుస్తూ కళ్ళు గట్టిగా మూసుకుంది స్నిగ్ధ—

ఏమిటీ పరీక్ష? ఎందుకు తనకీ శిక్ష?

తన సమక్షంలోనే ఆ రాకాసి గబ్బిలాలు అనిరుద్ధ్ రక్తాన్ని పీల్చి పిప్పిచేయడానికి సిద్ధపడ్తుంటే ఏమీ చేయలేకపోతోంది తను.

తనంతగా గొంతు చించుకుని అరచినా ఎవరూరాలేదు.

ఎందుకు?

ఇది కరకింకర మంత్ర మహిమా?

భయపడుతూ కళ్ళు తెరచి ఉయ్యాలకేసి చూసింది. స్నిగ్ధ అప్పుడే మూడు గబ్బిలాలు తొట్టిలోకి దిగిపోయాయి.

ఓ గాడ్! అంతా అయిపోయింది!

'అయ్యో! అయ్యో!...' నా బాబుని ఎవరయినా రక్షించండీ... గబ్బిలాలు వాడ్ని చంపేస్తున్నాయి!"

అరిచింది స్నిగ్ధ మళ్ళీ...

అరుపుకాదది...ఆక్రందన...!

స్నిగ్ధ గొంతు నర్సింగ్‌హోం కారిడార్లో ప్రతిధ్వనిస్తుండగానే...

వార్డు తలుపు భళ్ళున తెరచుకుంది...!

ఉలిక్కిపడి అటు చూసింది స్నిగ్ధ...

వార్డులోపలికి పరుగున వచ్చిందెవరో అర్థం కాలేదు స్నిగ్ధకి. డ్యూటీ నర్సు అయ్యుండాలని అనుకుంది ఒక్క క్షణం.

"సిస్టర్...సిస్టర్! ప్లీజ్!...నా బాబుని కాపాడండీ...గబ్బిలాలు" అని కంగారుగా అంటూ చటుక్కున ఆగిపోయింది...

వార్డు మధ్యన నిలబడిపోయి ఉయ్యాలకేసి చూస్తున్నది డ్యూటీ నర్సు కాదు.

మరి?

బెడ్‌లైట్ వెలుతురులో ఆ ఆకారం ఎవరిదో వెంటనే అర్థంకాలేదు. స్నిగ్ధకి...ఎవరది?

మస్తానమ్మ!

ప్రాణం లేచి వచ్చినట్టయింది స్నిగ్ధకి.

"మస్తానమా గబ్బిలాలు...గబ్బిలాలు." అంటూ ఉయ్యాలకేసి చూపించింది.

వెంటనే మస్తానమ్మ పరుగునవెళ్ళి గబ్బిలాలను తరిమికొట్టి అనిరుద్ధ్‌ని రక్షిస్తుందనుకుంది స్నిగ్ధ...

కానీ, అలా జరగలేదు.

"మస్తానమ్మా నిలబడ్డచోటునించి కదల్లేదు.

మస్తానమ్మా...అటూ...ఉయ్యాలలో. ఆలస్యం చేయకు గబ్బిలాలు బాబుని చంపేస్తున్నాయి" అని అరిచింది స్నిగ్ధ...

అయినా మస్తానమ్మ కదల్లేదు. జవాబయినా చెప్పలేదు.

ఆమె చూపులు మాత్రం ఉయ్యాల పైదే ఉన్నాయి.

మస్తానమ్మ ధోరణి అర్థంకాలేదు స్నిగ్ధకు.

ఆమె అలా ఎందుకు ఆగిపోయిందో...అనిరుద్‌ని ఎందుకు రక్షించడం లేదో బోధపడటంలేదు...

మస్తానమ్మా విన్నే! ఏమిటి అలా నిలబడిపోయావు" కోపంగా అంది స్నిగ్ధ మళ్ళీ...

అప్పుడు కదిలింది మస్తానమ్మ నెమ్మదిగా...ఉయ్యాలకేసి.

అలా కదిలింది స్నిగ్ధ అరుపులకి కాదు!...

అసలామెకు స్నిగ్ధ మాటలేవీ వినబడటంలేదు.

ఆమె పెదాలు మాత్రం నిశ్శబ్దంగా కదులుతున్నాయి సిఫిరి అమల్‌లో పరమోత్కృష్టమయిన మంత్రాన్ని జపిస్తున్నాయి ఆమె పెదాలు,

అదే...బందిష్.

బందిష్ మంత్రోచ్చారణతో తన మంత్రపరిధిని పటిష్ఠం చేసుకోవాలని తాపత్రయపడ్తోంది మస్తానమ్మ.

తనని ఆక్షేపిస్తున్న అన్యశక్తిని ఎదుర్కొడానికి దాని సవాలు నందుకుని బలాబలాలు తేల్చుకోడానికి రంగ బయలులోకి దూకిందామె.

అదామె దుడుకుదనమే!

బందిష్ ఫలించపోయినా...ఆ అన్యశక్తిని గెలవలేకపోయినా.

ఆమెకు ఘోరమయిన చావు తప్పదు.

అయినా భయపడకుండా ముందుకి కదిలిందామె.

మస్తానమ్మ ఎప్పుడు భయపడింది గనుక?

ఒకప్పుడు—

తను బాల్యం నించీ నేర్చుకుంటున్న మంత్ర విద్యలో నైపుణ్యం ఎంతో తెలుసుకోడానికి ఖబీస్‌ని వశం చేసుకుంది.

ఖబీస్ తనని ధిక్కరిస్తోందని గోటితో పోయేదానికి గొడ్డలిపెట్టులా భయంకరమయిన ఘోరామంత్రంవేసి అష్టదిగ్బంధనం చేసింది.

దాంతో సైతానుతో చేతులు కలపవలసి వచ్చింది!...సైతానుని ప్రసన్నుడిని చేసుకోవాలనే కదా స్నిగ్ధమీద కత్తికట్టింది.

మస్తానమ్మ ఉయ్యాలకేసి నడిచిందేకానీ తొట్టిలోకి దిగిపోయిన గబ్బిలాలని తరమడానికి ఎటువంటి ప్రయత్నమూ చేయలేదు.

ఆమెకు అర్థమయింది...అవి సాధారణమయిన గబ్బిలాలు కావని.

"మస్తానమ్మా!" బిగ్గరగా స్నిగ్ధ పిలవడం వినబడలేదు ఆమెకు.

తటాలున...

చేతులు రెండు పైకెత్తి చూపుడు వేళ్ళతో గాలిలో ఏవో గుర్తులు వేస్తూ ఉయ్యాలచుట్టూ వేగంగా నడవసాగింది మస్తానమ్మ.

చూస్తుండగానే...

ఆ నడక కాస్తా పరుగులామారింది.

విరబోసుకున్న జుట్టుతో...పిచ్చిదానిలా చేతులు ఊపుతూ అనిరుధ్ ఉయ్యాలచుట్టూ పరుగులు తీస్తున్న మస్తానమ్మనుచూసి నివ్వెరపోయింది

స్నిగ్ధ.

ఆశ్చర్యం!

మస్తానమ్మ వార్డులో అంత వేగంగా పరుగెడ్తున్నా ఎటువంటి అలికిడీ కావడంలేదు.

అంతలో...అనుకోని విధంగా ఠక్కున ఒక చోట ఆగిపోయింది మస్తానమ్మ.

చేతులు కిందకి దించకుండానే తీక్షణంగా ఉయ్యాల తొట్టిలోని గబ్బిలాలకేసి చూడసాగింది.

అపుడు లేచాయి ఆ మూడు గబ్బిలాలు తటుక్కున పైకి.

గాలిలోకి లేచాయేకానీ అంతకుముందు మస్తానమ్మ ఉయ్యాలచుట్టూ పరుగుతీస్తూ గీసిన గిరిని మాత్రం ఛేదించుకుని బయటపడలేకపోయాయి.

'కీచు' 'కీచు,మని అటూ ఇటూ ఎగురుతూ మస్తానమ్మ సృష్టించిన అగోచరమయిన గోడను తట్టుకుని వెనక్కి తగ్గుతున్నాయి.

తల ఏమాత్రం తిప్పకుండా కళ్ళుమాత్రమే తిప్పుతూ గబ్బిలాల అగచాట్లు గమనిస్తోంది మస్తానమ్మ.

గెలుపు తనదేనని అర్థమయిందామెకు.

బందిష్ పూర్తయినట్టే!

గబ్బిలాలు తను లేపి నిలబెట్టిన అడ్డుగోడలను దాటి ఎలా బయట పడలేకపోతున్నాయో...అలాగే ఇక బయటనించి అన్యశక్తి ఏదీ లోపలికి చొరపడలేదు.

తను సాధించిన విజయానికి సంబరపడిపోతూ చేతులు నెమ్మదిగా కిందకిదించి మామూలుగా నిలబడింది మస్తానమ్మ. అటూఇటూ గాబరాగా ఎగురుతున్న గబ్బిలాలపైనించి చూపులు మరల్చి ఉయ్యాలకేసి చూసింది.

అలా చూపులు తిప్పకుందోలేదో గబ్బిలాలు ఆమెమీదే పడ్డాయి.

పగబూని, వాడి కోరలతో ఆమె శరీరాన్ని తూట్లు పొడిచి రక్తం తాగేయాలని ప్రయత్నించాయి.

చాటంత రెక్కలున్న ఆ గబ్బిలాల ధాటికి రెండడుగులు వెనక్కి వేసింది మస్తానమ్మ.

అంతలోనే తమాయించుకుని నిటారుగా నిలబడిందామె. మళ్ళీ మంత్రోచ్చారణ ప్రారంభించి చేతులు గాలిలో అటూ ఇటూ రెండుసార్లు బలంగా ఊపింది.

అంతే!

అంతవరకూ ఆమెమీద దాడిచేసిన గబ్బిలాలు ఎవరో కొట్టినట్టు నేలకూలాయి!

నేలమీద రెక్కలు చాచుకుని పడిపోయిన గబ్బిలాలని మరింత కోపంగా చూసి వాటికేసి చూపుడువేళ్ళతో ఏవో గుర్తులు వేసింది మస్తానమ్మ. మరుక్షణం పడ్డచోటే గిలగిలా కొట్టుకుంటూ...కాసేపటికి నిశ్చలంగా పడిపోయాయి గబ్బిలాలు.

నెమ్మదిగా ముందుకు నడిచి ఎడమకాలితో వాటిని తోసి చూసింది మస్తానమ్మ.

గబ్బిలాలు మూడూ చచ్చాయని నిర్ధారణ చేసుకున్నాక ఒకొక్క దాన్నీ ఎత్తి తీసుకెళ్ళి కిటికీలోంచి బయటకి విసిరికొట్టిందామె.

జరుగుతున్నదంతా నిశ్చేష్టురాలై చూస్తోంది స్నిగ్ధ.

అనిరుధ్‌మీదపడ్డ ఆ రాకాసి గబ్బిలాలను మస్తానమ్మ చంపి పారేసిందని ఒకవైపు రిలీఫ్‌గా ఉన్నా...ఆమె వింత ప్రవర్తన గురించి ఏమనుకోవాలో బోధపడటంలేదు స్నిగ్ధకి.

ఒక్కటిమాత్రం అనిపించిందామెకు.

మస్తానమ్మ సామాన్యురాలు కాదు!

ఆమె చంపింది గబ్బిలాలని కాదు...

కరకింకర ఉపాసకులెవరో మంత్రించి పంపిన 'వ్యాంపైర్స్'ని!

ఏదిఏమైనా మస్తానమ్మ తన అనిరుధ్‌ని కాపాడింది.

ఆరోజు పిచ్చిగా ఆత్మహత్య చేసుకోబోతుంటే తన ప్రాణాలు కాపాడింది.

ఈరోజు అనిరుధ్ ప్రాణాలు!

ఇక జీవితాంతం తను మస్తానమ్మకి ఋణపడి ఉండాల్సిందే.

కన్నీళ్ళు తలగడాని తడిపేస్తుంటే అప్రయత్నంగా చేతులు

జోడించింది స్నిగ్ధ.

"మస్తానమ్మా!..." గద్గదంగా పిలిచింది.

మస్తానమ్మ జవాబివ్వలేదు. స్నిగ్ధకేసి చూడనయినా చూడలేదు—

ఒక్కొక్క అడుగూ వేస్తూ ఆమె ఉయ్యాలకేసి నడిచింది.

తొట్టిలో పడుకున్న బాబుకేసి పరిశీలనగా చూసిందామె.

బాబు ఒంటిమీద ఎటువంటి గాయమూలేదు. మెలకువగా కళ్ళుఅటూ ఇటూ తిప్పి చూస్తున్నాడు.

ఆ పసివాడి ముహంలో ఏం కనబడిందో ఏమో మస్తానమ్మకి!... అరచేతుల్లో తన మొహం దాచుకుని నిలబడిపోయింది?...

అంతలోనే...సన్నగా ఏడుపు ప్రారంభించింది...

అలా ఏడుస్తూ కిందకు ఒరిగిపోయి తల బలంగా విదిలించింది.

"ప్రభూ!...నేను పాపాత్మురాలిని...ప్రభూ!" అంది బిగ్గరగా బొంగురు గొంతుకతో...

మస్తానమ్మ ప్రవర్తనని కన్నార్పకుండా చూస్తున్న స్నిగ్ధ వార్డులో లైటు వెలగ్గానే ఉలిక్కిపడి చూసింది.

మస్తానమ్మ రాకముందు స్పృహతప్పి పడిపోయిన రాజేశ్వరిదేవి లైటు స్విచ్‌బోర్డు దగ్గర నీరసంగా నిలబడి ఉంది.

ఉయ్యాల దగ్గరున్న మస్తానమ్మ చటుక్కున కళ్ళ తుడుచుకుంటూ లేచి ఆమె దగ్గరకెళ్ళింది.

రాజేశ్వరిదేవి అయోమయంగా వార్డు కలయచూస్తోంది. జరిగింది ఏమిటో అర్థంచేసుకోడానికి ప్రయత్నిస్తోందామె.

"నువ్వెపుడు వచ్చావే?" అడిగింది మస్తానమ్మని.

"ఇప్పుడే అమ్మగారూ!"

"ఆ గబ్బిలాలు...?" భయంగా అడిగింది రాజేశ్వరిదేవి.

"గబ్బిలాలు ఏమిటి అమ్మగారూ?" ఎంతో అమాయకంగా అడిగింది మస్తానమ్మ.

• • •

మర్నాడు పెందలాడే నిద్రలేచింది స్నిగ్ధ.

రాజేశ్వరిదేవి సోఫాకమ్‌బెడ్‌లో కూర్చుని ఎటో శూన్యంలోకి చూస్తోంది జుట్టు రేగిపోయి కళ్లు ఎర్రగా ఉన్నాయి. రాత్రంతా నిద్ర పోయినట్టు లేదామె.

వార్డులో మస్తానమ్మను వెతికాయి స్నిగ్ధ కళ్ళు...

ఉయ్యాల పక్కనే చేతులు కట్టుకుని ప్రతిమలా నిశ్చలంగా నిల బడి ఉంది మస్తానమ్మ. తొట్టిలో నిద్రపోతున్న అనిరుధ్‌ని తదేకంగా చూస్తోందామె.

స్నిగ్ధ మేల్కొందని గమనించి సోఫాలోంచి లేచింది రాజేశ్వరిదేవి.

"నేనింటికి వెళతానమ్మాయి" అందక్కడే నిలబడి...

ఆవిడకేసి కొంచెం కంగారుగా చూసింది స్నిగ్ధ.

"అదేవిటి అత్తయ్యగారూ! నిన్నరాత్రి మీరు కళ్ళు తిరిగి పడిపో యారు. బాగానీరసంగా ఉన్నట్టున్నారు. కాస్సేపట్లో డాక్టర్ ప్రేమరౌండ్స్ కివస్తారు. ఆవిడ్ని అడిగి మందులు ఏవయినా రాయించుకుని ఇక్కడే రెస్టుతీసుకోండి" అంది.

తల అడ్డంగా తిప్పింది రాజేశ్వరిదేవి.

"లేదమ్మాయి. నాకిక్కడ ఊపిరి ఆడటంలేదు. ఇంటికెళ్ళిపోతాను. ఇంటిదగ్గర డాక్టర్‌కే చూపించుకుంటాను" అందామె కొంచెం బిగ్గరగా.

క్రితంరాత్రి జరిగిన సంఘటనకి రాజేశ్వరిదేవి హడలిపోయిందని, ఆవిడ్ని బలవంతంచేసి ఆపడం భావ్యం కాదనిపించింది స్నిగ్ధకి.

"సరే...కానీ, ఒంటరిగా వెళ్ళకండి మస్తానమ్మతో వెళ్ళండి. నాకిపుడేం ఫర్వాలేదు..." అంది.

ఏదో అభ్యంతరం చెప్పబోతున్నట్టు రెండడుగులు ముందుకు వేసింది మస్తానమ్మ...అంతలో ఏమనుకుందో కానీ ఊరుకుంది.

"ఇంటికెళ్ళాక మస్తానమ్మని వెనక్కి పంపిస్తాను" అంటూ బయటకి నడిచింది రాజేశ్వరిదేవి.

అయిష్టంగా మొహంపెట్టుకుని ఉయ్యాల పక్కనించి కదిలింది మస్తానమ్మ. మాటిమాటికి ఉయ్యాలకేసి తిరిగిచూస్తూ రాజేశ్వరిదేవిని అనుసరించింది ఆమె ధోరణి చూసి ఎందుకో అనాలనిపించి అంది స్నిగ్ధ.

"మస్తానమ్మా! ఫర్వాలేదు వెళ్ళిరా...నువ్వు వచ్చేదాకా బాబుని నేను చూసుకుంటాను కదా!"

హాయిగా చిరునవ్వొకటి నవ్వి రాజేశ్వరిదేవితో వెళ్ళిపోయింది మస్తానమ్మ.

కాసేపటికే డాక్టర్ ప్రేమ రౌండ్స్‌కి వచ్చింది. ఆమెతోపాటు కేస్‌షీట్ పట్టుకుని జూనియర్ డాక్టర్ ఒకమ్మాయికూడా వచ్చింది.

"ఏమ్మా స్నిగ్ధా ఎలా ఉన్నావ్? రాత్రి నిద్రపోయావా? బాబుకి పాలు పట్టావా?" అడిగింది డాక్టర్ ప్రేమ.

సమాధానంగా తలూపింది స్నిగ్ధ.

"ఇక్కడనీకేమీ ప్రాబ్లెమ్ లేదుకదా?" అడిగింది డాక్టర్ ప్రేమ మళ్ళీ

క్రితంరాత్రి వార్డులోకి గబ్బిలాలు రావడం, తను ఎంతగా అరచినా నర్సులు ఎవరూ పలకకపోవడం గురించి చెప్పాలని నోటిదాకా వచ్చింది స్నిగ్ధకి. కానీ, తను చెప్పేమాటలు డాక్టర్ ప్రేమ నమ్మకపోవచ్చని, హిస్టరిక్‌గా ప్రవర్తించిన తను పీడకలేదోచూసి అలా మాట్లాడ్తోందనుకోవచ్చని ఊరుకుంది...పైగా, అనిరుధ్‌ని అటాక్ చేయడానికి వచ్చిన గబ్బిలాలను మామూలు మనుషులు ఏంచేయకలరు? ఆ రాకాసి గబ్బిలాలని మంత్రమేదోవేసి చంపిందికదా మస్తానమ్మ? తనకిక భయం అనవసరం.

ఇకమీదట అనిరుధ్‌ని కాపాడటానికి మస్తానమ్మ ఉందికదా.

"ఏమ్మా ఏమిటి ఆలోచిస్తున్నావ్?" అడిగింది డాక్టర్ ప్రేమ.

"ఏం...ఏం లేదండీ...ప్రాబ్లెమ్ ఏమీలేదు!" అంది స్నిగ్ధ నవ్వు తెచ్చిపెట్టుకుంటూ.

స్నిగ్ధని ఎక్జామిన్ చేసాక ఉయ్యాలకేసి వెళ్ళింది డాక్టర్ ప్రేమ.

"బాబు పేరేదయినా ఆలోచించుకున్నావా? లేదా?" అడిగిందామె.

"అనిరుధ్"

"బ్యూటిఫుల్ నేమ్!" అంటూ అనిరుధ్‌ని ఎత్తుకుని కాసేపు ముద్దు చేసి ఆ తర్వాత పరీక్ష చేసింది డాక్టర్ ప్రేమ.

డాక్టర్ ప్రేమ పని ముగించుకుని వెళ్ళబోతుంటే అడిగింది స్నిగ్ధ.

"నేను లేచి కూర్చోవచ్చా?"

"వద్దమ్మా తొందరపడకు. ఇవాళంతా రెస్టుతీసుకుంటే రేపు కండి షన్‌చూసి నేనే లేపి నడిపిస్తాను కూడా అంది డాక్టర్ ప్రేమ బయటకి వెళుతూ.

కొంచెంసేపయ్యాక ఆయావచ్చి స్నిగ్ధ బట్టలు మార్చింది.

"నిన్న మీరు విప్పిన చీరకి రక్తం మరకలంటాయని లాండ్రీకి వేసానమ్మా. ఇదిగో ఇందాకే తెచ్చిచ్చాడు కుర్రాడు" అంది ఆయా.

"ఆ కుర్చీమీదున్న ఎయిర్‌బ్యాగ్‌లో పెట్టు" అంది స్నిగ్ధ.

ఆయా చీర ఎయిర్‌బ్యాగ్‌లోపెట్టి వెళ్ళిపోతుంటే పిలిచింది స్నిగ్ధ "ఆ ఎయిర్‌బ్యాగ్ నాకిచ్చివెళ్ళు" అని.

బ్యాగ్ స్నిగ్ధకిచ్చి తలుపు దగ్గరకేసుకుని వెళ్ళిపోయింది ఆయా. ఉయ్యాలలో అనిరుధ్ చిన్నగా ఏడిచాడు.

ఆకలేస్తోందేమో?

ఆయా ఉండగానే పాలుపట్టిఉండవల్సింది. మళ్ళీ ఆయాగానీ, నర్సు గాని రావడానికి ఎంతసేపు పడ్తుందో. పోనీ నెమ్మదిగాలేచి వెళ్ళి అనిరుధ్‌ని తెచ్చుకుంటే...?

డాక్టర్ ప్రేమ అంతకుముందు అన్నమాటలు గుర్తుకొచ్చాయి కానీ నెమ్మదిగా ఎటువంటి స్ట్రెయిన్ లేకుండా లేచి వెళ్ళడంలో పొరపాటు ఏముందనిపించింది స్నిగ్ధకి. సిసేరియన్ ఆపరేషన్ అయినవాళ్ళకి లేచి రగవచ్చని పర్మిషన్ ఇస్తే మరీ ఎక్కువగా తిరిగి కాంప్లికేషన్స్ తెచ్చు ంటారని కాబోలు, డాక్టర్లు రెండు మూడు రోజులు కదలకూడదంటారు.

ఊపిరిబిగబట్టి నెమ్మదిగా లేవబోయింది స్నిగ్ధ...

కడుపులో ఏదో పట్టేసినట్టయింది. ధైర్యంచాలక మళ్ళీ వెనక్కి వాలిపోయింది.

లాభంలేదు. అనిరుధ్‌కి పాలుపట్టాలంటే నర్సువచ్చేవరకూ ఉండా ల్సిందే.... ఈ లోగా మస్తానమ్మ తిరిగివస్తే సమస్య ఉండదు...

ఉయ్యాల్లో పడుకున్న అనిరుధ్‌కూడా ఏడుపు ఆపేసాడు అప్పటికి.

మంచంమీద తన పక్కనున్న ఎయిర్‌బ్యాగ్‌ని యథాలాపంగా చూసింది స్నిగ్ధ. అంతపెద్ద బ్యాగ్ రాజేశ్వరిదేవి ఎందుకు పట్టుకొచ్చిందో

అనుకుంటూ జిప్ తీసింది.

తన చీరకాక ఏముంది బ్యాగ్‌లో?

బ్యాగ్ లోపల చెయ్యిపెట్టి చూసింది స్నిగ్ధ.

ఆయా అంతకుముందు పెట్టిన చీరకాక ఒక టవల్, సబ్బుపెట్టె, బ్రష్, టూత్‌పేస్టు ఉన్నాయి అందులో అవన్నీకాక స్నిగ్ధచేతికి ఒక బ్రౌన్‌పేపర్‌లో చుట్టిన పొడవయిన వస్తువేదో తగిలింది. అదేమిటో అర్థంకాక బయటకు తీసి బ్రౌన్‌పేపర్ విప్పింది స్నిగ్ధ.

చేతిలోని వస్తువునిచూసి అద్దిరిపడింది.

కొడవలి!

తళతళ మెరుస్తున్న...కరకింకర కొడవలి.

ఆరోజు కరకింకర ఆలయానికి సుస్మితతో వెళ్ళినపుడు విచిత్రంగా తనకు దొరికిన కొడవలి.

ఎలా వచ్చింది బ్యాగ్‌లోకి?

ఇందులో బట్టలు సర్దుతున్నపుడు పొరపాటున చీరతోపాటు పెట్టేసారా?

కొడవలిని చేతిలో అటూఇటూ తిప్పి చూసింది స్నిగ్ధ.

ఖండాలాలో తను రౌడీ కుర్రాళ్ళ చేతులు నరకడం గుర్తొచ్చింది.

ఎంత సునాయాసంగా చేసింది తనాపని! ఆ పని చేసింది తనే అయినా...చేయించింది అతీత శక్తి! కరకింకర శక్తి.

అవును! అంతే అయ్యుండాలి. లేకపోతే తనకంత ధైర్యం ఎక్కడిది?

ఆరోజు ఈ కొడవలి పట్టుకున్నాకే కదా తనలో ఊపు వచ్చింది?! అంటే, ఇందులోకూడా ఏదో గొప్పదనం ఉండి ఉండాలి.

ఎంతయినా మిహిర్‌కుట్టి స్వయంగా తనకందించిన కొడవలి మరి.

......

అప్పుడు—ఒక్కసారిగా

ఒకదానితర్వాత ఒకటి ఆలోచనలు రాసాగాయి స్నిగ్ధ మస్తిష్కంలో.

వేటినీ తోసివేయలేకపోతోందామె...

పూర్తిగా వాటి ఊబిలో పడిపోయిన ఆమె కళ్ళు ఎటో శూన్యంలోకి చూడసాగాయి.

మొహమంతా పాలిపోయి బ్లాంక్‌గా తయారయింది. క్రమంగా ఆమె మొహంలో భావాలు పూర్తిగా మారిపోయాయి.

ఆ క్షణంలో పవన్ ఆమెను చూసిఉంటే గుర్తుపట్టేవాడుకాదేమో. అంతగా మారిపోయిందామె ఎక్స్‌ప్రెషన్.

కొడవలి పిడిచుట్టూ గట్టిగా బిగుసుకున్న ఆమెచేతి వేళ్ళు రక్తం అందక తెల్లగా మెరుస్తున్నాయి.

ఆమె చెవులకి హ్మాత్రమే...

కరకింకర ఆలయంలో మ్రోగే నగారా వినబడ్తోంది.

ఆ పూర్వదేశ్వడి ఉపాసకుల మంత్రోచ్చారణ వినబడ్తోంది.

క్షణక్షణానికి ఆ హోరు పెద్దదయిపోతుంటే స్నిగ్ధ వాస్తవానికి మరింత దూరం కాసాగింది.

ఆమె కళ్ళకి ఆ నర్సింగ్‌హోం వార్డు కరకింకర ఆలయమనిపించింది!...ఒకవైపు పదడుగుల ఎత్తు విగ్రహంకూడా కనిపించిందామెకు.

కరకింకర విగ్రహం కళ్ళలోని ఆకుపచ్చరంగు కాంతికూడా ప్రస్ఫుటమయింది.

చటుక్కున...

మంచం మీదనించి లేచినిలబడింది స్నిగ్ధ.

తనకుఆపరేషన్ అయిందన్నసంగతి పూర్తిగా మరచిపోయిందామె.

కొడవలిని మరింత గట్టిగా పట్టుకుని...ఒక్కొక్క అడుగు వేస్తూ ముందుకు నడిచింది!...

ఉయ్యాలలో పడుకున్న అనిరుధ్‌కేసి తడి కళ్ళతో చూసింది.

తప్పదు!...

ఈ రోజు కాక పోయినా

ఏదో ఒకరోజు ఈ పనిచేయక తప్పదు!

కరకింకర శక్తిముందు తనెంత?

"బాబూ అనిరుధ్ ... నన్ను క్షమించు!" అంటూ కొడవలి పైకె త్తింది—

# 21

కళ్ళు గట్టిగా మూసుకుని ఊపిరి బిగబట్టింది స్నిగ్ధ...

కొడవలితో ఒకే ఒక దెబ్బవేస్తే కరకింకరకు ప్రియాతి ప్రియ మయిన నైవేద్యం పెట్టగలుగుతుంది తను!

ఆ క్షణంలో నగరానాదంతో ఆ ప్రదేశమంతా మార్మోగుతున్న ట్టుగా అనిపించింది స్నిగ్ధకి...

ఇక ఆలస్యం చేయకూడదు!

సంశయాల్ని, సందేహాలని పక్కకునెట్టి ఇచ్ఛాపూర్వకంగా కరకిం కరకు ఈ కానుక అందించాలి!...

కొడవలి గురి తప్పకుండా ఒకే ఒక దెబ్బతో అనిరుధ్ చెయి నరకాలి!—

చెయి మాత్రమే నరకాలి.

ఏ మాత్రం పొరపాటు జరిగినా—

ప్రచండమైన కరకింకర ఆచార కర్మను ఉల్లంఘించినా పర్యవ సానం చాలా దారుణంగా ఉంటుంది

అప్రయత్నంగా కళ్ళు తెరచి అనిరుధ్‌కేసి ఒకసారి చూసిందిస్నిగ్ధ.

మరుక్షణం అవిటివాడిని చేయబోతున్న తన కన్నబిడ్డకేసి నిర్లి ప్తంగా చూసింది!...

అపుడు ఆమె మనసుని ఆక్రమించుకున్నది ఒకే ఒక ఆలోచన కొడవలి దెబ్బ గురితప్పకుండా సరిగ్గా పడాలి అంతే.

కొడవలి పడుతున్నపుడు అనిరుధ్ కదలకుండా ఉంటే చాలు.

సరిగ్గా అపుడే...ఉయ్యాలలో పడుకున్న అనిరుధ్ కళ్లుతెరచి స్నిగ్ధకేసి చూసాడు...

తళతళ మెరుస్తున్న ఆయుధం పట్టుకుని తన చెయి నరికి ఒక పూర్వదేవుడికి సమర్పించాలనుకుంటున్న స్నిగ్ధకేసి చూసాడు.

గుర్తుపట్టినట్టుగా చూసాడు తల్లి కేసి

"నువ్వేం కదూ?...నా మమ్మీవి?..." అన్నట్టున్నాయి ఆ చూపులు.

అలా చూస్తూ...సన్నగా చిరునవ్వొకటి నవ్వాడు అనిరుధ్!...మంచులో తడిసిన పారిజాతంలా ఎంత స్వచ్ఛంగా ఉందా చిరునవ్వు!

"నువ్వుంటే నాకంతకంటే ఏంకావాలి?..." అని అంటున్నట్టు ఎంతో ధీమాగా ఉందా చిరునవ్వు.

ఆ చిరునవ్వు చూసి...

పైశాచికత్వం ప్రకోపించిన స్నిగ్ధ మనసులో ఒకేఒక క్షణం మాతృత్వం పెల్లుబికింది.

కొడవలి పట్టుకున్న చెయి అలాగే నిలిచిపోయింది.

అనిరుధ్‌ని వెంటనే ఎత్తుకుని ముద్దాడాలని...

చనుకట్టుని తడిపేస్తున్న క్షీరధారని వాడి లేత పెదాలకి అందించాలని ఎంతగానో కోరుకుంది మాతృవాత్సల్యం.

కానీ, అంతలోనే దయార్ద్రభావాలను పక్కకు నెట్టేసింది స్నిగ్ధ! బలవంతంగా చూపులు మరల్చుకుంది నగారానాదం...కరకింకర ఉపాసకుల మంత్రోచ్చారణతో ఆమె మస్తిష్కం మళ్ళీ నిండిపోయింది.

విసురుగా...

కొడవలితో అనిరుధ్ చెయ్యి నరకబోయింది.

కానీ...ఆశ్చర్యం!

ఆ చెయి కిందికి వాలలేదు!

కొడవలి పట్టుకున్న ఆమె చేతిని నల్లటి చెయి మరొకటి గట్టిగా పట్టుకుంది.

ఆ ఉక్కుపట్టునించి విడిపించుకోడానికి గింజుకోసాగింది స్నిగ్ధ...ఎంత ప్రయత్నించినా ఆ పట్టు సడలలేదు.

చటుక్కున వెనక్కి తిరిగి చూసింది స్నిగ్ధ.

మస్తానమ్మ!

మస్తానమ్మను స్నిగ్ధ గుర్తుపట్టింది కాని తన ప్రయత్నం ఆపలేదు. తనచెయ్యి విడిపించుకోవాలని కరకింకరకు నైవేద్యం పెట్టాలని మాత్రమే

ఆలోచిస్తోందామె.

స్నిగ్ధని అలాగే పట్టుకుని, ఎడంచేతి చూపుడు వేలితో ఆమె నుదుటిమీద ఏవో గుర్తులు గీస్తూ అంది మస్తానమ్మ.

"ఇది నా పరిధి!...ఇక్కడ అధికారాలన్నీ నావి! దురాక్రమణ చేసినవాళ్ళు భస్మమౌతారు."

గింజుకోవడం ఆపి మస్తానమ్మకేసి చూస్తూ నిలబడిపోయింది స్నిగ్ధ! ఎవరితో మాట్లాడ్తోంది మస్తానమ్మ?

ఉన్నట్టుండి నిస్సత్తువగా అనిపించిందామెకు.

అంతవరకూ ఆమె విన్న నగారానాదం...ఇప్పుడు ఎక్కడో దూరంనించి వినబడ్తోంది...అస్పష్టంగా.

ఎదురుగా అంతకుముందు ప్రత్యక్షమయిన కరకింకర విగ్రహం కూడా మసగ్గా కనిపిస్తోంది.

అప్పుడు మొదలుపెట్టింది మస్తానమ్మ విచిత్రమైన మంత్ర జపమొకటి!...

ఆ జపం కొనసాగుతుంటే...

స్నిగ్ధకు మాత్రమే వినిపిస్తున్న నగారానాదం పూర్తిగా ఆగిపోయింది!

అంతవరకూ ధృడంగా పట్టుకున్న కొడవలి జారి నేలమీద ఖంగుమని శబ్దంచేసింది...

అప్పుడర్థమయింది స్నిగ్ధకు తనెక్కడుందో!

మరికాసేపు మంత్రజపంచేసి నెమ్మదిగా స్నిగ్ధ చెయి వొదిలిపెట్టింది మస్తానమ్మ...

దిగ్భ్రమంతో అటూ ఇటూ చూసింది స్నిగ్ధ...

నేలమీదపడ్డ కొడవలి అంతకుముందు వరకూ తన చేతిలోనేఉంది ఆ కొడవలి పట్టుకుని తను తలపెట్టిన పనేమిటి!

రాక్షసత్వంపూని తన ముద్దుల కన్నని నిర్దాక్షిణ్యంగా నరకబోయింది.

ఏది జరగకూడదనుకుందో అదే జరగబోతోంది.

ఆనాడు తను చూసిన పీడకల మస్తానమ్మ రాకపోతే నిజమయ్యేది! కలలో చూసినట్టు అనిరుధ్ చెయి నరికేసేది తను.

తనేం చేయబోతోందో తనకే తెలియదు.

ఆ రోజు...ఆత్మహత్య చేసుకోవాలని అనుకోవడమేకాదు ఏకంగా ఆత్మహత్యకి పూనుకుంది...

ఈరోజు...ఈ ఘాతకానికి సిద్ధమయింది.

"తనంటే తనకే భయం! తనమీద తనకే నమ్మకంలేదు.

ఏమిటీ పరిస్థితి!

అనిరుధ్‌కి రక్షణ కల్పించవలసిన తనే వాడికి బద్ధ శత్రువులా తయారయింది.

కాకతాళీయంగా ఈరోజు మస్తానమ్మ వచ్చింది కాబట్టి ఘోర మయిన విపత్తు నివారించకలిగింది.

కానీ, ఈసారి తన మనసు స్థిమితం తప్పినపుడు ఏం జరుగు తుందో...?

తననించి అనిరుధ్‌ని ఎవరూ రక్షించకపోతే?

"నో...నో!..." బిగ్గరగా అరిచింది స్నిగ్ధ.

ఆమెకేసి రెండడుగులు వేసింది మస్తానమ్మ. స్నిగ్ధ వెనక్కి వెళుతూ మరింత బిగ్గరగా అరవసాగింది."

"బాబుని ఇక్కడ్నించి తీసుకెళ్ళిపో—నా దగ్గరుంటే బాబుకి ఏం జరుగుతుందో! బాబుని ఇక్కడ ఉంచవద్దు...తీసుకెళ్ళు.

స్నిగ్ధ అలా అరుస్తుండగా వార్డు తలుపు తోసుకుంటూ డ్యూటీ నర్సు లోపలికి వచ్చింది.

మంచం దగ్గర నిలబడి పిచ్చిదానిలా అరుస్తున్న స్నిగ్ధనుచూసి కంగారుపడిపోయిందామె.

"అరె...ఎందుకులేచారు మీరు! ... లేవకూడదని డాక్టర్‌గారు చెప్పారుకదా." అంటూ వచ్చి స్నిగ్ధ చెయిపట్టుకుందామె.

నర్సు చెయి విదిలించి కొట్టింది స్నిగ్ధ.

"ముందు వాడ్ని ఇక్కడ్నించి తీసుకునిపొండి." గొంతు చించు

కుంటున్నట్టయింది.

నర్సుకి ఏం చేయాలో అర్థంకాలేదు. వెనక్కి తిరిగి అక్కడ్నించి గబగబ బయటకువెళ్ళి రౌండ్స్ పూర్తిచేసుకుని లేబర్ రూంకేసి వెళ్తున్న డాక్టర్ ప్రేమని పిలుచుకుని వచ్చింది.

"స్నిగ్ధా! ఏమిటమ్మా ఇది!" అంటూ దగ్గరకు వచ్చింది ప్రేమ.

పెద్దగా ఏడవసాగింది స్నిగ్ధ...ఉయ్యాలకేసి చూపిస్తూ.

"వొద్దు! నాకువాడు వొద్దు!" అనసాగింది వెక్కిళ్ళతో.

ఆమెను సముదాయిస్తున్నట్టు వీపుతట్టింది డాక్టర్ ప్రేమ.

"డోంట్ గెట్ ఎక్సైటెడ్ మైడియర్...నిన్నరాత్రి పాలు పట్టానన్నావుకదా...ఇందాక నేను వచ్చినపుడుకూడా బాగానే ఉన్నావు. ఇంతలో ఏమయింది? తల్లి వైయుండి" అని ఏదో చెప్పబోయిందామె.

"నో...నేను తల్లి నికాదు!...రాక్షసిని." బిగ్గరగా అరచి ఉరిమి చూసింది స్నిగ్ధ.

ఆమె ధోరణి వెళంతప్పుతోందని అర్థమయింది డాక్టర్ ప్రేమకి. ఇలాంటపుడు వాదనపెట్టుకోవడం పద్ధతికాదని అనుకుని వెనక్కి తిరిగి నర్సుకి ఏదో చెప్పింది. నర్సు వెళ్ళాక స్నిగ్ధ భుజంచుట్టూ చేయివేసి మంచంకేసి నడిపించింది.

"బాబుని ఇక్కడ్నించి తీసుకెళ్ళిపోవాలి అంతే కదా!...అలాగే చేద్దాం. నువ్వు అడిగేంతవరకూ మళ్ళీ బాబుని ఇక్కడికి తీసుకునిరాము! సరేనా?"

"నేనడిగినా సరే...బాబుని మాత్రం నా దగ్గరకి తీసుకుని రావద్దు!" అంది స్నిగ్ధ మళ్ళీ గొంతు పెద్దది చేస్తూ.

"అలాగే...అలాగే!..." అంది డాక్టర్ ప్రేమ ఆమెను మంచం మీద కూర్చోబెడుతూ.

అంతలో సిరెంజి తీసుకొచ్చింది నర్సు. ఇంజెక్షన్ అందుకుని స్నిగ్ధను మాటల్లో పెట్టింది డాక్టర్ ప్రేమ.

"మీ ఆయన ఎప్పుడొస్తాడమ్మా?...అక్కడ్న అసైన్‌మెంట్ పూర్తయిందనుకుంటాను?" అంటూ ఇంజెక్షన్ చేసేసింది.

"తెలియదు డాక్టర్..." అంది స్నిగ్ధ నొప్పికి కళ్ళు చిట్లిస్తూ.

కొంచెంసేపటికే ఇంజెక్షన్ తన ప్రభావం చూపించింది నీరసంగా తలగడమీద వాలిపోయి నిద్రలోకి జారుకుంది స్నిగ్ధ...

బెడ్ పక్కనించి కదుల్తూ కొంచెం చికాగ్గా నర్సుని అడిగింది డాక్టర్ ప్రేమ.

"అసలీ అమ్మాయిని మంచం దిగవద్దన్నాను. దగ్గర ఎవరూలేరా?

"ఈమె ఇక్కడే ఉంది మేడమ్!" అందామె ఉయ్యాలపక్కన నిలబడ్డ మస్తానమ్మకేసి చూపెడుతూ.

"ఇదిగో పిల్లా!...అమ్మాయిని ఇలా లేవనిస్తే ఎలా? నీమాట వినదనుకుంటే డ్యూటీ నర్సుని పిలవొచ్చుకదా? ఇంతకీ ఆ పెద్దావిడ ఏదీ? కనబడదేం?" అడిగింది డాక్టర్ ప్రేమ మందలిస్తున్న ధోరణిలో.

మస్తానమ్మ ఆమెకేసి అదోలా చూసి సమాధానం చెప్పకుండా ఉయ్యాలలో పడుకున్న అనిరుధ్‌నిచూస్తూ నిలబడింది.

"డాక్టరమ్మగారు ఏదో అడుగుతుంటే జవాబు చెప్పవేం?" అంటూ మస్తానమ్మకేసి నడవబోయిన నర్సుని వారించింది డాక్టర్ ప్రేమ.

"ఇట్స్ఆల్‌రైట్ సిస్టర్!... ఈ పేషెంట్‌ని మీరే కొంచెం కనిపెట్టి ఉండండి. పరిస్థితి ఇలాగే ఉంటే ఇది హిస్టీరియా కేసుగా మారి కాంప్లికేషన్స్ రావచ్చు! బీకేర్‌ఫుల్!" అని బయటకు నడిచింది...

ఒక్క నిముషం ఆగి స్నిగ్ధ మంచం పక్కకు వచ్చి నిలబడింది. మస్తానమ్మ...

ముందుకు వొంగి స్నిగ్ధ నుదుటిమీద చెయి పెట్టింది.

ఆ స్పర్శకు చటుక్కున కళ్ళు తెరచి చూసింది స్నిగ్ధ...ఒక్క పక్కనుంచి ఇంజెక్షన్ మత్తు నిద్రలోకి లాగేస్తున్నా తన మీదకు వొంగి నిలబడ్డ మస్తానమ్మతో ఏదో మాట్లాడ్డానికి ప్రయత్నించింది. పెదాలు వొణికాయి కాని నోటమాటరాలేదు!...కళ్ళలో నీళ్ళు పొంగాయి!...

స్నిగ్ధ చెప్పదలచుకున్నదేమిటో అర్థమయినట్టు తలపంకించింది మస్తానమ్మ.

"పూర్తిగా కట్టుదిట్టం చేయకుండా వెళ్ళడం నా పొరపాటే? వాళ్ళ

నీ ద్వారా బాబుకి హాని తలపెట్టవచ్చని ఆలోచించలేదు నేను. భయంలేదు. ఇకమీదట నీ మనసు అధీనం తప్పదులే?" అంది మస్తానమ్మ నెమ్మదిగా.

మాట్లాడే ప్రయత్నమాపి మస్తానమ్మ చెప్తున్నది వింటూ పడుకుంది స్నిగ్ధ.

"ఇక మీదట...బాబుగురించి నీకు భయం అనవసరం. బాబు ప్రాణాలకి నా ప్రాణం అడ్డం." అంది మస్తానమ్మ మళ్ళీ.

స్నిగ్ధ హాయిగా చిరునవ్వు నవ్వింది. డాక్టర్ ప్రేమ మాటలు అందివ్వని అభయాన్ని మస్తానమ్మ పలుకులు అందించాయి ఆమెకు.

నిశ్చింతగా కళ్ళుమూసుకుని, చాలారోజుల తర్వాత ఎంతో ప్రశాంతంగా నిద్రపోయింది స్నిగ్ధ.

ఆరోజు సాయంత్రం స్నిగ్ధ మెసేజ్ అందుకుని నర్సింగ్‌హోంకి వచ్చింది డాక్టర్ సుస్మిత.

స్నేహితురాలి పరిస్థితిచూసి కంగారుపడిపోయిందామె.

"నాకు వెంటనే తెలియచేయలేదెందుకు స్నిగ్ధా? నేను వచ్చి ఉండేదాన్నికదా నీకు తోడుగా!" అందామె బెడ్‌పక్కన కుర్చీలాక్కుని కూర్చుంటూ.

"నీకు ఫోన్‌చేసి చెప్పమని హాస్పిటల్ మేట్రన్‌కి నిన్న సాయంత్రమే చెప్పాను సుస్మితా!...మా అత్తయ్యగారు వచ్చేసారుకదా అని ఆమె నిర్లక్ష్యం చేసినట్టుంది."

"కనీసం ఇవాళయినా ఫోన్‌చేసి చెప్పారు అదే గొప్ప. లేకపోతే నువ్విం అడ్మిట్ అయినట్టు తెలిసేదేకాదు నాకు!" అంది సుస్మిత.

"ఇదంతా ఒక మిరకిల్‌లా జరిగింది...అన్నీ విచిత్రమయిన సంఘటనలే. నిన్న ఆక్సిడెంట్ జరిగి బ్లీడింగ్ మొదలయినపుడు ఇక అనిరుధ్ నాకు దక్కడనుకున్నాను. ఆపరేషన్‌కి ముందు బిడ్డ అడ్డం తిరిగిందని చెప్పడంతో మరింత కంగారు పడిపోయాను. ఇన్ని కాంప్లికేషన్స్ వచ్చినా చాలా నార్మల్‌గా ఆరోగ్యంగానే పుట్టాడు బాబు." చెప్పింది స్నిగ్ధ.

స్నిగ్ధ చెప్పినవన్నీ 'మిరకిల్స్'లా అనిపించలేదు సైకియాట్రిస్ట్

సుస్మితకి, ఆక్సిడెంట్ జరగడం, అనుకున్న డేట్‌కిముందే డెలివరీ కావడం మిరకిల్‌కాదు. ఇక సిసేరియన్ ఆపరేషన్ అత్యావసరమయినపుడే కదా చేస్తారు? ఆపరేషన్ ఏదయినా, అనుక్షణం ఏదో ఒక విధమయిన కంగారుంటుంది ఎవరికయినా. సర్వసాధారణమయిన సంఘటనలని భూతద్దంపెట్టి చూస్తోంది స్నిగ్ధ! అయితే...తనిపుడు స్నిగ్ధని స్నేహ ధర్మంగా చూడటానికి వచ్చిందికాబట్టి ఆమెను విమర్శించడం సబబు కాదనుకుంటూ ఊరుకుంది.

"బాబు ఏడీ?" అంటూ లేచి ఉయ్యాలకేసి నడిచింది సుస్మిత.

ఆమె రావడంచూసి అక్కడే కాపలా మనిషిలా కూర్చున్న మస్తానమ్మ లేచినిలబడింది.

మస్తానమ్మకేసి ఒక్కక్షణం అదోలాచూసి...ఉయ్యాలలో పడుకున్న అనిరుధ్‌ని జాగ్రత్తగా ఎత్తుకుని వచ్చి స్నిగ్ధ పక్కన పడుకోబెట్టింది సుస్మిత.

"బ్యూటిఫుల్...హీ ఈజ్ సింప్లీ బ్యూటిఫుల్." అంది చిరునవ్వుతో.

"థాంక్స్!...పవన్ పోలిక కదూ!" అడిగింది స్నిగ్ధ నవ్వుతూ.

"నాకయితే నీ పోలికలే కనిపిస్తున్నాయి. కళ్ళు ... అచ్చుగుద్దినట్టు నీవే."

"అవునా?" అంటూ మురిసిపోతూ అనిరుధ్‌కేసి చూసింది స్నిగ్ధ.

మస్తానమ్మకూడా దగ్గరకు వచ్చి నిలబడింది. ఆమెకేసి విసుగ్గా చూసింది సుస్మిత.

"అన్నట్టు...ఇక్కడ దగ్గర్లో కాఫీ దొరుకుతుందా? తలనొప్పిగా ఉంది." అందామె చటుక్కున.

"కాఫీ పట్టుకొస్తావా మస్తానమ్మా? మేట్రన్‌గారినడిగి ఫ్లాస్కు పట్టుకెళ్ళు!" అని మస్తానమ్మని పంపించింది స్నిగ్ధ.

మస్తానమ్మ బయటకు వెళ్ళగానే తేలిగ్గా ఊపిరిపీల్చుకుంది సుస్మిత.

"మీ ఇంట్లో పనిచేసే అమ్మాయి కదూ? ఎందుకో ఆ అమ్మాయిని చూస్తే మంచి అభిప్రాయం కలగడంలేదు."

ఆ మాటలకి నవ్వేసింది స్నిగ్ధ.

"ఏం ఎందుకూ?" అడిగింది.

"ఏమో? చెప్పలేను. అలా అనిపించింది అంతే."

"ఎవరూ? సైకియాట్రిస్టు సుస్మితగారేనా ఇలా మాట్లాడుతున్నది?" అడిగింది స్నిగ్ధ అలాగే నవ్వుతూ.

"అదేవిటి?"

"ఏంలేదు. ఎటువంటి ఆధారంలేకుండా ఏదీ అనుకోకూడదంటావు కదా? మరి మస్తానమ్మ గురించి బేసిస్‌లేని ఫీలింగ్స్ఎలా వస్తున్నాయినీకు?"

సమాధానం కోసం తడుముకుంది సుస్మిత.

అంతలోనే మళ్ళీ చెప్పింది స్నిగ్ధ—

"మొదట్లో మస్తానమ్మ గురించి నా క్కూడా అలాగే అనిపించేది సుస్మితా! దానికితోడు తన ప్రవర్తన కూడా చాలా విచిత్రంగా ఉండేది"

"అంటే?" అడిగింది సుస్మిత.

మస్తానమ్మ పనిలో చేరినప్పట్నుంచి జరిగిన సంఘటనలు వివరంగా చెప్పింది స్నిగ్ధ...

తను ఆత్మహత్య చేసుకోబోతుంటే మస్తానమ్మ ఆపడం...క్రితం రాత్రి అనిరుధ్‌ని గబ్బిలాల బారినుంచి కాపాడటం,..చివరగా...తన బ్యాలెన్స్ ఆఫ్ మైండ్ తప్పి అనిరుధ్‌ని కొడవలితో అటాక్ చేయబోయినపుడు మస్తానమ్మ అడ్డురావడం పూసగుచ్చినట్టు చెప్పి ఆగింది స్నిగ్ధ...

"స్ట్రేంజ్!...నమ్మలేకపోతున్నాను" అని మాత్రం అనకలిగింది సుస్మిత.

"ఇలాంటి స్ట్రేంజ్ సిట్యుయేషన్స్‌కి నేను ఇపుడు అలవాటు పడిపోయాను సుస్మితా!...అయితే నా కిపుడెందుకో ధైర్యంగానే ఉంది... మస్తానమ్మ అనిరుధ్‌ని కాపాడతానని అభయం ఇచ్చింది కదా!"

◆ ◆ ◆ ◆

నర్సింగ్‌హోంలో మరో పదిరోజులుండి డిస్చార్జ్ అయ్యిందిస్నిగ్ధ.

ఆమెను ఇంటిదగ్గర దింపడానికి కారు తెచ్చింది సుస్మిత.

కారులో...డ్రైవ్ చేస్తున్న సుస్మిత పక్కన కూర్చుంది స్నిగ్ధ.

అనిరుధ్‌ని ఒళ్ళో పడుకోబెట్టుకుని వెనక సీట్లో కూర్చుంది మస్తానమ్మ.

"మీవారిదగ్గర్నుంచి ఉత్తరం వచ్చిందా? ఎపుడు వస్తున్నారట?" అడిగింది సుస్మిత కారు పోనిస్తూ.

"ఏమో!...ఒకటి రెండురోజుల్లో ఉత్తరం రావచ్చు."

"బాబు పుట్టినట్టు ఉత్తరం రాసావా?"

"లేదు!" అంది స్నిగ్ధ.

"అదేమిటి?" ఆశ్చర్యంగా అడిగింది సుస్మిత.

"పవన్‌కి కేబిల్ ఇవ్వమని అత్తయ్యగారిని అడిగాను. ఆవిడ ఇచ్చినట్టులేదు. ఇదికూడా ఒకందుకు బాగానే ఉంటుందనుకుని నేనుకూడా లెటర్ రాయలేదు" అంది స్నిగ్ధ చిరునవ్వుతో.

"ఏం ఎందుకూ?" అడిగింది సుస్మిత గేరుమారుస్తూ.

"పవన్ వచ్చినపుడు అతడ్ని ఆశ్చర్యంలో ముంచెత్తవచ్చుకదా. ఇట్‌విల్‌బి ఎప్లెసెంట్ సర్‌ప్రైజ్" అంది స్నిగ్ధ.

• • •

ప్లెసెంట్ సర్‌ప్రైజ్.

ఆ క్షణంలో...కొన్నివేలమైళ్ళ దూరం యూ.కే, న్యూకాసిల్స్ అపాన్‌టైన్ యూనివర్సిటీ గెస్ట్‌హౌస్‌లో పవన్‌కూడా 'ప్లెసెంట్ సర్‌ప్రైజ్' గురించే అనుకుంటున్నాడు.

మరి రెండు రోజుల్లో సడన్‌గా హైదరాబాద్‌కి చేరుకుని స్నిగ్ధకి ప్లెసెంట్ సర్‌ప్రైజ్ ఇద్దామనుకుంటున్నాడు పవన్!...అందుకే అంతకు ముందు తన తిరుగుప్రయాణం గురించి స్నిగ్ధకు రాసిపెట్టిన ఉత్తరం చింపి పడేసాడు.

స్నిగ్ధ ఎలా ఉందో!?

గత ఆరునెలల్లో అతనలా అనుకోని క్షణంలేదు. చక్కటి అవకాశం దొరికిందని యూకే వచ్చాడేకాని పవన్ మనస్సంతా హైదరాబాద్లోనే ఉంది. మొదట్లో అక్కడుంటం మరీ దుర్భరమనిపించి తిరిగి వెళ్ళిపోదామని అనుకునేవాడు కూడా!...కానీ, ఎప్పటికపుడు స్నిగ్ధ ఉత్తరాలను బట్టి తను అమ్మగురించి మునుపటిలా అనుకోవడంలేదని తెలుసుకుని

కొంచెం రిలాక్స్ అయ్యేవాడు.

ఇలా అనుకోకుండా కొన్నినెలలపాటు వాళ్ళిద్దరిమధ్య తనుండక పోవడంతోనే వాళ్ళకి పరస్పరం మంచి అవగాహన ఏర్పడింది...ఆ అవగాహన ఎప్పటికీ అలాగే కొనసాగితే బావుణ్ణు!...

స్టడీ టేబిల్ దగ్గర్నించి లేచినిలబడి బద్ధకంగా ఒళ్ళు విరుచుకున్నాడు పవన్. టేబిల్ మీద ఫ్రేంలోని స్నిగ్ధ ఫోటోచూసి అతడిపెదాల మీద చిరునవ్వు మెరిసింది.

"వచ్చేస్తున్నాను డార్లింగ్...సోమవారానికల్లా నీ దగ్గరుంటాను!" అన్నాడు ఫొటోనుద్దేశించి.

స్నిగ్ధ కొన్నాళ్ళక్రితం రాసిన ఉత్తరంలోని మాటలు గుర్తుకొచ్చాయి అతడికి.

"...డెలివరీ టైంకి నువ్విక్కడుంటే నాకు ధైర్యంగా ఉంటుంది. అంతేకాదు—డెలివరీ అయ్యాక మనబాబుని నువ్వు వెంటనే చూడాలన్నది నా కోరిక అని రాసింది.

ఇపుడు అనుకోకుండా యూనివర్సిటీ పని పూర్తవడంతో రెండు రోజుల్లో బయల్దేర కలుగుతున్నాడు తను. అంటే స్నిగ్ధ కోరుకున్నట్టు డెలివరీకి తను హైదరాబాదులో ఉంటాడు తప్పకుండా.

అంతలో డోర్ బెల్ వినబడి లేచాడు పవన్.

తలుపు తెరవగానే "గుడ్ ఈవినింగ్" అంటూ లోపలికి వచ్చాడు ప్రొఫెసర్ బోన్ విట్స్.

కెనడాకి చెందిన బోన్ విట్స్ కూడా న్యూకాసిల్స్ యూనివర్సిటీలో విజిటింగ్ ప్రొఫెసర్‌గా అసైన్‌మెంట్ చేస్తున్నాడు. అతడుండేది పవన్ కాటేజి పక్కనే.

ఇంకా రెడీ కాలేదా? ప్రొఫెసర్ ఫోర్ట్ ఇంటికి డిన్నర్‌కెళ్ళాలి...మరచిపోయారా?" అడిగాడు బోనవిట్స్ ఆంగ్లంలో.

"లేదు మరచిపోలేదు. కూర్చోండి...రెండే రెండు నిముషాల్లోవచ్చేస్తాను" అన్నాడు పవన్ అతడ్ని లోపలికి ఆహ్వానిస్తూ.

ప్రొఫెసర్ ఫోర్టు 'విల్లాకి' రాత్రి ఎనిమిందింటికి చేరుకున్నారు

పవన్, బోన్‌విట్స్.

"ఇన్నాళ్ళకి మా ఇంటికి రావడానికి తీరిక దొరికింది మీకు! రండి దయచేయండి" అంటూ సాదరంగా స్వాగతం పలికాడు డెభైఏళ్ళ రిటైర్డు ప్రొఫెసర్ ఫోర్టు.

కాసేపు డ్రాయింగ్ రూంలోనే కూర్చుని కబుర్లు చెప్పుకున్నారు ముగ్గురూ. అంతలో ప్రొఫెసర్ ఫోర్టు అమ్మాయి అగాథావచ్చి భోజనాలకి పిలిస్తే అందరూ డైనింగ్ రూంకేసి నడిచారు.

పవన్‌కి వీడ్కోలుగా ఏర్పాటుచేసిన ఆ డిన్నర్ పార్టీ డ్రింక్స్‌తో ప్రారంభమయింది.

"మీ మ్యూసియమ్ చాలా గ్రేట్‌గా ఉంటుందని బోన్‌విట్స్ చెప్తుంటాడు చూపిస్తారా?" అని అడిగాడు పవన్ డ్రింక్ సిప్‌చేస్తూ.

"ష్యూర్!...అయితే దాన్ని మ్యూసియమ్ అనడంకంటే కలెక్షన్ అంటే సరిపోతుందేమో! డిన్నర్ చేసాక చూద్దురుకాని!" అన్నాడు ప్రొఫెసర్ ఫోర్టు.

డిన్నర్ తర్వాత అందరూ విల్లా వెనక భాగంలో ఉన్న మ్యూసియమ్ కేసి నడిచారు.

"ఫంటాస్టిక్" అన్నాడు పవన్ మ్యూసియమ్ లోపలికి అడుగు పెడ్తూనే.

విశాలమయిన ఆ హాలు...గాజు బీరువాల్లోనూ, షోకేసుల్లోనూ ప్రొఫెసర్ ఫోర్టు సేకరించిపెట్టిన పురాతన వస్తువులతో...ఒక ప్రదర్శన శాలలా ఉంది

ఒక్కొక్క షోకేసుదగ్గర నిలబడి ప్రొఫెసర్ ఫోర్టు వివరిస్తుంటే, ఆసక్తిగా వింటూ అతడితోపాటు ముందుకి నడుస్తున్నారు పవన్, బోన్‌విట్స్.

ప్రొఫెసర్ ఫోర్టు స్వతంత్రంగా చేపట్టిన తవ్వకాల్లో బయటపడ్డ నాణాలు, పాతకాలంనాటి ఆయుధాలు, పనిముట్లు చూస్తున్నవాళ్ళకి సమయమే తెలియలేదు!

"ఇది నా యాభైఏళ్ళ కృషి ఫలితం!" అన్నాడు ప్రొఫెసర్ ఫోర్టు

గర్వంగా.

"గ్రేట్! మిమ్మల్ని ఎలా అభినందించాలో తెలియడంలేదు!" అన్నాడు పవన్.

మ్యూసియమ్‌లోంచి బయటకి నడుస్తూ గడియ పెట్టున్న ఒక తలుపుదగ్గర ఆగిపోయాడు పవన్.

"ఈ గదిలో ఏముందీ?" అడిగాదతను కుతూహలంగా.

"నేనుక్లాసిఫై చేయలేని వస్తువులున్నాయి "అన్నాడు ప్రొఫెసర్ ఫోర్టు.

"మీరు క్లాసిఫై చేయలేనివికూడా ఉంటాయా?" అడిగాడు పవన్ నవ్వుతూ.

"ఎందుకుండవూ? ఉండండి నాకీమధ్య దొరికిన పెయింటింగ్ ఒకటి చూపిస్తాను మీకు!" అంటూ ఆ తలుపు గడియతెరచి వాళ్ళిద్దర్నీ లోపలికి పిలుచుకుని వెళ్ళాడు ప్రొఫెసర్ ఫోర్టు.

మ్యూసియమ్ ఎంతనీటుగా ఉందో ఆ గదిలో అంత అస్తవ్యస్తంగా ఉంది.

ఒక బీరువా తెరచి అందులోంచి పెద్దసైజు పెయింటింగ్ ఒకటి బయటకి లాగాడు ప్రొఫెసర్ ఫోర్టు.

"ఆ మధ్య లండన్‌కెళ్ళినపుడు డ్రరీ లేన్‌లో ఒక ఆంటీక్ డీలర్ దగ్గర కొన్నానీ పెయింటింగ్! ఇది కనీసం రెండువందల సంవత్సరాల క్రితం గీసినబొమ్మ అని తెలుస్తూనే ఉన్నా ఇది ఏ ప్రాంతానికి చెందిందో చెప్పలేకపోతున్నాను." అని ఆ పెయింటింగ్ పవన్ చేతికందించాడు ఫోర్టు.

ఆ పెయింటింగ్ చూసి ఉలిక్కిపడ్డాడు పవన్.

విశాలమయిన ఒక ఆలయం మధ్యన ఎత్తయిన విగ్రహంముందు నలుగురు వ్యక్తులు మోకరిల్లి ఉన్నారా పటంలో!

పటంలోని ఆ విగ్రహాన్ని వెంటనే గుర్తుపట్టేసాడు పవన్.

కరకింకర!

గబ్బిలంమీద సవారిచేస్తున్న...

కరకింకర!

# 22

ఆ రోజు రాత్రి ఒంటిగంట దాటాక నిద్రమెలకువ వచ్చింది స్నిగ్ధకి. ఎవరిదో మూలుగు వినిపించి లేచింది తను.

ఎవరిది?

చటుక్కున లేచి కూర్చుని ఉయ్యాలకేసి దృష్టిసారించింది... హాయిగా నిద్రపోతున్నాడు అనిరుధ్...

అంతలో మళ్ళీ వినిపించిందా మూలుగు...

హృదయవిదారకంగా।

రాజేశ్వరిదేవికి ఒంట్లో బాలేదా?...నెమ్మదిగా మంచందిగి బయటకు నడిచింది. గబగబ రాజేశ్వరిదేవి గదికేసి నడవబోయింది కానీ ...

"అమ్మా!..." భయంకరమయిన అరుపువినిపించింది...స్పష్టంగా అది రాజేశ్వరిదేవి అరుపుకాదు। మరి?

మస్తానమ్మ।

ఏమయింది మస్తానమ్మకి?

గబగబ మెట్లకింద గదికేసి వెళ్ళింది స్నిగ్ధ.

దగ్గరకేసి ఉన్న తలుపు తోసుకుని లోపలికి అడుగుపెట్టి ఉలిక్కి పడిందామె।

గదిమధ్యలో...కాళ్ళు చాపుకుని వెలకిలా పడుంది మస్తానమ్మ। గూటిలో వెలిగించి పెట్టిన మైనం వొత్తి కాంతిలో మస్తానమ్మ పరిస్థితి ఏమిటో సరిగ్గా అర్థంకావడంలేదు.

"మస్తానమ్మా?" లైటు స్విచ్ నొక్కి కంగారుగా ఆమె పక్కన కూర్చుంది స్నిగ్ధ...దగ్గర్నుంచి చూసాక అర్థమయింది ఆమె స్పృహలో లేదని. నుదుటిమీద గాయమయి రక్తం కారుతోంది.

ఆ ఇరుకు గది మూలలో పెట్టిన కుండలోంచి నీళ్ళు తెచ్చి మస్తానమ్మ మొహంమీద చల్లింది స్నిగ్ధ...

కాసేపటికి...నెమ్మదిగా కళ్ళుతెరచి చూసింది మస్తానమ్మ.

"ఏమయింది? ఈ దెబ్బ ఎలా తగిలింది?" అడిగింది స్నిగ్ధ.

ఆమె చెయి పట్టుకుని నెమ్మదిగా లేచి కూర్చుంది మస్తానమ్మ.
"నా...పాపాలకి పరిహారం—" అంది బొంగురుగొంతుతో.
"ఏమిటి నువ్వంటోంది?"
తనలో తను మాట్లాడుకుంటున్నట్టు అస్పష్టంగా చెప్పసాగింది మస్తానమ్మ.
"మా బాబా ఆజ్ఞని ధిక్కరించి సిఫిలి అమల్ చేపట్టాను। ఆయన నేర్పిన విద్యని దుర్వినియోగం చేసాను."
స్నిగ్ధకి మస్తానమ్మ అంటున్నదేమిటో అర్థంకావడంలేదు...
"మస్తానమ్మా..." అని ఏదో అనబోయింది.
ఆమె మాట వినిపించుకోకుండా తన ధోరణిలోనే కొనసాగించింది. మస్తానమ్మ...
"నేను చేసింది మహాపాపం। పరమనీచమయినపని బాబా నేర్పిన విద్యలతో...వినాశనాన్ని కోరుకున్నాను. పవిత్రమయిన ప్రార్థనల స్వరూపాన్ని, ఉచ్చారణ దోషాలతో నికృష్టమయిన సిఫిలి అమల్‌గా మార్చాను" అని బిగ్గరగా ఏడవసాగింది.
అంతలోనే ముందుకి వొంగి నేలమీద తలపెట్టి కొట్టుకోసాగింది. మస్తానమ్మకి నుదుటిమీద గాయం ఎలా తగిలిందో అప్పుడర్థమయింది స్నిగ్ధకి. ఆమె భుజాలు గట్టిగా పట్టుకుని లేపి కూర్చోబెట్టింది...
"ఏమవుతోంది నీకు? ఎందుకిలా చేస్తున్నావ్?" అడిగింది.
"పుట్టబోయే బిడ్డ ఎవరో గ్రహించలేక...ప్రభువు దారికే అడ్డు నిలవబోయాను। పాపిష్టిదాన్ని।" అంది మస్తానమ్మ ఎటో చూస్తూ.
ఏమనాలో అర్థంకాక మాట్లాడలేదు స్నిగ్ధ. మస్తానమ్మ కూడా కాసేపు మౌనంగా ఉండిపోయింది. ఆ తర్వాత అంది...
"భయంలేదు। అనిరుధ్ బాబుని తాకేశక్తి ఎవరికీలేదు। బందిష్‌ని ఛేదించిన వాళ్ళెవరూ బతికి బట్టకట్టరు।"
ఆమెకేసి అయోమయంగా చూస్తూ కూర్చుంది స్నిగ్ధ.
చటుక్కున లేచి నిలబడింది మస్తానమ్మ।
"ఇక నేనిక్కడ ఉండకూడదు। వెళ్ళిపోవాలి। మా బాబా పాదాల

దగ్గరకెళ్ళి పోవాలి!" అంది మస్తానమ్మ జుట్టు ముడివేసుకుంటూ.

ఉన్నట్టుండి అలా మాట్లాడిన మస్తానమ్మ మాటలు విని ఆశ్చర్య పోయింది స్నిగ్ధ. నెమ్మదిగా లేచి నిలబడి మస్తానమ్మ కళ్ళలోకి చూసింది.

"వెళ్ళిపోతావా?..."అని మాత్రం అడగ్గలిగింది.

తలూపింది మస్తానమ్మ అవునన్నట్టు.

"వెళ్ళొద్దు మస్తానమ్మా!" ప్రాథేయపడింది స్నిగ్ధ.

జవాబివ్వకుండా కూర్చుంది మస్తానమ్మ...ఆమె చెయి తన చేతుల్లోకి తీసుకుంది స్నిగ్ధ.

"కనీసం పవన్...అదే అనిరుధ్ వాళ్ళనాన్నగారు వచ్చేవరకు ఆగవా?" అడిగింది.

విచిత్రంగా నవ్వి చెయి వెనక్కి తీసేసుకుంది ఆ నల్లపిల్ల.

"అబ్బాయిగారు వచ్చేవరకూ...నేనుండకూడదు ఆయన్ని చూడ కూడదు నేను!" అంది బిగ్గరగా.

నిరాశతో ఆమె కళ్ళలోకి చూసింది స్నిగ్ధ. మస్తానమ్మ వెళ్ళిపోవా లని ఎందుకు అనుకుంటోందో అర్థంకావడంలేదు... కానీ...ఎందుకో... ఆమెను ఆపడం కుదరనిపని అనిపించింది! మస్తానమ్మ తన సంకల్పం మార్చుకునేట్టు లేదనితోచింది.

మస్తానమ్మ వెళ్ళిపోతే...తనూ, అనిరుధ్ మళ్ళీ ఒంటరివాళ్ళయి పోతారు.

అసలు మస్తానమ్మ లేకుండా ఎలా ఉండగలుగుతుంది తను? అను దినం తనెదుర్కొంటున్న సమస్యలు సామాన్యమయినవా? అనిరుధ్ పుట్టిన పట్నించి వాడ్ని కంటికి రెప్పలా కాపాడుకుంటూ వచ్చిన మస్తానమ్మ వెళ్ళిపోతే వాడేమయిపోతాడు.

ఒకవైపు హేతుపుకందని అతీతశక్తి అనిరుధ్‌ని కబళించే ప్రయ త్నంలో ఉంది...

మరోవైపు...

ఆ పసిప్రాణికి రక్షణ కల్పించవలసిన తనే...

ఎప్పుడు...ఎలా ప్రవర్తించబోతుందో! చెప్పలేని పరిస్థితి! క్షణాల

మీద తన మతి భ్రమిస్తోంది!...చెప్పపాటున తనలోని మాతృత్వం మటు మాయమయి రాక్షసత్వం విర్రవీగుతుంది.

మస్తానమ్మ అభయమిస్తోంది కానీ...ఒకవేళ ఆమె వెళ్ళాక అవాంతరం ఏదయినా వచ్చిపడితే అనిరుధ్‌ని కాపాడేదెవరు?

గొంతుకలో పట్టేసినట్టున్న బాధని దిగమింగడానికి ప్రయత్నించిన స్నిగ్ధ కళ్ళలో నీళ్ళు పొంగాయి. దిగులుగా మస్తానమ్మకేసి చూస్తూ అడిగింది.

"వెళ్ళక తప్పదా మస్తానమ్మ?"

"తప్పదు. ఇక్కడ నేనుండి చేయకలిగిందంతా చేసేసాను! ఇక నేను వెంటనే వెళ్ళి బాబాదగ్గర ప్రాయశ్చిత్తం చేసుకోక తప్పదు." అంది మస్తానమ్మ.

ఒక్కక్షణం ఆగి అడిగింది స్నిగ్ధ మళ్ళీ.

"...సరే నిన్ను ఆపను! ఆపలేను!... ఎప్పుడు వెళ్తావు?"

"రేపు! పొద్దునే వెళ్ళిపోతాను" అంది మస్తానమ్మ.

• • •

తెల్లవారుజామున బట్టలమూట సర్దుకుని బయల్దేరిన మస్తానమ్మకేసి ఆశ్చర్యపోయి చూసింది రాజేశ్వరిదేవి.

"ఏమిటే ఇది? ఎక్కడికి బయల్దేరావు?" అడిగింది.

"మా ఊరికి అమ్మగారూ!...ఆసిఫాబాదుకి!" అంది మస్తానమ్మ.

"అదేవిటే...ఏమొచ్చింది నీకు? చెప్పాపెట్టకుండా ఇలా బయల్దేరావు? అసలునీకిక్కడ ఏం కష్టమొచ్చిందని?" అడిగింది రాజేశ్వరిదేవి.

"నా కష్టాలింకా ప్రారంభం కాలేదమ్మగారూ కానీ నామూలంగా..."

మస్తానమ్మ అలా అంటుండగా గెస్టురూంలోంచి బయటకు వచ్చింది స్నిగ్ధ. ఆమెను చూడగానే తొట్రుపాటుతో మస్తానమ్మను మధ్యలోనే ఆపేసింది రాజేశ్వరిదేవి.

"ఇలారా...నా గదిలోకి వచ్చి చెప్పు ఏం చెప్పాలో" అంటూ ఆ పిల్ల చెయిపట్టుకుని తనగదికేసి వెళ్ళబోయింది. కానీ, చెయి విడిపించుకుని అక్కడే నిలబడిపోయింది మస్తానమ్మ.

"ఇక చెప్పేదేమీలేదమ్మగారూ!...నేను వెళ్తాన్నానంతే" అంది.

"ఏమిటే అంత మొండిగా మాట్లాడుతున్నావ్?" కోపంగా అంది రాజేశ్వరిదేవి.

సమాధానం చెప్పకుండా స్నిగ్ధను దాటుకుంటూ గెస్ట్‌రూంలోకి నడిచింది మస్తానమ్మ. ఉయ్యాలలో పడుకున్న అనిరుధ్‌ని ఎత్తుకుని నుదుటిమీద ముద్దెట్టుకుని మళ్ళీ పడుకోబెట్టేసింది. ఒక్క నిమిషం కళ్ళు మూసుకుని అక్కడే నిలబడింది నిశ్చలంగా...మంత్రమేదో జపిస్తున్నట్టు ఆమె పెదాలు మాత్రం కదుల్తున్నాయి.

అంతలో అక్కడికి రాజేశ్వరిదేవి వచ్చేసింది.

"వెళ్ళిపోతానని చెప్పి మళ్ళీ ఏమిటే ఇక్కడికి వచ్చి నిలబడ్డావు?" కరుగ్గా అడిగింది.

ఆమెకేసి తిరిగి చూడలేదు మస్తానమ్మ. తన మానాన జపంపూర్తి చేసి ఉయ్యాలచుట్టూ గాలిలో ఏవో గుర్తులువేసి గదిలోంచి బయటకి నడిచింది.

తనని ఖాతరు చేయకుండా వెళ్ళిపోతున్న మస్తానమ్మని చూసి మండిపడింది రాజేశ్వరిదేవి.

"వెళ్ళవే! వెళ్ళు!...ఇన్నాళ్ళు నీకు నా ఇంట్లో ఆశ్రమం ఇవ్వడం నాదే పొరపాటు! మంచి గుణపాఠమే చెప్తున్నావులే!...వెళ్ళు!" అని బిగ్గరగా అరవసాగింది.

నిర్లక్ష్యంగా బయటకి నడిచింది మస్తానమ్మ.

హాల్లో నిలబడ్డ స్నిగ్ధకేసి ఒక్కక్షణం చూసి వీధి తలుపుతీసి బయటకి వెళ్ళిపోయింది మస్తానమ్మ.

ఆమె బయటకి అడుగుపెట్టగానే ఠక్కున తన అరుపులు ఆపేసింది రాజేశ్వరిదేవి. ఆమె మొహం నల్లగా మాడిపోయినట్టయింది.

నీరసంగా కదిలి తన గదిలోకి వెళ్ళి తలుపులు వేసేసుకుంది.

......

మస్తానమ్మ వీధిమలుపు తిరిగిందోలేదో...పడక గదిలో ఈశాన్యం మూలన దూలంగా నిలబెట్టిన ఖబీస్ గింజుకోసాగింది...

మస్తానమ్మ వేసిన ఘేరా బంధాలను తెంచుకొని బయటపడాలని కాయశక్తులా ప్రయత్నిస్తూ బుసలుకొట్టింది.

తన ప్రయత్నాల్ని ఆపడానికి, తనని శిక్షించడానికి ఇక మస్తానమ్మ రాదని తెలుసుకున్న ఖబీస్ శక్తి రెండింతలయింది...

తన బలమంతా ఉపయోగించి అష్ట దిగ్బంధనం ఛేదించడానికి పూనుకుంది.

దాంతో...

ఆ గదిలో సన్నగా ప్రకంపనంలాంటిది మొదలయింది. గదిలోని అద్దాల బీరువా డ్రెస్సింగ్ టేబిల్...గడగడలాడాయి.

హాల్లో కూర్చున్న స్నిగ్ధకి గదిలోంచి వెలువడుతున్న విచిత్రమయిన శబ్దాలు వినబడి నెమ్మదిగా లేచివచ్చి బెడ్‌రూం గడియ తీసింది.

అప్పటికే గదిలో హోరున సుడిగాలిలాంటిది ప్రారంభమయి... మంచంమీద పరచిపెట్టిన దుప్పటి గుండ్రంగా చుట్టుకునిపోయింది!... టేబిల్ లాంప్ ఒకసారి అటూ ఇటూ ఊగి క్రిందపడిపోయింది. చిన్న చిన్న వస్తువులన్ని ఎగిరెగిరి అటూ ఇటూ పడిపోతున్నాయి.

గదిలో అడుగుపెట్టిన స్నిగ్ధ ఆ హోరుగాలికి తట్టుకోలేకపోయింది. ఊపిరి సల్పక ఉక్కిరిబిక్కిరి అయిపోయింది.

అప్రయత్నంగా ఈశాన్యం మూలకేసి తలతిప్పిందామె.

ఊగిపోతున్న ఖబీస్ ఆకారాన్ని చూసి హడలిపోయిందామె.

వికృతమైన ఖబీస్‌ని ఆమె చూడటం అది మొదటిసారికాదు! ఇంతకు ముందెన్నోసార్లు ఖబీస్‌ని ఆ మూలన చూసింది తను. ఖబీస్ తనతో మాట్లాడిందికూడా! దాని బాధ భరించలేకే కదా తను ఆ గదిలో ఉండటం లేదు.

కానీ,...ఇంతకు ముందెన్నిసార్లు చూసినా ఆ మూలన ఖబీస్ ఆకారం అస్పష్టంగా కనిపించేది. అది తన ఊహో లేక వాస్తవమో చెప్పలేకపోయేది.

ఈరోజు అలాలేదు...

ఏడడుగులు పొడవున్న ఖబీస్ ప్రస్ఫుటంగా కనిపిస్తోంది...

నరాలన్నీ ఉబ్బి మరింత భయంకరంగా ఉందా మొహం!

ఆ ఉద్దండుడు చేస్తున్న ప్రయత్నమేమిటో అర్థమయింది స్నిగ్ధకు! ఇన్నాళ్ళూ ఆ మూల వదిలి ఇవతలికి రాలేదంటే దాన్ని మంత్రశక్తి ఏదో అక్కడకట్టి పడేసుంటాలి...ఇపుడు మస్తానమ్మ ఇల్లు వొదిలిపెట్టగానే అదిలా చేస్తోందంటే...ఆ మంత్రశక్తి మస్తానమ్మదే అయ్యుండాలి!

ఈ ఆకారాన్ని అదుపులో పెట్టగలిగే సామర్థ్యం కేవలం మస్తానమ్మకే ఉంది.

మస్తానమ్మని ఆపాలి.

మస్తానమ్మా!" అరుస్తూ బయటకు పరుగుతీసింది స్నిగ్ధ.

బాలెంత అన్న విషయం కూడా మరచి కాంపౌండు దాటి రోడ్డు మీదకు వచ్చింది స్నిగ్ధ...రోడ్డు మలుపుదాకా దృష్టి సారించింది... మస్తానమ్మ కనబడలేదు!

వేగంగా మెయిన్‌రోడ్డుకేసి నడిచిందామె. బస్‌స్టాప్ దగ్గర మస్తానమ్మ నిలబడి ఉంటుందేమోనని ఆశగా చూసింది...అక్కడాలేదు.

అంతలోనే ఎక్కడికి వెళ్ళిపోయింది? ఏమయిపోయింది?

ఏం చేయాలో తెలియక అయోమయంగా కాసేపు అక్కడే నిలబడింది స్నిగ్ధ...

అపుడు గుర్తుకొచ్చింది...అనిరుధ్ గెస్ట్‌రూంలో ఒంటరిగా ఉన్నాడని!

మస్తానమ్మని వెతుక్కుంటూ అనిరుధ్‌ని వొంటరిగా వొదలిపెట్టి వచ్చేసింది...ఈలోగా ఆ ఉద్దండస్వరూపం చేస్తున్న ప్రయత్నం ఫలిస్తే!?

ఆమె గుండె వేగంగా కొట్టుకోనారంభించింది. గిరుక్కున వెనక్కి తిరిగి మళ్ళీ ఇంటికేసి పరుగుతీసింది. సరాసరి గెస్ట్‌రూంలోకి వెళ్ళి ఉయ్యాలలో పడుకున్న అనిరుధ్‌ని ఎత్తుకుని గుండెలకు హత్తుకుంది.

అయినా ఆమె భయం తగ్గలేదు!...

ఏ క్షణమయినా ఆ ఆకారం తన బంధాలను తెంచుకుని బయట పడుతుంది! తిన్నగా తన దగ్గరకే వస్తుంది...పోనీ...అనిరుధ్‌ని తీసుకుని ఈ ఇంటిలోంచి ఎక్కడకయినా వెళ్ళిపోతే?...

అలా స్నిగ్ధ అనుకుంటున్నంతలోనే.... దగ్గరకు వేసిన ఆ గది తలుపు నెమ్మదిగా తెరుచుకోసాగింది...తలుపు పూర్తిగా తెరచుకుంటుంటే చిన్నగా కేకపెట్టింది స్నిగ్ధ...

గుమ్మంలో నిలబడ్డ రాజేశ్వరిదేవిని చూసాక కొంచెం తేలిగ్గా ఊపిరి పీల్చుకుందామె...ఆ షాక్ నించి తేరుకోడానికి మంచంమీద నిస్సత్తువగా కూర్చుంది.

రాజేశ్వరిదేవి గుమ్మంలోనే నిలబడింది...గదిలోపలికి రాలేదు... స్నిగ్ధకేసి, అనిరుధ్‌కేసి మార్చి మార్చి చూసింది.

"అమ్మాయి...నాకు మనస్సేమీ బాగోలేదు. యాదగిరి గుట్టకి దర్శనానికి వెళ్ళొద్దాం అనుకుంటున్నాను." అంది.

రాజేశ్వరిదేవి మాటలు వినిపిస్తున్నా సమాధానం చెప్పే పరిస్థితిలో లేదు స్నిగ్ధ.

"అబ్బాయి రేపో ఎల్లుండో వచ్చినా వచ్చేస్తాడనిపిస్తోంది. వాడు వచ్చేస్తే వెళ్ళడంకుదర్దు...అందుకని ఇవాళే బయల్దేరుతున్నాను తొమ్మిది గంటలకి బస్సుంది. రేపుపొద్దునకల్లా వచ్చేస్తాను." అంది రాజేశ్వరిదేవి మళ్ళీ...

పరిస్థితి తెలిసి ఉండి కూడా తనని ఒంటరిగా వొదిలిపెట్టి వెళ్తానంటున్న రాజేశ్వరిదేవి గురించి ఏమనుకోవాలో అర్థంకాలేదు స్నిగ్ధకి. ఆమెను ఆపదలచుకోలేదు.

"సరే..." అంది ముక్తసరిగా...

♦ ♦ ♦

ఆ రోజురాత్రి–న్యూకాసిల్ అపార్ట్‌మెంట్స్‌లో–

సూట్‌కేస్‌లో బట్టలు సర్దేసి పాకింగ్ పూర్తిచేసాడు పవన్.

సిగరెట్టు వెలిగించుకుని కాటేజి సిట్ అవుట్‌లోకి నడిచాడు...

గార్డెన్‌లో చెట్ల నీడల మధ్య పూలమొక్కలు మసగ్గా కనిపిస్తున్నాయి. ఆకాశంలో మబ్బుతునకల మధ్య కృష్ణపక్ష చంద్రుడు మరింత కుంచించుకుపోయినట్టున్నాడు...

సిటౌట్ మెట్లు దిగి నెమ్మదిగా గార్డెన్‌లోకి నడిచి ఫౌంటెన్

పక్కన బెంచిలో కూర్చున్నాడు పవన్.

అక్కడ్నించి ప్రొఫెసర్ బోన్‌విట్స్ కాటేజ్ కనిపిస్తోంది. స్టడీ రూంలో లైట్ వెలుగుతుండటం చూసి బోన్‌విట్స్ ఇంకా నిద్రపోలేదని అనుకున్నాడు పవన్.

మర్నాడు ఉదయమే తన తిరుగు ప్రయాణం. మిత్రుడు బోన్‌విట్స్ లండన్ దాకా తన కారులో దింపుతానన్నాడు. లండన్ నించి ఫ్లైట్ షెడ్యూల్ టైంకే బయిల్దేరితే బొంబాయి నించి మర్నాడు రాత్రికే హైదరాబాదు చేరుకోవచ్చు.

అంటే మరో ఇరవైనాలుగు గంటల్లో తను స్నిగ్ధని చూడగలడన్న మాట.

గార్డన్ బెంచ్ మీద రిలాక్స్ అయి కూర్చుని సిగరెట్ పూర్తిచేసాడు పవన్.

వెంటనే లేచి గదిలోకి వెళ్ళాలనిపించక అక్కడే కళ్ళు మూసుకుని కూర్చున్నాడతను.

దేవదారు చెట్లమీద పక్షులు ఆగి ఆగి అరుస్తున్నాయి ఎందుకో...

వాటి కూతలు వింటూ బెంచిలో వెనక్కివాలి పడుకున్నాడు. పవన్.

అంతలో చెట్లమీద పక్షులు జెదిరినట్టు అరుస్తూ రెక్కలు టప టప లాడించుకుని పైకి ఎగిరాయి.

కళ్ళు తెరచి చూద్దామనుకున్నాడు పవన్...

కానీ అంతలోనే అతడి మొహానికి చల్లటి గాలి సోకింది...ఆ గాలితో...సుపరిచితమైన పరిమళం తేలి వచ్చింది.

స్నిగ్ధ శరీర పరిమళం!...

పవన్ పెదాలమీద చిరునవ్వు మెదలింది...

స్నిగ్ధ ఆలోచనలు తన మనసుని ఆక్రమించుకోవడంతో తనకలా అనిపిస్తోందా...?

ఆ ఫీలింగ్...అందమైన ఆ అనుభూతి కాసేపు అలాగే కొనసాగితే బావుంటుందనిపించింది పవన్‌కి...

అందుకే కళ్లు తెరవకుండా అలాగే పడుకున్నాడు.

"స్నిగ్థా!..." అన్నాడతను.

అలా అంటూండగానే...స్నిగ్థ వచ్చిపక్కనే కూర్చున్నట్టనిపించింది.

స్ట్రేంజ్!

ఇలాంటి అద్భుతమయిన ఊహలు ఎపుడూ రాలేదతనికి.

కొన్నివేల మైళ్ళ దూరంలో ఉన్న స్నిగ్థ తన పక్కనే కూర్చుని ఉన్నట్టు అనిపిస్తోంది తనకి.

చెయిచాస్తే పక్కనే కూర్చున్న స్నిగ్థని తాకవచ్చు...కానీ అలా చేయలేదు పవన్. కదిల్తే కరిగిపోతుందా ఫీలింగ్.

కాటేజిలో తన స్టడీ టేబిల్‌మీదున్న స్నిగ్థఫోటోని తరచూ పలకరించడం అలవాటు...అలాగే మాట్లాడాలనిపించింది ఈ రోజుకూడా—

"ఇంకెంతసేపు స్నిగ్థా...రేపు రాత్రికల్లా హైదరాబాదులో ఉంటాను నేను." అన్నాడతను కళ్ళు తెరవకుండానే...

"ఇవాళ రాత్రే వచ్చిఉంటే ఎంత బావుండేది."...అస్పష్టంగా వినబడ్డాయి స్నిగ్థ మాటలు.

ఇది విచిత్రంగా తోచింది పవన్‌కి. తను నిద్రపోవడం లేదు. అయినా కలకంటునట్టుగా ఉంది...స్నిగ్థని తన పక్కన ఊహించుకొని మాట్లాడటమే కాదు, ఆమె సమాధానం కూడా ఊహిస్తున్నాడు తను.

"కళ్లుమూసుకుని కూర్చున్నావెందుకూ?...కళ్ళు తెరచి చూడు..." అని స్నిగ్థ అన్నట్లనిపించింది...

"కళ్లు తెరిస్తే నువ్వు వెళ్ళిపోతావు. నువ్వు కరిగిపోయే కలవి." అన్నాడు పవన్ చిన్నగా నవ్వి.

"మన బాబుని చూపిద్దామని వచ్చాను...మన అనిరుధ్‌ని" అంది స్నిగ్థ కంఠం. ఆమె పలుకులో ఏదో బాధ ధ్వనించి ... కలవరపడ్డాడు పవన్.

"మనబాబు అప్పుడే పుట్టాడా? అయినా మనకు పుట్టేది బాబు కాదు...పాప" అన్నాడు పవన్ తమాషాగా.

"కాదు పవన్...మనకు బాబేపుట్టాడు. ఒక్కసారి కళ్ళుతెరచి

చూసు...నువ్వు బాబుని ఎత్తుకుంటే చూసి వెళ్ళిపోతాను..." అంది స్నిగ్ధ కంఠం.

"ఊహూ...నేను కళ్ళుతెరవను..." అని అలాగే పడుకున్నాడు.

స్నిగ్ధ బరువుగా నిట్టూర్చినట్టు ఫీలయ్యాడు పవన్...

కాసేపు స్నిగ్ధ ఇంకేమయినా అంటుందేమోనని ఎదురుచూసాడు. కానీ ఏమీ అనలేదు.

కల కరిగిపోయింది!

నెమ్మదిగా కళ్ళు తెరచి చూసాడు పవన్...ఎవరూ లేరక్కడ.

"ఫన్నీ!" అని తల విదిలించిలేచాడు.

......

మర్నాడు ఉదయం అయిదింటికల్లా బోన్‌విట్స్ తయారయి వచ్చాడు అతడి సహాయంతో సామానులు కారు డిక్కీలో పెట్టేసాడు పవన్.

"ఏమయినా మరచిపోయారా మరోసారి చూసుకోండి" అన్నాడు బోన్‌విట్స్.

"ఏంలేదు. అన్నీ చెక్ చేసుకున్నాను..." అని కారుకేసి నడిచాడు పవన్.

డ్రైవింగ్ సీట్‌లో కూర్చున్నాక కారు స్టార్టుచేసి అడిగాడు బోన్‌విట్స్.

"నిన్నరాత్రి చాలాసేపు మీరు గార్డన్‌లోనే కూర్చున్నారు కదూ?"

"అవును...మీకెలా తెలుసు?" అడిగాడు పవన్.

"మా స్టడీ రూంలోంచి చూసాను." అన్నాడు బోన్‌విట్స్.

"అలాగా?"

"విజిటర్స్ ఎవరో వచ్చినట్టుంది?"

"విజిటర్స్ ఏమిటీ?" అడిగాడు పవన్.

"గార్డన్‌లో మీతోపాటు ఎవరో ఇండియన్ లేడీని చూసానే!..." అన్నాడు బోన్‌విట్స్.

ఉలిక్కిపడ్డాడు పవన్.

"ఇండియన్ లేడీయా!"

"అవునండీ...ఎవరో ఇండియన్ లేడీ వచ్చిందికదా!...చిన్న బాబుని ఎత్తుకుని ఉంది...మీ పక్కనే కూర్చుని మాట్లాడటం నేను చూసాను...ఎవరా యంగ్‌లేడీ? ఇంతకుముందెపుడూ చూడలేదే..."

# 23

సాధారణంగా టైంకే వస్తుంది బొంబాయి ఫ్లైట్...

కానీ...

ఆరోజు ఎందుకో గంట ఆలస్యంగా వచ్చి చేరింది హైదరాబాదుకి.

విమానం దిగి ఎయిర్‌పోర్టు టర్మినల్‌కేసి నడుస్తున్న పవన్ మనస్సెందుకో చికాగ్గా ఉంది.

నడకవేగం పెంచి అరైవల్‌గేటులోంచి గబగబ లోపలికి వెళ్ళాడు. ఎదురుగా నిలబడ్డ పోర్టర్‌కి బ్యాగేజిటికెట్టుఇచ్చి సూట్‌కేసులు తెమ్మన్నాడు.

కన్వేయర్ బెల్టుమీద లగేజి రావడం ఆలస్యం అవుతున్నకొద్దీ అతడిలో చికాకు ఎక్కువయింది.

సిగరెట్టు వెలిగించి ఒక పక్కగా నిలబడ్డాడు పవన్.

తనెందుకు అంత అసహనంగా ఉన్నాడో అర్థంకాలేదు అతనికి. లండన్‌నించి బయల్దేరినపట్నించి ఇలాగే ఉంది...ఎందుకు?

ఆ మూడ్‌నించి బయటపడాలి తను.

ఆఫ్టరల్! హైదరాబాదుకి వచ్చి చేరుకున్నాడు తను! మరి కాసేపట్లో ఇంటికి చేరుకోబోతున్నాడు. మరో అరగంటలో స్నిగ్ధని కలుసుకోబోతున్నాడు.

మరో అరగంటలో??

మరో అరగంటలో జరగనున్న ఘోరం గురించి అతను ఆ క్షణంలో ఊహించకలిగి ఉంటే ఎంత బావుండేది.

కనీసం బొంబాయినించి వచ్చిన ఆ ఫ్లైట్ లైంకి వచ్చి ఉండాల్సింది.

......

ఎయిర్‌పోర్టులో పవన్ లగేజి కోసం ఎదురుచూస్తూ నిలబడి ఉన్నపుడు.

జూబ్లీ హిల్స్‌లో...

అతడి ఇంట్లో లైట్లన్నీ వెలుగుతున్నాయి. వీధి తలుపులు బారలా తెరచి ఉన్నాయి.

ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది.

గెస్ట్‌రూంలో...మంచంమీద నిద్రపోతున్నాడు అనిరుధ్.

ఆ గది గుమ్మందగ్గర చతికిలబడి ఎటో చూస్తోందామె.

తన చుట్టూ ప్రపంచంతో సంబంధం లేనట్టుగా ఏదో ఆలోచనలో ఉన్నదానిలా ఉందామె.

నిజానికి ఆమె మస్తిష్కంలో ఆలోచనలేమీ లేవు...అంతా శూన్యంగా ఉంది।

సరిగ్గా అపుడు...వంటింట్లో గ్యాస్‌లీక్ కావడం ప్రారంభమయింది.

వంటింటి కిటికీలు వేసి ఉండటంతో క్షణాల్లో గ్యాస్ నిండిపోయిం దక్కడ.

గ్యాస్ వాసన గెస్ట్‌రూందాకా సోకుతోంది.

అయినా...

ఆమె నిశ్చలంగా కూర్చుంది.

ఏదీ పట్టించుకునేస్థితిలో లేదామె।

......

ఎయిర్‌పోర్టునించి లగేజితో బయటపడ్డ పవన్ టాక్సీఎక్కికూర్చుని పోర్టర్‌కి డబ్బులిచ్చాడు. టాక్సీ కదిలాక సీటులో వెనక్కిజారి కూర్చు న్నాడు.

"తొందరగా పోనీ" అన్నాడతను డ్రైవర్‌తో.

డ్రైవరు 'అలాగే' అన్నాడు కానీ టాక్సీ వేగం పుంజుకోలేక పోతోంది. పాతమోడల్ కావడంతో పిక్అప్ లేదాటాక్సీకి—।

అసలే మూడ్ బాలేనపుడు టాక్సీ మరీ నెమ్మదిగా ముందుకి కదు లుతుంటే విసుగనిపించిందతనికి. ఇలా వెళ్తే కనీసం ముప్పావుగంట పడు తుంది ఇంటికి చేరడానికి।...చేసేదేమీలేక కళ్లుమూసుకుని కూర్చుండి పోయాడు. అంతలో...

బేగంపేట ఫ్లయ్ ఓవర్ బ్రిడ్జిదాటాక ఇంజన్‌లోంచి పొగలు లేచి టాక్సీ ఆగిపోయింది.

విసుగ్గా డ్రైవర్‌కేసి చూసాడు పవన్...

"ఏమయిందయ్యా?" అడిగాడు.

"ఏంలేదు సాబ్...మీరు కూర్చోండి ఒక్క క్షణంలో సరిచేస్తాను" అంటూ కిందికి దిగి టాక్సీ బానెట్ తెరచి నిలబడ్డాడు డ్రైవర్.

రెండు నిముషాలు ఒదిగ్గా కూర్చుని...ఇక భరించలేక విసురుగా కిందికిదిగాడు పవన్.

డ్రైవర్ పక్కన నిలబడి అతడు పడుతున్న తంటాలు గమనించాడు. ఇప్పట్లో టాక్సీ స్టార్టుకాదని తెలిసిపోయిందతనికి.

మరో టాక్సీ కాని, ఆటో కానీ దొరుకుతుందా అని అటూ ఇటూ చూసాడతను...

రాత్రి తొమ్మిదిన్నరవుతోంది...రోడ్డుమీద దరిదాపుల్లో ఏమీ కనబడలేదు...

రెండు మూడు ఆటోలు వేగంగా అటుకేసి వచ్చాయి కానీ వాట్లో ఎవరో కూర్చున్నారు.

ఏం చేయాలో తోచక టాక్సీనానుకుని నిలబడిపోయాడు పవన్. టాక్సీ బాగుపడితే కానీ తనిక్కడ్నించి కదలడానికి లేదు...

......

......

వంటింట్లోంచి లీక్ అవుతున్న గ్యాస్ వాసన మరీ ఎక్కువయింది

ఆ వాసన గాటుకికాబోలు సన్నగాదగ్గాడు నిద్రపోతున్న అనిరుధ్

కళ్లుతెరచి అటూ ఇటూ చూసి

ఉన్నట్టుండి ఏడుపు మొదలెట్టాడు...

అంతవరకూ నిశ్చలంగా...ప్రతిమలా కూర్చున్న ఆమె ఉలిక్కిపడి లేచింది.

అనిరుధ్‌బాబు ఏడుస్తున్నాడు!

ఎందుకు?

ఆకలేస్తోందేమో?...పాపం!

బాబుకి పాలుపట్టాలి!...

అనిరుధ్‌కి పాలుపట్టాలి అన్న ఆలోచన మాత్రమే ఆమె మనసులో చోటు చేసుకుంది?...

వంటింటికేసి యాంత్రికంగా కదిలిందామె...

అపుడు కూడా గ్యాస్ వాసన పసిగట్టలేదామె...

ఆ పరిస్థితిలో లేదామె!

......

......

ఫ్లయ్ ఓవర్ దగ్గర టాక్సీ పక్కనించి తెల్ల ఫియట్ కారొకటి దూసుకుంటూ ముందుకెళ్ళి—సడన్ బ్రేక్‌తో ఆగింది—

అలా ఆగిన కారుకేసి తలతిప్పి చూసాడు పవన్—

ఫియట్‌కారు రివర్స్‌లో వెనక్కువచ్చి పవన్ పక్కన ఆగింది...

"హల్లో!" అంది సుపరిచిత కంఠం.

డ్రైవింగ్‌చేస్తున్న డాక్టర్ సుస్మితను చూసి ప్రాణం లేచి వచ్చినట్టయింది పవన్‌కి—

"అరె మీరా—బావున్నారా?" అడిగాడు పవన్ చిరునవ్వుతో.

"ఎప్పుడు వచ్చారు?" అంటూ కారు దిగింది సుస్మిత.

"ఇప్పుడే—"అని టాక్సీ టాప్ కారియన్ పైనున్న తన లగేజికేసి చూపించాడు పవన్.

"టాక్సీ స్టార్టుకావడంలేదా?—పదండి నేను డ్రాప్ చేస్తాను—" అంది సుస్మిత.

"థ్యాంక్స్!" అని సూట్‌కేసులు ఫియట్‌కారు డిక్కీలోకి మార్చాడు పవన్—

టాక్సీ డ్రైవర్‌కి చార్జి చెల్లించి కారెక్కి సుస్మిత పక్కన కూర్చున్నాడు పవన్.

మీరు మరో రెండు మూడు రోజులకు గాని రారని అనుకుంటుందే స్నిగ్ధ!—మీరు వస్తున్నట్టు మెసేజ్ పంపలేదా?" అడిగింది సుస్మిత కారు

వేగం పెంచుతూ—

"లేదండీ—పంపలేదు. ఇలాచెప్పకుండావచ్చి ప్లెసెంట్ సర్‌ప్రైజే ఇద్దామనుకున్నాను" అన్నాడు పవన్ నవ్వుతూ—

ప్లెసెంట్ సర్‌ప్రైజ్!-స్నిగ్ధకూడా అలాంటి ప్లెసెంట్ సర్‌ప్రైజ్ ఇద్దామని అనుకుంటోందని సుస్మితకు తెలుసు. అనిరుధ్ పుట్టిన సంగతి అందుకే చెప్పలేదు.

"—స్నిగ్ధ ఎలా ఉంది? — ఈమధ్య కలిసారా?" అడిగాడు పవన్.

"ఓ...షీఈజ్ ఫైన్!" అంది సుస్మిత ముక్తసరిగా.

కారు జూబ్లీహిల్స్ చేరుకుంటుంటే గతఆరునెలల్లో ఆ ప్రాంతంలో వచ్చిన చిన్న చిన్న మార్పులను గమనిస్తూ కూర్చున్నాడు పవన్.

ఇంటిమలుపుతిరుగుతుంటే అనుకున్నాడు పవన్

హోం—స్వీట్‌హోం—అని—!

డోర్ బెల్ నొక్కితే తలుపు ఎవరు తెరుస్తారో?

స్నిగ్ధ తెరిస్తే బావుణ్ణు—ఆమె మొహంలోని-ఆనందం, ఆశ్చర్యం చూడొచ్చు.

సుస్మిత ఇంటి గేటు దగ్గర కారు స్లో చేస్తుండగా వినబడింది— దిక్కులు మార్మ్రోగేటట్టు—

పెద్దమోత!

అదిరిపోయి కారు సడన్ బ్రేక్‌వేసింది సుస్మిత...

మళ్ళీ...చెవులు చిల్లులుపడేట్టు పెద్దగా ఏదో పేలింది!

కాలనీ మొత్తం దద్దరిల్లేట్టు చేసిన ఆ మోతలో.

ఒక ఆర్తనాదం కలిసిపోయింది...

కారు తలుపు తెరచి గేటుకేసి పరుగుతీసాడు పవన్. భయంకర మయిన ఆ పేలుడు తన ఇంట్లోనే వచ్చిందని మాత్రమే అర్ధమయిందతనికి!

ఆలోచనలకంటే వేగంగా తలుపు తోసుకుని ఇంట్లోకి ప్రవేశిం చాడతను...

......

వంటింట్లోంచి భగభగమని ఎర్రటిమంటలు పైకి లేస్తున్నాయి.

ఒక్కసారిగా గ్యాస్‌తో నిండిన వంటింట్లో నిప్పంటుకోవడంతో అగ్నిగోళం ఏర్పడింది.

దాని ధాటికి లోపలున్న చిన్నచిన్న డబ్బాలు, గిన్నెలు బయట మండువాలో చెల్లాచెదరయి పడుతున్నాయి.

నిశ్చేష్టుడయిన పవన్ చూస్తుండగానే వంటింటి తలుపు బాంబు పెట్టి పేల్చినట్టు దఢాలున తునాతునకలై పోయింది.

గుండె లయతప్పినట్టయి.

వంటింటిని పూర్తిగా ఆక్రమించుకున్న మంటల్లోకిసూటిగాచూసాడు పవన్.

మంటలమధ్య గుండ్రంగా తిరిగిపోతోంది ఒకస్త్రీ ఆకారం. ఎవరది? రాజేశ్వరిదేవా? కాదు. మరి?...

"స్నిగ్ధా!" గావుకేకపెట్టి ముందుకి పరుగెత్తాడు పవన్.

తిన్నగా మంటల్లోకి ఉరికి ఆమెను కాపాడుకోవాలనే ఆలోచన అతడి మనసుని ఆక్రమించుకుంది.

మండువా నేలమీదపడి కాలుతున్న ద్వారబంధాన్ని దాటుకుంటూ వంటింటి గుమ్మందాకా వెళ్ళిపోయాడు పవన్...

కానీ...అడుగు ముందుకు వేస్తుంటే మొహానికి వేడిగా సెగలు తాకాయి.

అసంకల్పంగా రెండడుగులు వెనక్కి వేసాడు.

ఆహుతయిపోతున్న స్నిగ్ధను కాపాడటానికి తనుకూడా మంటల్లో దూకడం అవివేకం!...ఆలస్యం చేయకుండా గిర్రున వెనక్కి తిరిగి బాత్‌రూంలోకి పరుగునవెళ్ళి రెండుబకెట్లు నీళ్ళు గబగబ మోసుకొచ్చాడు పవన్.

వంటింట్లోకి ఆ నీళ్ళు విసురుతూ

"స్నిగ్ధా...బయటకు వచ్చేయ్!" అని బిగ్గరగా అరవసాగాడు.

భగభగమని కాలిపోతున్న ఆమె శరీరం ఊగుతూవచ్చి అతడి కాళ్ళదగ్గర పడిపోయింది.

ఆమె వొంటిమీద వెంటనే నీళ్ళు చల్లి మంటలు ఆర్పాలి!...

మళ్ళీ స్నానాల గదికేసి వెళ్ళబోయాడు పవన్. కానీ...దానవసరంలేకుండా...ఒక బకెట్టునిండా నీళ్ళుతెచ్చి గుమ్మరించింది సుస్మిత.

మంటలు అదుపులోకి వస్తున్నా నడుంకిందగా నిప్పంటుకునే ఉంది...

వెంటనే లేచి నిలబడి తను తొడుక్కున్న ఉలన్ ఓవర్‌కోటు తీసి ఆమె శరీరాన్ని కప్పేసి మంటలు ఆర్పసాగాడు పవన్.

మంటలు ఆరిపోయాక...

నేలమీద బోర్లా పడున్న ఆమె భుజం పట్టుకుని...నెమ్మదిగా తనకేసి తిప్పుకున్నాడు.

నల్లటి మాంసం ముద్దలా కాలిపోయిన ఆ మొహం గుర్తుపట్టేట్టుగా లేదు!

భయానకమైన ఆ ఆకృతినిచూసి...

తన భార్యకు జరిగిన దురాగతాన్ని చూసి...

ఆమెను కాపాడుకోలేకపోయిన తన అసమర్థతను చూసి హృదయ విదారకమైన అరుపొకటి అరిచాడు పవన్!...

దుఃఖం పెల్లుబికుతుంటే

అతడి ఆలోచనలు స్తంభించిపోయాయి.

తన ఎదురుగా పడున్న స్నిగ్ధ బతికుందో లేదోకూడా ఆలోచించు లేకపోతున్నాడతను!

"పవన్‌గారూ...లేవండి! ఆలస్యం చేయవద్దు. వెంటనే హస్పిటల్‌కి తీసుకెళ్ళాలి తనని!...ప్లీజ్—డోంట్ డిలే!" అంటూ అతడి భుజంపట్టుకుని ఊపేసింది సుస్మిత

ఆమెకేసి వెర్రిగా ఒకసారి చూసి మళ్ళీ తల తిప్పుకున్నాడుపవన్.

"పవన్‌గారూ...మనం వెంటనే హాస్పిటల్‌కి వెళ్ళకపోతే స్నిగ్ధ ప్రాణాలు పోతాయి" అని అరిచింది సుస్మిత.

అపుడర్థమయిందతనికి ఇంకా స్నిగ్ధ ప్రాణాలు పోలేద!...

తక్కున లేచి రెండు చేతుల్లో ఆమెను ఎత్తుకుని బయటకు

నడిచాడు...

అతను బయటకు నడుస్తుంటే సుస్మితకూడా గబగబ అతడివెంట వెళ్ళింది.

వీధి తలుపుదాటి కాంపౌండులోకి వెళ్తుంటే నలుగురైదుగురు కుర్రాళ్ళు "ఏమయిందండీ..." అంటూ ఎదురొచ్చారు.

పవన్ ఎత్తుకుని వస్తున్న ఆకారాన్ని చూసి విషయం అర్ధమయి పక్కకు తప్పుకున్నారు.

అంతలో మరికొంతమంది జనం గేటుదగ్గర గుమిగూడారు... దూరంగా ఫైర్ ఇంజిన్ గంటలు వినబడసాగాయి.

కారు వెనకసీటులో స్నిగ్ధని పడుకోబెట్టి ఫ్రంట్ సీట్‌లో కూర్చు న్నాడు పవన్.

కారు స్టార్ట్ చేయిబోయి ఏదో ఆలోచనవచ్చి "ఓ గాడ్!" అంటూ ఆగిపోయింది సుస్మిత.

వెంటనే కారుదిగి మళ్ళీ ఇంట్లోకి పరుగెత్తింది.

రెండే రెండు నిమిషాల్లో తెల్లటి శాలువాలో ఏదో చుట్టుకుని భుజాన వేసుకొని తిరిగి వచ్చిందామె.

ఆమె లోపలికి ఎందుకువెళ్ళిందో—శాలువాలో చుట్టుకుని తెచ్చిం దేవిటో పట్టించుకునే పరిస్థితిలో లేడు పవన్—అతడి ఆలోచనలంతా స్నిగ్ధమీదే ఉన్నాయి!—

"ఒళ్ళో పడుకోబెట్టుకుంటారా?" అంటూ అతడి చేతికి అందిం చింది చుట్టిన శాలువా.

కొంచెం బరువుగా ఉన్న ఆ శాలువాలో ఏముందో కూడా చూడ లేదు పవన్—

"ప్లీజ్—" త్వరగా పోనివ్వండి అని మాత్రం అనగలిగాడు—

అతడి ఒడిలోఉన్నది స్నిగ్ధ అతడికిఅందివ్వాలనుకున్న ప్లెసెంట్ సర్‌ప్రైజ్ అని—వాళ్ళిద్దరి ప్రేమ ప్రతిఫలమని తెలియడతనికి—

......

ఈ దారుణం చూసి—

పడకగది ఈశాన్యంమూలననిలబడ్డ ఖబీస్ పగలబడి నవ్వసాగింది.

అంతవరకూ జరిగిందంతా దాని కళ్ళకు పండగ్గా ఉంది.

పవన్ పరిస్థితి చూస్తే మరింత సంతోషంగా ఉంది దానికి—

నవ్వాపుకోలేక అటూ ఇటూ ఊగిపోసాగింది—

అంతలోనే—తక్కున నవ్వాపి—

భయంగా—దిగులుగా అటూ ఇటూ చూసి—కుమిలి కుమిలి ఏడవసాగింది.

ఖబీస్ దుష్టభావతరంగాలు ఆఇంటిని పూర్తిగా ఆక్రమించుకోవడమే కాదు— ఆ ఇంటి నలువైపులా ప్రసరించాయి.

డాక్టర్ ఇసాక్ ఇంటిలోనిల్యాబ్రడార్ జాతికుక్క—ఆకాశం కేసి తలెత్తి బాధగా ఏడవసాగింది.

## 24

కారు జూబ్లీహిల్స్‌దాటి వెళ్తుంటే—

హోరున గాలి ప్రారంభమయింది.

అంతవరకూ స్తబ్దంగా ఉన్న వాతావరణం ఉన్నట్టుండి పూర్తిగా మారిపోయింది.

గాలికి రోడ్డుపక్కన చెట్లు అటూఇటూ ఊగిపోతుంటే రోడ్డుమీద చెత్త దుమారమయి పైకి లేచింది.

చూస్తుండగానే ఆకాశంలో నల్లటి మబ్బులు కమ్ముతున్నాయి.

దుమ్ము చుట్టుముట్టడంతో దారి సరిగ్గా కనబడక – తప్పనిసరై కారు వేగం తగ్గించింది డాక్టర్ సుస్మిత.

హాస్పిటల్‌కి చేరుకోడానికి ఆలస్యమయిపోతుందని మరింత కంగారు పడిపోయాడు పవన్.

వెనకసీట్లో పడుకోబెట్టిన స్నిగ్ధకేసి చూసాడతను.

"స్నిగ్గా!—" గద్గద కంఠంతో పిలిచాడు.

చీకట్లో ఆమె ఆకారం అస్పష్టంగా కనిపిస్తోంది. ఆమె ఊపిరి పీల్చుకుంటోందోలేదో తెలియడంలేదు. కారు ఆగి ఆగి వేగం పుంజుకుంటుంటే స్నిగ్ధ శరీరం కొంచెం అదురుతోందంతే.

"స్నిగ్ధా!" మరోసారి పిలిచి చూసాడు పవన్.

గేరుమార్చి స్పీడు పెంచింది సుస్మిత.

"పవన్‌గారూ! కంట్రోల్ యువర్ సెల్ఫ్. స్నిగ్ధ మాట్లాడే పరిస్థితిలోలేదు" అందామె.

కళ్ళలో నీళ్ళు తిరుగుతుంటే ఆమెకేసి ఒకసారి చూసి తల తిప్పు కున్నాడు పవన్.

'భగవంతుడా! నా స్నిగ్ధను రక్షించు—నాకింకేమీవొద్దు నా స్నిగ్ధ ప్రాణాలు కాపాడు' అని విలపిస్తోందతడి మనసు.

సరిగ్గా అపుడు—గాలి ఉధృతానికి తట్టుకోలేక పెద్ద చెట్టుకొమ్మ ఒకటి ఫెళఫెళమని విరిగి రోడ్డుకి అడ్డంగా వచ్చిపడింది.

'ఓగాడ్!' అంటూ కారు బ్రేక్ వేసింది సుస్మిత.

"సుస్మితగారూ? కారు రివర్స్ చేయండి—పంజగుట్ట మీదుగా వెళదాం" అన్నాడు పవన్.

పంజగుట్ట రోడ్డు మీదకి కారుమళ్ళిస్తుంటే ఆకాశం ఉరిమి ఎర్రటి మెరుపొకటి మెరిసింది.

"వర్షం కూడా వచ్చేట్టుంది" అంటూ కారువేగం మరింతపెంచింది సుస్మిత. ఎదురొస్తున్న లారీ ట్రాఫిక్‌ని ఖాతరుచేయకుండా రాష్‌గా డ్రైవింగ్ చేస్తోందామె. తన స్నేహితురాలిని వెంటనేహాస్పిటల్‌లోకి చేర్చా లనే ధ్యాసతప్ప మరొకటి లేదామెకు.

ఉస్మానియా హాస్పిటల్ చేరుకుంటుండగా చినుకులతో పెద్ద వాన పట్టుకుంది!—దానికి తగ్గట్టుగా కారు ఇంజన్ కూడా ఆగిపోయింది.

"అయ్యో!" అంటూ రెండు మూడు సార్లు సెల్ఫ్ లాగి చూసింది. సుస్మిత.

కారు స్టార్టు కాలేదు.

"మీరు కూర్చోండి నేను కారు తోస్తాను" అని గబగబ తలుపు తెరచి దిగబోయాడు పవన్.

అతడి ఒడిలోంచి జారిపడబోయింది చుట్టిన శాలువా

"అరె—జాగ్రత్త!" అంటూ దాన్ని పొదివి పట్టుకుంది సుస్మిత.

ఆ శాలువా గురించి సుస్మిత ఎందుకు అంత జాగ్రత్తపడుతోందో అప్పుడుకూడా పట్టించుకోలేదు పవన్.

స్నిగ్ధను రక్షించుకోవాలనే ఆలోచన అతడి మనసుని పూర్తిగా ఆక్రమించుకుని ఉంది—

కిందకు దిగి వర్షంలో తడుస్తూ కారు తోయనారంభించాడు పవన్ వర్షంజల్లు మొహంమీద కొడ్తుంటే ఊపిరి ఆడటం లేదతనికి. అయినా పట్టుదలగా కారుతోసుకుంటూ హాస్పిటల్ పోర్టికోదాకా తెచ్చాడు.

పోర్టికోలో కారాగగానే కిందకు దిగింది సుస్మిత.

"మీరిక్కడే ఉండండి..." అంటూ కాషువాలిటీస్ కేసి పరుగెత్తిందామె.

ముద్దగా తడిసిన బట్టలతో అక్కడే నిలబడ్డాడు పవన్.

రెండు నిమిషాలు।...కేవలం రెండు నిముషాల ముందు తను ఇంటికి చేరుకుని ఉంటే ఈ ఘోరం జరిగుండేదికాదు। పేలుడు వినిపించినపుడు ఇంటికి కేవలం కొన్ని గజాల దూరంలో ఉన్నాడు...ఫ్లయిట్ లేంకి వచ్చి ఉన్నా ఎయిర్‌పోర్టునించి బయల్దేరిన టాక్సీ దారిలో ఆగక పోయినా తను శమయానికి ఇంట్లో ఉండేవాడు.

'ఫేట్' అంటే ఇదేనేమో।

స్నిగ్ధ ఇంట్లో ఒంటరిగా ఉండటంవల్లే జరిగిందీ ప్రమాదం ఒంటరిగా?...

అమ్మ ఇంట్లో లేదా? ఎక్కడికెళ్ళింది?

అంతలో సుస్మిత ముగ్గురు వార్డుబాయిస్‌ని వెంటపెట్టుకుని రావడం చూసి ఆలోచనల్లోంచి తేరుకున్నాడు పవన్.

కారు వెనక తలుపుతీసి జాగ్రత్తగా స్నిగ్ధని స్ట్రెచర్ మీద పడుకోబెట్టుకుని లోపలికి బయల్దేరారు వార్డు బాయ్స్.

సుస్మిత ఫ్రంట్ సీట్ మీద ఉంచిన శాలువా తీస్తుంటే చూసాడు పవన్. హాస్పిటల్ ఆవరణలో వెలుగుతున్న దీపాల కాంతిలో తెల్లగా మెరిసిపోతోంది ఆ పసివాడి మొహం।

ఎవరీ బాబు?

ఇంతసేపు తను ఒళ్ళో పెట్టుకుని కూర్చుంది ఈ బాబునా! అర్ధంకా నట్టు సుస్మితకేసి చూసాడు పవన్.

"మీ బాబు...పదిహేనురోజులవుతోంది పుట్టి..." అని గబగబ స్నిగ్ధను తీసుకెళ్ళిన వైపుకి నడిచింది డాక్టరు సుస్మిత.

సుస్మితను అనుసరిస్తూ బర్న్స్ వార్డుకేసి నడుస్తునపుడు... యూకేలో యుండగా చూసిన విచిత్రమయిన స్వప్నం గుర్తుకొచ్చింది పవన్‌కి...ఒక్కసారి కళ్ళు తెరచి చూడు...మనబాబునినువ్వు ఎత్తుకుంటే చూడాలని ఉంది అని స్నిగ్ధ అన్నట్టు అనిపించిందపుడు తనకి.

అంటే?

విచిత్రమయిన ఆ కల కర్థమేమిటి?

బాబుని తనకప్పచెప్పి...స్నిగ్ధ?...నో!

స్నిగ్ధను పడుకోబెట్టిన స్ట్రెచర్ బర్న్స్ వార్డులోకి తీసుకెళ్ళారు.

వార్డు బయట సుస్మితతోపాటు నిలబడిపోయాడు పవన్.

వార్డు తలుపు ఎదురుగా కొంచెం రద్దీగా ఉందని బాబుని ఎత్తుకుని ఒక పక్కగా వెళ్ళి నిలబడింది సుస్మిత.

పవన్ కూడా అటే వెళ్ళాడు.

"బాబుని నేను ఎత్తుకుంటాను..."

బాబుని చేతుల్లోకి తీసుకుంటుంటే అవ్యక్తమైన భావాలతో నిండి పోయిందతని మనసు.

మైసన్!

మై లవ్ చైల్డ్!

చురుగ్గా అటూఇటూ చూస్తున్న వాడిమొహంకేసి ఆర్తిగా చూసాడు పవన్...

తెల్లటి మొహంమీద నల్లగా మెరుస్తున్న కళ్ళు అచ్చు స్నిగ్ధవే... ఎర్రటి పెదాల కింద నల్లటిపుట్టుమచ్చ...దిష్టికొట్టకూడదని పెట్టిన కాటిక బొట్టులాఉంది.

అప్రయత్నంగా ముందుకు ఒంగి బాబు బుగ్గమీద మృదువుగా ముద్దెట్టుకుని ఏడ్చేశాడు పవన్!

"పవన్‌గారూ...ప్లీజ్! అధైర్యపడకండి!" అంటూ ఓదార్పుగా అతడి భుజంమీద చెయి వేసింది సుస్మిత.

కొంచెం సర్దుకుని కళ్ళు తుడుచుకున్నాడు పవన్.

రెండు వారాల క్రితం...స్నిగ్ధ ఆటోలో వెళ్తుంటే ఆక్సిడెంట్ అయింది. దెబ్బలు పెద్దగా తగల్లేదు కానీ, బ్లీడింగ్ మొదలవడంతో సిసేరియన్ చేసారు. బాబు పుట్టిన సంగతి మీరు వచ్చాకే చెప్పి మీకు ప్లెసెంట్ సర్‌ప్రైజ్ ఇద్దామనుకుంది స్నిగ్ధ..." అంది సుస్మిత నెమ్మదిగా.

బాధగా నవ్వాడు పవన్.

"...కానీ నాకు ఈ అన్ ప్లెసెంట్ షాక్ మిగిలింది!...ఇలానేను బాబుని ఎత్తుకుని నిస్సహాయంగా నిలబడిఉంటే లోపల...తను చావుతో పోరాడుతోంది!..." అంటూ ఆగిపోయాడు అతను.

వార్డు తలుపు తెరచుకుని డాక్టర్ ఒకాయన పవన్‌కేసి వచ్చాడు.

"మీరు పేషెంట్‌కేమవుతారు?" అడిగాడతను.

"షీ ఈజ్ మై వైఫ్" అన్నాడు పవన్.

"ఐయామ్ డాక్టర్ సుధాకర్, నాతోరండి" అంటూ కారిడార్ చివరున్న గదికేసి దారితీసాడతను.

గదిలో టేబిల్ ఎదురుగా ఉన్న కుర్చీలకేసి చూపించి కూర్చోమన్నాడు డాక్టర్ సుధాకర్.

"మీ పేరు...?"

తన పేరు చెప్పి సుస్మితనుకూడా పరిచయం చేసాడు పవన్.

"మీ మిసెస్ పరిస్థితి కొంచెం సీరియస్‌గానే ఉంది మిస్టర్ పవన్" అన్నాడు డాక్టర్.

ఆ మాటలువిని మొద్దుబారింది పవన్ మనసు-

"సర్‌వైవల్ ఛాన్సెస్ ఎలా ఉన్నాయి డాక్టర్?" అడిగాడతను యాంత్రికంగా.

ఒక్కక్షణం సందేహించి మాట్లాడాడు డాక్టర్ సుధాకర్.

"చెప్పలేం మిస్టర్ పవన్ ఫుల్ థిక్‌నెస్ బర్న్స్‌తో శరీరం చాలా మటుకు కాలిపోయింది!"

"చాలామటుకు అంటే?" అడిగాడు పవన్

"ఎనభై శాతం!..."

ఆ మాట వినగానే పూర్తిగా నీరసపడిపోయాడు పవన్.

ఎనభై శాతం కాలిపోయిందంటే...ఇక స్నిగ్ధ?!

ఆ మాట అనుకోడానికి కూడా మనసు అనుమతించడంలేదు. ఏదైనా చేయాలి. తన బుర్రను ఉపయోగించి ఏదయినా మార్గం ఆలోచించి స్నిగ్ధని రక్షించుకోవాలి.

డాక్టర్ సుధాకర్! స్నిగ్ధను...అదే మా మిసెస్‌ని రక్షించుకునే మార్గమేలేదా?..." అడిగాడు పవన్ అతడి చెయి పట్టుకుని.

పవన్‌కేసి జాలిగాచూసి నెమ్మదిగా తలూపాడు డాక్టర్ సుధాకర్.

"చర్మం అంతా కాలిపోవడంతో ఇప్పటికే చాలా ఫ్లూయిడ్ లాస్ అయిందామెకు. అది పూరించడానికి ప్రయత్నాలు ఏవో చేస్తున్నాం. దీనికితోడు ఆవిడ బాడీ ఫంక్షన్స్‌కూడా క్రమంగా ఆగిపోయే సూచనలు కనబడ్తున్నాయి!...మీకు ఊరట కలిగించడానికి నేనేదో చెప్పవచ్చు ... కానీ ఉన్న సంగతిది" అన్నాడతను.

కాసేపు మాట్లాడకుండా తలపట్టుకుని కూర్చుండిపోయాడు పవన్. ఆ తర్వాత అడిగాడు.

"స్నిగ్ధను ఒకసారి చూడొచ్చా?"

డాక్టర్ సుధాకర్ సమాధానం చెప్పేలోగా ఎవరో తలుపు తట్టిన చప్పుడయి అటుచూసాడు పవన్.

"ఎక్స్‌క్యూజ్ మీ...పవన్‌గారంటే మీరేనా?" అంటూ లోపలికి వచ్చాడు పోలీస్ ఇన్స్‌పెక్టర్.

"అవును" అంటూ లేచాడు పవన్.

"కూర్చోండి...ఈ ఆక్సిడెంట్ గురించి వివరంగా చెప్తారా!" అడిగాడతను.

నిస్సత్తువగా డాక్టర్‌కేసి చూసాడు పవన్.

"ఇది మెడికోలీగల్ కేసండీ...పోలీస్ డిపార్టుమెంట్‌వాళ్ళ జౌట్ పోస్టు ఇక్కడుంటుంది. పేషెంట్ రాగానే వాళ్ళ స్టేట్‌మెంట్స్ రికార్డు

చేసుకుంటారు" అన్నాడు డాక్టర్ సుధాకర్.

"మీక్కావలసిన ఇన్ఫర్మేషన్ నేనిస్తాను. ఆయన పేషెంట్ని చూడ్డానికెళ్తున్నారు." అంది అంతవరకూ మౌనంగా సుస్మిత.

సరేనని తలూపి పవన్ వెళ్ళడానికి దారిచ్చాడు ఇన్స్పెక్టర్. అంతవరకు తన చేతుల్లో ఉన్న బాబుని సుస్మితకి అప్పచెప్పి డాక్టర్ సుధాకర్తోపాటు బర్న్స్ వార్డ్లోకి వెళ్ళాడు పవన్.

అక్కడ చికిత్స పొందుతున్న వారిని చూసి మరింత కృంగి పోయాడు పవన్. ఆ వాతావరణం దుర్భరంగా ఉందనిపించింది.

వార్డు చివర గోడపక్కన మంచంమీద పడుకోబెట్టారు స్నిగ్ధని.

డాక్టర్ సుధాకర్ ఆ బెడ్దగ్గర ఆగితేకాని అర్థంకాలేదు పవన్కి అదే స్నిగ్ధ అని। రక్తం కారకుండా ఉండటానికి చేసిన డ్రెస్సింగ్తో గుర్తుపట్టేట్టుగా లేదామె మొహం.

"కాంషియస్గా ఉందా?" అడిగాడు పవన్ వస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటూ.

తలూపి మంచం పక్కన వచ్చినిలబడ్డాడు డాక్టర్.

"స్నిగ్ధగారూ...స్నిగ్ధగారూ..." పిలిచాడు డాక్టర్ సుధాకర్.

కొంచెం కదిలిందామె.

"స్నిగ్ధా...నేను పవన్ని" ముందుకి వొంగాడు పవన్.

అతికష్టంమ్మీద అతడికేసి తలతిప్పి చూసిందామె.

అంతలో అక్కడికి పోలీస్ ఇన్స్పెక్టర్ కూడా వచ్చాడు.

"మేడమ్...ఎలా జరిగిందీ ఆక్సిడెంట్? చెప్పండి" అన్నాడతను పెద్ద గొంతుకతో.

ఆమె నోరు కొంచెం కదిలింది...ఏదో చెప్పడానికి ప్రయత్నిం చింది కానీ మాట వినబడటంలేదు.

"చెప్పండి ... ఏం చెప్పాలనుకుంటున్నారు?" అడిగాడు.

పవన్కేసి చూస్తున్నట్టున్నాయామెకళ్ళు...

"బా...బు..." అన్నమాట అస్పష్టంగా వెలువడింది ఆమెనించి.

...నాను స్నిగ్ధా...ఇక్కడే...వార్డు బయట సుస్మిత
...లు..." చెప్పాడు పవన్.

...ఈ ఆక్సిడెంట్ ఎలా అయిందో చెప్తారా?" మళ్ళీ అడిగాడు
...ర్.

...శరీరంలో మిగిలిపోయిన శక్తినంతా కూడదీసుకుని జవాబివ్వడానికి ప్రయత్నించిదామె.

"కా...త్యాయ...ని..."

ఆమె అంటున్నదేవిటో అర్థంకాక పవన్‌కేసి చూసాడు ఇన్‌స్పెక్టర్. ఏమోనన్నట్టు పెదవి విరిచాడు పవన్.

స్నిగ్ధ పలికిందేవిటో పవన్‌కర్థమయింది కానీ ఇప్పుడాపేరు ఎందుకు చెప్తోందో తెలియలేదతనికి...

ఆ తర్వాత ఎంత ప్రయత్నించినా జవాబివ్వలేదు స్నిగ్ధ.

ఇక లాభంలేదనుకుని పక్కకు జరిగాడు ఇన్‌స్పెక్టర్.

"ఆవిడ స్టేట్‌మెంట్ ఇచ్చేపరిస్థితిలోలేదు. డాక్టర్ సుస్మితగారిచ్చిన ఇన్‌ఫర్మేషన్ బట్టి చూస్తుంటే ఇది ఆక్సిడెంట్ అనే అనిపిస్తోంది. ప్రమాద వశాత్తు గ్యాస్ సిలిండర్ పేలడం వల్ల జరిగిందిది! ఇంట్లో ఎవరూ లేరట కదా అపుడు? మీ అమ్మగారు కూడా యాదగిరిగుట్ట కెళ్ళినట్టున్నారు?" అడిగాడతను.

ఏమనాలో తెలియక తలూపాడు పవన్.

ఇన్‌స్పెక్టర్ అక్కడ్నించి కదిలాడు. డాక్టర్ సుధాకర్ కూడా డ్యూటీనర్సు వచ్చి పిలిస్తే అక్కడ్నించి వెళ్ళిపోయాడు.

బెడ్ పక్కన ఒంటరిగా నిలబడి స్నిగ్ధకేసే చూస్తున్నాడు పవన్.

మంటల్లో కాలిపోయి వికృతంగా తయారయిన స్నిగ్ధ శరీరాన్ని చూస్తుంటే అతడిమనసులో వైరాగ్యం చోటు చేసుకుంది...

అంతలో—

"బయటకెళ్ళి నిలబడండయ్యా!" అంటూ అక్కడి ఒక ఆయా వచ్చింది.

లావుగా పొడుగ్గా ఉన్న ఆమెకేసి ఎగాదిగా చూసి అయిష్టంగా

అక్కడ్నించి కదిలాడు పవన్.

ఆమె పక్కనించి వెళ్తుంటే అడిగిందామె.

"ప్రాణం ఉందా? పోయిందా?"

చురుగ్గా ఆమెకేసి చూసి గబగబ తలుపుకేసి నడిచాడతను. తలుపు తీసుకుని వార్డు బయటకు అడుగుపెడుతూ అప్రయత్నంగా వెనక్కితిరిగి చూసాడు పవన్. ఆయా స్నిగ్ధమంచం పక్కనే నిలబడి అమెనే చూస్తోంది.

ఏదో సందేహం వచ్చింది కానీ అంతలో అటుకేసి వస్తున్న డాక్టర్ సుధాకర్‌ని చూసి అతడితో మాట్లాడ్డానికి వెళ్ళాడు పవన్.

"డాక్టర్ —"

"చెప్పండి..." అంటూ వార్డు బయట ఒక పక్కకు తీసుకెళ్ళాడు డాక్టర్ సుధాకర్.

"ఇలాంటి కేసుల్లో స్కిన్ గ్రాఫ్టింగ్ చేసి ప్రాణాలు కాపాడ్తారని విన్నాను."

"కరెక్ట్...కానీ మీ మిసెస్‌కి ఆటోగ్రాఫ్టింగ్ చేయాలంటే కుదర్దు. దురదృష్టవశాత్తు ఆవిడ శరీరమంతా కాలిపోయింది! కాలిపోయిన చోట్నించి మంచి చర్మం తీయడానికే లేదు!" అన్నాడు డాక్టర్.

"పోనీ...నా స్కిన్ ఇస్తాను. గ్రాఫ్టింగ్ చేయలేరా?" ప్రాధేయపడుతున్నట్టు అడిగాడు పవన్.

అతడి బాధ అర్థం చేసుకుంటున్నట్టు చూసాడు డాక్టర్.

"నో! పవన్‌గారూ! ఇలా స్కిన్ డొనేషన్ తీసుకోవాలనుకున్నా మీ శరీరం నించి పదిశాతం చర్మంకంటే తీసుకోలేము. మీ ఆవిడకి ఎనభైశాతం కాలిపోయింది. మీ చర్మం ఇచ్చినా ఆవిడ్ని కాపాడుకోలేక పోయాననే బాధ మాత్రమే మిగుల్తుంది మీకు! ఐయామ్ సారీ!..." అన్నాడతను.

"అయితే స్నిగ్ధ..."

"ఇలాంటి సందర్భాల్లో ఫ్రాంక్‌గా మాట్లాడ్డం నాకలవాటు! మీ మిసెస్ చుట్టాలకి మెసేజ్ పంపించడం మంచిది"

బరువుగా నిట్టూర్చాడు పవన్.

"తనకెవరూలేరు డాక్టర్... నేను తప్ప!"

"ఎక్స్‌క్యూజ్ మీ..." అంటూ డాక్టర్ బిజీగా అక్కడ్నించి వెళ్ళిపోయాక మళ్ళీ వార్డుకేసి వెళ్ళాడు పవన్.

వార్డు తలుపుకేసి లోపలికి వెళ్తూ అక్కడి దృశ్యాన్ని అపనమ్మకంగా చూసాడు.

స్నిగ్ధ మంచంపక్కన నిలబడ్డ ఆయా ఇంకా అక్కడే ఉంది!

ఎడమచేతి పిడికిలి నుదిటికి ఆనించి ఏదో జపం చేస్తున్నట్టు తల కొంచెం పైకెత్తి నిలబడి ఉంది!

ఆమె చేస్తోందేమిటో అర్ధంకాలేదు పవన్‌కి.

అప్పుడెత్తిందామె తన కుడిచేయి!

చేతిలోని కొడవలి తళుక్కుమని మెరిసింది.

ఆమె చేయబోతున్నదేవిటో అపుడు బోధపడిందతనికి.

"ఏయ్! ఆగు!" అని ఒక్క ఉదుటున అటు పరుగుతీసాడు.

కానీ...

అతడు అక్కడికి చేరేలోగానే...

జరక్కూడనిది జరిగిపోయింది!

ఆయా చేతిలోని కొడవలి...మంచంమీద చావుతో పోరాడుతున్న స్నిగ్ధ చేతిమీద బలంగా పడింది!

"రాక్షసీ!!..." పిచ్చిగా అరుస్తూ ఆమెమీదకు వెళ్ళి పడ్డాడు పవన్.

పవన్ అలా వస్తాడని ముందే ఊహించినట్టు సర్రున వెనక్కి తిరిగి అతడ్ని ఒక్కతోపు తోసిందామె.

వెనక్కి తూలి పక్కనున్న మంచానికి తట్టుకుని కిందపడ్డాడు పవన్.

ఆడదానికి అంత బలం ఉండటం అసాధ్యం!

తలెత్తి చూసాడు పవన్.

అప్పటికే వార్డునాటి పరుగెడ్తోంది ఆ ఆయా!

ఆ పరుగునిబట్టికూడా చెప్పవచ్చు అది ఆడమనిషి కాదని।

చేతిలో కొడవలి పట్టుకుని ఆయా వేషంలో ఉన్నతను అలా పరుగెడ్తుంటే వార్డులో పని చేస్తున్న నర్సులు, మిగతా ఆయాలు భయపడి పక్కకి తప్పుకున్నారు...

చటుక్కున లేచి పారిపోతున్న ఆ దొంగ ఆయాని వెంబడించాడు పవన్.

హాస్పిటల్ వసారాల్లోంచి పరుగుతీస్తున్న ఆ వ్యక్తిని పట్టుకుని చంపేయాలనే ధ్యాసతప్ప మరొకటిలేదు పవన్‌కి.

ఆ వ్యక్తికి అయిదే అయిదు అడుగులదూరంలో ఉన్నపుడు... ఉన్నట్టుండి ఒక వార్డులోంచి వీల్‌ఛైర్ తోసుకుంటూ ఒకతను అడ్డు వచ్చాడు। దాంతో తప్పనిసరయి పవన్ వేగం తగ్గింది...

చూసేప్పటికి ఆ వ్యక్తి గేటులోంచి బయటకు వెళ్ళిపోతున్నాడు।

పవన్‌కూడా అటుకేసి పరుగెట్టాడు కానీ అప్పటికే ఆ దుర్మార్గుడు చాలా దూరం వెళ్ళిపోయాడు బయట చీకట్లో। వర్షం। అతడ్ని పట్టుకోవడం అసాధ్యమని తెలిసిపోయింది పవన్‌కి....

అక్కడున్న పూలకుండీ ఎత్తి బలంగా ఆ వ్యక్తి వెళ్ళినవైపుకి విసురుతూ "యూ బాస్టర్డ్।" అని అరిచాడు.

ఆలోచనలు బ్లాంక్ అయిపోతే కాసేపు అక్కడే నిలబడిపోయి... నెమ్మదిగా అక్కడ్నించి వెనక్కి తిరిగాడు పవన్.

...మంటలకి ఆహుతయిన స్నిగ్ధ చేయి నరికేసాడు ఆ కిరాతకుడు।

నిస్సత్తువగా అడుగులు వేసుకుంటూ బర్న్స్ వార్డుకేసి వెళుతుంటే అంతకుముందు కలిసిన ఇన్‌స్పెక్టర్ పరుగున ఎదురొచ్చాడు...

"ఎటుసార్। ఎటు వెళ్ళాడు వాడు?" అడిగాడు.

ఆ వ్యక్తి వెళ్ళిన వైపుకి చూపించి ముందుకి నడిచాడు పవన్—

బర్న్స్ వార్డు గుమ్మందగ్గర అనిరుధ్‌ని ఎత్తుకుని పాలిపోయిన మొహంతో నిలబడివుంది డాక్టర్ సుస్మిత.

"మీరు వెంటనే లోపలికి వెళ్ళండి" అందామె.

తలుపుతీసుకుని లోపలికి వెళ్ళి స్నిగ్ధ బెడ్ చుట్టూ నిలబడ్డ ముగ్గురు డాక్టర్లను, నర్సులను చూసి పవన్ గుండె లయతప్పింది.

అతడ్ని గమనించి వెనక్కి తిరిగిన డాక్టర్ సుధాకర్ మొహం చూడగానే అర్థమయిపోయింది పవన్‌కి...

అంతా అయిపోయిందని.

వార్డు బయట...

సుస్మిత చేతుల్లోని పసివాడు ఉలిక్కిపడి లేచాడు...

ఎప్పుడూ లేనిది...బిగ్గరగా ఏడవసాగాడు...

తల్లిపాలకోసం.

......

......

సూర్యోదయానికి ... ఇంకా మూడున్నరగంటలుంది...వికారాబాద్ అడవుల నడుమ సమావేశమయిన కరకింకర ఉపాసకులకు దీప్తి నాయక్ పంపిన కబురందింది.

అక్కడున్న పదముగ్గురు లేచి కరకింకర విగ్రహం చుట్టూనాట్యమాడి వేడుకలు జరుపుకున్నారు.?

# 25

కాలం అనేది ఒకటే—

కానీ...కాలగమనం ఒక్కొక్కరి అవగాహనకు ఒకొక్కలా ఉంటుంది.

ఒకే వ్యక్తికి–అతడి మానసిక పరిస్థితినిబట్టి కాలగమనంలో తేడా రావచ్చు.

అన్నీ ఊహించినట్టే జరుగుతూ—

ఆశించినవన్నీ ఫలిస్తున్నంతవరకూ

కాలం శరవేగంతో సాగిపోతున్నట్టు అనిపించవచ్చు...చూస్తుండగానే రోజులు, నెలలు, సంవత్సరాలు దొర్లిపోతున్నట్టు అనిపించవచ్చు.

కానీ—

ఊహించని దుస్సంఘటనలు ఎదుర్కొని అంతా కోల్పోతే జీవితం దుర్భరంగానూ...కాలం తాబేటి నడక నడుస్తున్నట్టుగానూ తోస్తుంది।

ఇక సాధించేది, ఆశించేది ఏమీలేదు అనుకుంటునపుడు బతుకంతా నిస్సారమయి...ఒకొక్క సంవత్సరం ఒక జీవితకాలంలా అనిపిస్తుంది.

స్నిగ్ధ పోయాక—

అలాంటి ఏడు భయంకరమయిన సంవత్సరాలు గడిపాడు పవన్.

ఏడు సంవత్సరాలక్రితం పవన్‌ని ఎరిగినవాళ్ళు అతడ్నిచూస్తే గుర్తుపట్టనంతగా మారిపోయాడతను.

గెడ్డం పెంచుకుని చత్వారం కళ్ళజోడు పెట్టుకుంటున్నాడిపుడు.

పరధ్యానంగా జీవం కోల్పోయిన కళ్ళతో ఎటో చూస్తుంటాడు ఎవరయినా వచ్చి పలకరిస్తేనే కానీ మాట్లాడడు।

మునపటి డైనమిక్ పవన్ ఏమైపోయాడో।

యూ.కే.నించి తిరిగివచ్చిన రెండేళ్ళకి అతడికి ప్రమోషన్ వచ్చింది. డిపార్టుమెంట్ డైరెక్టర్ అయ్యాడన్న మాటేకానీ...అతడికి ఏమాత్రం సంతోషంలేదు. పనిపట్ల అశ్రద్ధ చూపకపోయినా ఒకప్పటి ఉత్సాహం లోపించింది అతడిలో।...ఏపని చేసినా యాంత్రికంగా చేయసాగాడతను.

ఏడేళ్ళ క్రితం...

ఉస్మానియా హాస్పిటల్ బర్న్స్ వార్డులో స్నిగ్ధ చావుతో పోరాడుతుంటే నిస్సహాయింగా చూడవలసివచ్చింది తను అమా వేషంలో వచ్చిన ఆ కిరాతకుడు స్నిగ్ధ చెయి నరికేయడంతో....ఆ కొన ఊపిరి కూడా నిలిచిపోయింది.

ఆ దృశ్యం చూసి...నిజానికి ఆరోజు అక్కడికక్కడే గుండె పగిలి తను కూడా చనిపోవలసింది।...

కానీ...అలాజరగలేదు.

వార్డు బయటనించి వినబడ్డ అనిరుధ్ ఏడుపు దావానలం లాంటి అతడి ఉద్వేగాలను అరికట్టింది.

అగాధంలోకి జారిపోతున్న అతడి మనస్సుకి స్థయిర్యానిచ్చింది.

అనిరుధ్...

స్నిగ్ధ తనకిచ్చిన కానుక।...
తనకప్పగించిన బాధ్యత।
స్నిగ్ధలేని బతుకు బతకాలనిలేదు.
కానీ...అనిరుధ్‌ని పెంచి పెద్ద చేసేందుకు తప్పదు।
......

ఆ రోజు ఆఫీసుపని త్వరగా ముగించుకుని బయల్దేరాడు పవన్.. సాయంత్రం అనిరుధ్‌ని పార్కుకి తీసుకెళ్తానని చెప్పాడు...త్వరగావెళ్తే చీకటిపడేలోగా ఇంటికి తిరిగి వెళ్ళవచ్చు.

హిమాయత్‌నగర్‌లో ఆరంతస్తుల భవనం ఆవరణలో మారుతీకారాపి దిగాడు పవన్. ఆ భవనం మూడవ అంతస్తులో ఉంది ప్రస్తుతం పవన్ ఉంటున్న ఫ్లాట్.

స్నిగ్ధ పోయిన పదిహేను రోజులకే రాజేశ్వరిదేవి పట్టుపట్టడంతో జూబ్లీహిల్స్‌లో ఉంటున్న స్వంత ఇల్లు ఖాళీచేసి ఈ ఫ్లాట్ అద్దెకు తీసుకున్నాడతను.

పార్కింగ్ ఏరియాలోంచి లిఫ్ట్‌కేసి నడుస్తుంటే అనిరుధ్‌ని స్కూల్లో దింపే రిక్షావాడు ఎదురొచ్చాడు.

"బాబు వచ్చేసాడా?" అడిగాడు పవన్ యధాలాపంగా.

"లేదుదొరా...ఇవాళకూడా నాతో రాలేదు."

ఆశ్చర్యంగా అతడికేసి చూసాడు పవన్.

"అలాగా?...సరే నువ్వెళ్ళు" అని ముందుకు కదిలాడు.

లిఫ్ట్ ఎక్కి థర్డ్‌ఫ్లోర్ బటన్ నొక్కాడు పవన్. లిఫ్ట్‌పైకి వెళ్తుంటే అసహనంగా నిలబడ్డాడు.

అనిరుధ్ ఈ మధ్య ఇలా ఎందుకు చేస్తున్నాడు? పొద్దున మామూలుగానే స్కూలుకెళ్ళిపోతాడు కానీ స్కూలు వదిలే టైంకి రిక్షావాడు వెళ్తే అక్కడుండడు। రిక్షావాడు కంగారు పడిపోయి ఇంటికివస్తే అప్పటికే ఇల్లుచేరుకుని ఉంటాడు। ఏమనడిగితే సరిగ్గా జవాబివ్వడు.

థర్డ్‌ఫ్లోర్‌లో లిఫ్ట్ ఆగాక షట్టర్ తెరచుకుని తన ఫ్లాట్ తలుపు కేసి నడిచాడు పవన్.

ఓరగావేసిఉన్న తలుపు తోసుకుని లోపలికి అడుగుపెట్టి అక్కడే నిలిచిపోయాడు!...లోపల్నించి రాజేశ్వరిదేవి అరుపులు పెద్దగా వినబడ్తున్నాయి.

"మాట్లాడవేంటి? చెప్పరా...రిక్షావాడు వచ్చినపుడు ఎక్కడున్నావు?...స్కూల్లోనే ఉన్నావా అసలు?" అంటోందామె.

పవన్ రెండడుగులు ముందుకేసాడు. రాజేశ్వరిదేవితో అనిరుధ్ ఎలా మాట్లాడ్తాడో చూద్దామనిపించిందతనికి.

"ఒరేయ్! ఇందాకట్నించి గొంతు చించుకుని అరుస్తున్నా జవాబివ్వవేమిటి?" కోపంగా అంది రాజేశ్వరిదేవి.

ఆమెమాటలు వినిపించుకోకుండా సోఫాలో కాళ్ళు చాపుకుని కూర్చున్నాడు అనిరుధ్.

రాజేశ్వరిదేవి ఎడం చెయి నడుంమీద పెట్టుకుని నిలబడి తీక్షణంగా చూస్తున్నా తననికానట్టు అక్కడున్న కామిక్స్ పుస్తకం అందుకుని తిరగేస్తూ కూర్చున్నాడు.

ఆ ధోరణిచూసి మరింత రెచ్చిపోయింది రాజేశ్వరిదేవి.

"ఒరేయ్! లేవరా...ముందు లేచి నిలబడు."

ఠక్కున లేచినిలబడ్డాడు అనిరుధ్.

తను చెప్తేనే లేచి నిలబడ్డాడనుకుని వెళ్ళి కుర్చీలో కూర్చుంది రాజేశ్వరిదేవి.

"ఊఁ...ఇలారా...ఇలావచ్చి నిలబడు" అని ఆమె అంటుండగానే అక్కడ్నించి నింపాదిగా కదిలాడు అనిరుధ్.

"ఎక్కడికిరా? ఎక్కడికెళ్తున్నావ్? ఇలారా! ... నిన్నే!...నా గదిలోకి వెళ్తున్నావేంటి? అక్కడ నీకేం పని?" అరిచింది రాజేశ్వరిదేవి.

ఆమె పిలుపుని ఖాతరు చేయకుండా గదిలోకి వెళ్ళిపోయాడు అనిరుధ్.

ఒక్కక్షణం అక్కడే కూచ్చుండిపోయి...లేచి అనిరుధ్ వెళ్ళిన వైపు కదిలింది రాజేశ్వరిదేవి.

అంతవరకూ తలుపుదగ్గరే నిలబడ్డ పవన్ కూడా అటు నడిచాడు.

గదిలో రాజేశ్వరిదేవి మంచంకింద నించి చిన్న పెట్టె ఒకటి బయటికి లాగాడు అనిరుధ్.

రాజేశ్వరిదేవి చూస్తుండగానే చటుక్కున పెట్టె తెరిచాడు.

"ఇప్పుడా పెట్టె ఎందుకు తెరుస్తున్నావ్? నీకేమయినా మతిపోయిందా?" అంది రాజేశ్వరిదేవి గదిలోకెళుతూ.

అంతలోనే పెట్టెలోంచి పాతకాలంనాటి కళ్ళజోడు ఒకటి తీసి పెట్టుకున్నాడు అనిరుధ్...

ఎందుకో...అది చూసి తటపటాయించింది రాజేశ్వరిదేవి.

"ఏ...ఏమ్మిటా...?"

కళ్ళజోడు ముక్కుమీదకు జారిపోతుంటే ఫ్రేం మీదనించి కళ్ళు మిటకరించి అదోలా చూసాడు అనిరుధ్.

"ఆ కళ్ళజోడు తాతగారిది! ఎందుకు పెట్టుకున్నావ్? తీసేయ్!" అంది రాజేశ్వరిదేవి తడారుతున్న గొంతుకతో.

అనిరుధ్ కదల్లేదు. అలాగే ఆమెకేసి మరికాసేపు చూసి నెమ్మదిగా అన్నాడు.

"ఏమిటీ...ఇవాళ ప్రాణాలు తోడేస్తున్నావ్?"

ఆ పసివాడి మాటలు విని ఉలిక్కిపడింది రాజేశ్వరిదేవి.

అనిరుధ్ లేచినిలబడితే భయంగా రెండడుగులు వెనక్కి వేసింది.

ఇదంతా చూస్తున్న పవన్ పెదాలమీద ఒకే ఒక్కక్షణం చిరునవ్వు మెరసి మాయమయ్యింది. అనిరుధ్ ఇలా అల్లరిచేయడం మొదటిసారికాదు...!

"బబ్లూ...ఏమిటిది?" అంటూ గదిలోకి నడిచాడు.

అతడ్ని చూడగానే తాతగారి కళ్ళజోడుతీసి పెట్టెలో పెట్టేసాడు అనిరుధ్.

"ఏమిటీ? ఇవాళ కూడా స్కూలునించి రిక్షాలో రాలేదట? ఎక్కడికెళ్ళి వచ్చావు?" అడిగాడు పవన్. మంచంమీద కూర్చుంటూ.

"గేమ్స్ పీరియడ్ లేదుడాడీ! మా ఫ్రెండు వాళ్ళింటికెళ్ళి అక్కడ్నించి వస్తున్నాను..."అన్నాడు అనిరుధ్ అతడి ఒళ్ళో కూర్చోబోతూ.

అనిరుధ్‌ని కూర్చోనివ్వలేదు పవన్.

"అలాచేయకూడదని చెప్పలేదా? నువ్వు తిన్నగా ఇంటికి రాక పోతే ఎంత కంగారు పడిపోతాం మేము? ఇంకెపుడయినా ఇలాచేసావంటే ఊరుకునేదిలేదు!" అన్నాడు పవన్ కోపం ప్రదర్శిస్తూ.

అతడి మాటలకి చిరునవ్వుతో తలూపి ఓరగా చూస్తూ నిలబడ్డాడు అనిరుధ్. 'ఇదంతా ఉత్తుత్తికోపం...నాకు తెలియదా!' అంటున్నాయి ఆ చూపులు.

వాడికేసి సూటిగా చూస్తే తన కోపం పటాపంచలవుతుందని తెలుసు పవన్‌కి. అందుకే కళ్ళు తిప్పుకుని మాట్లాడాడు...

...పైగా ఇందాకట్నుంచి చూస్తున్నాను బామ్మతో నీ ప్రవర్తన ఏమీ బాగాలేదు. అడగ్గానే తిన్నగా నాకు చెప్పినట్టు సమాధానం చెప్ప వెందుకు బామ్మకి...?"

రాజేశ్వరిదేవికూడా ముందుకు వచ్చింది.

"అలా అడగరా కన్నా! ఇలా అల్లరిపనులు చేసినపుడు ఏద యినా అడిగితే సమాధానం చెప్పడు!...పైగా ఆ చూపులొకటి నా ప్రాణానికి...చూడు, చూడు ఎలా చూస్తున్నాడో!" అందామె.

"బబ్లూ తప్పమ్మా! బామ్మతో అలా చేయకూడదు. సారీ చెప్పు బామ్మకి..." అన్నాడు పవన్ కోపం అభినయిస్తూ.

తండ్రికేసి 'తప్పదా?' అన్నట్టు చూసి తల వొంచుకుని నెమ్మదిగా నడుచుకుంటూ వెళ్ళి రాజేశ్వరిదేవి దగ్గరగా నిలబడ్డాడు అనిరుధ్.

వొంచిన తల పైకెత్తకుండా కళ్ళుమాత్రమే పైకెత్తి చూసాడామెను.

"...ఇంకెపుడూ ఇలా చేయను...సారీ రాజేశ్వరీ!" అన్నాడు చిలిపిగా.

ఆ మాటలు వినగానే మొహం పాలిపోయింది రాజేశ్వరిదేవికి.

పవన్‌లేచి అనిరుధ్ వీపుమీద చిన్నదెబ్బ వేసాడు.

"ఏమిటా పిలుపు?"

పకపక నవ్వేస్తూ పవన్ నడుంచుట్టూ చేతులువేసి పెనవేసు కున్నాడు అనిరుధ్.

అప్రయత్నంగా పవన్‌కూడా నవ్వేసాగాడు—
ఏడుపుని దిగమింగుకుని నవ్వడానికి ప్రయత్నించింది రాజేశ్వరిదేవి.

• • •

సాయంత్రం అయిదు గంటలు దాటుతుంటే-
పబ్లిక్‌గార్డన్స్ లాన్స్‌పక్కన కారాపాడు పవన్.
"నిన్న కొనిపెట్టిన బూమరాంగ్ తెచ్చుకున్నావా?" అడిగాడు తన పక్కసీట్లో కూర్చున్న అనిరుధ్‌ని.
"తెచ్చుకున్నానన్నట్టు తలూపి డాష్‌బోర్డు కిందనించి 'బూమరాంగ్' బయటకి తీసాడు.
సగానికి వొంచిన ప్లాస్టిక్ స్కేల్‌లా ఉందా ఆట వస్తువు.
"లాన్స్‌మీదకు రా బబ్లూ! దీన్ని ఎలా విసరాలో చూపిస్తాను" అంటూ కారు దిగాడు పవన్.
అనిరుధ్‌కూడా కారుదిగి తండ్రిననుసరిస్తూ పచ్చికమీదకు నడిచాడు.
లాన్స్‌మీద అక్కడక్కడా జనం కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు...ఖాళీగా ఉన్న ఒకచోట నిలబడి చేతిలోఉన్న 'బూమరాంగ్'ని బలంగా గాలిలో విసిరాడు పవన్.
రివ్వున ముందుకు దూసుకుపోయిన బూమరాంగ్ అంతలోనే చుట్టూ తిరిగివచ్చి మళ్ళీ పవన్ కాళ్ళదగ్గర పడింది!
బూమరాంగ్ అందుకున్నాడు అనిరుధ్...
అంతకుముందు పవన్ వంగినట్టే ముందుకి వంగి సరిగ్గా అతడు విసిరినట్టే విసిరాడు అనిరుధ్‌కూడా,..అది మళ్ళీ అలాగే వెనక్కి తిరిగివచ్చి పడింది.
"గుడ్!" అన్నాడు పవన్ ఆనందంగా.
తండ్రి కళ్ళుగర్వంగా మెరుస్తుంటే సంబరపడిపోయాడు అనిరుధ్. మళ్ళీ బూమరాంగ్‌ని గాలిలో విసిరి చూపించాడు.
"వెల్‌డన్...నువ్వు ఆడుకో. ఇక నేను ఆ బెంచిమీద కూర్చుంటాను" అనిరుధ్ తలనిమిరి లాన్స్ పక్కనున్న బెంచికేసి నడిచాడు పవన్.

పవన్ అక్కడ్నించి వెళ్ళాక అటూ ఇటూ చూస్తూ నిలబడ్డాడు అనిరుధ్. గాలి ఎటువైపుకి వీస్తోందో ఆకుల కదలికను బట్టి గమనించి దానికి ఏటవాలుగా మళ్ళీ బూమరాంగ్ విసిరాడు.

ఈసారి బూమరాంగ్ మామూలుగా ఎగరలేదు. తుమ్మెదలా రెండు మూడు చుట్లు తిరిగి అనిరుధ్ దగ్గర వచ్చి పడింది ... దాంతో అలాగే ఆడుకుంటూ ముందుకి నడిచాడు అనిరుధ్.

అనిరుధ్ ఆటలో లీనమయిపోయాడని గమనించి సీట్లో రిలాక్సయి సిగరెట్టు వెలిగించుకున్నాడు పవన్.

మరోసారి బూమరాంగ్‌ని పైకి విసిరాడు అనిరుధ్. ఈ సారి అది వెనక్కి తిరిగిరాలేదు. చెట్టుకొమ్మకు తట్టుకుని పొదల వెనక పడిపోయింది.

బూమరాంగ్ కోసం పొదల వెనక్కి పరుగు తీసాడు అనిరుధ్

పూల కుండీల మధ్యపడున్న 'బూమరాంగ్' అందుకుని కెన్నాన్ మొక్కల పక్కన ధ్యానముద్రలో కూర్చుని ఉన్న ఆయనకేసి చూసి ఆగిపోయాడు. ఇంతకుముందు పబ్లిక్ గార్డెన్స్‌కి వచ్చినపుడు కూడా ఇదే చోట ఇలాగే కూర్చుని ఉన్నాడాయన.

అలా కళ్ళు మూసుకుని కూర్చుని ఏం చేస్తున్నాడాయన?

నిద్రపోతున్నాడా?

ఊహుఁ...కూర్చుని ఎలా నిద్రపోతారెవరయినా?

అలికిడి చేయకుండా నాలుగడుగులు ముందుకు వేసి 'ఆయన' కూర్చున్న పద్ధతి పరిశీలించి చూసాడు అనిరుధ్.

అప్పుడొక తమాషా ఆలోచన తట్టింది అనిరుధ్ బుర్రకి.

చేతిలోని బూమరాంగ్ కింద పడేసి పచ్చికమీద కూర్చుండిపోయాడు. కొంచెం కష్టపడి 'ఆయన'కూర్చున్నట్టే'పద్మాసనం' వేసి, అరచేతులు రెండూ పొదులుగా వొళ్ళో పెట్టుకుని కూర్చున్నాడు. తన ముద్ర కుదిరిందని నిర్ధారణ చేసుకుని కళ్ళుమూసుకున్నాడు.

రెండు నిమిషాలు అలా కళ్ళు మూసుకుని కూర్చున్నాడో లేదో ఏవేవో ఆలోచనలు మనసుని గజిబిజి చేయసాగాయి... ఇంట్లో బెడ్‌రూం బీరువాలో డాడీ దాచిపెట్టుకున్న ఫొటో ఆల్బమ్‌లోని మమ్మీ ఫొటోలు

గుర్తొచ్చింది — దాంతోపాటున్న నల్ల డైరీ కూడా గుర్తొచ్చింది... ఎప్పుడు చూసినా డాడీ ఆ డైరీ చదువుకుంటూ ఉంటాడెందుకు? ఏముంది అందులో? అది మమ్మీ రాసిన డైరీ అని చెప్పాడు డాడీ ఒకసారి అడిగితే. డాడీకి తెలియకుండా రెండు మూడు సార్లు ఆ డైరీ చదవడానికి ప్రయత్నించాడు తను...సరిగ్గా అర్థంకాలేదు.

మమ్మీ బాగా ఏడిచేదని, ఎవరికో భయపడేదని మాత్రం అర్థమయింది.

మమ్మీ తనతో మాట్లాడుతున్నట్లు రాసింది చాలా చోట్లలో.

తను పుట్టకముందే ... తనేపుట్టబోతున్నట్టు ఎలా తెలిసిందో మమ్మీకి?

ఆలోచనలు ఎటో వెళ్ళిపోతుంటే అతికష్టంమీద వాటినించి బయటపడి కళ్ళు తెరచి చూసాడు అనిరుధ్.

ఎదురుగా 'ఆయన' అలాగే కూర్చుని ఉన్నాడు.

ఆయన లేస్తే బావుణ్ను...తనకేసి చూస్తే బావుణ్ను...

ఎందుకో 'ఆయన'తో మాట్లాడాలనిపిస్తోంది ... అసలెవరో ఆయన? తెలుసుకోవాలని ఉంది.

ఒక్కసారి ఆయన కళ్ళు తెరచి తనకేసి చూస్తే బావుంటుంది.

తనకేసి ఆయన కళ్లుతెరచి చూడాలని బలంగా కోరుకుంది అనిరుధ్ మనసు.

అలా కోరుకుంటే ఆయిన తనకేసి చూస్తాడని ఎందుకో అనిపించింది అనిరుధ్‌కి.

అంతలో దూరంనించి పవన్ పిలుపువినబడింది.

"బబ్లూ...బబ్లూ..."

డాడీ తనకోసం వెతుక్కుంటున్నాడు.

డాడీ తనని చూస్తే ఇక్కణ్నుంచి పిలుస్తాడనుకొని వెళ్ళిపోతాడు.

డాడీ వచ్చేలోగా ఏదైనా చేయాలి...అర్జెంటుగా.

'ఆయన' ఇంకా అలాగే ధ్యానముద్రలో ఉన్నాడు.

ఆయనకేసి తీవ్రంగా చూసాడు అనిరుధ్...

"బబ్లూ! బబ్లూ!" మళ్ళీ పవన్ పిలుపు

డాడీ వచ్చేస్తున్నాడు.

ఏం చేయాలిపుడు?

మరింత తీవ్రంగా చూడసాగాడు అనిరుధ్...

అలా చూస్తుంటే—

అనుకోనివిధంగా...ఒక అద్భుతం జరిగింది!

అనిరుధ్ కళ్ళలోంచి బయల్దేరి మెరుపుతీగలు రెండు స్పురున వెళ్ళి ధ్యానముద్రలో కూర్చున్న వ్యక్తిని చుట్టుముట్టాయి.

అంతే!

ధ్యానంలో లీనమయి కూర్చుని ఉన్న ఆయన ఎవరో బలంగా తట్టినట్టు ఉలిక్కిపడిలేచి నిలబడ్డాడు!

పదిగజాల దూరంలో పద్మాసనం వేసుకుని తనని కన్నార్పకుండా చూస్తున్న ఏడేళ్ళ కుర్రవాడిని అపనమ్మకంగా చూసాడు ఆ వ్యక్తి!?

## 26

అనిరుధ్ స్కూల్‌గేటు దగ్గర కారాపి లోపలికి నడిచాడు పవన్.

స్కూలు ప్రిన్సిపాల్ గది తలుపు దగ్గర ఆగి

"మే ఐ కమ్ ఇన్" అడిగాడు పవన్.

స్టడీటేబిల్ దగ్గర కూర్చుని చేస్తున్నపని ఆపి లేచాడు బ్రదర్ జోన్స్.

"కమ్ ఇన్ మిస్టర్ పవన్" అంటూ సాదరంగా కూర్చోబెట్టాడు.

"మీరు రాసిన ఉత్తరం అందింది..." అని ఆగిపోయాడు పవన్.

"ఇంట్లో మీ అబ్బాయికి ఏమయినా టెంషన్స్ ఉన్నాయా మిస్టర్ పవన్?"

చటుక్కున ప్రిన్సిపాల్ అడిగిన ఆ ప్రశ్న పవన్‌ని కలవరపెట్టింది. ఒక్కక్షణమాగి సమాధానం చెప్పాడు.

"నాకు తెలిసి ఏమీలేవు బ్రదర్ జోన్స్!...తల్లి లేదన్న ఒక్క లోటు తప్ప!...ఏడేళ్ళక్రితం గ్యాస్ ఆక్సిడెంటులో..."

అర్థమయినట్టు తలూపాడు ప్రిన్సిపాల్.

"దట్సిట్!...ఇదొక కారణం కావచ్చు...అనిరుధ్‌కి చదువులో శ్రద్ధ లేకపోవడానికి."

"అసలింతకీ ఏంచేసాడు మా అబ్బాయి?" అడిగాడు పవన్.

"నథింగ్ వెరీ సీరియస్..." అని మొదలుపెట్టి అనిరుధ్ గురించి వివరంగా చెప్పసాగాడు ప్రిన్సిపాల్ జోన్స్. స్కూల్‌గేటు దగ్గర రిక్షా దిగి లోపలికి రాకపోవడం...క్లాసులో పరధ్యానంగా ఉండటం...తన స్నేహితులు ఎవరితోనూ ఆడుకోకుండా ఒంటరిగా ఎటో వెళ్ళి కూర్చోవడం...అన్ని విషయాలు తనకు తెలిసినంతవరకూ చెప్పాడతను.

అంతా విని భారంగా నిట్టూర్చాడు పవన్.

"బ్రదర్ జోన్స్! మా వాడిలా ఎందుకు చేస్తున్నాడో నాకర్థం కావడంలేదు. ఇన్నాళ్ళూ వాడి చదువు బాగా సాగిపోతోందని నిశ్చింతగా ఉన్నాను. చదువుతోపాటు వాడి ప్రవర్తనకూడా..."

అంతలో గది తలుపు దగ్గర అలికిడి వినిపించడంతో ఆగిపోయాడు పవన్.

స్కూలు యూనిఫారంలో భుజానికి పుస్తకాల సంచి వేలాడేసుకుని నిలబడ్డాడు అనిరుధ్.

"కమ్ ఇన్ అనిరుధ్!" అంటూ ప్రేమగా లోపలికి పిలిచాడు ప్రిన్సిపాల్.

చిరునవ్వుతో లోపలికివచ్చి పవన్ కూర్చున్న కుర్చీపక్కన నిలబడ్డాడు అనిరుధ్.

"హెల్లో డాడీ!" అన్నాడు మామూలుగా ప్రిన్సిపాల్ గదిలో తండ్రినిచూసి ఏ మాత్రం కంగారు పడలేదు. ఎంతో నార్మల్‌గా ఉన్నాడు అనిరుధ్.

"స్కూల్ సరిగ్గా అటెండు చేయడంలేదట!...అప్పుడప్పుడు గేటు దగ్గర రిక్షాదిగి ఎటో వెళ్ళిపోతున్నావట ఏమిటి బబ్లూ ఇదంతా ఎక్కడికి వెళ్తున్నావు? అసహనంగా అడిగాడు పవన్.

"టాంక్‌బండ్‌కి డాడీ..." అన్నాడు అనిరుధ్ నెమ్మదిగా.

ఆశ్చర్యంగా చూసాడు పవన్.

"అక్కడ కూర్చుంటే...నాకు బావుంటుంది..." అన్నాడు అనిరుధ్ మళ్ళీ.

ఏమనాలో అర్థంకాక కూర్చుండిపోయాడు పవన్.

బ్రదర్ జోన్స్ లేచివచ్చి అనిరుధ్ భుజాలచుట్టూ చెయివేసి నిలబడ్డాడు.

"అనిరుధ్ మై బాయ్! టాంక్‌బండ్‌కి వెళ్ళాలంటే మీ డాడీని అడిగితే తీసుకెళ్తారుకదా! ఇలా స్కూల్లోకి రాకుండా వెళ్ళడం తప్పుకదూ"

ప్రిన్సిపాల్‌కేసి చూస్తూ తలూపాడు అనిరుధ్.

"ఇకమీదట రెగ్యులర్‌గా స్కూల్‌కి వస్తావుకదూ?..."

మళ్ళీ తలూపాడు అనిరుధ్.

"క్లాస్‌లో నీ గ్రేడ్స్‌కూడా తగ్గిపోతున్నాయి. పాఠాలు అర్థం కావడంలేదా?"

"అర్థమవుతున్నాయి సర్!" అన్నాడు అనిరుధ్.

"మరి టెస్టుల్లో మార్కులు రావడంలేదెందుకూ? ఏదీ ఇంగ్లీషులో పోయెమ్ ఏదయినా చెప్పు..." అడిగాడు ప్రిన్సిపాల్.

అతనికేసి అదోలాచూసి మౌనంగా ఉండిపోయాడు అనిరుధ్.

"కమాన్ మై బాయ్!...పోనీ టేబిల్స్ వచ్చా? ఫోర్ టేబిల్ చెప్పు"

ఈసారికూడా సమాధానం చెప్పలేదు అనిరుధ్.

మరోక్షణం అనిరుధ్ సమాధానం కోసం ఎదురుచూసి అన్నాడు బ్రదర్ జోన్స్.

"అనిరుధ్...నువ్వు కాసేపు ఆ టేబిల్‌దగ్గర కూర్చో...నేను మీ డాడీతో కొంచెం మాట్లాడాలి"

నెమ్మదిగా అక్కడ్నించి కదిలి స్టడీ టేబిల్‌దగ్గరకెళ్ళి నిలబడ్డాడు అనిరుధ్.

"సీ మిస్టర్ పవన్...ఇలా చేస్తాడు మీ అబ్బాయి. క్లాస్ టీచర్లు కూడా ఇదే కంప్లైంట్ ఇస్తున్నారు. అబ్బాయి బుర్రలో ఏమయినా టెంషన్స్‌ఉంటే అవి పోయేట్టు మీరే చేయకలరు. ఇలా వొదిలేస్తే మాత్రం చాలా ప్రమాదం."

ప్రిన్సిపాల్ మాటలు వింటూ అనిరుధ్ నిలబడ్డవైపుకి దృష్టి సారించాడు పవన్. టేబిల్ మీదకు వొంగి నిలబడి ఏదో చేస్తున్నాడు అనిరుధ్.

నెమ్మదిగా లేచివెళ్ళి అనిరుధ్ వెనక నిలబడ్డాడు పవన్.

టేబిల్ మీదున్న కాలిక్యులేటర్‌తో ఆడుకుంటూ కాగితాలమీద ప్రిన్సిపాల్ పెన్నుతో ఏదో రాస్తున్నాడు అనిరుధ్

"అనిరుధ్!"

ఆ అరుపుకి ఉలిక్కిపడి తండ్రికేసి తలెత్తి చూసాడు అనిరుధ్.

"అవన్నీ ముట్టుకుంటావెందుకూ పెట్టేయ్!" అన్నాడు పవన్ కోపంగా.

చేతిలోని ఎలక్ట్రానిక్ కాలిక్యులేటర్ పెట్టేసి పక్కకు జరిగాడు అనిరుధ్.

"ఐయామ్ సారీ బ్రదర్ జోన్స్! మీ కాగితాలు పాడుచేసినట్టుంది మావాడు..." అన్నాడు పవన్.

"దట్స్ ఆల్ రైట్!" అన్నాడు జోన్స్.

"ఇక నేను వెళ్తానండీ...స్కూలు వొదిలిపెట్టినట్టున్నారు మా వాడినికూడా తీసుకెళ్తాను" అన్నాడు పవన్.

"ష్యూర్!...నేను చెప్పింది మాత్రం గుర్తుపెట్టుకోండి" అని వాళ్ళని సాగనంపాడు బ్రదర్ జోన్స్.

అనిరుధ్ చెయి పట్టుకుని పవన్ గదిలోంచి వెళ్ళాక తన స్టడీ టేబిల్ కేసి వెళ్ళాడతను.

అంతకుముందు అక్కడ కూర్చుని స్కూలు బిల్డింగ్ ఫండ్‌కి అందిన డబ్బుల లెక్కలేవో వేసుకుంటున్నాడతను. ఆ కాగితంమీదే అనిరుధ్ ఏదో రాసినట్టుంది.

ఆ కాగితం చింపేయబోయి ఆగిపోయాడు బ్రదర్ జోన్స్.

తనంతకముందు చేస్తున్న కాలిక్యులేషన్ దానిమీద పూర్తిచేసి ఉంది!

అపనమ్మకంగా ఎలక్ట్రానిక్ కాలిక్యులేటర్‌తో లెక్కవేసి చూసాడ

తను.

కరెక్ట్!

కాగితంమీద అనిరుధ్ వేసిన అంకెలుకూడా అవే!!

• • •

కారు స్టార్ట్‌చేసి ముందుకి పోనిచ్చాడు పవన్.

కిటికీలోంచి బయటకు చూస్తూ కూర్చున్నాడు అనిరుధ్. రివ్వున వీస్తున్న గాలికి జుట్టుమొహంమీద పడ్తున్నా ఖాతరు చేయకుండా ఆలోచనల్లో పడిపోయాడు.

డాడీకి తనమీద చాలాకోపంవచ్చి ఉండాలి! ప్రిన్సిపాల్ అడిగినపుడు టేబిల్స్ చెప్పలేకపోయినందుకు బాధపడ్తున్నాడు డాడీ! కానీ ఏం చేసేది? లెక్కల్లో వర్డ్ ప్రాబ్లమ్స్ చేయకలిగిన తనని ఫోర్ టేబిల్ అప్ప చెప్పమంటే చికాకనిపించదా? తనకు లెక్కలు బాగావచ్చని చెప్పడానికే ప్రిన్సిపాల్ కాలిక్యులేటర్ మీద లెక్కలు వేసాడు తను. కానీ డాడీకి కోపంగా ఉందని ఏమీ చెప్పలేదు!...

డాడీని ఎలాగయినా ఇంప్రెస్ చేయాలి.

డాడీ కళ్ళు గర్వంగా మెరుస్తుంటే తనకెంతో బావుంటుంది.

కానీ ఎలా?

కారు సడన్‌గా ఆగడంతో ఆలోచనల్లోంచి బయటపడ్డాడు అనిరుధ్.

కిటికీలోంచి అటూ ఇటూ చూసాడు అనిరుధ్.

ఒక పెద్ద హోటల్ ఆవరణలో ఆగిఉంది కారు.

"బబ్లూ! కాసేపు ఇక్కడే కూర్చుంటావా? అయిదు నిమిషాల్లో వచ్చేస్తాను?" అంటూ కారు దిగాడు పవన్.

"చాలా టైం పడ్తుందా డాడీ?" అడిగాడు అనిరుధ్.

"అయిదే నిమిషాలు. రిసెప్షన్‌లో ఒక మెస్సేజి ఇచ్చివచ్చేయాలి అంతే!" అన్నాడు పవన్ చిరునవ్వుతో.

తండ్రికి తనమీద కోపం తగ్గిందని గమనించి ఆనందంగా తలూపాడు అనిరుధ్.

రిసెప్షన్ కౌంటర్‌కేసి గబగబ నడిచాడు పవన్.

"ఢిల్లీ నించి మల్హోత్రగారు వచ్చారండీ?" అడిగాడు అక్కడ నిలబడ్డ రిసెప్షనిస్టుని.

రిజిస్టర్ చూసి తలూపింది రిసెప్షనిస్టు.

"లేదండీ ఇంకా రాలేదు సాయంత్రం ఫ్లైట్ కి వస్తారేమో!..." అందామె.

"ఐసీ!...ఆయన వచ్చాక నన్ను కాంటాక్ట్ చేయమంటారా?" అంటూ తన విజిటింగ్ కార్డు తీసి ఆమెకిచ్చి వెనక్కి తిరిగాడు పవన్.

పోర్టికోలో కారాపిన చోటుకి నడవబోయి ఆగిపోయాడతను.

కారక్కడలేదు!

క్రోటన్ కుండీల పక్కనించి నెమ్మదిగా ముందుకెళ్తోంది కారు!

ఓ గాడ్!

న్యూట్రల్ గేరులో ఉంచేసాడాతను!? స్లోప్ గా ఉండటంతో ముందుకి వెళ్ళిపోతోందా!!? కారులో బబ్లూ ఉన్నాడు!...కారు దేనికయినా గుద్దుకుందంటే బబ్లూకి దెబ్బలు తగుల్తాయి.

ఒక్క ఉదుటున ముందుకి పరుగుతీసాడు పవన్.

కానీ...

అతడు కారు దగ్గరకి చేరేలోగా—

కారువేగం పుంజుకుంది!

ఎక్సాస్ట్ సైప్ లోంచి పొగవొదుల్తూ వేగంగా గేటుకేసి వెళ్ళిపోతోంది.

కారు మలుపు తిరుగుతుంటే కనిపించాడు అనిరుధ్...డ్రైవరు సీటులో!

అనిరుధ్ కారు స్టార్ట్ చేసుకుని వెళ్ళిపోతున్నాడు!

ఒక్కక్షణం పరిస్థితి అర్ధంకాక ఆగిపోయాడు పవన్.

అపుడు గుర్తుకొచ్చిందతనికి తాళాలు కారులోనే వొదిలిపెట్టి దిగాడని.

కారు స్టార్టు చేయడమేకాదు! కారు గేరులోవేసి ముందుకి పోనిస్తున్నాడు అనిరుధ్!

"బబ్లూ!...స్టాప్ ఇట్" అని పిచ్చిగా అరుస్తూ కారువెంట పరుగెత్తాడు పవన్.

కారు ఆగలేదు!...

గేటు దాటి మెయిన్‌రోడ్డుమీదకు వెళ్ళింది.

"బబ్లూ!...బబ్లూ!" గొంతు చించుకుని అరిచాడు పవన్ మళ్ళీ.

అంతలో ఒకతను మోటర్ సైకిల్ మీద అట్నుంచి వచ్చి—

"వాట్ హ్యాపెన్డ్...కన్ ఐ హెల్ప్‌యూ?" అని అడిగాడు.

"ప్లీజ్...ఆ కారుని ఫాలో అవ్వండి..." అని అతడి సమాధానం కోసం ఎదురు చూడకుండా మోటర్ సైకిల్ ఎక్కికూర్చున్నాడు పవన్.

పెద్దమోత చేసుకుంటూ కారు వెళ్ళినవైపుకి బయల్దేరింది మోటార్ సైకిల్.

అప్పటికే మోజమ్ జాహీ మార్కెట్‌కేసి వెళ్ళిపోతోంది మారుతీ కారు!

అంత కంగారులో ఏం చేయాలో పాలుపోవడంలేదు పవన్‌కి.

అనిరుధ్ కారు ఎలా స్టార్టు చేసాడో...ఎలా నడిపేస్తున్నాడో ఆలోచించే పరిస్థితిలో లేడతను...అంత వేగంగా వెళ్తున్నకారు ఆక్సిడెంట్ అయితే ఏమవుతుందో ఊహించుకుని పూర్తిగా అప్సెట్ అయిపోతున్నాడు.

"ప్లీజ్...ఫాస్ట్‌గా పోనివ్వండి..." అన్నాడు మోటర్‌సైకిల్ అతడ్ని.

థ్రాటిల్ పూర్తిగా తిప్పేసి మరింతవేగంగా ముందుకినడిపాడుతను.

మార్కెట్ దగ్గర ట్రాఫిక్ సిగ్నల్ ఎరుపుకి మారగానే సడన్ బ్రేక్‌తో ఆగింది మారుతీకారు.

మోటర్ సైకిల్‌దిగి కారుకేసి గబగబ వెళ్ళబోయాడు పవన్. కానీ మధ్యలో ఆటో రిక్షాలు, స్కూటర్లు అడ్డురావడంతో కొంత ఆలస్యం అయింది.

ఎలాగో కారు దగ్గరకు చేరుకుని...

"బబ్లూ...ఏమిటిది...ఇంజన్ ఆఫ్‌చెయి అన్నాడు పవన్.

పకపక నవ్వేసాడు అనిరుధ్!

అతడి మాటలు పట్టించుకునే పరిస్థితిలో లేడు...

"డాడీ...నాకు డ్రైవింగ్ వచ్చేసింది." అన్నాడు.

అంతలో సిగ్నల్ మారడంతో మళ్ళీ కారు ముందుకి పోనిచ్చాడు అనిరుధ్.

"నో...బబ్లూ..." అని బిగ్గరగా అరచి గత్యంతరంలేక మళ్ళీ మోటర్ సైకిల్ దగ్గరకి వచ్చాడు పవన్.

పోలీస్‌స్టేషన్ దగ్గర నిలబడి ఇదంతా గమనిస్తున్న ట్రాఫిక్ ఇన్స్‌పెక్టర్ ఒకతను తన మోటర్ సైకిల్ స్టార్టుచేసి అనిరుధ్ వెళ్తున్న కారుని వెంబడించాడు.

మారుతీకారు ఎడమవైపు మలుపు తిరిగి ఆబిడ్స్ వైపుకి వేగంగా సాగిపోయింది.

ఇన్స్‌పెక్టర్ ఎన్నిసార్లు విజిల్ వేసినా అనిరుధ్ ఆపలేదు.

కారు పక్కనించి మోటర్ సైకిల్ పోనిస్తూ ఆపమని సైగచేస్తున్నాడు ఇన్స్‌స్పెక్టర్. అయినా ఆపలేదు అనిరుధ్.

నాంపల్లి మీదుగా పబ్లిక్‌గార్డన్స్‌వరకు ఇలాగే సాగింది...పబ్లిక్ గార్డన్స్‌లో కారు తిప్పి ఒక చెట్టుకింద కారాపాడు అనిరుధ్ చివరికి.

కారు డోర్ తీసి కిందకి దిగిన ఏడేళ్ళ అనిరుధ్‌కేసి విచిత్రంగా చూస్తూ నిలబడ్డాడు ఇన్స్‌పెక్టర్...

అంతలో మోటర్‌సైకిల్‌మీద ఫాలో అయిన పవన్‌కూడా అక్కడికి వచ్చి చేరాడు.

"సారీ...సారీ ఇన్స్‌పెక్టర్...మా అబ్బాయి...పొరపాటున కారు స్టార్టు అయినట్టుంది—" అని ఏదో చెప్పబోయాడు పవన్.

అతడికేసి అదోలా చూసాడు ఇన్స్‌పెక్టర్.

"పొరపాటున కారు స్టార్టుచేసాడంటారేమిటి ఇంత బిజీ ట్రాఫిక్‌లో చేజ్ చేస్తేకాని ఆపలేదు? ఇంత చిన్న కుర్రాడికి కారు డ్రైవింగ్ నేర్పుతారా? అసలు పొరపాటు మీది—"అన్నాడు ఇన్స్‌పెక్టర్.

"లేదు ఇన్స్‌పెక్టర్...బిలీవ్‌మీ... ఇంతకు ముందెపుడూ మావాడు కారు నడపలేదు... బై మిస్‌టేక్ జరిగిందిది..."

అతడి మాటలు నమ్మనట్టు తలూపాడు ఇన్స్‌పెక్టర్.

"పెద్ద ఎక్స్‌పర్టులా నడిపేస్తుంటే ఏమిటండీ మీ మాటలు?" అంటూ చలాన్ పుస్తకంతీసి ఆలోచనలో పడిపోయాడతను.

"ఈ కుర్రాడికి ఫైన్ ఏమని వేయాలో అర్థంకావడంలేదు." అని చలాన్ పుస్తకం మళ్ళీ జేబులో పెట్టుకున్నాడు.

మోటర్‌సైకిల్ స్టార్టుచేసి అనిరుధ్‌కేసి నవ్వుతూ చూసాడు ఇన్స్‌పెక్టర్.

"నీ పేరేమిటి బాబూ?" అడిగాడు.

జవాబిచ్చాడు అనిరుద్.

"ఇకమీదట ఇలా చేయకు...ఓ.కే?" అన్నాడు మోటర్‌సైకిల్ వెనక్కి తిప్పుతూ.

"ఓ.కే. అంకుల్...!" అన్నాడు అనిరుద్‌కూడా నవ్వుతూ.

ఇన్స్పెక్టర్ వెళ్ళాక పవన్‌ని మోటర్‌సైకిల్‌మీద తెచ్చిన వ్యక్తి అన్నాడు.

"మీ అబ్బాయి చాలా ఎక్స్ట్రార్డినరీ అండీ!...కానీ జాగ్రత్తగా ఉండాలి."

"థాంక్సండీ...మీరు సమయానికి వచ్చారు" అన్నాడు పవన్ అతడు బయల్దేరివెళ్తుంటే...

అనిరుధ్ వచ్చి పవన్ చెయిపట్టుకున్నాడు.

"డాడీ!...నేను కారు బాగా నడిపాను కదూ?" అడిగాడు నవ్వుతూ.

చెంపమీద ఛెళ్ళుమని దెబ్బవేసాడు పవన్.

## 27

ఖాళీ కాఫీ కప్పు సెంటర్ టేబిల్‌మీదపెట్టి లేచినిలబడింది డాక్టర్ సుస్మిత.

"ఇక నేను వెళ్ళొస్తాను ఆంటీ"

"అదేమిటమ్మా అప్పుడే వెళ్ళిపోతానంటావు? ఇపుడేకదా వచ్చావు!" అంది రాజేశ్వరిదేవి సోఫాలోంచి లేస్తూ.

"లేదాంటీ...క్లినిక్‌కి వెళ్ళే టైం అవుతోంది" అంది సుస్మిత చేతి గడియారంకేసి చూసుకుంటూ.

అంతవరకూ తన గదిలో ఆడుకుంటున్న అనిరుధ్ సుస్మిత బయల్దేర్తుండటం చూసి పరుగున వచ్చాడు—

"అప్పుడే వెళ్ళొద్దు ప్లీజ్!" అన్నాడు ఆమె చెయిపట్టుకుని.

"ఇప్పటికే బాగా లేటయింది బాబూ!" అంది సుస్మిత నవ్వుతూ.

"నాకదంతా తెలియదు! నాతో చెస్ ఆడతానన్నావు...పద నా రూంలోకి!" అంటూ ఆమె చెయిపట్టుకుని లాగాడు అనిరుధ్.

"అమ్మో! ఇప్పుడా!...మరోసారి తీరిగ్గా వచ్చి కూర్చుంటాను" అనిరుధ్ తల నిమురుతూ చెప్పింది సుస్మిత.

"ఒరేయ్! ఆంటీకి నీతో కూర్చుని ఆడుకోవడంతప్ప మరొక పని లేదనుకుంటున్నావా? స్కూలు ఎగ్గొట్టి ఇంట్లో కూర్చోవడమేకాక ఏమిటి అల్లరి?" అని కోప్పడింది రాజేశ్వరిదేవి ముందుకివస్తూ.

"ఇవాళ స్కూల్‌కి సెలవని చెప్పానా?" అన్నాడు అనిరుధ్ చికాగ్గా మొహం పెట్టుకుని.

"స్కూలు ఉన్నపుడు మాత్రం ఎపుడు వెళ్తావుగనుక" ఎత్తి పొడుపుగా అంది రాజేశ్వరిదేవి.

ఆ మాటలు పట్టించుకోకుండా సుస్మితకేసి తిరిగాడు అనిరుధ్.

"ప్లీస్—మరో అయిదు నిమిషాలు కూర్చో ఆంటీ...జస్ట్ ఫైవ్ మినిట్స్"

అనిరుధ్ బుగ్గ చిన్నగా గిల్లి నవ్వేసింది సుస్మిత.

"ఎందుకట?"

"డాడీ వచ్చేస్తాడుకదా ఇపుడు!"

అనిరుద్ మాటలు విని కొంచెం ఆశ్చర్యంగా రాజేశ్వరిదేవికేసి చూసింది సుస్మిత.

"పవన్‌గారు అపుడే వచ్చేస్తారా?" అడిగింది.

తల అడ్డంగా తిప్పింది రాజేశ్వరిదేవి.

"ఇంత త్వరగానా! సాయంత్రం ఆరు దాటితేకాని రాడు...ఏడు

ప్రతీది ఇలాగే మాట్లాడాడు"

అనిరుద్ మళ్ళీ సుస్మిత చెయిపట్టుకుని లాగాడు—

"ప్లీజ్! నాకోసం అయిదు నిమిషాలు..."

తన స్నేహితురాలి బిడ్డకేసి లాలనగా చూసింది సుస్మిత.

అవేకళ్ళు!...

ఆత్మీయత ఒలకబోస్తున్నట్టుండే ఆ కళ్ళలోకి చూస్తుంటే...స్నిగ్ధను చూస్తున్నట్టుగానే ఉంటుంది.

"సరేపద – కాసేపు నీ గదిలో కూర్చుని వెళ్తాను" అంది సుస్మిత.

ఆనందంగా ఆమెను తన గదిలోకి తీసుకెళ్ళాడు అనిరుధ్.

నీటుగా సర్దిన ఆ గదిని కలయచూసింది సుస్మిత. ఒకవైపు బుక్ షెల్ఫ్‌లో స్కూలు పుస్తకాలు, కామిక్స్...మరోవైపు బట్టలస్టాండు మీద ఒక పద్ధతిగా వేలాడేసిన స్కూలు యూనిఫారాలు...చూడముచ్చటగా ఉందా గది!...సాధారణంగా చిన్నపిల్లలు చేసే గజిబిజి ఎక్కడా కనిపించలేదు ఆమెకు.

ఆ ఈడుపిల్లలు ఆడే ఆట వస్తువులుకూడా లేవు ఆ గదిలో.

"చాలా బావుందే నీ గది!...ఎవరు సర్దారు? బామ్మగారా!" అడిగింది సుస్మిత మెచ్చుకోలుగా.

"కాదు...నేనే సర్దుకుంటుంటాను..." అన్నాడు అనిరుధ్.

చిరునవ్వుతో అనిరుద్ భుజంచుట్టూ చెయివేసి వెళ్ళి మంచంమీద కూర్చుంది సుస్మిత. అపుడు కంట కనబడిందామెకు మంచంపక్కన గోడకివేలాడేసిన స్నిగ్ధ ఫొటో.

కాసేపు ఆ ఫొటోకేసి ఆర్తిగాచూస్తూ ఉండిపోయింది సుస్మిత.

"అరె! ఈ ఫొటో ఇంతకు ముందెపుడు ఇక్కడ చూడలేదే!" అందామె తేరుకుంటూ.

"డాడీని అడిగి తెచ్చుకున్నాను ఆంటీ...! పొద్దున లేవగానే మమ్మీ మొహం కనపడితే నాకెంతో బావుంటుంది!..." అని ఒక్కక్షణమాగాడు అనిరుధ్.

అనిరుధ్ మనసులోని ఆలోచనలు అర్థంచేసుకొనడానికి ఇంత

కంటే మంచి అవకాశం ఉండదనిపించింది సుస్మితకి. అనిరుద్‌ని దగ్గరకు తీసుకుని తలనిమురుతూ నెమ్మదిగా మాటలు పెంచింది.

సైకియాట్రిస్టుగా తనక్కావలసిన సమాచారం కొంత దొరికాక లేచినిలబడింది సుస్మిత.

"అనిరుద్ బాబూ! ఇకనేను వెళ్ళనా?" అడిగింది గడియారంకేసి చూసుకుంటూ.

"నేనడిగిన అయిదు నిమిషాలింకా పూర్తికాలేదు ఆంటీ! మరో అర నిమిషం ఉంది" అన్నాడు అనిరుద్ నవ్వుతూ.

'నీతో లాభంలేదు!' అన్నట్టుగా నవ్వేసి తల అడ్డంగా తిప్పింది సుస్మిత.

అంతలోనే డోర్ బెల్ మోగింది!

హాయిగా నవ్వేసాడు అనిరుద్.

"డాడీ వచ్చేసారు!" అంటూ తలుపుకేసి పరుగెత్తాడు.

సుస్మితకూడా అతడ్ని అనుసరించి డ్రాయింగ్ రూంలోకి నడిచింది.

అనిరుద్‌ని దాటుకుంటూ అప్పుడే లోపలికి వస్తున్నాడు పవన్.

"అరె...మీరెపుడు వచ్చారు?" అడిగాడతను సుస్మితను గమనించి.

"అరగంటయిందండీ...వెళ్ళిపోతుంటే మీరు వచ్చేస్తారుండమని ఆపేసాడు అనిరుద్!" అంది సుస్మిత.

ఆశ్చర్యంగా అనిరుద్‌కేసి చూసాడు పవన్.

"ఇవాళ నువ్వు త్వరగా వచ్చేస్తావనిపించింది డాడీ అందుకే ఆంటీని కాసేపు ఆగమన్నాను" అన్నాడు అనిరుద్ నెమ్మదిగా.

అంతలో రాజేశ్వరిదేవి అక్కడికి వచ్చింది.

"ఏమిట్రాకన్నా ఒంట్లో బాగాలేదా? అప్పుడే వచ్చేసావు?" అంది కంగారుగా

"ఏంలేదమ్మా! చిన్నపనొకటి తగిలింది అందుకే త్వరగా వచ్చేసాను" అన్నాడు పవన్.

"ఇక నేను బయల్దేరతానండీ!" అని రాజేశ్వరీదేవి దగ్గర సెలవు

తీసుకుంది సుస్మిత.

ఆమెను సాగనంపడానికి పవన్ కూడా లిఫ్ట్‌కేసి కదిలాడు.

......

పార్కింగ్ ప్లేస్‌లో తనకారుకేసి నడుస్తూ అంతవరకూ తను అనిరుధ్‌తో మాట్లాడిన విషయాలు క్లుప్తంగా చెప్పింది సుస్మిత.

"...తల్లి గురించి వివరంగా తెలుసుకోవాలనే ఆరాటం కనిపిస్తోంది అనిరుధ్‌లో! జరిగిన విషయాలు ఫ్రాంక్‌గా చెప్పటంలేదా మీరు!" అడిగిందామె.

"వివరంగా ఎలా చెప్తాను?...వాడి వయసెంతని?"

ఆ సమాధానం విని నవ్వేసింది సుస్మిత.

"ఫిసికల్ ఏజ్ గురించి చెప్తున్నారు మీరు! అనిరుధ్ మెంటల్ ఏజ్ పన్నెండేళ్ళు ఉంటుందని నా అంచనా. మీరు ఆ మధ్య అనిరుధ్ చేసిన అడ్వెంచర్స్ గురించి చెప్తుంటే వాడు 'చైల్డ్ ప్రాడిజీ' అనిపిస్తోంది? చిన్నవయసులోనే పెద్దవాళ్ళకుండవలసిన తెలివితేటలు సామర్థ్యం, ఉంటాయి ఇలాంటి పిల్లలకు!"

"మావాడిని మరీ ఆకాశానికెత్తేస్తున్నారు. తెలివితేటలున్నాయి కానీ జీనియస్‌కాడు వాడు."

"ఏది ఏమయినా అనిరుధ్‌ని మరీ చిన్నపిల్లవాడిలా ట్రీట్ చేయడం సబబుగాలేదు. ఎదిగిన పిల్లలతో మాట్లాడుతున్నట్లు ఫ్రాంక్‌గా మాట్లాడితేనే అనిరుధ్ కూడామనసువిప్పి మాట్లాడ్తాడు...అపుడు టాంక్‌బండ్‌దగ్గర ఒంటరిగా కూర్చుని తల్లిగురించి ఆలోచించవలసిన అవసరం ఉండదు వాడికి!" అని కారెక్కి కూర్చుంది సుస్మిత.

"సరే ప్రయత్నిస్తాను..." అన్నాడు పవన్.

సుస్మిత కారు స్టార్టు చేసుకుని వెళ్ళాక వెనక్కి తిరిగి లిఫ్ట్‌కేసి నడిచాడు పవన్.

ఫ్లాట్‌లోకి వెళ్ళాక రాజేశ్వరితో చెప్పాడు.

"జూబ్లీహిల్స్ ఇల్లు కొంటానంటూ గుంటూరునించి ఒకాయన వచ్చి కలిసాడమ్మా. ఇల్లు ఇవాళ చూపిస్తానన్నాను."

"అయితే ఆ ఇల్లు అమ్మేయాలనే నిశ్చయించుకున్నావా?" అడిగింది రాజేశ్వరిదేవి.

"తప్పదమ్మా!...ఇంకెన్నాళ్ళు అలా ఖాళీగా పడేసి ఉంచుతాం? మనం వెళ్ళి అక్కడుండే ప్రసక్తి ఎలాగూ లేదు!" అన్నాడు.

"సరే...కానీ..." అంది రాజేశ్వరిదేవి బరువుగా నిట్టూరుస్తూ.

పవన్ డ్రెస్ మార్చుకుని బయల్దేరుతుంటే అనిరుధ్ తనుకూడా వస్తానని తయారయ్యాడు!

కొంచెం ఆలోచించి సరేనన్నాడు పవన్

ఆ ఇల్లు చూస్తానని చాలా రోజులబట్టే అడుగుతున్నాడు అనిరుధ్

త్వరలో అమ్మేయాలనుకుంటున్న ఆఇంటికి అనిరుధ్‌ని తీసుకెళ్తే తప్పేముంది? డాక్టర్ సుస్మిత చెప్పినదాంట్లో మంచి పాయింటే ఉంది కదా!

ఇకమీదట అనిరుధ్ దగ్గర ఏదీ దాచకుండా నెమ్మదిగా అన్ని సంగతులూ చెప్పాలి! వాడ్ని చిన్నపిల్లవాడ్ని చూసినట్టు చూడకూడదు!

......

......

ఏడేళ్ళక్రితం పవన్ ఖాళీచేసిన ఆ ఇల్లు ఇప్పుడు గుర్తుపట్టేటుగా లేదు.

ఒకప్పుడు కాంపౌండ్‌లో మెత్తటి లాన్స్ చుట్టూ అందమయిన పూలమొక్కలతో ఎంతో ఆహ్లాదంగా ఉండేది. ఇప్పుడు అస్తవ్యస్తంగా పెరిగిపోతున్న పొదలతోనూ చెత్తా-చెదారంతోనూ ఎంతో ఉదాసీనంగా ఉందక్కడి వాతావరణం.

రంగు వెలసిన గోడలమీద దట్టంగా పెరిగిన నాచు...తుప్పపట్టిపోతున్న వీధితలుపు...ఇదంతా చూస్తుంటే ఆ ఇంటిని పూర్తిగా నిర్లక్ష్యం చేసినట్టు తెలుస్తోంది.

ఆ ఇల్లు ఖాళీచేసి వచ్చేసినా దాన్నంతగా గాలికి ధూళికి వొదిలేయాలని అనుకోలేదు పవన్. ఇల్లు ఎవరికయినా అద్దెకివ్వాలని నిశ్చయించుకుని తగలబడిపోయిన వంటింటిని రిపేర్ చేయించి 'టులెట్' బోర్డు పెట్టిం

చాడు.

కొన్నాళ్ళకే కేరళకి చెందిన బిజినెస్‌మాన్ ఒకతను తన ఫ్యామిలీతో ఆ ఇంట్లో దిగాడు...

కానీ వారం తిరక్కుండానే మరో ఇల్లు చూచుకున్నాం అంటూ ఇల్లు ఖాళీచేసి వెళ్ళిపోయారు వాళ్ళు!?

ఆ తర్వాత బ్యాంక్ ఆఫీసరు ఒకాయన ఇల్లు అద్దెకు తీసుకున్నాడు ఒకనెల హాయిగా గడిపాక అతడి భార్యకు ఉన్నట్టుండి జబ్బుచేసింది ఆ జబ్బు చాలా రోజులవరకూ అలాగే కొనసాగి...చివరికి మతిస్థిమితం తప్పిందామెకు।

వాళ్లుకూడా ఇల్లు ఖాళీచేసి వెళ్ళిపోయారు.

అప్పట్నించి...ఆ ఇంట్లో అద్దెకు దిగుతామని ఎవరూ ముందుకి రాలేదు.

......

గేటు ముందు కారాపి కిందికి దిగాడు పవన్.

అనిరుధ్ కూడా కారు దిగాక గేటు గడియతీసాడతను.

క్రిరుమని శబ్దంచేస్తూ తెరచుకుంది।

వాళ్ళిద్దరూ కాంపౌండ్‌లోకి అడుగుపెట్టగానే...అంతవరకూ ముళ్ళ కంపలో గోల పెడ్తున్న కీచురాళ్ళు ఠక్కున ఆగిపోయాయి.

అటూ ఇటూ చూస్తూ నెమ్మదిగా తండ్రినిఅనుసరించాడు అనిరుధ్.

వీధితలుపు తాళంతీసి తలుపుతోసాడు పవన్.

వెంటనే తెరచుకోలేదు.

కొంత బలం ఉపయోగించి తోసాడు మళ్ళీ—

బరువుగా తెరచుకుంది తలుపు.

చాలా రోజులబట్టి కిటికీలు, తలుపులు వేసి ఉంచడంవల్ల కాబోలు ఆదోలాంటి వాసనగా ఉందక్కడ.

"ఇదే బబ్లూ...మనిల్లు।" అంటూ లోపలికి నడిచాడు పవన్.

ఖాళీగాఉన్న ఆ ఇంటిని కలయచూస్తూ నెమ్మదిగా తండ్రిని అనుసరించాడు అనిరుధ్.

మంచువా మధ్యన ఆగిపోయి బెడ్‌రూం తలుపుకేసి కన్నార్పకుండా చూస్తూ నిలబడిపోయాడు.

"ఏంబబ్లూ ఏం చూస్తున్నావ్?" అడిగాడు పవన్.

"ఏం...ఏంలేదు'' తల తిప్పుకుంటూ అన్నాడు అనిరుధ్.

"ఇక్కడే ఉండేవాళ్ళం మనం...అది మా బెడ్‌రూం అది బామ్మ గది..." అంటూ అక్కడే నిలబడిచూపించాడు పవన్.

ఆ ఇంట్లోకి రాగానే అనిరుధ్ ప్రశ్నల పరంపర ప్రారంభమవుతుందని అనుకున్నాడు పవన్...కానీ ఏదో ఆలోచనలో పడిపోయినట్టు మౌనంగా ఉన్నాడు.

అంతలో ఏదో ఆలోచనవచ్చి అన్నాడు పవన్.

"బబ్లూ బయటకి వెళ్దాం పద'' అంటూ అనిరుధ్ చెయి పట్టుకుని బయటకి కదిలాడు.

అయిష్టంగానే నడిచాడు అనిరుధ్.

బబ్లూ...ఇల్లు చూడ్డానికి వస్తానన్న పెద్దమనిషి ఇంతవరకూ రాలేదు. నేను ఎదురింట్లోంచి ఒక ఫోన్‌చేసి వస్తాను.... అంతవరకూ ఇక్కడే నిలబడు..." అని కారు పక్కన అనిరుద్‌ని నిలబెట్టి ముందుకి వెళ్ళాడు పవన్.

కొంతదూరం నడిచి ఒక్కక్షణం ఆగి అనిరుద్‌కేసి చూసాడు పవన్.

"అల్లరి చేయకుండా ఇక్కడే నిలబడతావుకదూ? మళ్ళీ కారు స్టార్టు చేయకు-" అన్నాడు నవ్వుతూ.

చేయనన్నట్టు తలూపి...తండ్రి వెళ్తున్నవైపు కాసేపు చూస్తూ నిలబడ్డాడు అనిరుద్.

ఆ తర్వాత మళ్ళీ ఇంటికేసి చూసాడు అనిరుధ్.

ఈ ఇంట్లోనే మమ్మీ ఉండేది...

ఎన్నాళ్ళబట్టో డాడీని అడుగుతుంటే ఇవాళ పిలుచుకుని వచ్చాడు.

ఆ ఇల్లు ఎవరికీ అమ్మకపోతే బావుణ్ణు...

మళ్ళీ ఆ ఇంట్లోకి వచ్చేయాలని డాడీ అనుకుంటే బావుణ్ణు!

మమ్మీతోకాకపోయినా...కనీసం మమ్మీ ఉన్న ఇంట్లోనైనా తనుండ వచ్చు।

ఆ ప్రయత్నంగా...గేటు తెరచి...ఇంటికేసి కదిలాడు అనిరుద్.

వీధి తలుపు తోసుకుని లోపలికి అడుగు పెడ్తుంటే అనిర్వచనీయ మయిన ఆలోచనలతో నిండిపోయింది అనిరుధ్ మనసు.

మండువాలో నిలబడి మమ్మీ బెడ్‌రూం తలుపుకేసి దృష్టి సారించాడు.

ఒక వైపునించి పట్టరాని ఆనందం...

మరో వైపునించి దుర్భరమయిన ఆవేదన....।

ఇంకో వైపునించి సన్నగా వొణికేట్టు చేస్తున్న బెదురు...వీటన్నిటి మధ్య కొట్టుకోసాగింది ఆ పసివాడి మనసు।

కాసేపు అలాగే నిలబడిపోయాడు...అంతలోనే...మంత్రముగ్ధుడిలా బెడ్‌రూంకేసి నెమ్మదిగా కదిలాడు అనిరుధ్।

ఆ గదికేసి కదుల్తుంటే అనిరుద్ మొహంమీద భావాలు మారిపోసాగాయి.

మొసైక్ ఫ్లోరింగ్‌మీద ఆ చిన్నవాడి అడుగుల చప్పుడుతప్ప ఎటువంటి అలికిడిలేదు ఇంట్లో... అంతా నిశ్శబ్దం।

అది మామూలు నిశ్శబ్దంలాలేదు.

...చాలామంది అదృశ్య ప్రేక్షకులు...ఊపిరి బిగపట్టి ఇపుడేమవుతు [illegible]సని చూస్తున్నట్టుగానూ... పెనుతుఫానుకి ముందు క్షణమాత్రం ప్రకృతి తటస్థంగా నిలిచిపోయినట్టుగా ఉంది.

ఒకొక్క అడుగు ముందుకివేసి బెడ్‌రూం తలుపు దగ్గరకు చేరుకున్నాడు అనిరుద్.

సందేహిస్తూ, దగ్గరకువేసి ఉన్న ఆ తలుపుమీద చెయివేసాడు.

అంతే।

ఛప్పున తెరుచుకున్నాయి ఆ తలుపులు.

అంతవరకూ లేనిది...ఉన్నట్టుండి హోరుగాలి ప్రారంభమయింది।

దాని ధాటికి తట్టుకోలేక అటూఇటూ ఊగిపోతూ గదిలోకి వెళ్ళిపడ్డాడు అనిరుద్।

గదిలో హోరుగాలి ఉధృతం మరింతగా ఉంది...ఊపిరి అందడం లేదు అనిరుద్‌కి।

అయినా తమాయించుకుంటూ నెమ్మదిగా తలెత్తి చూసాడు ఆ గది ఈశాన్యం మూలకేసి।

ఎవరో ఉన్నారు।...

ఆ మూలన ఎవరో ఉన్నారు...

కనిపించడం లేదుకానీ...ఎవరో ఉన్నారక్కడ।

ఆ చిన్నారి గుండె వేగంగా కొట్టుకోసాగింది.

"ఎవరు...ఎవరునువ్వు..." అడగాలనుకున్నాడు కానీ...మాట పెదవి దాటలేదు...

అప్పుడు కనిపించింది అనిరుద్‌కి...

అస్పష్టంగా కదులుతున్న ఆకారమొకటి...

అంత పొడవయిన వ్యక్తిని ఎన్నడూ చూడలేదు తను।

ఎవరది?

ఎందుకో ఆ ఆకారాన్ని చూస్తుంటే కోపం వచ్చింది అనిరుద్‌కి....

"ఎవరునువ్వు..." అడగబోయాడు మళ్ళీ...కానీ-ఈసారికూడా అడగలేకపోయాడు.

ఆకారం ముందుకి రాబోయి...కదల్లేక అక్కడే నిలబడిపోయింది. దాని మొహం మరింత వికృతంగా మారింది.

అంతలోనే ముందుకి వొంగి అనిరుద్‌కి సలాములు చేయసాగింది ఆ ఆకారం.

నిశ్చేష్టుడయి దానికేసి చూడసాగాడు అనిరుద్.

సలాములు చేయడం ఆపి ఏడుపు అందుకుంది ఆకారం।...పెద్దగా ఏడుస్తున్నట్టు కనిపిస్తున్నా దాని పెదాలనించి ఎటువంటి శబ్దం వెలువడటంలేదు.

దాని అవస్థచూసి అనిరుద్ మనసులోని కోపం మాయమయింది. జాలిగా దానికేసి చూసాడు...

'నన్ను రక్షిస్తావా...' అని ప్రాధేయపడుతున్నట్టు చూసిందది.

కరుణా భావంతో నిండిపోయింది అనిరుద్ మనసు.

పాపం...అతనెవరో తన సహాయం కోర్తున్నాడు.

రక్షించమంటున్నాడు...కానీ...ఎలా? అర్థంకాలేదు అనిరుద్‌కి.

"రక్షిస్తాను...ఏం చేయాలి?" అడగ కలిగాడు.

ఆ మాట వినగానే ఆనందంగా తలెత్తి చూసిందా ఆకారం.

"నిజంగానా?" అడిగిందది పెదాలు కదపకుండానే.

వంకరగా నవ్వి అనిరుద్‌ని తన దగ్గరకు రమ్మని పిలిచింది...

ఏ మాత్రం సందేహించకుండా ముందుకి నడిచాడు అనిరుద్.

## 28

ఎదురింట్లోకి ఫోను చేయడానికి వెళ్ళిన పవన్ ఫోను సంభాషణ ముగించుకుని బయటకి వచ్చాడు.

కారు దగ్గర అనిరుద్ కనబడలేదు.

కారులోపల పడుకున్నాడా?...

గబగబ నడచివెళ్ళి కారులోకి తొంగిచూసాడు పవన్.

లేదు...

ఎక్కడికివెళ్ళి ఉంటాడు?

నిర్మానుష్యంగా ఉన్న ఆ వీధిలో ఒకసారి అటూఇటూ చూసాక తట్టింది పవన్‌కి...అనిరుధ్ ఇంట్లోకి వెళ్ళిఉండవచ్చని.

ఆలస్యం చేయకుండా గేటు తోసుకుని లోపలికి నడిచాడు.

"బబ్లూ!" పిలిచాడు బిగ్గరగా, ఇంట్లోకి అడుగుపెడ్తూ మండువా దగ్గరకానీ హాల్లోకానీ అనిరుద్ కనబడక మళ్ళీ పిలిచాడు.

"బబ్లూ! ఎక్కడున్నావ్?"

అతడి అరుపు ఖాళీ ఇంట్లో విచిత్రంగా ప్రతిధ్వనించింది.

అంతలో కిర్రుమని తలుపు శబ్దమయి బెడ్‌రూంకేసి తలతిప్పాడు పవన్. అంతవరకూ ఓరగా తెరచిఉన్న బెడ్‌రూం తలుపులు పవన్ చూస్తుండగానే దభేలున మూసుకున్నాయి.

అనిరుద్ తనని కంగారు పెట్టడానికి గదిలోకివెళ్ళి దాక్కుని ఉంటాడనిపించింది పవన్‌కి. అనిరుద్ ఇలా అల్లరి చేయడం నచ్చలేదు పవన్‌కి.

"బబ్లూ ఏమిటిది? బయటకి రా!" అంటూ గది దగ్గరకెళ్ళి తలుపు తోసాడు.

తలుపులు తెరచుకోలేదు లోపల్నించి గడియ వేసినట్టుంది.

పవన్‌కి చికాకు ఎక్కువయింది. దబదబ తలుపులమీద బాదేసాడు.

"బబ్లూ! తలుపు తెరుస్తావాలేదా నువ్వు లోపలదాక్కున్నావని నాకు తెలిసిపోయింది...ఓపెన్ ఆప్ క్విక్" అరిచాడు కోపంగా.

లోపల్నించి జవాబు చెప్పలేదు అనిరుద్.

కానీ...తలుపు దగ్గరగా నిలబడ్డ పవన్‌కి లోపల్నించి అలికిడి లాంటిది వినిపించింది ... లోపల ఎవరితోనో గుసగుసలాడ్తున్నాడు అనిరుద్.

అనిరుద్‌కాక—మరెవరున్నారు లోపల?

"ఎవరూలోపల?" బిగ్గరగా అరిచాడు పవన్.

గదిలోపల అలికిడి ఠక్కున నిలిచిపోయింది.

ఇక లాభం లేదనుకుని నాలుగు అడుగులు వెనక్కివేసి పరుగున బెడ్‌రూం తలుపుమీద వెళ్ళిపడ్డాడు పవన్. ఆ ధాటికి తట్టుకోలేక గడియ విరగడంతో తలుపులు తెరచుకుని పవన్ లోపలికెళ్ళిపడ్డాడు...తమాయించుకుని లేచి నిలబడుతూ చుట్టూచూసాడు పవన్.

ముని చీకట్లు అలుముకుంటున్న ఆ గదిలో అనిరుద్ ఒంటరిగా నిలబడి ఉన్నాడు.

కానీ...అనిరుద్ తనకేసి తిరగలేదు.

తలుపులు విరగగొట్టి తను లోపలికి వచ్చినా ఏ మాత్రం ఉలిక్కిపాటులేకుండా ఏమిటలా నిలబడి ఉన్నాడు అనిరుద్.

ఆ మూలకేసి ఏమిటి చూస్తున్నాడు?

ఏం కనిపిస్తోందక్కడ?...

"బబ్లూ!" మృదువుగా పిలిచి చూసాడు పవన్.

అనిరుధ్ కదలకపోయేసరికి కంగారుగా ముందుకెళ్ళాడు—

భుజంమీద చెయి వెయ్యబోతుండగా నెమ్మదిగా వెనక్కి తిరిగి పవన్‌కేసి సూటిగా చూసాడు అనిరుధ్...

అద్దిరిపడి మూడడుగులు వెనక్కి వేసాడు పవన్।

ఏమయింది? ఏమయిపోయింది అనిరుధ్‌కి।

సున్నంపూత పూసినట్టు తెల్లగాపాలిపోయి ఉంది అనిరుధ్ మొహం దానికితోడు—

నిక్కపొడచినజుట్టు...తీక్షణంగా తనకేసే చూస్తున్న కళ్ళు।

అసలిది అనిరుద్దేనా? లేక...

మసక వెలుతురులో తనకళ్లు సరిగ్గా కనబడటంలేదా?

నెమ్మదిగా అనిరుధ్‌కేసి కదిలివెళ్ళి "బబ్లూ।...ఏమయిందినాన్నా?" అంటూ ముందుకి ఒంగాడు పవన్—

అంతే—।

అంతవరకూ నిశ్చలంగా నిలబడ్డ అనిరుధ్ పళ్ళు పటపటలాడిస్తూ తండ్రిమీదకు ఒక్కగెంతు గెంతాడు.

అరచేతులు రెండు పులిపంజాల్లా పెట్టి పవన్ మొహాన్ని గీరేసాడు। వెనక్కి తగ్గబోతున్న పవన్ మెడను చుట్టి పట్టుకుని అతడితోపాటు లేచి ఛాతీమీద మెడమీద పిచ్చిగా గీరేసాడు.

ఏమవుతోందో అర్థంకాని పరిస్థితిలో—చిన్నపిల్లాదని కూడా చూసుకోకుండా అనిరుధ్‌ని బలంగా విదిలించి కొట్టాడు పవన్.

దాంతో పట్టుసడలి కిందకు జారాడు అనిరుధ్.

అంతటితో ఆపకుండా...

అనాలోచితంగా చెంపలమీద గట్టిగా రెండుదెబ్బలు వేసాడుపవన్-మరో దెబ్బకూడా వేయబోతుండగా...

అంతవరకూ నోట్నుంచి ఒక్క పలుకయినా లేని అనిరుధ్ "అమ్మా..." అంటూ కిందకు ఒరిగిపోయాడు...।

దుమ్ముపట్టిన నేలమీద పడిపోయిన అనిరుధ్‌కేసి బ్లాంక్‌గా చూస్తూ నిలబడిపోయాడు పవన్‌కాసేపు...

జరిగిందేమిటో అర్థంచేసుకోవడానికి ప్రయత్నిస్తూ ముందుకు వొంగి అనిరుధ్ భుజంపట్టి నెమ్మదిగా తనకేసి తిప్పుకున్నాడతను—

"బబ్లూ।..బబ్లూ" ఆత్రుతగా పిలిచాడు.

స్పృహతప్పాడు అనిరుద్.

ఓ గాడ్. ఎంతపనిచేసాడతను. అమానుషంగా తను కొట్టిన దెబ్బ లకు తట్టుకోలేక పోయింది పసిప్రాణం.

అనిరుధ్‌ని మరోసారి పిలిచిచూసాడు.

బరువుగా ఊపిరిపీల్చుకుంటూ పడున్న అనిరుధ్‌లో ఎటువంటి స్పందన లేదు....

తన కొడుకు మొహంలోకి పరిశీలనగా చూసాడు పవన్. కొన్ని క్షణాల క్రితం తనకు కనబడిన వికృతి లక్షణాలు ఏవీలేవు.

ఎప్పటిలా ప్రశాంతంగానేఉంది అనిరుద్ మొహం.

తనే పొరబడ్డాడా? ఏమో?!

అనిరుద్‌ని వెంటనే డాక్టరుకి చూపించడం అవసరం అనుకుంటూ వాడిని ఎత్తుకుని లేచాడు పవన్.

గదిలోంచి బయటకి నడవబోతూ గుమ్మందగ్గర ఒక్క క్షణం ఆగి ఈశాన్యం మూలకేసి తిరిగి చూసాడు పవన్.

అక్కడేమీ కనబడడంలేదుకానీ...ఎందుకోపవన్‌మనసుక్రోధంతో వికలమయింది.

• • •

జూబ్లీహిల్స్ ఇంట్లో అనిరుద్...ఖబీస్‌తో మంతనాలు జరుపుతు న్నపుడు...

ఎప్పటిలా పచ్చికమీద పద్మాసనం వేసుకొని ధ్యానంలో ఉన్నాడు ఆయన...

కానీ...ఆరోజు ఎందుకో ధ్యానం కుదరడంలేదు ఆయనకి. విచిత్ర మైన ఆలోచనలు ఏవో పైకితేలి వస్తున్నాయి.

మాటిమాటికి ముఖారవిందమొకటి మనసులో మెదలి కలవరపెట్టే స్తోంది.

చటుక్కున కళ్లుతెరచి చూసాడాయన—

సూర్యుడ స్తమించి పబ్లిక్ గార్డెన్‌లో చీకట్లు అలుముకుంటున్నాయి. కానీ వాడిజాడలేదు.

ఏమయింది?

ఇవాళకూడా ఎందుకు రాలేదు?

ఎందుకో వాడిని వెంటనే చూడాలనిపిస్తోందాయనకి. ఇలా చటుక్కున మనసులో మెదిలే ఆలోచనలకు ఎంతో ప్రాముఖ్యం ఇస్తాడాయన.

చూడాలి...చూడాలి...వెంటనే చూడాలి!

అసహనంగా లేచి నిలబడి పచ్చికలోనే అటూ ఇటూ పచార్లు చేయసాగాడు ఆయన.

ఆ క్రూరాడిని చూడాలనిపించడం సరే...

కానీ ఎలా?

వాడు ఎక్కడుంటాడో!

ఈ జంటనగరాల్లోవాడి ఇల్లు ఎక్కడుందో.

పచార్లు చేయడం ఆపేసి టక్కున నిలబడిపోయాడు ఆయన

వాడెక్కడున్నాడో తెలుసుకోవడానికి ఒకే ఒక మార్గం ఉంది... ఈరాత్రికి అలా ప్రయత్నించి చూడాలి.

ప్రయత్నే ఫలే.

......

ఉదయం అయిదున్నరకి మెలకువ వచ్చింది పవన్‌కి...

బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంటూ క్రితంరాత్రి అనిరుధ్‌ని పడుకోబెట్టిన మంచంకేసి చూసాడు.

మంచంమీద అనిరుధ్ లేకపోవడం చూసి కంగారుగాలేచి బెడ్‌రూంలోంచి బయటకి నడిచాడు పవన్.

హాలుపక్కన అనిరుధ్ కోసం ప్రత్యేకంగా ఏర్పాటుచేసిన గది తలుపుతోసుకొని లోపలికెళ్ళాడు...కిటికీదగ్గర కుర్చీలో కూర్చుని బయటకు తొంగి చూస్తున్నాడు అనిరుధ్.

"బబ్లూ అపుడే నిద్రలేచావా? ఇంకాసేపు నిద్రపోలేకపోయావా?" అంటూ అనిరుధ్ పక్కన వెళ్ళి నిలబడ్డాడు పవన్.

"నాకిపుడు బాగానేఉంది డాడీ. అన్నాడు అనిరుధ్ హుషారుగా.

కొడుకుకేసి పరిశీలనగా చూసాడు పవన్.

నిజమే...అనిరుద్ నార్మల్‌గానే ఉన్నట్టున్నాడు మరి క్రితంరోజు సాయంత్రం జరిగిన సంఘటన గురించి ఏమనుకోవాలి? జూబ్లీహిల్స్ ఇంట్లో స్పృహతప్పి పడిపోవడం తోనే కదా డాక్టర్ దగ్గరకి తీసుకెళ్ళ వలసివచ్చింది? డాక్టరు పరీక్షచేస్తున్నపుడే కళ్ళు తెరచి మామూలుగా మాట్లాడసాగాడు అనిరుద్. డాక్టరు పరీక్షపూర్తిచేసి అనిరుద్‌కి అంతా నార్మల్‌గానే ఉందని తేల్చిచెప్పాడు.

అనిరుద్ మామూలుగానే ఉన్నట్టున్నాడు కాబట్టి అడిగాడు పవన్.

"బబ్లూ...నిన్న సాయంత్రం ఎందుకలా చేసావు? అక్కడేం కనిపించింది నీకు?"

వెంటనే జవాబు చెప్పకుండా చూపులు తిప్పుకున్నాడు అనిరుద్.

"ఏంలేదు...డాడీ" అన్నాడు అస్పష్టంగా.

"బబ్లూ...డాడీ దగ్గరేదీ దాచకూడదు..." అంటూ అనిరుద్‌ని దగ్గరికి తీసుకున్నాడు పవన్.

"అక్కడ...ఆ గదిలో సన్నగా పొడుగ్గా ఒకతను ఉన్నాడుడాడీ అపుడు మనం సర్కస్‌లో చూసామే అంతకంటే పొడుగ్గా ఉన్నాడు... పాపం అతడ్ని ఎవరో అక్కడ బందించేసారట." అన్నాడు అనిరుద్ ఉత్సాహం పుంజుకుంటూ.

ఏమనాలో అర్థంకాలేదు పవన్‌కి.

"బబ్లూ అక్కడ ఎవరూలేరు. ఉంటే నాకు కనిపించరా?" అని ఏదో చెప్పబోయాడు.

కానీ అనిరుద్ తల అడ్డంగా తిప్పాడు...

"నిజంగానే ఉన్నాడు డాడీ...అతనిపేరు ఖబీస్. మమ్మీకి కూడా కనిపించేవాడు కదా." అన్నాడు.

ఉలిక్కిపడ్డాడు పవన్.

"...నీకెవరు చెప్పారు?"

"ఎవరూ చెప్పలేదు...మమ్మీ డైరీలో చదివాను."

అనిరుధ్ అన్న మాటలకి మతిపోయినట్టయింది పవన్‌కి.

స్నిగ్ధ డైరీ చదివినందుకు కొప్పడాలనిపించింది

కానీ అది సరిఅయిన పద్ధతికాదు। కోప్పడితే అనిరుధ్ ఇక మనసు విప్పిమాట్లాడడు.

స్నిగ్ధ డైరీ చదివి ఏవో ఊహించుకుంటూ తనుకూడా స్నిగ్ధలా తయారయిపోతాడా?

అంతలో డోర్ బెల్ మోగడంతో ఆలోచనల్లోంచి తేరుకుని తలుపు తెరవడానికి వెళ్ళాడు పవన్.

తలుపు తెరచి ఎదురుగా నిలబడ్డ అపరిచితుడికేసి చూసాడు పవన్.

"ఎస్?...ఎవరు కావాలండీ?" అడిగాడు.

"మీతోటే పనుండి వచ్చాను"

"మీరూ?..." ఆగాడు పవన్.

"నన్ను మీరు గుర్తు పట్టినట్టులేదు...మిమ్మల్ని చాలాసార్లు పబ్లిక్ గార్డన్‌లో చూసాను నేను...మీ బాబుతో అక్కడికి వస్తుంటారు కదూ?" అడిగాడా వ్యక్తి.

అవునన్నట్టు తలూపి ఆ వ్యక్తికేసి పరిశీలనగా చూసాడు పవన్... దాదాపు తనంత పొడవుంటాడు...నెరసిన జుట్టు, చురుగ్గా మెరిసే కళ్ళు. మంచి సంస్కారం ఉన్నవాడిలాగానే ఉన్నాడు.

పవన్ భుజాలమీదుగా ఇంట్లోకి చూస్తూ అడిగాడు ఆ వ్యక్తి మళ్ళీ.

"మీ బాబు ఇంట్లోనే ఉన్నాడా?"

ఆ వ్యక్తి అనిరుధ్‌ని చూడ్డానికే వచ్చాడని అర్ధమయిపోయింది పవన్‌కి.

"రండి...లోపల కూర్చుని మాట్లాడుకుందాం।" అంటూ పక్కకి జరిగి దారిచ్చాడు.

డ్రాయింగ్‌రూం సోఫాలో కూర్చున్నాక ఇల్లంతా ఆత్రుతగా కలయచూస్తూ అడిగాడా వ్యక్తి.

"ప్లీజ్...మీ బాబుని ఒకసారి పిలిపిస్తారా?"

"ఏం? ఎందుకూ" నిర్మొహమాటంగా అడిగాడు పవన్.

"చెప్తాను...కానీ ముందు మీ బాబుని ఒకసారి చూడాలి నేను" అన్నాడావ్యక్తి.

పవన్ పిలవకుండానే అక్కడికి వచ్చాడు అనిరుధ్.

అనిరుధ్‌ని చూడగానే ఎంతో రిలీఫ్ ఫీలయినవాడిలా నవ్వేసి తన దగ్గరకు పిలిచాడు ఆ వ్యక్తి.

"నీపేరేమిటి బాబూ" అడిగాడతను అనిరుధ్ వచ్చి కూర్చున్నాక జవాబిచ్చాడు అనిరుధ్.

"నిన్న సాయంత్రం ఏమయింది? ఏదయినా ఇబ్బంది ఎదుర్కొన్నావా?" అడిగాడా విచిత్రమయిన వ్యక్తి.

ఊహించని ఆ ప్రశ్న విని చటుక్కున తలెత్తి చూసాడు పవన్.

"మీరు ఇలా ఎందుకు అడుగుతున్నారో నాకర్థం కావడంలేదు" అన్నాడు పవన్.

కాసేపు మౌనంగా ఉండిపోయి జవాబు చెప్పాడా వ్యక్తి.

"ఐయామ్ సారీ! నేను మరీ ఫాస్టుగా మాట్లాడేస్తూ మిమ్మల్ని కంగారు పెట్టేస్తున్నాను. కానీ నన్ను నమ్మండి!...నేను మీ శ్రేయోభిలాషినే...ప్లీజ్ చెప్పండి...నిన్న సాయంత్రం ఏం జరిగింది?" ఈసారి ఆ ప్రశ్న పవన్‌నే అడిగాడు.

గబగబ మాట్లాడేస్తున్న ఆ మనిషిని గురించి ఒక నిర్దిష్టమయిన అభిప్రాయానికి రాలేకపోతున్నాడు పవన్.

"అసలు మీరు...?" అడిగాడతను.

అదేదో అర్థంపర్థంలేని ప్రశ్న అన్నట్టు అసహనంగా తల విదిలించాడా వ్యక్తి.

"నేను ఇంతకుముందు యూనివర్సిటీ ఆఫ్ కాలిఫోర్నియాలో ప్రొఫెసర్‌గా పనిచేసేవాడిని. కొన్నాళ్ళబట్టి ఇండియాలోనే ఉంటూ స్వతంత్రంగా పారాసైకాలజీలో పరిశోధనలు జరుపుతున్నాను" అన్నాడు.

అతడికేసి గౌరవ భావంతో చూసాడు పవన్.

"అలాగా!?"

"ఇపుడయినా చెప్తారా? నిన్న సాయంత్రం ఏం జరిగిందో!" పవన్ ఆలోచనలో పడ్డాడు. ఈ వ్యక్తికి క్రితంరోజు సాయంత్రం జరిగిన సంఘటన గురించి ఎలాగో తెలిసింది. అతనెందుకు ఆరా తీస్తున్నాడో

తెలుసుకోవాలంటే కొంతవరకూ అతడితో సహకరిస్తూ మాట్లాడక తప్పదు.

"నిన్న సాయంత్రం అనిరుధ్ కళ్ళు తిరిగి పడిపోయాడండీ కానీ దీని గురించి మీకెలా తెలిసిందో నాకర్థం కావడంలేదు" అంటూ ఆగాడు పవన్.

ఆ వ్యక్తి తల అడ్డంగా తిప్పాడు.

"కాదు...నిన్న సాయంత్రం అనిరుధ్ ఏదో అసాధారణమయిన పరిస్థితిని ఎదుర్కొని ఉండాలి."

అతడి ధోరణి చూస్తుంటే పవన్‌లో చికాకు ఎక్కువవుతోంది. అయినా పైకి మామూలుగా మాట్లాడాడు.

"అంత ఖచ్చితంగా ఎలా చెప్తున్నారు?"

పవన్‌కేసి సూటిగా చూస్తూ జవాబిచ్చాడతను.

"అనుకోకుండా...నాకూ మీ బాబుకి టెలీపతీ కనెక్షన్ ఏర్పడింది కాబట్టి!"

అప్రయత్నంగా నవ్వేసాడు పవన్.

టెలీపతి మీరు నమ్మరా? మీ బాబులో ఇ.ఎస్.పి. చాలా హైలెవెల్‌లో ఉన్నట్టుందే? ఎప్పుడూ గమనించలేదా?" అడిగాడతను

"లేదండీ...మా వాడిలో అలాంటి శక్తులేవీలేవు!...హీ ఈజ్ ఎ నార్మల్ బాయ్!" అన్నాడు పవన్ ముక్తసరిగా.

పవన్ ధోరణి గమనించి లేవబోయాడా వ్యక్తి.

"సరే...ఇకనేను బయల్దేరతాను" అన్నాడతను.

"ఇంతకీ మీరు వచ్చినపనేమిటో చెప్పనేలేదు!" అడిగాడు పవన్.

"చెప్పానుకదా! ఈ చిరంజీవి క్షేమసమాచారం కనుక్కోడానికి వచ్చాను...ఎందుకో నిన్నట్నించి నా ఆలోచనలన్నీ ఈ బాబు గురించే! ఉండబట్టలేక వచ్చేసాను!" అన్నాడతను.

"మా ఇంటి అడ్రస్సు అనిరుధ్ చెప్పాడా మీకు?" అడిగాడు పవన్.

"లేదండీ...మీవాడితో నేనింతకు ముందెపుడూ మాట్లాడలేదు" అన్నాడతను.

అతనికేసి ఆశ్చర్యంగా చూసాడు పవన్.

"మరి?"

"మీ చిరునామా ఎలా తెలుసుకున్నానో చెప్తే మీరు నమ్ముతారా?"

పవన్ నవ్వేసాడు.

"చెప్పిచూడండి. కన్విన్స్ అవుతానేమో."

"నిన్న సాయంత్రం అనిరుధ్ ఏదో ఆపదలో ఉన్నాడనిపించింది నాకు. వెంటనే వాడ్ని చూడాలనిపించింది. కానీ మీరెవరో...ఎక్కడుంటారో నాకు తెలియదు. అందుకే డౌసింగ్ చేసి కనుక్కున్నాను."

"డౌసింగ్ అంటే?" అడిగాడు పవన్.

జేబులోంచి మూరెడు దారానికి వేలాడేసిన ఒక చిన్న గుండుతీసి చూపించాడా ప్రొఫెసర్.

"ఏమిటిది?" పవన్ అడిగాడు.

"ఇ.ఎస్.పి. ప్రయోగానికి పనికొచ్చే ఒకచిన్న సాధనం... పెండ్యులమ్? నేనుమాత్రం దీన్ని ఆందోళిక అంటాను. దీంతోనే మీరిక్కడుంటారని పసిగట్టాను"

అతడికేసి పవన్ అపనమ్మకంగా చూస్తుంటే అనిరుధ్ ఎంతో కుతూహలంగా ముందుకి వచ్చి నిలబడ్డాడు.

ప్రొఫెసర్ తన జేబులోకి మళ్ళీ చెయిపెట్టి ఒక కాగితం బయటకి తీసాడు. దానిమడతలు విప్పి సెంటర్ టేబిల్ మీద పరిచాడు. అది జంట నగరాల మ్యాప్.

ఆ పటంమీద ఎర్రటి సిరాతో చిన్నచిన్న త్రికోణాలు కొన్ని వందలు గీసి ఉన్నాయి.

ప్రొఫెసర్ అంతకుముందు చూపెట్టిన ఆందోళికను ఎడంచేతి వేళ్ళతో పట్టుకుని కూచ్చున్నాడు...కింద వేలాడేస్తున్న గుండు అటూ ఇటూ ఊగుతోంది.

"మీరెక్కడుంటారో తెలుసుకోడానికి జంటనగరాల మ్యాప్ మీద ఇలాంటి త్రికోణాలు గీస్తూ" ఆ కుర్రాడు ఈ ప్రాంతంలో ఉంటాడా? అని ప్రశ్న వేయసాగాను. ప్రశ్న వేసాక ఆందోళిక వెనక్కి ముందుకి

ఊగితే సమాధానం అవును అని—మరోలా ఊగితే కాదని అర్థం...ఇలా ఎన్నో త్రికోణాలు వేసాక తెలిసింది...మీరు ఏ ప్రాంతంలో ఉంటారన్న విషయం!...ఆ తర్వాత అదే పరిస్థితితో మీరుండే సందు ఏదో కూడా కనుక్కోగలిగాను!" అని ముగించాడతను.

"గ్రేట్!...మీరింత పర్‌ఫెక్ట్‌గా మా అడ్రెస్ కనుక్కోగలిగా రంటే మిమ్మల్ని అభినందించక తప్పదు!" అన్నాడు పవన్ సిన్సియర్‌గా...

"ఇదేం అంత గొప్ప విషయం కాదండీ! ఎవరయినా ప్రయత్నించి చూడవచ్చు. నేను కొంత కృషిచేసి నా ఇ.ఎస్.పి ని అభివృద్ధి చేసుకున్న మాట నిజమే కానీ...మీవాడికి పుట్టుకతోనే ఇ.ఎస్.పి ఉంది." అని మొదలెట్టి...కొన్నాళ్ళక్రితం పబ్లిక్ గార్డెన్‌లో ధ్యానం చేస్తున్నపుడు అనిరుధ్ ఆలోచనా తరంగాలు తనని ఎలా కలవరపెట్టాయో చెప్పాడతను.

ఆ పొగడ్తలకి సంతోషించాలో ... బాధపడాలో అర్థంకాలేదు పవన్‌కి.

అనిరుధ్ గురించి తనకున్న అభిప్రాయం చెప్పాక మళ్ళీ అడిగాడు ప్రొఫెసర్...

"ఇకనైనా చెప్తారా? నిన్న జరిగిందేమిటో?"

తప్పనిసరి అనిపించి క్లుప్తంగా అన్ని విషయాలు చెప్పసాగాడు పవన్. స్నిగ్ధ గురించి కూడా కొంతవరకు చెప్పక తప్పలేదు.

"...ఇదంతా...మావాడు వాళ్ళ మమ్మీ డైరీ చదవడం వల్ల జరిగింది. ఆ ఇంట్లో ఏదో ఉందనే అభిప్రాయంతో వెళ్ళాడక్కడికి...ఏదో ఊహించుకుని జడుచుకుని ఉండాలి!" అని ముగించాడు.

"కావచ్చు అదే నిజమయితే చాలా మంచిది." అని అనిరుధ్‌కేసి తిరిగాడు ప్రొఫెసర్.

"అనిరుధ్! నిన్న నీకు ఆ గదిలో కనిపించిన ఆకారం ఎలాఉందో చెప్తావా?" అని అడిగాడు.

అనిరుధ్ ఆ ఆకారాన్ని వర్ణించాడు మళ్ళీ...

ఆ వర్ణన విని ప్రొఫెసర్ మొహం అదోలా అయిపోయింది

"ఖబీస్!...అనుమానంలేదు!..."అని తనలో తానేదోఅనుకుంటూ కూర్చున్నాడు.

అంతలోనే లేచి నిలబడి "ఇకనేను వెళ్తాను"అన్నాడు.

పవన్‌కి అతడి ప్రవర్తనలో వచ్చిన మార్పు బోధ పడలేదు... దీనంతటి గురించి మీ అభిప్రాయం ఏమిటో చెప్పనేలేదు...!" అన్నాడు.

"చెప్తాను!...నాకు తెలిసిన పద్ధతుల్లో మీ సమస్యలకి పరిష్కారం కూడా వెతుకుతాను! ఇవాళ సాయంత్రం బాబుతో మీరొకసారి పబ్లిక్ గార్డెన్స్‌కి రాగలరా!"

"ఇవాళ సాయంత్రమా?...నేను రాలేనేమో...! అన్నాడు పవన్.

"పోనీ అనిరుధ్‌ని పంపిస్తారా?..."

ఒక్కక్షణం ఆలోచించి సరేనన్నాడు పవన్.

అతడికేసి ఆనందంగా చూసాడు అనిరుధ్!

"సరే...ఇప్పటికే చాలా టైం తీసుకున్నాను..." అంటూ ఆ ప్రొఫెసర్ బయటకి నడవబోతుంటే ఆపాడు పవన్.

"మీ పేరు అడగనేలేదు..."

"ఆత్మారాం...మిత్రులు ఆత్మ అంటారు!..."అన్నాడతను.

ఆత్మకి షేక్‌హ్యాండ్ ఇస్తూ తన పేరు చెప్పబోయాడు పవన్.

"మీపేరు నాకు తెలుసు పవన్‌గారూ! మీ వృత్తి కూడా తెలుసు."

ఆత్మకేసి ఆశ్చర్యంగా చూసాడు పవన్.

"ఇదికూడా ఇ.ఎస్.పి. అంటారా? సిక్త్సెన్సా?"

"సిక్త్సెన్స్‌కాదు...కామన్‌సెన్స్" అని నవ్వుతూ తలుపు మీద మెరుస్తున్న పవన్ నేమ్‌ప్లేట్ చూపించాడు ఆత్మ.

పవన్‌కూడా హాయిగా నవ్వేసి అతడికి వీడ్కోలు చెప్పాడు...

• • •

......

ఆఫీసులో పని ఒత్తిడివల్ల ఆ రోజు ఇంటికి తిరిగి వచ్చేప్పటికి రాత్రి తొమ్మిదయింది పవన్‌కి—

తిన్నగా అనిరుధ్ గదిలోకి నడిచాడు.

సాయంత్రం పబ్లిక్ గార్డెన్స్‌లో ప్రొఫెసర్ ఆత్మ ఏమన్నాడో అనిరుధ్‌ని అడిగి తెలుసుకుందామనుకున్నాడు...కానీ అప్పటికే గాఢ నిద్రలో ఉన్నాడు అనిరుధ్...వాడికి భుజాలదాకా బ్లాంకెట్ కప్పి చప్పుడు చేయకుండా లైటార్పి బయటకు వెళ్ళిపోయాడు పవన్.

పవన్ గదిలోంచి బయటకు వెళ్ళాడో లేదో...

చటుక్కున లేచి కూర్చున్నాడు అనిరుధ్.

మర్నాడు తను చేయవలసిన అడ్వెంచర్ గురించే ఆలోచిస్తోంది ఆ పసివాడి మనసు.

తలగడాకింద తడిమిచూసుకున్నాడు.

పవన్ బీరువాలోంచి తీసిన జూబ్లీహిల్స్ ఇంటి తాళాలు భద్రంగా ఉన్నాయి.

ఖబీస్‌తో భేటికి మర్నాటి దాకా ఆగకతప్పదు.

## 29

జూబ్లీహిల్స్ ఇంటిగేటు దగ్గర భుజానికి స్కూలు బ్యాగ్ వేలాడేసుకుని నిలబడ్డాడు అనిరుధ్.

ఎండ చురుకుకి మొహం చిట్లించిసందు చివరిదాకాదృష్టి పోనిచ్చాడు.

ప్రొఫెసర్ అంకుల్ ఇంకా రాలేదేం?!

ఆయన చెప్పినట్టు తను స్కూలుకి వెళ్ళకుండా ఇక్కడికి వచ్చేసాడు. ఇంకెంతసేపు నిలబడాలి ఇక్కడ?...పోనీ తలుపు తాళం తీసి లోపలికి వెళ్తేనో?...

వొద్దు!...ప్రొఫెసర్ అంకుల్ అలా వెళ్ళొద్దన్నాడు.

ఖబీస్‌తో మాట్లాడాలంటే ప్రొఫెసర్ అంకుల్ వచ్చేవరకూ ఆగాలి తప్పదు...!

అంతలో సందుచివర...మలుపుదగ్గర కనబడింది పెద్దగా ఉన్న నల్ల కుక్క ఒకటి...

నిటారుగా బొమ్మలా నిలబడి అనిరుధ్‌కేసే చూస్తోంది లాబ్రడార్

జాతికిచెందిన ఆ వేటకుక్క.

నెమ్మదిగా ఆ కుక్క నిలబడ్డవైపుకి నడిచి వెళ్ళాడు అనిరుధ్...

నల్లకుక్క కదలకుండా అలాగే చూస్తూ నిలబడింది.

తనకేసి నిర్భయంగా వస్తున్న ఆకుర్రాడి ఉద్దేశం ఏమిటాఅన్నట్టు వాడి మొహంలోకే చూస్తోంది.

అనిరుధ్ బాగా దగ్గరకు వచ్చేసి— "హాయ్ నీ పేరేమిటి?" అని పలకరించగానే నెమ్మదిగా తన కుచ్చుతోక బరువుగా ఆడించింది.

అనిరుధ్ దాని వీపుమీద ప్రేమగా నిమురుతుంటే ఆనందం పట్ట లేక చేతులు నాకడం మొదలెట్టింది. రెండు కాళ్ళమీద లేచి నిలబడి అని రుధ్ భుజాలపైన ముందు కాళ్లుపెట్టి స్నేహాన్ని ప్రకటించింది.

ప్రొఫెసర్ అంకుల్ వచ్చేవరకూ ఈ కాలక్షేపం బాగానే ఉందని పించింది అనిరుధ్‌కి...

"దా...ఇంటి దగ్గరకెళ్ళి ఆడుకుందాం" అని దాన్ని ఆహ్వానిస్తూ ఇంటికేసి నడిచాడు.

అనిరుధ్‌ని అనుసరించబోయి ఆగిపోయింది ఆ వేటకుక్క.

ఏమయింది అన్నట్టు దానికేసి తిరిగిచూసి రమ్మని పిలిచాడు అనిరుధ్.

అయినా కదల్లేదది. తల పైకెత్తి గాలిలో ఏదో వాసన పసిగడ్తు న్నట్టు నిలబడిపోయింది—

మరోసారి పిలిచినా రాకపోయేసరికి వెనక్కివచ్చాడు అనిరుధ్. కుక్క వీపునిమిరి తనతో దాన్ని తీసుకెళ్ళడానికి ప్రయత్నించాడు. ఒక్క అడుగుకూడా ముందుకు వేయలేదది పైగా బిగుసుకుపోయింది.

కుక్క మెడకు కట్టిన బెల్టు పట్టుకుని దాన్ని ముందుకి లాగి చూసాడు అనిరుధ్. కళ్ళలో భయం చోటుచేసుకుంటుంటే అనిరుధ్ పట్టు నించి విడిపించుకోవడానికి తల విదిలించింది కుక్క.

అనిరుధ్‌కి ఏదో అర్థమయింది—చటుక్కున—

కుక్క మెడచుట్టూ చేతులువేసి దాన్ని దగ్గరకు లాక్కుని ముద్దు చేయసాగాడు.

"ఎందుకు భయపడ్తున్నావ్? నేనున్నానుకదా!" అన్నాడు

అనిరుద్ బుజ్జగింపుకే దానికి ధైర్యం వచ్చిందో మరేమోకాని తోకాడిస్తూ నెమ్మదిగా ముందుకి నడిచిందా కుక్క.

ఏడేళ్ళతర్వాత ఆ సందులోకి అడుగు పెడ్తోంది ఆ కుక్క.

ఇంటి గేటు దగ్గర నిలబడి కాసేపు దానితో ఆడుకున్నాడు అనిరుద్.

పది నిమిషాలయ్యాక మళ్ళీ ప్రొఫెసర్ ఆత్మ కోసం చూసాడు అనిరుద్.

కుక్కతో ఆట ఆపేసి నిలబడిపోయాడు.

ఇంతవరకూ రాలేదంటే ఇక రాడేమో ప్రొఫెసర్ అంకుల్.

ఆయనకోసం ఇంకెంతసేపు చూడాలి?

ఇంటికేసి తలతిప్పి చూసాడు అనిరుద్.

ఇక ఆలస్యం చేయకుండా ఇంట్లోకి వెళ్ళిపోవాలని బలంగా కోరుకుందతని మనసు.

గేటు తోసుకుని కాంపౌండులోకి నడుస్తూ వెనక్కి తిరిగిచూసాడు. అంతసేపు హాయిగా ఆడుకున్న కుక్క కాళ్ళమధ్య తోక ముడుచుకుని వెనక్కి తగ్గింది.

దాన్నికూడా లోపలికి పిలిచాడు అనిరుధ్. కానీ...ఎంతకీ రాకపోయేసరికి ఆ ప్రయత్నం మానేసి వీధి తలుపుకేసి నడిచాడు.

అనిరుధ్ తాళంవేసి ఇంట్లోకి అడుగుపెడ్తుంటే పెద్దగా ఏడ్చిందా కుక్క!...అక్కడ్నించి వెళ్ళిపోవాలనుకుని మళ్ళీ సంశయంలోపడి అక్కడే చతికిలబడిందది.

......

మండువాలో నిలబడి బెడ్‌రూం తలుపుకేసి చూసాడు అనిరుధ్.

ఆ గదిలోపలే ఖబీస్ ఉంది!...మమ్మీని భయపెట్టిన ఖబీస్!

తనకెందుకో ఖబీస్‌ని చూస్తే భయమనిపించలేదు. పాపం! ఇన్నేళ్ళబట్టి ఎవరో దాన్ని అక్కడ బంధించిపెట్టేసారు! ఎవరు చేసారో అలాగ? ఖబీస్ చేసిన తప్పేవిటి? అంత పొడవున్న ఖబీస్ తనని రక్షించమని

ప్రాధేయపడ్తుంటే ఎంత జాలి వేస్తోందో!

వికృతమయిన ఆ ఆకారంపట్ల మనస్సంతా కరుణతో నిండి పోతుంటే బెడ్‌రూంకేసి గబగబ నడిచాడు అనిరుధ్.

బెడ్‌రూం తలుపు తెరవబోతూ ఆగి వెనక్కి తిరిగి చూసాడు.

ఎవరో వంటింటి తలుపుదగ్గర నిలబడి తనకేసే ఆత్రుతగా చూస్తున్నట్టు క్షణమాత్రం అనిపించింది.

కానీ...అక్కడ ఎవరూ కనబడలేదు.

అడుగు ముందుకువేసి తలుపు తోసాడు అనిరుధ్.

ఉన్నట్టుండి హోరుగాలి ప్రారంభమయి అనిరుధ్‌ని చుట్టేసింది! అయితే, అలాంటిదేదో జరుగుతుందని ముందే ఊహించి ఉండటంవల్ల మునపటిలా కంగారు పడలేదు అనిరుధ్. గాలికి జుట్టంతా రేగిపోయి కళ్ళ మీద పడ్తుంటే చేత్తో దాన్ని వెనక్కి దువ్వుతూ నెమ్మదిగా గదిలోకి అడుగు పెట్టాడు.

ఎప్పటిలాగానే... ఈశాన్యంమూల నిలబడిఉంది ఖబీస్!

అనిరుధ్‌ని చూడగానే వంకర నవ్వొకటి నవ్వింది.

"నీ కోసమే ఎదురుచూస్తున్నాను! రా...కాలాతీతమవుతోంది!..." అంది పెదాలు కదపకుండానే.

"ప్రొఫెసర్ అంకుల్‌కోసం ఎదురుచూస్తున్నానింతసేపు" అన్నాడు అనిరుద్ గదిమధ్యన నిలబడి.

ఆ మాట వినగానే మరింత వికృతంగా మారింది ఖబీస్ మొహం.

"వాడా!...వాడు మనకు వొద్దు!...వాడి ఆలోచనలు మంచివి కావు..." అంది.

ప్రొఫెసర్ అంకుల్ గురించి ఖబీస్ అలా మాట్లాడటం నచ్చలేదు అనిరుద్‌కి.

"అంకుల్ మంచివాడు. నిన్ను ఎలా రక్షించాలో కూడా చెప్పాడు నాకు! తనుకూడా అందుకే వస్తానన్నాడు" అన్నాడు.

"నాటకాలు! వాడివి అన్నీ నాటకాలే...నన్ను వొదిలి పెట్టడం వాడికేమాత్రం ఇష్టంలేదు! నన్ను తన బానిసని చేసుకుందామనే ఈ

పన్నాగం" అంది ఖబీస్ కోపంగా.

"నువ్వలా మాట్లాడితే నేను వెళ్ళిపోతాను" అంటూ వెనక్కి తిరిగాడు అనిరుద్.

"వొద్దు...వొద్దు వెళ్ళొద్దు" గిలగిలలాడింది ఖబీస్.

అనిరుద్ ఆగకుండా తలుపుకేసి కదిలాడు.

కానీ...హోరుగాలి ఉధృతం ఎక్కువయి ఊపిరి సల్పక రెండడుగులు వెనక్కి వేసాడు। దానికితోడు దభేలున గది తలుపు మూసుకుంది. ఆ తలుపు తెరవడం సులభమయినపని కాదు.

ప్రొఫెసర్ అంకుల్ క్రితంరోజు ఇచ్చిన ఉపదేశం గుర్తుకొచ్చింది అనిరుద్‌కి.

ఖబీస్‌తో ఘర్షణ పెట్టుకుంటే ఇలాగే ఉంటుంది.

మనసు మార్చుకుని వెనక్కి తిరిగి అడిగాడు.

"సరే వెళ్ళను...ఏం చేయాలో చెప్పు।" ఇలా దగ్గరికి రా।..." అంది ఖబీస్ విచిత్రంగా మెరుస్తున్న కళ్ళు గుండ్రంగా తిప్పుతూ.

అనిరుద్ ముందుకి నడిచాడు కాని ఖబీస్ పరిధిలోకి కాలుపెట్టలేదు.

"అక్కడే నిలబడిపోయావేం। వచ్చి నా బంధాలు తెంచవా। నన్ని చెరనుండి బయటకు పోనివ్వవా?" అడిగింది ఖబీస్ దీనంగా.

అప్పుడు తీసాడు అనిరుద్ జేబులోంచి చిన్న సీసా ఒకటి.

"ఏమిటది?" అడిగింది ఖబీస్ భయంగా.

"భయపడకు ఖబీస్।...నిన్ను విడిపించేందుకు ఈ సీసాలో ఏదో పోసిచ్చాడు ప్రొఫెసర్ అంకుల్."

కోపంగా ఊగిపోయింది ఖబీస్.

"వాడికి మతిలేదు।...అయినా దాంతో మనకవసరంలేదు...నువ్వు నేను చెప్పినట్టు చేయి...నా దగ్గరకి రా." అని చేతులు చాచింది.

"వస్తాను।...కానీ ముందు అంకుల్ చెప్పిన పని చేయాలి" అంటూ సీసామూత తీసాడు అనిరుద్.

"ఆగు।...ఆ ద్రవం నామీద చల్లవద్దు।...ఒక్క చుక్కయినా నామీద పడితే నీకే నష్టం" బెదిరించింది ఖబీస్.

అనిరుద్ పట్టించుకోకుండా సీసాలోని ద్రవం కొంచెం అరచేతిలో పోసుకున్నాడు చేదుమందు తాగడానికి భయపడ్తున్న కుర్రాడికి ఎలా గయినా ఆ మందు తాగించాలనుకుంటున్న డాక్టర్‌లా ఉంది అనిరుద్ ధోరణి...ఖబీస్ వద్దంటున్నా ఆ పని ఖబీస్ మంచికోసమే చేస్తున్నాడతను.

"నా మాట వినవా?...నేనంటే ఖాతరు లేదా నీకు? భయంలేదా?" అడిగింది ఖబీస్ మళ్ళీ.

ఆ ఉద్దండ రూపంకేసి పరిశీలనగా చూసాడు అనిరుద్.

లేదు - అదంటే తనకు భయంలేదు।

మమ్మీని భయపెట్టిందని కోపంకూడాలేదు.

జాలిగా ఉందంతే.

నెమ్మదిగా చెయి పైకెత్తాడు అనిరుధ్.

"వొద్దు।...అంతపని చేయకు. నన్ను వొదిలేయి...నాకు నీ సహాయం అవసరంలేదు." అని గింజుకోసాగింది ఖబీస్.

అనిరుధ్ దాని మాటలు వినిపించుకోలేదు.

"పిచ్చివాడా।...వాడి మాటలు విని నన్ను ధిక్కరిస్తున్నావా?" వద్దంటున్నా అదే చేస్తున్నావా? నాశనమయిపోతావు। నా గురించి నీకు తెలియదు." అని ఫీంకరించింది.

అయినా అనిరుధ్ ఆగలేదు.

చేతిలోని ద్రవాన్ని ఖబీస్‌మీదకు చల్లేసాడు అనిరుధ్.

అంతే ...అంతవరకూ నిశ్శబ్దంగా అరుస్తున్న ఖబీస్ నిశ్చేష్టంగా నిలబడిపోయింది.

అనిరుధ్ చూస్తుండగానే ఖబీస్‌కి కట్టిన బంధనాలు ఒకొక్కట్టంటూ తెగిపోయాయి వాసానికి లాగి కట్టిన మేకు ఒకటి ఖంగుమని శబ్దంచేస్తూ, కింద పడిపోయింది.

బంధనాలు తెగగానే ఖబీస్ ధోరణి పూర్తిగా మారిపోయింది. అనిరుధ్‌కేసి కళ్ళు పెద్దవిచేసి కోపంగా చూసింది.

వొళ్ళు విరుచుకుని ముందుకి కదిలింది.

అది నెమ్మదిగా తనకేసి వస్తుంటే...అనిరుధ్‌కి మొట్టమొదటి

సారిగా భయంవేసింది...

ఏం చేయాలనుకుంటోంది ఖబీస్?

తనని తినేస్తుందా?

వెనక్కి అడుగు వేయాలనుకున్నాడు అనిరుధ్... కానీ కదల్లేక పోయాడు...

అంతలో ఖబీస్ రూపంలో కూడా మార్పు వచ్చింది...

అంత పొడవున్న ఖబీస్ ముందుకు నడుస్తుంటే పొట్టిదయిపోతోంది...

చూస్తుండగానే...మరింత...మరింత పొట్టిదయింది ఖబీస్!... మొహంలో కూడా ఏదో మార్పు ప్రారంభమయింది. డెభై ఏళ్ళ ముసలి మొహంలోంచి ముడతలన్నీ మాయమయి క్రమంగాచిన్న కుర్రవాడిరూపం దాల్చిందది.

మరింత దగ్గరకు వచ్చిందా ఆకారం....!

ముందు ఆ మొహం ఎక్కడో చూసినట్టుందని పించింది అనిరుధ్‌కి...

కానీ...ఆ తర్వాత విషయం అర్ధమయి ఉలిక్కిపడ్డాడు!"

తనకు రెండే రెండడుగుల దూరంలో నిలబడి క్రూరంగాచూస్తున్న ఆ కుర్రవాడి మెహం—

అచ్చు తనదే.

పోలికలు అన్నీ ఒకటే అయినా...ఆమొహంలోని దుష్టభావాలు తనవికావు!...

ఎదురుగా నిలబడ్డ కుర్రవాడు...కాదు ఖబీస్... చేతులు చాచింది.

"నాతో వైరం పెట్టుకుంటే ఏమవుతుందో ఇప్పుడు చూడు!..." అంటూ అనిరుధ్‌ని వాటేసుకుంది ... జుగుప్సతో వొళ్ళు గగుర్పొడుస్తుంటే...

అనిరుధ్ కళ్ళు గట్టిగా మూసుకున్నాడు...

కడుపులో తిప్పినట్లయింది. అంతే.

ఖబీస్ రూపం...అతడిలో కలిసిపోతుంటే...ఎలక్ట్రిక్‌షాక్ తగిలిన

వాడిలా...రెండడుగులు పైకెగిరి నేలమీదపడిపోయాడు అనిరుధ్.

శరీరం అనుభవిస్తున్న బాధకంటే మానసికబాధ ఎన్నోరెట్లుఎక్కు వయిపోతుంటే—తట్టుకోలేక పెద్దగా అరిచాడు.

......

ఇంటి గేటు దగ్గరకి వేగంగా వచ్చి సడన్ బ్రేక్‌తో ఆగింది పవన్ కారు.

కారులోంచి పవన్‌తోపాటు ప్రొఫెసర్ ఆత్మారాం కూడా దిగి గబ గబ గేటులోంచి లోపలికి నడిచాడు...

"ఓ గాడ్!...అనిరుద్ తాళంతీసి లోపలికి వెళ్ళినట్లున్నాడు?" అంటూ పరుగున ఇంట్లోకి వెళ్ళాడు పవన్.

హాల్లోకి వచ్చి బెడ్‌రూం తలుపుకేసి చూసి తక్కున ఆగిపోయా రిద్దరూ.

బెడ్‌రూం తలుపు నెమ్మదిగా తెరచుకుంటోంది.

కిర్ ర్ ర్!...

తలుపు పూర్తిగా తెరుచుకుంది...గుమ్మందగ్గర నిశ్చలంగా నిలబడ్డ అనిరుద్ మొహం మసకవెలుతురులో సరిగ్గా అగుపించలేదు ముందు కాసేపు!—

ఇంటిలోపల చీకటికి కళ్ళు అలవాటుపడ్తుంటే అనిరుధ్ మొహంలో కదలాడుతున్న భయానకమైన భావాలను చూసి నిశ్చేష్టుడై పోయాడు పవన్.

తెల్లగా రక్తపుచుక్క లేనట్టుగా పాలిపోయిన అనిరుద్ మొహం మీద నీలం రంగు రక్తనాళాలు వికృతంగా ఉబ్బిపోయి ఉన్నాయి!...

జుట్టు నిక్కబొడచుకుని ఉంది!...

గాజుకళ్ళతో ఎటో చూస్తున్నట్టుంది.

నిర్జీవంగా ఉన్న ఆ కళ్లు విప్పారి ఉండటంతో కనుగుడ్లు చిన్న చుక్కల్లా కనిపిస్తున్నాయి.

అనిరుధ్ రూపం అలా మారిపోవడం చూసి విలవిలలాడిపోయాడు పవన్.

ఏమయింది అనిరుధ్‌కి?

ఎందుకిలా అయిపోయాడు?

అసలిది అనిరుద్దేనా?

ప్రేమానురాగాలు చిందించే అందమయిన మొహం ఎటుపోయింది? దాని చోట పగకి ద్వేషానికి ప్రతిరూపంలా ఉన్న ఈ దానవరూపం ఏమిటి?

"బబ్లూ!" ఆర్ద్రంగా పిలుస్తూ ముందుకు నడవబోయాడు పవన్

కానీ...

అతడి చెయి పట్టి ఆపేసాడు ప్రొఫెసర్ ఆత్మారాం.

"నో!...బాబుకి దూరంగానే నిలబడండి!..." అన్నాడు

పవన్ ఏదో అనబోయేంతలోనే అనిరుధ్ శరీరం ఒక్క ఊపు ఊగి అతడికేసి కదిలింది.

ఊపిరి బుసలుకొడ్తుంటే పళ్ళు చూపిస్తూ...

అరచేతులు రెండు పులిపంజాల్లా పెట్టి పవన్‌కేసి కదిలాడు అనిరుధ్!...

కాదు! అనిరుద్‌కాదది!

మస్తానమ్మ వేసిన బందిష్ నించి బయటపడి అనిరుద్ కోమల శరీరాన్ని ఆవహించిన ఖబీస్.

అనిరుద్ తనమీదకు లంఘించనున్నాడని ఊపిరి బిగపట్టి సిద్దంగా నిలబడ్డాడు పవన్...

సరిగ్గా అప్పుడు...

మెరుపులాంటి కదలికతో పవన్‌కి అతడిమీదకు ఉరుకుతున్న అనిరుధ్‌కి మధ్యనవచ్చి నిలబడ్డాడు ఆత్మ!

తక్కున ఆగిపోయాడు అనిరుధ్.

చూపుడువేలితో అనిరుధ్ నుదుటిమీద ఏవో గుర్తులువేస్తూ—

"అనిరుధ్ నువ్వు మొదలెట్టిన పని మధ్యలో ఆపవద్దు. ఖబీస్‌కి విముక్తి కావాలి. ఖబీస్ నిన్ను బాధపెడ్తోంది! అయినాసరే నువ్వు ఖబీస్‌కి సహాయపడాలి—ఖబీస్‌తో ఘర్షణ పెట్టుకోవద్దు." అన్నాడు గంభీరంగా.

ప్రొఫెసర్‌కేసి విచిత్రంగా చూసాడు పవన్.

అతడి వింతప్రవర్తన దేనికో అంతుపట్టలేదు పవన్‌కి.

అయితే అనిరుధ్‌పైన ఆ మాటల ప్రభావం అద్భుతంగా ఉంది.

క్షణం క్రితం తండ్రిమీదకి దాడి చేయడానికి పూనుకున్న అనిరుధ్ ఉన్నట్టుండి వెనక్కి తగ్గాడు.

అటూ ఇటూ ఊగిపోతూ అక్కడ్నించి నెమ్మదిగా కదలి వెళ్ళి మండువా మధ్యన చతికిలబడ్డాడు.

పరాధీనమయిన శరీరాన్ని కష్టపడి వశంలోకి తెచ్చుకుంటూ పద్మాసనం వేసి కూర్చుని కళ్ళు మూసుకున్నాడు.

అయినప్పటికీ—తీవ్రమయిన అంతర్మథనానికి గురవుతున్నట్లు శరీరం విహ్వలించిపోతోంది.

అనిరుధ్ పడ్తున్న బాధను చూడలేక ముందుకి వెళ్ళబోయాడు పవన్.

మళ్ళీ అతడ్ని ఆపేసాడు ఆత్మ:—

"కంగారులేదు పవన్‌గారు. మీ బాబుకి ఏమీకాదు—నా మాట నమ్మండి!" అన్నాడు—

ఆ తర్వాత జరిగిందంతా ఒక మిరకిల్‌లా అనిపించింది పవన్‌కి.

ఏమయిందో ఏమోకానీ—

అంతవరకూ ఆ సుకుమారుడి శరీరాన్ని ఆక్రమించుకుని హింసిస్తున్న అదృశ్య శక్తి పట్టుసడలింది.

క్రమంగా చల్లారిపోతున్న దావానలంలా.

బలహీనమవుతున్న తుపానులా.

దాని ప్రభావం సన్నగిల్లింది...

పవన్ చూస్తుండగానే...అనిరుద్‌లోని వికృత ఛాయలు మాయమయ్యాయి.

చీకటి తొలగి సూర్యోదయం అయినట్టు అనిరుద్ మొహంలో మునుపటి కళ తిరిగి వచ్చింది.

ఎప్పటిలాగానే వాడి పాలబుగ్గలు అందంగా మెరిసాయి.

యధాప్రకారం కళ్ళలో చురుకుదనం తళుక్కుమంది.

దరహాసంతో లేచి నిలబడ్డాడు అనిరుద్.

"డాడీ...ఎప్పుడు వచ్చావు?" అడిగాడు ఏమీ జరగనట్టు.

గభాలున వాడ్ని ఎత్తుకుని ఛాతికి హత్తుకుని ముద్దులు కురిపించాడు పవన్.

"ప్రొఫెసర్ ఆత్మ! ఏమిటిదంతా...?" అడిగాడు పవన్ కాసేపాగి.

చిరు నవ్వుతో తలూపాడు ప్రొఫెసర్ ఆత్మ.

"నేను ఆశించినట్టే జరిగింది పవన్‌గారూ! మీవాడు సామాన్యుడు కాడు! సైకిక్ శక్తులు పరిపూర్ణంగా అభివృద్ధి చెందిన వారుకూడా చేయ డానికి వెనుకాడే ప్రక్రియ సునాయాసంగా సాధించాడు అనిరుద్... ఇన్నేళ్ళుగా ఈ ఇంటిని పీడిస్తున్న ఖబీస్ శక్తిని ఆవాహన చేసాడు."

అతడికేసి వింతగా చూసాడు పవన్.

"ఖబీస్‌లోని దౌష్ట్యాన్ని హరించి, తనలోని మంచితనంతో... ఇంకా వివరం చెప్పాలంటే తనలోని పాసిటివ్ ఫోర్స్‌తో దాన్ని సంకీర్ణం చేసి, బలహీనపరచి, సమూలంగా రూపుమాపాడు" అన్నాడు ప్రొఫెసర్ ఆత్మ మళ్ళీ.

ఆ మాటలు విని తల అడ్డంగా తిప్పాడు పవన్.

"సారీ ప్రొఫెసర్ ఆత్మా! అసలు మీరంటున్న ఖబీస్ ఉనికినే నేను గుర్తించడంలేదు. దయ్యాలూ, భూతాలూ ఇవన్నీ ఉన్నాయంటే నమ్మను నేను! సైంటిఫిక్‌గా వీటిని నిరూపించలేరు మీరు" అన్నాడు.

ప్రొఫెసర్ ఆత్మ నవ్వేసాడు.

"పదండి-ఇంటికెళ్తూ మాట్లాడుకుందాం" అని బయటకి దారి తీసాడు. అనిరుధ్ చెయిపట్టుకుని పవన్‌కూడా నడిచాడు.

బయటకి వెళ్ళగానే కాంపౌండులో తోకాడించుకుంటూ ఎదు రయింది లాబ్రడార్ కుక్క. అనిరుద్‌ని చూడగానే ఆనందంగా గంతులు వేసిందది. ఇప్పుడా ఇంటి ఆవరణలో విహరించడానికి దానికి ఏమాత్రం భయం అనిపించడంలేదు.

పవన్ కారు నడుపుతుంటే అతడి పక్కసీటులో కూర్చుని

మాట్లాడుతున్నాడు ప్రొఫెసర్ ఆత్మ.

వాళ్ళతో సంబంధం లేనట్టుగా వెనకసీట్లో కూర్చుని కారుని అనుసరిస్తూ పరుగెడ్తున్న లాబ్రడార్ కుక్కని గమనిస్తున్నాడు అనిరుధ్.

అప్పుడంటున్నాడు ప్రొఫెసర్ ఆత్మ.

"పవన్‌గారూ...నా అభిప్రాయంలో మంత్రవిద్యలు తెలిసిన వ్యక్తి ఎవరో ఖబీస్‌ని సృష్టించి మీ ఇంట్లో నిలబెట్టారు అనిరుద్‌లో జన్మతః వచ్చిన సంస్కారంవల్ల ఇ.ఎస్.పి, సైకిక్ శక్తి, పరిపక్వదశలో ఉన్నందువల్ల ఖబీస్ ఉనికిని పసిగట్టి దాన్ని తనలో ఆవహింపచేసుకుని నిర్వీర్యంచేసి నాశనం చేయకలిగాడు. నేను దీనిలో చేసిన సహాయం చాలా స్వల్పం!" అని పవన్‌కేసి తిరిగి చూసాడతను.

"నేనడిగింది మావాడి గురించికాదు. మీరంటున్న ఖబీస్ గురించి! ఆ గదిలో అలాంటిదేదో ఉందని మా ఆవిడ ఊహించుకునేది...డైరీ చదివి మావాడుకూడా అదే పట్టుకున్నాడు దట్సాల్!"

"అయితే ఇందాక జరిగిందంతా ఏమిటి? అనిరుధ్‌కి మెంటల్ ప్రాబ్లెమ్ ఉందంటారా? నో" అన్నాడు ఆత్మ.

వెంటనే జవాబివ్వలేదు పవన్.

కాసేపాగి అడిగాడు.

"సరే - దీని గురించి మీరేమనుకుంటున్నారో చెప్పండి- అర్థం చేసుకోడానికి ప్రయత్నిస్తాను. ఎవరో ఖబీస్‌ని సృష్టించారన్నారే అదెలా సాధ్యమో చెప్పండి మీథియరీ ఏమిటి?"

"ఎక్టోప్లాసమ్ అంటే తెలుసా మీకు? మన భౌతిక శరీరానికి, కంటికి కనపడని మన వ్యోమ శరీరానికి అదే...ఇథరిక్ డబుల్ **(etheric double)**కి మధ్య పొరలా ఉంటుంది. ఈ ఎక్టోప్లాసమ్‌ని కొంత మంది మాంత్రికులు అదుపులో తెచ్చుకుని తాము కోరిన భౌతికరూపం దాని. కిచ్చి అనుకున్న కార్యం సాధించుకోడానికి వినియోగించుకుంటారు. అలా తయారయినదే ఈ ఖబీస్...నేననుకోవడం ఖబీస్ అన్న పేరు జానపదా ల్లోనో, కథల్లోనో విని, ఆ పేరుకి ఒక రూపాన్ని ఊహించుకుని ఎవరో

సృష్టించారు ఈ ఖబీస్ శక్తిని." అన్నాడు ప్రొఫెసర్ ఆత్మ.

"అయితే ఆ యాంత్రికులు ఊహించింది ఇతరుల అనుభవంలోకి వస్తుందంటారు అంతేనా?" అడిగాడు పవన్.

"కరెక్ట్! అయితే ఇలా సృష్టించబడిన శక్తిని కార్య రంగంలోకి దింపి ఏదయినా పనికి నియమిస్తే...ఆ శక్తి కొన్నాళ్ళకి సృష్టించినవారి అధీనంలోంచి బయటపడి స్వతంత్రంగా వ్యవహరించడం మొదలెడ్తుంది. వీటికి ప్రత్యేకమయిన ఉనికి ఏర్పడ్తుంది...వీటిని ఆర్టిఫిషియల్ ఎలిమెంటల్స్ అంటాను."... అందుకే ఇన్నాళ్ళు ఊహించని సంఘటనలూ అవాంతరాలు జరిగి ఎవరూ ఆ ఇంట్లో ఉండలేకపోయారు" అని ముగించాడు ప్రొఫెసర్.

పవన్ మనసులో ఎన్నో సందేహాలు మెదులుతున్నాయి. ప్రొఫెసర్ మాట్లాడే పద్ధతి చూస్తుంటే అతడికి ఈ విషయాల గురించి చాలా తెలుసనిపిస్తోంది.

కానీఅంతలో ఇంటిమలుపుతిరగడంతోసంభాషణ కొనసాగించలేదు.

......

అనిరుధ్‌తోపాటు ఫ్లాటులోకి అడుగు పెట్టగానే డ్రాయింగ్ రూం సోఫాలో ఒక అమ్మాయి కనబడింది పవన్‌కి.

పవన్ చూడగానే లేచి నిలబడిందామె.

తెల్లగా పొడుగ్గా ఉందా అమ్మాయి.

గోధుమ రంగులో ఉన్న ఆమె జుట్టు చూడగానే తెలుస్తోంది ఆమె విదేశానికి చెందినదని.

"మీరు...?" అడిగాడు పవన్...ఆంగ్లంలో.

"మీ అబ్బాయికి ఫ్రెంచ్ నేర్పించేందుకు టీచర్ కావాలట కదా?" అడిగిందామె వచ్చీరాని తెలుగులో.

అప్పుడు గుర్తుకొచ్చింది పవన్‌కి.

"అవును...ఎవరు చెప్పారు మీకు రాంకుమార్‌గారా?"

"లేదండీ జూబిన్...చెప్పాడు!" అందామె.

జూబిన్ పేరు గుర్తుపట్టలేదు పవన్.

"బొంబేలో కాంట్రాక్టర్ జూబిన్!" అంది ఆమె మళ్ళీ.

"అలాగా...కూర్చోండి...మీ పేరు?"

"జొసెఫైన్!"

# 30

ఫ్రెంచ్ అమ్మాయి జొసెఫైన్ మాట్లాడి వెళ్ళాక ఆఫీసుకి ఫోన్‌చేసి సెలవు పెట్టేసాడు పవన్.

ఆ రోజంతా అనిరుధ్‌తో కబుర్లు చెప్తూ గడిపేసాడతను.

జూబ్లీహిల్స్ ఇంట్లో జరిగిన సంఘటన పూర్తిగా మరచిపోయి ఎప్పటిలా నవ్వుతూ మాట్లాడుతున్న అనిరుద్‌ని చూసి రిలీఫ్‌గానే ఉన్నా... కొన్ని గంటలక్రితం జరిగిన విచిత్రాన్ని తలచుకుంటే పవన్‌కి ఇంకా కంగారుగానే ఉంది.

అయినా పైకి ఏమీ లేనట్టుగా అనిరుద్‌తో చాలా సేపటి వరకు కేరమ్స్ ఆడుతూ గడిపేసాడు. ఆట మధ్యలో అనిరుద్‌నే గమనిస్తున్నాడతను.

అనిరుద్ ధోరణికానీ, మాటలుకానీ అసహజంగాలేవు. అంతా నార్మల్‌గానే ఉంది. ఏడేళ్ళ పిల్లవాడిలో ఉండవలసిన హుషారు తప్ప మరొకటి కనపడటంలేదు వాడిలో.

అసలు ప్రొఫెసర్ ఆత్మ చెప్పింది ఎంతవరకు సబబుగా ఉంది? ఆయనమాటలు లాజిక్‌కి అందటంలేదు!...ఈ సృష్టిలో మనకు తెలియని, రహస్యాలు ఎన్నయినా ఉండవచ్చు. ప్రొఫెసర్ ఆత్మ చెప్తున్నట్టు ఖబీస్ శక్తి ఎవరో సృష్టించి నిలబెట్టినదే కావచ్చు...అయినా అనిరుధ్ ఆ శక్తిని జయించి నిర్వీర్యంచేసితనలోఆవాహనచేసుకున్నాడంటేనమ్మశక్యంగాలేదు.

మరి జరిగిందేమిటి?

మెంటల్ అబ్రేషన్స్!

అవును...చిత్తభ్రమ!

జరగనిది జరిగినట్టు ఊహించుకుని ఉంటాడు అనిరుధ్.

ఆ ఊహ ఎంత బలమయినదయి ఉంటుందంటే...దాని ప్రభావం

అనిరుధ్ శరీరంమీద కూడా పడింది.

ఈ ఊహలకి మూలం అనిరుద్ చదివిన స్నిగ్ధ డైరీ.

అసలు ఆ డైరీఅనిరుద్‌కిఅందుబాటులో ఉంచడం తనదేపొరపాటు.

అనిరుద్‌లో వయసుకు మించిన తెలివితేటలున్నమాట నిజమే... కానీ వాడికున్న లోకానుభవం చాలా స్వల్పం...డైరీలో తల్లి రాసిన విష యాలు చదివేసి వాటిని విశ్లేషించకుండాయథాతథంగా నమ్మేసాడు! అన్నీ వాస్తవాలే అనుకుంటున్నాడు.

ఈ ధోరణి ఇలాగే కొనసాగితే?

అనిరుద్ మనసుకూడా స్నిగ్ధలాగే చాలా సున్నితంగా ఉంటుంది. ఇలాంటి ఇల్యూషన్స్‌తోనూ ... ఫాంటసీలతోనూ ఒకవేళ... అనిరుధ్ కూడా?...

నో...!

అనిరుధ్‌కి అలా జరక్కూడదు.

అనిరుద్‌లో మార్పు తీసుకొనిరావాలి...ప్రాక్టికల్‌గా వాస్తవాలకి దగ్గరగా ఉండేట్టు చేయాలి.

ఎలా?

పరిస్థితి చేయిదాటకముందు తనే ఏదయినా చేయాలి.

ఏం చేయాలి?

కేరమ్స్ ఆట పూర్తయ్యాక అనిరుద్ బద్ధకంగా లేచినిలబడ్డాడు...

"డాడీ! నిద్రొస్తోంది!..." అన్నాడు.

పవన్ కూడా లేచి నిలబడ్డాడు.

"పడుకుందాం పద..." అని బెడ్‌రూంకేసి నడిచాడు.

"డాడీ...నా రూంలోనే పడుకుంటాను..." అని అక్కడే నిలిచి పోయాడు అనిరుద్.

వాడిని ఒంటరిగా వొదిలిపెట్టడం మంచిది కాదని ఒక్కక్షణం అని పించింది పవన్‌కి...కానీ వెంటనే నవ్వు తెచ్చిపెట్టుకుని సరే అన్నాడు...

అనిరుద్ బెడ్‌రూంలోకి వెళ్ళాక రాజేశ్వరి దగ్గరకు వెళ్ళాడు పవన్.

నిద్రకుపక్రమిస్తున్న రాజేశ్వరిదేవి అతడ్నిచూసి లేచి కూర్చుంది.

మధ్యాహ్నం అనిరుద్‌ని వెంటపెట్టుకుని ఇంటికి వచ్చినప్పట్నుంచి ఏం జరిగిందో చెప్పమని అడుగుతునే ఉందామె...కానీ ఏదోవిధంగా మాట దాటేస్తూ వచ్చాడు పవన్.

"నిద్రపోయాడా వాడు" అడిగింది రాజేశ్వరిదేవి.

తలూపి ఈజీచైర్లో కూర్చున్నాడు పవన్.

జూబ్లీహిల్స్‌లోజరిగిందంతా క్లుప్తంగా చెప్పాడతను రాజేశ్వరిదేవికి.

ఆ వృత్తాంతం విని బెదిరిపోయిందామె.

"...ఏమిటోరా కన్నా నాకయితే...ఇదంతా వింటుంటే భయంగా ఉంది!" అందామె.

"భయమెందుకమ్మా?..."

"ఆ ఇంట్లో...నేననుకున్నట్టు నిజంగానే ఏదో ఉందిరా..."

ఆమె మాటలువిని అసహనంగా కదిలాడు పవన్.

"ఏమిటమ్మా! నువ్వు మరీను!...అనిరుద్ అలా ఊహించుకున్నాడని చెప్తూనే ఉన్నాను కదా! మనింటిలో అలాంటిదేమీ లేదు.

మనింట్లోనేకాదు ఎక్కడయినాసరే దయ్యాలూ భూతాలున్నాయంటే నమ్మను నేను. అన్నీ కాకమ్మ కథలు!..." అన్నాడు పవన్...

కాసేపు ఆగి అడిగింది రాజేశ్వరిదేవి...

"ఇపుడు ఏంచేద్దామనుకుంటున్నావ్?"

ఆమెకేసి సూటిగా చూసాడు పవన్.

"అమ్మా! ఒకటడుగుతాను.కాదనకూడదు."

"ఏమిటి? అడగరా? నీ మాట ఎప్పుడు కాదన్నానని?" అంది రాజేశ్వరిదేవి.

"మనం...జూబ్లీహిల్స్ ఇల్లు అమ్మవద్దమ్మా!...అక్కడికే వెళ్ళిపోదాం మళ్ళీ!..."

ఉలిక్కిపడి చాతీమీద చెయి పెట్టుకుంది రాజేశ్వరిదేవి.

"ఏ...ఏమిట్రా నువ్వంటోంది?"

అవునమ్మా...స్నిగ్ధ పోయాక నువ్వు ఇల్లు మారదాం అన్నపుడు

నాక్కూడా మార్పు అవసరం అనిపించి ఒప్పుకున్నాను...దానికి తగ్గట్టు ఆ ఇంట్లో అద్దెకు దిగిన ఇద్దరు వెంటనే ఖాళీచేసి వెళ్ళిపోవడంతో అచోటు ఎవరికీ అచ్చిరావడం లేదనీ, అక్కడేదో ఉందనే అభిప్రాయం ఏర్పడింది। ఇల్లు మారడమే మనంచేసిన మొదటి పొరపాటనిపిస్తోంది... బబ్లూ చిన్నప్పట్నించి అక్కడే ఉండిఉంటే వాడి మనసులో కూడా ఇలాంటిఊహలు వచ్చి ఉండేవి కావేమో...।" అని ఆగాడు పవన్.

"...ఏడేళ్ళుగా గాలికీ ధూళికీ వొదిలిపెట్టేసాం...ఆ ఇంట్లోకివెళ్ళి ఇప్పుడు ఉండగలమా।—" అంది రాజేశ్వరిదేవి—ఏమనాలో అర్థంకాక.

"దాండేముందమ్మా రేపట్నుంచే అక్కడ రిపేర్ పని ప్రారంభిస్తాను. నువ్వే దగ్గరుండి మరమ్మత్తులు చేయించు. పని పూర్తయ్యాక నీకే అనిపిస్తుంది అక్కడికివెళ్ళి ఉండాలని." అని లేచాడు పవన్.

......

పవన్ వెళ్ళాక చాలాసేపు అలోచనల్లో పడిపోయింది రాజేశ్వరిదేవి.

జూబ్లీ హిల్స్ ఇంటికి మారడం ఏమాత్రం ఇష్టంలేదు ఆమెకు. స్నిగ్ధ పోయాక ఆ ఇంట్లో అనుభవించిన నరకం ఇంకా మరచిపోలేదామె

ఆ సంఘటనతో తనకు ఎటువంటి సంబంధంలేదని పోలీసులని నమ్మించకలిగినా—అసలు రహస్యం బయటపడిపోతుందన్న భయిం వెన్నంటే ఉంది.

తనుచేసిన పని ఎవరికి తెలిసినా తెలియకపోయినా— "ఆమె"కు తెలుసు.

"ఆమె" ఇంకా ఆ ఇంట్లోనే ఉంది.

తనకు తెలుసు?—ఆ ఇంటిని వొదిలిపెట్టి వెళ్ళదామె?—తీరనికోరికలతో—తన మీద ప్రతీకారం తీర్చుకోడానికని—అక్కడే తిరుగుతోంది ఆ ప్రేతాత్మ।

ఇప్పుడు ఆ ఇంటికి తిరిగి వెళ్దాం అంటున్నాడు పవన్—వెళితే ఏమవుతుందో?।

అంతలో కిటికీలోంచి రివ్వున చల్లగాలి వచ్చి తాకింది రాజేశ్వరిదేవిని—సన్నగా వొణుకు ప్రారంభమయింది ఆమెకు...

......

వారం రోజులు తిరక్కుండానే ఇల్లుమారే ఏర్పాట్లు చేయించాడు పవన్.

ఆ రోజు ఫ్లాట్‌లోని సామానులన్నీ జూబ్లీహిల్స్ ఇంటికి తరలించాక పవన్‌తోపాటు కారులోవచ్చి దిగింది రాజేశ్వరిదేవి.

అంతకుముందే సామానులు లారీతో అక్కడికి వచ్చి చేరిన అనిరుద్ ఆనందంగా ఎదురొచ్చాడు వాళ్ళిద్దరికీ.

"డాడీ—మనల్లిపుడు బ్యూటిఫుల్‌గా ఉంది నేను చూసి గుర్తుపట్టలేకపోయాను తెలుసా?" అన్నాడు.

రాజేశ్వరిదేవి ఇంటికేసి చూసింది.

లారీలోని సామానులు హడావిడిగా ఇంట్లోకి చేరుస్తున్నారు కూలీలు...మరోవైపు కాంపౌండులోని చెత్తాచెదారం శుభ్రంచేసి పూల మొక్కలు నాటుతున్నారు ప్లాంట్ నర్సరీ వాళ్ళు.

గోడలకి, తలుపులకి పూసిన రంగులతో ఇల్లు కళకళలాడుతోంది మళ్ళీ. ఆ మార్పులన్నీ ఆమోద పూర్వకంగా చూసింది రాజేశ్వరిదేవి.

ఇంటి వాతావరణం ఆమెకు కొంత ధైర్యాన్నిచ్చింది.

పవన్ చెప్పింది నిజమే...ఆ ఇంట్లో ఉండటం పెద్ద సమస్యకాకపోవచ్చిపుడు.

ఏడేళ్ళ తర్వాత మళ్ళీ అడుగుపెట్టింది రాజేశ్వరిదేవి తనింట్లోకి.

......

మర్నాడు పవన్ ఆఫీసుకి బయల్దేరుతుంటే గేటు దగ్గర నల్ల అంబాసిడర్ కారొకటి వచ్చి ఆగింది.

కార్లోంచి దిగిన ప్రొఫెసర్ ఆత్మని చూసి ఇంటి గుమ్మందగ్గరే ఆగిపోయాడు పవన్.

"ఆఫీసుకి బయల్దేరుతున్నట్టున్నారు?...మరోసారి వస్తానులెండి" అన్నాడు ఆత్మ.

"ఏదయినా పనిమీద వచ్చారా?"

"బాబుని చూసి పోదామని వచ్చాను. ఎలా ఉన్నాడు?"

"బబ్లూ బాగానే ఉన్నాడండీ...ఇందాకే స్కూల్‌కి వెళ్ళాడు" ముందుకి నడుస్తూ చెప్పాడు పవన్.

ఇంటికేసి చూసి సంతృప్తిగా తల పంకించాడు ఆత్మ.

"గుడ్! ఈ ఇంట్లోకి మారి మంచి పనే చేసారండీ?...ఇక ఖబీస్ గురించి మీకెటువంటి బెడదా..." అని ఏదో అనబోతున్న అతడి మాటలకి అడ్డు వచ్చాడు పవన్.

"సారీ ప్రొఫెసర్...ఇలా అంటున్నానని మరోలా అనుకోవద్దు. ఖబీస్ గురించి మీరు చెప్పిన మాటలు నాకింతవరకూ అర్థం కాలేదు. ఎన్ని విధాలుగా ఆలోచించినా అలాంటి అసాధారణమయిన శక్తి ఉంటుందంటే నమ్మకం కుదరడంలేదు. అయితే అనిరుద్ తను ఇన్నాళ్ళు ఊహించిన ఖబీస్ ఇక ఇక్కడలేదని గట్టిగా నమ్ముతున్నాడు! ఆ నమ్మకాన్ని బలపరచి వాడ్ని మళ్ళీ ఒక నార్మల్ పిల్లవాడిలా చేయాలనే ఈ తాపత్రయం" అని ముగించాడు.

పవన్ మాటలువిని చిన్నగా నవ్వాడు ప్రొఫెసర్ ఆత్మ.

"నా మాటలు మీరెందుకు నమ్మలేకపోతున్నారో నాకు తెలుసు పవన్‌గారూ—ప్రతి విషయాన్ని సైన్సు దృష్టితో చూస్తారు మీలాంటి వాళ్ళు. అందులో తప్పులేదు. కానీ మనకు తెలిసిన సైన్స్ పరిధిలో రాని వన్నీ అవాస్తవాలు అనుకుంటేనే వస్తుంది ఇబ్బంది. సైంటిఫిక్ కానివన్నీ మూఢనమ్మకాలు అయితే...సరి అయిన పరిశోధన చేయకుండా ఒక నిర్ణయానికి రావడంకూడా మూఢనమ్మకమే. కాదంటారా!...మీకు తీరిక ఉన్నపుడు మనం ఈ విషయాల గురించి వివరంగా మాట్లాడుకుందాం" అన్నాడు.

చూద్దాం అన్నట్టు భుజాలెగరేసాడు పవన్.

"సాయంత్రం అనిరుద్‌ని కల్సుకోవచ్చా?" అడిగాడు ఆత్మ.

ఒక్కక్షణం ఆలోచించి జవాబిచ్చాడు పవన్.

"ఇవాళ మధ్యాహ్నం నేను వికారాబాదు టూర్‌కి బయలుదేరుతున్నాను మీరిక్కడికి వచ్చి బబ్లూని కల్సుకుంటే నాకభ్యంతరంలేదు కానీ...దయచేసి క్రితంసారిలా వాడిమీద మీ ప్రయోగాలు మాంత్ర

చేయకండి."

• • •

సాయంత్రం ఆరు గంటలు దాటుతుంటే మండువా మధ్యన గార్డన్ ఛైర్ వేసుకుని కూర్చుంది రాజేశ్వరిదేవి.

ఒంటరిగా హాల్లో కూర్చుని హోంవర్క్ చేసుకుంటున్నాడు అనిరుధ్.

అంతలో వీధి తలుపు దగ్గర ఏదో శబ్దమయి ఉలిక్కిపడింది రాజేశ్వరిదేవి.

తలుపుమీద ఎవరో మేకులుపెట్టి గీరుతున్నట్టు ... కర్ర్ర్‌మని శబ్దం!

ఎవరో బలంగా తోస్తున్నారు తలుపు.

రాజేశ్వరిదేవికి గుండె దడ ప్రారంభమయింది.

పవన్‌కూడా టూర్ వెళ్ళిపోయాడు...తను చిన్నవాడితో ఒంటరిగా ఉంది...అసలే భయం భయంగా ఉన్నపుడు ఏమిటిది?

మళ్ళీ చప్పుడయింది తలుపుదగ్గర.

హోంవర్క్ చేసుకుంటున్న అనిరుధ్ పట్టించుకోకుండా తన పనేదో చేసుకుంటున్నాడు.

అసలు వాడికి వినిపిస్తోందా ఆ చప్పుడు?!

ధైర్యం తెచ్చుకుంటూ నెమ్మదిగా లేచి తలుపుదగ్గరకి వెళ్ళింది

"ఎ...ఎవరదీ?"

తక్కున ఆగిపోయింది చప్పుడు.

కాసేపాగి నెమ్మదిగా తలుపు గడియతీసి బయటకు తొంగి చూడబోయిందామె.

కానీ...అంతలో ఎవరో బలంగా ఒక్కతోపు తోసినట్టయి వెనక్కి తూలింది రాజేశ్వరిదేవి...తలుపు దభేలున తెరచుకుని లోపలికి ఉరికింది నల్లటి ఆకారమొకటి!

అదేమిటో అర్థంకాక బిగ్గరగా అరిచిందామె.

గోడకానుకుని తమాయించుకుంటూ లోపలికెళ్ళినదేమిటా అని

చూసింది మళ్ళీ.

షుమారు నాలుగడుగులు ఎత్తున్న నల్ల కుక్క ఒకటి మండువా లోంచి అనిరుధ్ దగ్గరకెళ్తోంది...దాన్ని చూడగానే అనిరుధ్ ఆనిందంగా లేచి ముందుకొచ్చాడు. దాని మెడచుట్టూ చేతులువేసి దగ్గరకు తీసుకుంటుంటే తోకాడిస్తూ వాడి చేతులు నాకుతోందది.

క్షణంసేపు అపనమ్మకంగా ఆ దృశ్యంచూసి తేరుకుంది రాజేశ్వరిదేవి.

"ఛీ ఛీ! ఎవరిదిరా ఈ కుక్క? దయ్యంలా ఇంట్లోకి దూరింది? తరమరా దాన్ని బయటకి" అని అరిచింది.

"బామ్మా? ఇది నా ఫ్రెండు! నేనంటే దీనికి చాలా ఇష్టం...మనం పెంచుకుందామా దీన్ని?" అడిగాడు కుక్క వీపు నిమురుతూ.

అనిరుధ్ మాటలువిని గయ్యాళిలా గొంతు చించుకుంది రాజేశ్వరిదేవి.

"వీల్లేదు - మాయదారి కుక్క ఎవరిదో ఏమో! దాన్ని ఇంట్లో ఉండనిస్తే ఇల్లంతా ఖరాబు చేస్తుంది"

ఆమె అలా అందోలేదో అనిరుధ్ కళ్ళు అదోలా మెరిసాయి. నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ ఆమె దగ్గరకు నడిచాడు...నల్ల కుక్క కూడా తోకాడిస్తూ అనుసరించింది.

నడుమ్మీద చేతులు పెట్టుకుని నిలబడి రాజేశ్వరిదేవిని పైనించి కిందవరకూ చూసాడు.

వాడికేసి కంగారుగా చూసింది రాజేశ్వరిదేవి.

"ఏమిట్రా ఆ చూపులు?"

"రాజేశ్వరీ ఏమిటే నీనస?...నాకు కుక్కలు పెంచడం సరదా అని తెలియదా నీకు?" అన్నాడు.

గొంతు తడారిపోతుంటే రాజేశ్వరిదేవి నోట మాటరాలేదు.

"ఈ కుక్క ఇక్కడే ఉంటుంది! దీని పేరు సీజర్!...ఇప్పుడు మేమిద్దరం అలా షికారుకి వెళ్ళివస్తాం" అంటూ కుక్కతోపాటు బయటకు నడిచాడు అనిరుధ్.

అనిరుధ్ వెళ్తున్నవైపు అవాక్కయి చూస్తుండి పోయింది

రాజేశ్వరిదేవి...

పవన్ తండ్రికూడా ఇంతే...కోపం పట్టలేకపోతే సరిగ్గా ఇలాగే మాట్లాడేవాడు. కుక్కలు పెంచడం ఆయనకూ్కడా సరదాగా ఉండేది. అనిరుధ్ మాటలు కాకతాళీయం అని ఎలా అనుకునేది?

......

గేటు బయట నిలబడి సీజర్‌తో అనిరుధ్ ఆడుకుంటుంటే కారులో ప్రొఫెసర్ ఆత్మ వచ్చాడక్కడికి.

"హల్లో అంకుల్" అంటూ వెళ్ళి అతడి చెయి పట్టుకున్నాడు అనిరుధ్.

"ఎలా ఉన్నావు బాబూ?" అని వాడిని ప్రేమగా దగ్గరకు తీసుకున్నాడు ప్రొఫెసర్ ఆత్మ.

"ఫైన్ అంకుల్। ఇప్పుడు ఇంట్లో చాలా బావుంది। ఖబీస్ లేదు కదా?" అన్నాడు అనిరుధ్ మెరుస్తున్న కళ్ళతో.

"ఖబీస్ లేకుండా చేసింది నువ్వేకదా?" అన్నాడు ఆత్మ మెచ్చుకోలుగా.

"సీజర్‌కూడా ఇపుడు ధైర్యంగా ఇంట్లోకి వస్తోంది।" అని అక్కడే నిలబడ్డ కుక్కకేసి చూపించాడు అనిరుధ్.

దానికేసి చూసి అదెవరిదని అడిగాడు ఆత్మ.

"తెలియదు అంకుల్...కానీ అప్పట్నించి నాకు బెస్ట్‌ఫ్రెండ్ అయిపోయింది"

ఆత్మ నవ్వేసి కుక్క తల నిమిరాడు ముందుకి వొంగి.

"అంకుల్?"

"ఊఁ?" తలెత్తాడు ఆత్మ.

ఏమీ మాట్లాడకుండా ఏదో ఆలోచనలో పడిపోయాడు అనిరుధ్.

"ఏమిటి ఆలోచిస్తున్నావ్?" అడిగాడు ఆత్మ.

అడగాలావద్దా అన్నట్టు సందేహిస్తూ చూసాడు అనిరుధ్ ఒక్కక్షణం ఆగి అడిగాడు.

"ఎవరయినా...చనిపోతే...ఇక అంతేనా?"

అలాంటి ప్రశ్న వస్తుందని ఊహించని ప్రొఫెసర్ ఆత్మ ఆశ్చర్యంగా చూసాడు.

"ఏమిటి బాబూ నువ్వడుగుతోంది?"

"ఎవరయినా చనిపోతే...వాళ్ళు... మనకుందరా?" అడిగాడు అనిరుధ్ మళ్ళీ.

అనిరుధ్ అడుగుతున్నదేమిటో అర్థమయింది ఆత్మకి.

"ఎందుకలా అడుగుతున్నావ్?"

"చెప్పనా అంకుల్" అడిగాడు అనిరుధ్ అతడి చెయి పట్టుకుని.

అనిరుధ్‌కి అర్థమయ్యేలా ఎలా చెప్పాలా అని ఆలోచిస్తూ సమాధానం చెప్పాడు ఆత్మ.

"మనిషి చనిపోయాడూ అంటే...ఆ మనిషి 'శరీరం' చనిపోయిందని అర్థం!...ఆ మనిషి ఆత్మ అదే అసలు మనిషి చనిపోడు."

తనక్కావలసిన సమాధానం దొరికిందన్నట్టు చూసాడు అనిరుధ్.

"అయితే మా మమ్మీ చనిపోలేదుకదూ," అన్నాడు ఆనందంగా.

ఆ పసివాడి మాటలకి చలించిపోయాడు ప్రొఫెసర్. వాడి తల నిమురుతూ అన్నాడు.

"అదేమిటి అనిరుధ్ బాబూ! జరిగిందేమిటో నీకు తెలుసుకదా!"

"తెలుసు అంకుల్! డాడీ అంతా చెప్పాడు...కానీ చనిపోయింది అసలు మనిషికాదని అన్నావుకదా?"

"అఫ్‌కోర్స్!..."అని ఆగిపోయాడు ప్రొఫెసర్ ఆత్మ.

"మరి...నాకు మమ్మీ కనిపించదెందుకూ!"

"శరీరం ఉండకపోతే ఎలా కనిపిస్తుంది?" అడిగాడు ప్రొఫెసర్ ఆత్మ.

"మరి మమ్మీని చూడాలంటే ఏం చేయాలి అంకుల్!"

అనిరుధ్ వేస్తున్న ప్రశ్నలు ఎటువైపుకి వెళ్తున్నాయో పసిగట్టలేకపోతున్నాడు ప్రొఫెసర్ ఆత్మ. అయినా సమాధానం చెప్పాడు.

"చనిపోయిన వాళ్ళని మనం చూడలేం అనిరుధ్!...కానీ వాళ్ళ ఆలోచనా తరంగాలు మనం పసిగట్టినపుడు వాళ్ళని చూసినట్లో లేదా

వాళ్ళతో మాట్లాడినట్లో అనిపిస్తుంది" అని ఆగాడు.

"అదెలా?"

"నేను నీ ఎదురుగా లేకపోయినా...నా గురించి ఆలోచిస్తే నీ మనసులో నా రూపం కనబడుతుంది కదా? గుర్తు చేసుకుంటే నా మాటలు వినిపిస్తాయి కదా? అలాగే... ఈ విషయాలన్నీ ఇప్పుడేకాదు। కొన్నేళ్ళయ్యాక తెలుసుకోవాలి నువ్వు...నువ్వింకా చిన్నవాడివి కదా!" అన్నాడు ఆత్మ నవ్వుతూ।

"కానీ...అంకుల్ నాకు మమ్మీతో ఇప్పుడే మాట్లాడాలని ఉంది మమ్మీతో చాలాచాలా మాట్లాడాలని ఉంది."

ఆ మాటలు విని నిర్ఘాంతపోయాడు ప్రొఫెసర్.

అంతలో రాజేశ్వరిదేవి ఇంటి గుమ్మం దగ్గర నిలబడి అనిరుధ్‌ని పిలవడంతో సంభాషణ కొనసాగలేదు.

"గుడ్‌నైట్ అనిరుధ్।...డాడీ వచ్చాక పబ్లిక్ గార్డన్స్‌కి వస్తావు కదూ!" అని కారు స్టార్టుచేసుకుని బయల్దేరాడు ప్రొఫెసర్ ఆత్మ.

కారు నడుపుతున్నాడే కానీ అతడి ఆలోచనలు అనిరుధ్ గురించే.

అనిరుధ్ అడిగిన ప్రశ్నలు ఏడేళ్ళ పిల్లవాడుఅడిగే ప్రశ్నలుకావు.

అనిరుధ్‌కి ఏడేళ్ళే అయినా మానసికంగా పన్నెండేళ్ళ కుర్రాడిలా ఆలోచిస్తున్నాడు।

వాడి ప్రశ్నలకి సమాధానం ఎలా ఇవ్వాలా అని తను అనవసరంగానే సందేహించాడేమో।...వాడి అవగాహనకి అందని విషయం కాదు కదా ఇది?

అనిరుధ్ సాధారణమయిన కుర్రాడు కాదు.

చైల్డ్ ప్రాడిజీ!...

పారాసైకాలజీలో తను చేస్తున్న పరిశోధనలకి ఇలాంటి సబ్జెక్ట్ ఒక్కరుంటే చాలు।

అనిరుధ్‌ని తన పరిశోధనలకు ఉపయోగించుకోకలిగితే అంతకంటే ఏం కావాలి?

అలా ఆలోచిస్తూ ఠక్కున సిగ్నల్ లైట్స్‌దగ్గర కారాపాడు

ప్రొఫెసర్.

అనిరుధ్‌కూడా ఏదయినా సాధించాలనుకుంటున్నాడేమో!

వాడిలో వికసిస్తున్న శక్తులకు ప్రత్యేకమయిన గమ్యం ఏదయినా ఉందేమో...?

చనిపోయిన తల్లితో మాట్లాడాలనుకుంటున్నాడు అనిరుధ్... అదేనా వాడి లక్ష్యం?

ఈసారి కలిసినపుడు ప్రశ్నలతో ఆగదేమో!...

ఆత్మలతో ఎలా మాట్లాడాలో నేర్పమని పట్టుపడతాడేమో.

......

ఏదిఏమయినా అనిరుద్‌తో తనకు ఏర్పడిన అనుబంధం రోజు రోజుకి బలపడ్తోందనిపిస్తోంది...వాడికి లాంటి అధ్యాత్మిక విషయాలను గురించి ఉపదేశం ఇవ్వడానికే ఈ అనుబంధం ఏర్పడిందేమో!...

సిగ్నల్ మారగానే గేరుమార్చి కారు ముందుకి పోనిచ్చాడు ప్రొఫెసర్ ఆత్మ.

......

రాత్రి పది గంటలకి వీధి తలుపు తెరచుకుని బయటకి వచ్చి నిలబడ్డాడు అనిరుధ్.

ఆకాశంలో పున్నమి చంద్రుడు మెరుస్తున్నాడు.

కాలనీలో నిశ్శబ్దంగా ఉంది...

నెమ్మదిగా కాంపౌండులోంచి నడచి గేటుదగ్గరకు వచ్చి నిలబడ్డాడు అనిరుద్...

ఆలోచనలతో నిద్ర రావడంలేదు అనిరుద్‌కి...

ఇంట్లో మాట్లాడానికి కూడా ఎవరూ లేరు...

బామ్మకూడా అవేవో మాత్రలు వేసుకుని ఎప్పుడో నిద్రపోయింది. తను ఇంట్లోంచి బయటకి రావడంకూడా తెలియదామెకు.

బామ్మ...చాలా గాఢంగా నిద్రపోతుంది ... నిద్రపోయిందంటే పొద్దెక్కేదాకా లేవనేలేవదు.

రాత్రంతా తను ఇంటి బయటేఉన్నా తెలియదేమో బామ్మకి.

అప్పుడు మెరిసింది అనిరుద్ మస్తిష్కంలో విచిత్రమయిన ఆలోచన ఒకటి.

అవును, ఆ పని ఎందుకు చేయకూడదు?

ఈరాత్రే ఎందుకు చేయకూడదు...?

ఇక ఆలస్యం చేయలేదు అనిరుద్.

గేటు తెరచుకుని బయటకి నడిచాడు...

మలుపు తిరిగి ముందుకి నడుస్తుంటే అతడ్ని నీడలా అనుసరిస్తూ బయల్దేరింది నల్లకుక్క సీజర్."

ఎటు వెళ్తున్నాడో బాగా తెలుసు అనిరుద్‌కి.

శ్మశానానికి!!

ఏడేళ్ళక్రితం స్నిగ్ధను ఖననం చేసిన శ్మశానానికి.

# 31

అరగంటలో తన గమ్యానికి చేరుకున్నాడు అనిరుద్.

కొన్ని గజాలదూరంగా నిటారుగా నిలబడి అతడికేసే చూస్తోంది వెన్నంటి వచ్చిన సీజర్.

గేటుమీద ఎత్తుగా ఉన్న నల్లటి బోర్డుమీద తెల్లటి అక్షరాలు వీధి దీపాల కాంతిలో స్పష్టంగా కనబడుతున్నాయి.

హిందు శ్మశాన వాటిక.

అప్రయత్నంగా అటూ ఇటూ చూసాడు అనిరుద్. రోడ్డుమీద ఎవరూ లేరు.

నెమ్మదిగా గేటులోంచి లోపలికి నడిచాడు...

శ్మశాన ఆవరణలో చీకటిగా ఉంది.

ఎగుడు దిగుడుగా ఉన్న సమాధులు నల్లటి గొంగళ్ళు కప్పుకుని నిద్రోతున్న మనుషుల్లా విచిత్రంగా కనబడ్డాయి అనిరుద్ కళ్ళకి.

అనిరుద్ శ్మశానం లోపలికి నడచి వెళ్ళిపోతుంటే సంశయంలో పడిపోయింది సీజర్ కాసేపు.

రెండడుగులు ముందుకువేసి...గాలిలో ఏదో వాసన పసిగట్టి... గేటుదగ్గరే కూర్చుండిపోయింది.

గతుకుల దారి దాటి సమాధులకేసి కదిలాడు అనిరుద్.

ఊడల మర్రిదాకా నడచి-ఆగిపోయాడు.

చీకట్లో సమాధులన్నీ ఒక్కలాగానే కనిపిస్తున్నాయి.

'మమ్మీ ఎక్కడుంది?'

కిక్కిరిసిఉన్న ఈ సమాధులమధ్య మమ్మీ సమాధి ఎక్కడుందో తెలుసుకునేది ఎలా?

ఇంటినుంచి వస్తున్నపుడు టార్చిలైటు తెచ్చుకోవలసింది.

సందేహిస్తూ మరికొంత ముందుకి నడిచాడు అనిరుధ్. అలానడుస్తుంటే కుడికాలు పెద్దరాయి ఒకదానికిబలంగా కొట్టుకోవడంతో 'అమ్మా' అని అరిచి ముందుకి ఒరిగి కూర్చుండిపోయాడు. కాలి బొట్టనవేలిలో విపరీతంగా నొప్పి పుట్టుంటే పళ్ళు బిగపట్టి చెమ్మగిల్లిన కళ్ళు మూసుకున్నాడు.

రెండు మూడు నిముషాలు అలాగే కూర్చుని—నొప్పి కొంచెం తగ్గాక నెమ్మదిగా కళ్ళుతెరచి చూసాడు.

శ్మశానం నడుమ చితి ఒకటి కాలుతోంది.

చితిలోంచి సన్నటి నిప్పు కణాలు పైకి ఎగిరి పోతున్నాయి.

తన కాలికి కొట్టుకున్న రాయి మీదే కూర్చుని కాలుతున్న చితికేసి చూడసాగాడు అనిరుద్.

ఇంతదూరం వచ్చి మమ్మీని...

మమ్మీ సమాధిని చూడకుండానే వెళ్ళిపోవాలా?

అంతకుముందు ఒకే ఒకసారి చూసాడతను...

కానీ అప్పుడు మిట్టమధ్యాహ్నం!...

డాడీతో ఆరోజు వచ్చాడు!...మేస్త్రీ ఒకతను సమాధీదగ్గర రిపేరు పనేదో చేస్తున్నాడని డాడీ చూడ్డానికని వస్తే తనుకూడా తోడుగా వచ్చాడు...

ఇక్కడే ఎక్కడో ఉండాలి.

మరోసారి శ్మశానం కలియచూసాడు అనిరుద్.

సమాధి ఎక్కడుందో కనిపెట్టలేక మళ్ళీ చితి మంటలకేసి చూస్తూ

కూర్చున్నాడు...

బూడిదయిపోతున్న కర్రలు ఎర్రగా చిటపటలాడుతున్నాయి.

అంతలో రివ్వున గాలి మొదలయింది

చలికి సన్నగా వొణుకుతూ ముడుచుకుని కూర్చున్నాడు అనిరుద్.

గాలి ఉధృతానికి శ్మశానంలోని చెత్త చెదారం పైకిలేచింది.

చల్లారిపోతున్నమంటలు గాలితాకిడికి పెద్దవయ్యాయి...ఆమంటలు కాంతిలో చుట్టుపక్కల సమాధులు స్పష్టంగా కనబడ్డాయి అనిరుద్‌కి. చటుక్కున ఏదో అనుమానం వచ్చి తను కూర్చున్న రాయికేసి చూసు కున్నాడు...

రాయికాదది। సమాధి.

స్నిగ్ధాదేవి

జననం: జనవరి 25, 1957

మరణం ఏప్రిల్ 5, 1982

అంతలోనే చితిమంటలు పూర్తిగా ఆరిపోయి శ్మశానంలో మళ్ళీ చీకట్లు అలుముకున్నాయి...అయితేనేం। అప్పటికే అనిరుద్ ఆ సమాధి తన తల్లిదేనని నిర్ధారణ చేసుకున్నాడు.

చీకట్లో ముందుకి వొంగి సమాధిని తడిమిచూస్తే చేతికి ఎండు టాకులు తగిలాయి...ఆకులన్నీ ఏరిపారేసి సమాధి అంచుమీదే కూర్చు న్నాడు అనిరుద్.

మమ్మీ!

తన మమ్మీ సమాధి అది!...తను పసితనంలోనే పోగొట్టుకున్న మమ్మీ.

మమ్మీ చనిపోయిందని...ఇక్కడ సమాధి చేసారని అంటారు అందరూ...కానీ మమ్మీ చనిపోలేదు—చనిపోయినది మమ్మీ శరీరం. మమ్మీ బతికేఉంది.

ప్రొఫెసర్ అంకుల్ చెప్పిందే నిజం. మమ్మీకి శరీరం లేక పోతే నేం? ఆత్మఉంది కదా?

ఆత్మలలో మాట్లాడవచ్చని కూడా చెప్పాడు ప్రొఫెసర్ అంకుల్

మమ్మీతో మాట్లాడాల్సింది చాలా ఉంది!—

డాడీ గురించి, బామ్మ గురించి—తన స్కూలు గురించి మమ్మీకి చెప్పాల్సింది చాలా ఉంది.

అలాగే—

మమ్మీనడిగి తెలుసుకోవలసింది కూడా చాలా ఉంది.

డాడీనడిగితే సరిగ్గా చెప్పడు—చిన్న పిల్లవాడితో మాట్లాడుతున్నట్లు ఏదీ సరిగ్గా చెప్పడు—మమ్మీ అలా చేయదు. ఏదీదాచకుండా అన్నీ చెప్తుంది.

కానీ—

అసలు మమ్మీతో మాట్లాడేది ఎలా?

ఆత్మలతో ఎవయినా ఎలా మాట్లాడతారు?

ఆరోజు పబ్లిక్‌గార్డెన్‌లో నోరు విప్పి పిలవకపోయినా ప్రొఫెసర్ అంకుల్‌కి తన మనసులోని మాట వినిపించిందికదా? అలాగే మమ్మీ గురించి ఆలోచిస్తూ కూర్చుంటే ... మమ్మీకి తన ఆలోచనలు వినిపిస్తా యేమో!?

ఖబీస్ పెదాలు కదలకపోయినా... అదేమంటోందో తనకు తెలిసి పోయేదికదా!...

ఇదంతా టెలిపతీ అంటాడు ప్రొఫెసర్ అంకుల్.

ఇప్పుడు మమ్మీతో టెలిపతీ చేయాలా?

......

ఒక్కక్షణం ఆలోచించి...సమాధిమీద పద్మాసనం వేసుకుని కూర్చున్నాడు అనిరుధ్.

అలా కూర్చున్నాడోలేదో...అంతవరకు జోరుగా వీస్తున్నగాలి ఠక్కున నిలిచిపోయింది.

కళ్ళు మూసుకున్నాడు అనిరుద్.

శ్మశానంలో రవ్వంత అలికిడైనా లేదు...

అనిరుద్ చేయబోతోందేమిటో కుతూహలంగా చూస్తున్నట్లు... శ్మశాన వాతావరణం స్తబ్దంగా తయారయింది.

కళ్ళు మూసుకుని కూర్చున్న అనిరుధ్ పరిసరాలను మరచి... ఆ సమాధిలో ఖననమయి ఉన్న తన తల్లి గురించే ఆలోచిస్తున్నాడు...

"మమ్మీ!...మమ్మీ..." అని కదులుతున్నాయి అనిరుధ్ పెదాలు.

సమాధిలోంచి తన పిలుపుకి సమాధానం వస్తుందని ఆత్రుతగా ఎదురుచూస్తోంది అనిరుధ్ మనస్సు!

అలా ఎంతసేపు కూర్చున్నాడో...అనిరుధ్‌కే తెలియదు.

ఎంతకీ...ఆశించిన సమాధానం రాలేదు.

ఉన్నట్టుండి అసహనంగా కదిలాడు అనిరుధ్.

ఎవరో తనని గమనిస్తున్నారు!

ఒక్కరో, ఇద్దరో కాదు! వందలమంది...తనకేసే కన్నార్పకుండా చూస్తున్నట్టు అనిపించింది అనిరుధ్ కెందుకో!

శ్మశానంలోని సమాధుల్లోంచి ఒకొక్కరంటూ నిశ్శబ్దంగా లేచి కూర్చుని తనకేసే చూస్తున్నట్టు వింత ఆలోచన!

చటుక్కున కళ్ళు తెరచి చుట్టూ చూసాడు...

ఎవరూలేరు!... సమాధులన్నీ మామూలుగానే ఉన్నాయి. అనవసరంగా కంగారుపడి కళ్ళు తెరచేసినందుకు తనమీదే కోపం వచ్చింది అనిరుధ్‌కి.

దానికితోడు అంతసేపట్నించి పిలుస్తున్నా తల్లి దగ్గర్నించి సమాధానం అందలేదని ఉక్రోషం పొడుచుకుని వచ్చింది.

అపజయం అంటే ఎరుగని వాడి మనస్సుకి దుస్సహంగా ఉందీ పరిస్థితి!...

ఎంత పిలిచినా తల్లి సమాధానం ఇవ్వడంలేదని కళ్ళలో నీరు పొంగింది.

కూర్చున్నవాడు చటుక్కునలేచి నిలబడ్డాడు...చేతులు జోడించి నెమ్మదిగా సమాధి చుట్టూ ప్రదక్షిణం మొదలెట్టాడు.

చెంపలమీదుగా కన్నీళ్ళు కారిపోతుంటే...తల్లితో మాట్లాడి తీరాలన్న కోరిక మరింత బలపడింది అనిరుధ్‌లో ఎంతసేపయినా సరే తల్లిని ప్రసన్నం చేసుకోవాలని పట్టుదలగా ఉంది ఆ పిల్లవాడికి!

మూడుసార్లు ప్రదక్షిణం పూర్తి చేసి మళ్ళీ సమాధిపైన పద్మాసనం వేసి కూర్చున్నాడు అనిరుద్.

"నువ్విక్కడే ఉన్నావని నాకు తెలుసు!...నా మాటలు నీకు వినిపిస్తున్నాయి. నేనేమనుకుంటున్నానో నీకు తెలుస్తూనే ఉంది. అయినా నాతో మాట్లాడవెందుకూ?" అడిగాడు సమాధిని ఉద్దేశించి.

సమాధానం ఏదయినా వస్తుందేమోనని ఆశగా కళ్ళు మూసుకున్నాడు కాసేపు.

అలాంటిదేమీ జరగలేదు!

"నేను గుర్తులేనానీకు? మరచిపోయావా? ఆరోజు గ్యాస్ సిలిండర్ పేలినరోజు...మనిద్దరమే ఉన్నామట ఇంట్లో! నన్ను ఒంటరిగా ఉయ్యాలలో వొదిలేసి నువ్వా వంటింట్లోకి వెళ్ళావట! నేనపుడు మరీ చిన్నవాడిని కాబట్టి నాకు తెలియదు...నువ్వెలా మరచిపోయావు!"

అనిరుధ్ పలుకు విచిత్రంగా ధ్వనిస్తోంది అర్ధరాత్రి నిశ్శబ్దంలో.

"నీ గురించి నేను రోజూ ఆలోచిస్తుంటాను...అంటే నువ్వు ఎప్పుడూ నా ఆలోచనల్లోనే ఉంటావు! నా ఆలోచనల్లోనే ఉండే నీకు నాతో మాట్లాడాలని ఎందుకులేదు? ఏం తప్పు చేసాను నేను?" అని ఆగాడు అనిరుద్...

సమాధికేసి కన్నార్పకుండా చూస్తుంటే...

తన మాటలు ఆమెకు వినిపిస్తున్నాయని బలంగా తోచింది... అయినా...ఎందుకో మాట్లాడటంలేదు తనతో. అక్కడే ఉందామె! అయినా పలకడంలేదు!

ఎందుకు?

తనంటే ఇష్టంలేదా?

ఏం చేసాడని తను?

"నువ్వు నాతో మాట్లాడేంతవరకూ ఇక్కడ్నించి కదలను నేను!" అన్నాడు ఏడుపు ఆపుకుంటూ.

అయినా సమాధానం రాలేదు.

"నీకు తెలుసు... నువ్వు నాకెంత ఇష్టమో!...ఇవాళ నువ్వు

మాట్లాడకపోతే ఇక్కడే... ఈ రాయిమీదే తల బాదుకుని దెబ్బలు తగి లించుకుంటాను...అసలు నన్నెందుకు వొదిలిపెట్టేసి వెళ్ళావు?...ఆరోజు వంటింట్లోకి నీతోపాటు నన్నెందుకు తీసుకెళ్ళలేదు." ఇక ఏడుపు ఆపు కోలేక బిగ్గరగా ఏడ్చేసాడు అనిరుద్.

అలా ఏడుస్తూ...

ముందుకి వొంగి సమాధిమీద తల వాల్చేసాడు.

"అయితే...అంతేనా? నన్ను పలకరించవుకదూ!...నేనేమయినా నీకు లెఖ్ఖలేదుకదూ" అని సమాధిమీద తల బాదుకోసాగాడు ఆ పసివాడు!

సిమెంటుతో చేసిన ఆ సమాధిమీద తలపెట్టి బాదుకుంటుంటే నుదురుచిట్లిపోయి విపరీతమయిన నొప్పి ప్రారంభమయింది!

అయినా ఆగలేదు అనిరుద్.

తల బాదుకోవడం ఆపలేదు.

ధన్! ధన్! ధన్!...తలఅదిరిపోతోంది. అయినా పిచ్చివాడిలా... ఆ శరీరం తనది కాదన్నట్టుగా పైకి లేచిలేచి కొట్టుకోసాగాడు చివరికి...

అలిసిపోయి...ఒంట్లో శక్తంతా హరించుకునిపోయి సమాధిమీద సొమ్మసిల్లి పడిపోయాడు!

నుదుట్లోంచి కారుతున్న రక్తం సమాధిని తడిపేస్తుంటే...వెక్కి వెక్కి ఏడుస్తూ పడుకున్నాడు అనిరుద్.

ఇక మమ్మీ తనతో మాట్లాడదు...ఓడిపోయాడు తను!

ఇక చేసేదిలేక పూర్తిగా నీరసించిపోయి కళ్ళు మూసుకుని పడు కున్నాడు.

......

దూరంగా ఎక్కడో గంటలు మోగుతున్నాయి.

దేవాలయంలోని గంటల్లా లేవు...చర్చి గంటలుకూడా కావు!

గంటలమోత వింటూ అలాగే పడుకున్నాడు అనిరుద్.

అంతలో—విచిత్రమయిన పరిమళం ఒకటి అనిరుద్ నాసికా పుటాలకి తగిలింది! ఏమిటది?

ఛాతీనిండా ఊపిరి పీల్చుకున్నాడు అనిరుద్...మత్తుగా ఉందా

పరిమళం:

"అనిరుద్ బాబా!"

ఎవరది?

భారంగా ఉన్న తల కొంచెం తిప్పి చూడబోయాడు అనిరుధ్. కానీ తలపోటువల్ల తిప్పలేకపోయాడు.

"అనిరుద్ బాబా!" మళ్ళీ పిలిచారెవరో.

తెలిసిన వాళ్ళెవరయినా...తను శ్మశానంలోకి రావడంచూసి అక్కడికి వచ్చేసారా? ఎవరయి ఉంటారు?

ఆలోచించడానికి ప్రయత్నించాడు అనిరుద్...కానీ మస్తిష్కం ఆలోచనలని నిరాకరించింది.

"బాబా!" మళ్ళీ అదే పిలుపు.

అప్పుడు స్ఫురించింది అనిరుద్‌కి...ఆ పిలుపు ఎక్కడ్నించోకాదు తనకెంతో దగ్గర్నించి వినవస్తోందని!

ఆ పిలుపు ఎవరిదోకాదు!...తన తల్లిది!

తలపోటు మరచి ఆనందంగా నవ్వేసాడు అనిరుద్!

మమ్మీ మాట్లాడ్తోంది! తనతో మమ్మీ మాట్లాడ్తోంది!

లేచి కూర్చోవాలనుకున్నాడు కానీ...కదిల్తే అద్భుతమయిన ఆ అనుభూతి ఎక్కడ కరిగిపోతుందోనని కదలకుండా అలాగే పడుకున్నాడు. కళ్ళుకూడా తెరవలేదు.

కాసేపటివరకూ ఏమీ వినబడలేదు.

కొంచెం కంగారుపడ్డాడు అనిరుద్—వెళ్ళిపోయిందా? మమ్మీ?

"బాబా!..."గుసగుసలాడుతున్నట్టు మళ్ళీ అదే పిలుపు వినిపించగానే తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాడు అనిరుధ్ ... ఆనందం పట్టలేకపోతోంది వాడి మనస్సు.

"నేనంటే...నీకెందుకింత ఇష్టం? వినిపించింది ఈసారి ఎంతో స్పష్టంగా.

కళ్ళు తెరచి చూడాలనిపిస్తుంటే బలవంతంగా ఆపుకున్నాడు ఆ కోరికను.

"నువ్వంటే నాకెందుకు ఇష్టం అనడిగితే ఏం చెప్పేది నువ్వు... నువ్వుకాబట్టి" అంది అనిరుధ్ మనసు.

"తల బాదుకున్నావెందుకూ?...నొప్పెట్టడంలేదా?"

"ఇందాక నొప్పెట్టింది. ఇప్పుడు లేదు.

"నాకోసం అంత బాధపడ్డావా? ఎందుకు?"

"నిజంగా నీకు తెలియదా?" అడిగాడు అనిరుధ్.

"తెలియదు. నువ్వు నాతో మాట్లాడాలనుకుంటున్నావని ఇప్పుడే తెలిసింది."

ఆ మాటలు అనిరుధ్‌ని ఆశ్చర్యపరిచాయి.

"నీ గురించి నేను ఆలోచించని రోజంటూ లేదు. అదికూడా తెలియదా నీకు?"

"తెలియదు...నేనంటే నీకింత ఇష్టమనికూడా ఇప్పుడేతెలిసింది."

మరింత ఆశ్చర్యపోయాడు అనిరుధ్.

"చనిపోయిన వాళ్ళ ఆలోచనలని వెంటనే పసిగట్టేస్తారటకదా? ప్రొఫెసర్ అంకుల్ చెప్పాడు మరి..."

"అతడికి అంతగా తెలియవు ఇలాంటి విషయాలు."

"నీకు తెలుసుకదా. మరి నువ్వు చెప్తావా?"

"తప్పకుండా...కానీ మరోసారి"

"మరోసారా...ఈసారి నేను పిలిస్తే వెంటనే పలుకుతావా?" అడిగాడు అనిరుధ్.

"తప్పకుండా."

"నువ్వు నా దగ్గరే ఉన్నట్టు నాకెలా తెలుస్తుంది?"

సమాధానంగా చిన్న నవ్వు వినిపించింది ముందు.

"నువ్వు తెలుసుకోకలుగుతావు అనిరుధ్ బాబా."

ఒక్కక్షణం ఆగి అడిగాడు అనిరుధ్.

"బాబా అని పిలుస్తావెందుకు? డాడీ పిలిచినట్లు బబ్లూ అనరాదూ?"

"ఊహూ ... అయినా మీ నాన్నగారు పిలిచినట్టు నేనెందుకు పిలవాలి?"

ఆ కంఠం వింటుంటే జోలపాట వింటునట్టుగా ఉంది అనిరుధ్‌కి. మత్తుగా కళ్ళు బరువెక్కాయి...ఆ సంభాషణ అలాగే కొనసాగించాలనీ అక్కడే ఉండిపోవాలనీ ఉంది. కానీ...నిద్ర...నిద్ర...

"నిద్ర వస్తోందా?"

"ఊఁ..." అన్నాడు అనిరుధ్ మత్తుగా.

అలా అంటుంటే ఘాటైన పరిమళం మళ్ళీ సోకింది...వెచ్చటి తల్లి ఒడిలో ఒదిగి పడుకుంటున్నట్టు...ఆ సమాధిమీద ముడుచుకుని పడు కున్నాడు...అనిరుధ్...నెమ్మదిగా నిద్రలోకి జారుకున్నాడు...నిద్రేనా అది?!

......

అనిరుధ్‌కోసం శ్మశానం గేటుదగ్గర ఎదురుమాస్తూ కూర్చున్న లాబ్రకార్ కుక్క తక్కునలేచి నిలబడింది. శ్మశానం చీకట్లోకి చూస్తూ అనిరుధ్‌కోసం మొరగసాగింది...లోపల్నించి సమాధానం రాకపోయే సరికి ధైర్యంచేసి నెమ్మదిగా గేటులోంచి శ్మశానం ఆవరణలోకి నడి చింది. గతుకుల కాలిబాటలో వాసన పసిగడ్తూ అనిరుద్ పడుకున్న సమాధి దగ్గరకువచ్చి ఆగిపోయింది.

అనిరుద్ పరిస్థితి ఏమిటో అర్థంకాలేదు సీజర్‌కి.

సందేహంగా అనిరుద్ మొహంమీద నాకింది కాసేపు.

కొంచెమయినా కదల్లేదు అనిరుద్. స్పృహలేనట్టుగా పడుకుని ఉన్నాడు.

పెద్దగా మొరుగుతూ ఆ సమాధిచుట్టూ పరుగెత్తింది సీజర్. అయినా కదల్లేదు అనిరుద్.

ఏదో ఆలోచన వచ్చినదానిలా ఉన్నట్టుండి మొరగడం ఆపేసి... తటాలున శ్మశానం బయటకి పరుగుతీసింది ఆ వేటకుక్క!

......

సరిగ్గా ఆ సమయానికి...టోలీచౌకి అవతల పాతకాలంనాటి బంగళాలో.

నిద్రపట్టక...అసహనంగా పచార్లు చేస్తోంది...

ఫ్రెంచ్ అమ్మాయి జోసెఫైన్।

ఆమె బొంబాయినించి హైదరాబాదుకి వచ్చి అప్పుడే పది రోజులు అవుతున్నాయి.

హైదరాబాదుకి తనంతట తాను రాలేదామె.

నాయకురాలు కాత్యాయని ఆజ్ఞాపిస్తే వచ్చింది.

ఇక్కడ తను చేయవలసిన పనేమిటో అడగలేదు.

కరకింకర భక్తులెవరూ అలాంటి ప్రశ్నలడుగరు। తమకు అందిన ఆదేశాలను మనస్ఫూర్తిగా ఆచరించడమే వారికి తెలుసు.

కాత్యాయని చెప్పినట్టు హైదరాబాదుకి వచ్చి చేరాక పవన్‌కుమార్ ఇంటికివెళ్ళి అతడి ఏడేళ్ళ కొడుకు అనిరుద్‌కి ఫ్రెంచ్ టీచర్‌గా ఉద్యోగం కూడా సంపాదించుకుంది జోసెఫైన్.

పదిరోజులబట్టి అనిరుద్‌కి ఫ్రెంచ్ పాఠాలు చెప్తున్న జోసెఫైన్ అనుకోని విధంగా...వాడంటే ఇష్టం ఏర్పర్చుకుంది. ముద్దుగా ఉన్న ఆ కుర్రాడు ఒక్కసారి చెప్పగానే పాఠం వెంటనే నేర్చుకుంటుంటే ఎంతో ముచ్చటగా ఉందామెకు...వాడ్ని చూస్తుంటే పారిస్‌లో చదువుకుంటున్న తన తమ్ముడు బాబీ గుర్తుకు వస్తాడెందుకో?

అలాంటిది...

ఉన్నట్టుండి ఆరోజు మధ్యాహ్నం కాత్యాయని వచ్చి తనకప్పచెప్పిన పనివిని చలించిపోయింది జోసెఫైన్ ఉరుఫ్ మహిత।

"మహితా। కరకింకరపట్ల నీ శ్రద్ధ నిరూపించుకోడానికి ఇంత కంటే మంచి అవకాశం మరొకటిలేదు।" అంది కాత్యాయని.

"కానీ...ఆ పసివాడిని..." అంది జోసెఫైన్...

ఆమెకేసి సూటిగాచూసి సన్నగా నవ్వింది కాత్యాయని.

"...నీ సందేహం దేనిగురించో తెలుసు నాకు। ఆ కుర్రవాడిపట్ల నువ్వు పెంచుకుంటున్న మమకారాన్ని పక్కకినెట్టి కరకింకరకి అతి ప్రియమయిన నైవేద్యం పెట్టగలిగినపుడే నిన్ను భీష్మినాయక్ సన్నిధిలోకి తీసుకునివెళ్ళకలను।.." అని ఆగింది కాత్యాయని.

తల వంచుకుని ఆలోచిస్తూ కూర్చుండిపోయింది జోసెఫైన్.

"మహితా? ఏమిటి ఆలోచిస్తున్నావ్? ఏడేళ్ళుగా నువ్వు చేస్తు ఉపాసనలో ఈ ఒక్క లోపం ఎందుకు ఉంచుకుంటావ్?... ఈ చిన్న పని మాలో ఎవరయినా సంతోషంగా చేయకలం కాబట్టి ఇది భీష్మనాయక్ నీకోసం ప్రత్యేకంగా కల్పిస్తున్న అద్భుతమైన అవకాశం అని అర్థం చేసుకో?... ఇంకెంత మరో ముఫైరోజుల్లో మనమందరం ఎదురుచూస్తున్న పండగరోజు రానేవస్తుంది। సరిగ్గా ముఫైరోజుల తర్వాత కరకింకర మళ్ళీ నిద్రపోతాడు... నిద్రకుపక్రమించకముందు గత తొమ్మిదేళ్ళుగా తనని ఆరాధించిన భక్తులకి కోరినవరాలిస్తాడు. ఆ పైన... ఈ లోకానికి అధిపతులం మనమే।" అని ముగించింది కాత్యాయని...

కాత్యాయని వెళ్ళాక సంశయంలో పడిపోయింది జోసెఫైన్. ఆ రోజంతా ఆలోచనలతోనే గడిపేసింది.

అర్ధరాత్రి అవుతుండే ఆమెలో కంగారు ఎక్కువయిపోయింది. ఏడేళ్ళక్రితం జూబిన్ మాటలు నమ్మి... అతడి ప్రేమకోసం తనమతాన్నే వొదులుకుని కరకింకర భక్తురాలైంది తను।... ఎన్నోసార్లు ఫ్రాన్స్‌కి తిరిగివెళ్ళిపోవాలనుకుంది కానీ... వెళ్ళలేకపోయింది.

ఇప్పుడు దారుణమయిన పనొకటి అప్పచెప్పారు తనకి. ఆ పని చేయాలనిలేదు... వెంటనే ఇక్కడ్నుంచి ఈ దేశంనుంచే వెళ్ళిపోవాలని ఉంది... కానీ కరకింకరుని ధిక్కరించి ఎక్కడికి వెళ్ళకలదు తను?

తప్పదు।... మనసుని రాయిచేసుకుని కాత్యాయని చెప్పినట్టు చేయక తప్పదు.

నెమ్మదిగా లేచి బెడ్‌రూం పక్కనున్న విశాలమయిన గదిలోకి నడిచింది...

చీకటిగా ఉన్న ఆ గది మధ్యన నిలబడి నల్లటి మైనంవొత్తి ఒకటి వెలిగించింది...

గది మధ్యన ... ఎత్తయిన బల్లమీద నిలిచి ఉంది కరకింకర విగ్రహం.

రెండు నిముషాలపాటు కరకింకర కళ్ళలోకి చూస్తూ నిలబడింది జోసెఫైన్...

అలా చూస్తూ నిలబడితే కరకింకర విగ్రహంలో జీవం ఉన్నట్టు కదలిక కనిపించింది ఆమెకు...కరకింకర కళ్ళలో ఆకుపచ్చరంగు కాంతి తళుక్కుమంది.

దాంతో జోసెఫైన్ మస్తిష్కంలో నగారానాదంమారుమ్రోగింది.

నాదానికి తగ్గట్టు అడుగులు వేయడం మొదలెట్టి అటూ ఇటూ ఊగిపోయిందా అమ్మాయి?...

అలాగే కదుల్తూ...ఒక్కొక్కటంటూ వొంటిమీద బట్టలు విప్పి పడేసింది...అందమయిన ఆ శరీరం మైనంవొత్తి కాంతిలో చిత్రకారుడి కలలా ఉంది.

నగారానాదం...హోరు ఎక్కువయింది.

కరకింకర విగ్రహం ముందు ఒకసారి మోకరిల్లి లేచి నిలబడి నాట్యం కొనసాగించింది జోసెఫైన్...

ఆమె వొంపుల శరీరంలోని అణువణువు నగారానాదానికి స్పందిస్తోంది...బొంగరంలా గిరగిరా తిరుగుతూ తన అధిష్టాన దేవతకు ఉపాసనలు జరిపిందామె...

దాదాపు రెండున్నరగంటలసేపు సాగినఆవిచిత్ర ప్రయాసకి శోషిల్లి కరకింకర పాదాల దగ్గర వెల్లకిలాపడిపోయింది జోసెఫైన్। దెబ్బతిన్న విహంగంలా రొప్పుతూ ఉండిపోయింది చాలాసేపు...

ఆ తర్వాత—తెప్పరిల్లి లేచి నిలబడింది—చేతులు రెండూ పైకెత్తి కరకింకరకేసి చూసింది.

"కుంభీనసా—అష్టోరధా—నీ దాసినినేను—నాశరీరానికి, ఆత్మకు అధిపతివినీవే," అంటూ విగ్రహం ముందు ప్రణమిల్లింది—

నెమ్మదిగాలేస్తూ కరకింకరపాదాలదగ్గరున్న కొడవలినిఅందుకుంది.

అప్పట్నించి మరో ఇరవై నాలుగు గంటల్లో తనపని పూర్తిచేయాలి జోసెఫైన్.

## 32

రాత్రి పన్నెండు గంటలు దాటుతుంటే పెద్దగా మొరుగుతూ డాక్టర్ ఐసాక్ ఇంటి కాంపౌండులోకి దూసుకుని వెళ్ళింది సీజర్.

వీధి తలుపుదగ్గర ఆగి రెండు కాళ్ళతో దానిమీద గీరుతూ బంగళా దద్దరిల్లేలా మొరిగింది—

కాసేపటికి వరండాలో లైటు వెలిగి తలుపు నెమ్మదిగా తెరచు కుంది. అరవై ఏళ్ళ వయసులో ఉన్న డాక్టర్ ఐసాక్ బయటకు వచ్చి సీజర్‌కేసి చికాగ్గా చూసాడు.

"మళ్ళీ బయటకు వెళ్ళిపోయావా?—గెట్ ఇన్" అని సీజర్ లోప లికి వెళ్ళడానికి దారిచ్చాడు.

సీజర్ లోపలికి వెళ్ళలేదు. డాక్టర్ ఐసాక్ తొడుక్కున్న నైట్ కోట్ అంచు పట్టుకుని అతడ్ని బయటకి లాగింది.

"సీజర్! లీవ్ ఇట్!" అని బిగ్గరగా అరచి దాని నోటినుంచి నైట్ కోట్ వెనక్కి లాక్కున్నాడు డాక్టర్ ఐసాక్.

సీజర్ అతడ్ని వొదిలిపెట్టి కాంపౌండు మధ్యలోకి పరుగెత్తింది! అక్కడనిలబడి తోకాడిస్తూ మొరిగింది—అంతలోనే ముందుకి గెంతి తన యజమానికేసి రమ్మన్నట్టు చూసింది.

సీజర్ చేష్టలు కొత్తేమీకాదు డాక్టర్ ఐసాక్‌కి. అడవుల్లో వేటకి వెళ్ళినపుడు తను దారితప్పుతున్నా—లేదా మృగాలవాసన పసిగట్టినా ఇలాగే చేస్తుంది. కానీ, అర్ధరాత్రిపూట ఇంట్లో హాయిగా నిద్రపోతుంటే సీజర్ తనని ఎక్కడికో వెళ్దాం రమ్మనడం చికాకు కల్గించింది. డాక్టర్ ఐసాక్‌కి—

"నో! నేనెక్కడికీ రాను—పద లోపలికి—గెట్ ఇన్‌సైడ్" అన్నాడు కోపంగా.

ఠక్కున మొరగడం ఆపేసింది సీజర్.

డాక్టర్ ఐసాక్‌కేసి దీనంగా చూసి నెమ్మదిగా వెనక్కి వచ్చింది. అది లోపలికి వెళ్తుందికాబోలు అనుకుని పక్కకు జరిగాడు తను.

సీజర్ లోపలికి వెళ్ళకుండా కిందకు వొంగి అతడి పాదాలమీద తలపెట్టి రుద్దసాగింది.

"ఓ జీసస్!" అని ఆశ్చర్యంగా ఆ కుక్కకేసి చూసాడతను! సీజర్ అంతగా ప్రాధేయపడుతోందంటే విశేషంఏదో ఉండేఉండాలి.

దానివెంట వెళితే అసలు సంగతేమిటో తెలిసిపోతుంది। అర్ధరాత్రి పూట నిద్రమానుకుని బయటకి వెళ్ళాలంటే బద్ధకంగానే ఉన్నా సీజర్‌తో వెళ్ళడానికి సిద్ధపడ్డాడు డాక్టర్ ఐసాక్.

"ఓకే—సీజర్ నువ్వేగెలిచావు—ఉండు ఇప్పుడేవస్తాను" అంటూ వెనక్కి వెళ్ళి ఇంట్లోంచి టార్చిలైటు పట్టుకుని బయటకి వచ్చాడు డాక్టర్ ఐసాక్.

ఆనందంగా తోకాడిస్తూ గేటులోంచి బయటకి దారితీసింది సీజర్.

సీజర్ అతడ్ని తిన్నగా శ్మశానంలోకి తీసుకెళ్తుంటే మరింత ఆశ్చర్యపోయాడు ఐసాక్. టార్చ్ వెలిగించి పట్టుకుని గతుకుల దారిలోంచి సమాధుల మధ్యకి నడిచాడు.

అనిరుధ్ స్పృహ తప్పి పడున్న సమాధిదగ్గరకెళ్ళిసీజర్‌కూర్చుండి పోయింది.

"ఓ గాడ్—పవన్‌కుమార్ వాళ్ళ బాబులా ఉన్నాడే" అనుకున్నాడు డాక్టర్ ఐసాక్ టార్చ్‌లైట్ వెలుగులో అనిరుధ్ మొహం చూసి—

అప్పుడే అతడికి అనిరుధ్ నుదుటికి తగిలిన గాయంకూడా కనబడింది.

ఆ కుర్రావాడు అక్కడికి ఎందుకువచ్చాడో ఎలా వచ్చాడో అని ఆలోచించడంకంటే వెంటనే వాడికి చికిత్సచేసి ప్రాణాలు కాపాడటం తన వృత్తిధర్మం అనుకుంటూ తన నైట్ కోట్‌తీసి అనిరుద్‌కి భుజాల దాకా కప్పి వాడిని రెండు చేతుల్లో ఎత్తుకున్నాడు డాక్టర్ ఐసాక్.

అనిరుద్‌ని ఎత్తుకుని డాక్టర్ ఐసాక్ శ్మశానంలోంచి బయటకి నడిచాక...

అంతవరకూ ఆ సన్నివేశాన్ని ఆసక్తితో గమనించిన అదృశ్య ప్రేక్షకులు నిట్టూర్చినట్టు సన్నగా గాలివీచింది।

విశ్రాంతి గృహాల్లోకి వెళ్ళిపోతున్నట్టు సమాధుల్లోకి ఆ ప్రేక్షకులు చేరుకున్నట్టయి...

ముళ్ళ కంపల్లోని కీచురాళ్ళు మళ్ళీ విజృంభించాయి.

......

రాజేశ్వరిదేవి చేసిన ఫోను అందుకున్న డాక్టర్ సుస్మిత ఉన్న పళాన జూబ్లీహిల్స్‌కి బయల్దేరి వచ్చింది.

గేటు దగ్గర కారాపి దిగుతుంటే ఇంట్లోంచి బయటకు నడచివస్తున్న డాక్టర్ ఇసాక్ కనబడ్డాడు ఆమెకు.

డాక్టర్ ఐసాక్‌ని పరిచయం చేసుకుని జరిగిన సంగతి అడిగి తెలుసుకుంది సుస్మిత.

డాక్టర్ ఐసాక్ వెళ్ళాక నెమ్మదిగా ఇంట్లోకి నడిచిందామె. లైట్లన్నీ వెలుగుతున్నాయి ఇంట్లో. ఆమెను చూడగానే మండువాలో కుర్చీ వేసుకుని కూర్చున్న రాజేశ్వరిదేవి చటుక్కున లేచి వచ్చింది.

"వచ్చావా సుస్మితా!" అంటూ చేతులు పట్టుకుని ఏడుపు మొదలెట్టింది.

ఆమెని ఓదార్చి అక్కడే కూర్చోబెట్టి అనిరుద్‌ని చూసివస్తానంటూ లోపలికి వెళ్ళింది సుస్మిత.

తలకి కట్టుకట్టించుకుని మంచంమీద కళ్ళుమూసుకుని పడుకున్నాడు అనిరుద్.

వాడిభుజంమీద చెయివేసి 'అనిరుద్' అని మృదువుగా పిలిచి చూసింది సుస్మిత.

డాక్టర్ ఐసాక్ అంతకుముందు ఇచ్చిన కాంపోజ్ ఇంజక్షన్ ప్రభావానికి కాబోలు గాఢ నిద్రలో ఉన్నాడు అనిరుద్. నెమ్మదిగా అక్కడ్నించి లేచి మళ్ళీ రాజేశ్వరిదేవి దగ్గరకు వచ్చింది సుస్మిత.

ఆమెనుచూసి తల అడ్డంగా తిప్పుతూ అంది రాజేశ్వరిదేవి.

"నాకయితే దిక్కుతోచడంలేదమ్మాయి! అర్ధరాత్రిపూట లేచి శ్మశానానికి వెళ్ళాడంటే వీడిగురించి ఏమనుకోవాలో అర్థంకావడంలేదు. దీనికితోడు...ఆయనెవరో ప్రొఫెసర్ అట! ఈ పిల్లవాడిమీద ప్రయోగాలేవో చేస్తున్నాడీమధ్య! అసలే చిన్నప్పట్నించి వీడికేదో పిచ్చి!... సమయానికి పవన్‌కూడా లేడింట్లో"

"మీరు కంగారుపడకండి ఆంటీ! అనిరుద్‌కి పిచ్చేమీలేదు. చాలా

తెలివయిన కుర్రవాడు. పవన్ గారితో మాట్లాడి నేనే స్వయంగా ట్రీట్మెంట్ ఇస్తాను. మీరు రిలాక్స్ అవ్వండి డాక్టర్ ఐసాక్ చేసిన ఇంజక్షన్‌కి హాయిగా నిద్రపోతున్నాడు అనిరుద్!" అంటూ లేచినిలబడింది.

సుస్మిత వెళ్ళిపోతుందంటే కంగారు పడిపోయింది రాజేశ్వరిదేవి. అనిరుద్ రాత్రి మళ్ళీ లేచిఏదయినా తంటా తెచ్చిపెడ్తాడేమోనని భయంగా ఉందని చెప్పింది.

తప్పనిసరయి ఆ రాత్రికి గెస్ట్‌రూంలో పడుకోవలసి వచ్చింది సుస్మితకి.

......

మర్నాడు ఏమీ జరగనట్టుగా లేచి డైనింగ్ టేబిల్‌దగ్గర పాలు తాగుతూ కూర్చున్నాడు అనిరుద్.

"గుడ్‌మార్నింగ్!" అంటూ అక్కడికి వచ్చింది సుస్మిత.

"అరె! ... నువ్వెపుడు వచ్చావాంటీ? ఆశ్చర్యంగా అడిగాడు అనిరుద్.

"నిన్నరాత్రి!...ఇప్పుడెలా ఉంది నీకు?" అడిగింది కుర్చీలో కూర్చుంటూ.

"బాగానే ఉంది!...ఆంటీ...ఈ కట్టు ఎవరు కట్టారు నాకు!"

"డాక్టర్ ఐసాక్! ఆయనే నిన్ను ఇంటికి చేర్చారు."

"అలాగా!" అని తలతిప్పుకున్నాడు అనిరుద్.

"అనిరుద్...!" పిలిచింది సుస్మిత.

ఏమిటన్నట్టు చూసాడు అనిరుద్.

"ఎందుకెళ్ళావు అక్కడికి?"

ఒక్కక్షణం సందేహించి చెప్పాడు అనిరుద్.

"మమ్మీతో మాట్లాడానికి!"

ఉలిక్కిపడి వెంటనే సర్దుకుంది సుస్మిత.

"మరి మాట్లాడావా? ఏమంటోంది మమ్మీ?"

ఆమెకేసి పరిశీలనగా చూసాడు అనిరుద్...తనతో సిన్సియర్‌గానే మాట్లాడ్తోందనిపించి నెమ్మదిగా చెప్పాడు.

"...మమ్మీ వెంటనే మాట్లాడలేదు...అందుకే సమాధిమీద తల పెట్టి కొట్టుకున్నాను..."

"ఆ తర్వాత?"

"ఆ తర్వాత...మమ్మీతో చాలాసేపు మాట్లాడాను!...ఆంటీ మమ్మీ నన్ను 'అనిరుద్ బాబా' అని పిలుస్తోంది. భలే బావుందికదూ!" అన్నాడు అనిరుద్ హాయిగా నవ్వుతూ.

అనిరుద్ మాటలని సైకియాట్రిస్టుగా అర్థం చేసుకోడానికి ప్రయత్నించింది సుస్మిత.

అనిరుద్‌లోని టెన్షన్స్ ఇలా పరిణామం చెందుతాయనుకోలేదు తనెప్పుడూ.

డెల్యూషన్స్!

అనిరుధ్‌కికూడా స్నిగ్ధకిలాగే డెల్యూషన్స్ ప్రారంభమయ్యాయి. ఇది న్యూరోసిస్‌కి దారితీయకూడదనుకుంటే...అనిరుధ్ మళ్ళీ వాస్తవ ప్రపంచంలోకి రావాలంటే...వెంటనే మానసిక చికిత్స అవసరం.

"ఆంటీ నా మాటలు నమ్మడంలేదుకదూ నువ్వు!" అని అనిరుధ్ అంటుంటే ఆలోచనల్లోంచి బయటపడింది సుస్మిత.

"లేదు బాబూ! ఐ బిలీవ్‌యూ! నువ్వు అబద్ధాలు చెప్పవని తెలుసు నాకు...ఈసారి మీ మమ్మీతో నేనుకూడా మాట్లాడ్తాను" అంటూ అనిరుధ్ చెయి పట్టుకుంది సుస్మిత.

అనిరుద్‌కి టెంపరేచర్ ఉన్నట్టనిపించిందామెకు.

"అరె...నీకు జ్వరం వచ్చినట్టుందే...ఇవాళంతా నువ్వు ఎక్కడికీ వెళ్ళకుండా ఇంట్లోనే రెస్టు తీసుకోవాలి. నీకు జ్వరం పూర్తిగా తగ్గాక మనం మాట్లాడుకుందాం. సరేనా?" అని లేచింది.

రాజేశ్వరిదేవిని వెతుక్కుంటూ పూజ గదిలోకి వెళ్ళింది సుస్మిత. దేవుడి విగ్రహంముందు చేతులు జోడించి కూర్చుని ఉంది రాజేశ్వరిదేవి.

"ఆంటీ అనిరుద్‌కి జ్వరంగా ఉంది. క్రోసిన్ మాత్రలుంటే వేయండి. నేను క్లినిక్‌లో పనిచూసుకుని సాయంత్రం వీలైనంత త్వరగా వచ్చేస్తాను" అని అగింది సుస్మిత.

రాజేశ్వరిదేవి సమాధానం చెప్పకుండా అలాగే కూర్చుంది

"ఆంటీ? ఏమయింది?" పిలిచింది సుస్మిత.

నెమ్మదిగా ఆమెకేసి తిరిగింది రాజేశ్వరిదేవి బాగా ఏడ్చినట్టున్నాయి ఆమె కళ్ళు.

"వాడు నీతో మాట్లాడిందంతా విన్నాను...నాకు మనశ్శాంతిలేదు. ఏదో ఒకటి నా నెత్తిమీదకి వస్తూనే ఉంటుంది."

"అదేమిటి ఆంటీ! ఇదంతా నిజమనుకుంటున్నారా మీరు? అనిరుధ్ మాటలు నమ్మకపోతే వాడు మనసు విప్పి మాట్లాడడు. అందుకే అలా అన్నాను..." అని సుస్మిత ఏదో అనబోతుంటే ఆమెని మధ్యలో ఆపేసింది రాజేశ్వరిదేవి.

"లేదమ్మాయి! నాకు తెలుసు! కోరికలు తీరకుండా చనిపోయిన వాళ్ళు ఇలాగే..." అని రాజేశ్వరిదేవి ఏదో అనబోతుంటే అసహనంగా ఆమెను ఆపేసింది సుస్మిత.

"ఆంటీ! ప్లీజ్...మీరలాంటి భయాలూ అనుమానాలు మనసులోంచి తీసిపారేయండి...స్నిగ్ధ గురించి అలా అనుకోవడం బావుండదు నాకు!"

"నాకోడలి గురించి అలా మాట్లాడ్డం నాక్కూడా బావుండదమ్మా ఆ అమ్మాయి పోయాక ఈ ఇంట్లో రోజుకో వింత సంఘటన జరుగుతుండటంతో ఇల్లు ఖాళీచేసి వెళ్ళిపోయాం. మేమేదయినా ఊహించుకున్నామేమో అనుకోవడానికి లేకుండా అద్దెకుదిగిన ప్రతి ఒక్కరూ ఏదో విధంగా నష్టపోయారు!...ఏడేళ్ళ తర్వాత పవన్ మళ్ళీ ఈ ఇంట్లోకి మారదాం అంటే వాడి మాట కాదనకూడదని ఒప్పుకున్నాను...ఇంట్లోకి వచ్చామోలేదో ఈ గొడవ మొదలయ్యింది." అని ఆగింది రాజేశ్వరిదేవి.

ఆమె భుజంమీద ఆప్యాయంగా చెయివేసి ఎంతో మృదువుగాఅంది సుస్మిత.

"దీనిగురించి మీరు దిగులుపడకండి ఆంటీ...నేనున్నాను కదా! నేను చూసుకుంటాను!"

సుస్మిత చెయి పట్టుకుని ఆమెకళ్ళలో ఏదో వెతుకుతున్నట్టుగా

చూసింది రాజేశ్వరిదేవి.

"ఈ ఇంటికి కానీ...మీ కుటుంబానికి కానీ ఇకమీదట ఎటువంటి ఆపదారాదు! అంతా సవ్యంగానే ఉంటుంది. ఆంటీ...మీకేది కావలసినా నాకు చెప్పండి" అంది సుస్మిత మళ్ళీ...

ఆమెకేసి ప్రేమగా చూసింది రాజేశ్వరిదేవి.

"నన్ను ఆంటీ అని పిలిస్తే ఎలాగమ్మాయి? చనువుగా ఎలా అడుగుతాను ఏదయినా? పవన్ పిలిచినట్టు అమ్మా అని పిలవకూడదా?" అంది.

ఉన్నట్టుండి రాజేశ్వరిదేవి అలా మాట్లాడం ఆశ్చర్యమనిపించింది సుస్మితని అయినా మామూలుగానే నవ్వేసింది.

"అలాగే—ఇకమీదట అలాగే పిలుస్తాను" అని లేవబోయింది. కానీ...రాజేశ్వరిదేవి ఆమె చెయిపట్టి ఆపేసింది.

"సుస్మితా!...నీతో మాట్లాడుతుంటే నా మనిషితో మాట్లాడుతున్నట్టు ఉంటుందమ్మాయి. నిన్న రాత్రి నేనడగ్గానే ఒప్పుకుని ఇక్కడే పడుకున్నావు నువ్వు. ఇంట్లో తోడుగా నువ్వున్నావు కాబట్టే కొండంత ధైర్యం వచ్చింది నాకు. నా ఒక్కదానికే కాదమ్మా...అనిరుధ్‌కి కూడా నువ్వంటే చాలా ఇష్టం...నిన్నొకమాట అడగనా?"

రాజేశ్వరిదేవి మాటలు వింటూ కూర్చున్న సుస్మిత గుండెవేగంగా కొట్టుకోసాగింది.

రాజేశ్వరిదేవి అడగబోతోందేమిటో అర్థమయిందామెకు.

కానీ...

ఏమని జవాబు చెప్పాలి?

సరిగ్గా ఆ క్షణంలో డోరు బెల్ మోగడంతో రాజేశ్వరిదేవి తన మాట మధ్యలోనే ఆపి లేవవలసి వచ్చింది.

రాజేశ్వరిదేవి వెనకనించే తేలిగ్గా ఊపిరి పీల్చుకుంటూ సుస్మిత కూడా పూజగదిలోంచి బయటకి వచ్చింది.

రాజేశ్వరిదేవి తలుపుతెరిస్తే గుమ్మందగ్గర నిలబడ్డ సన్నగా పొడుగ్గా ఉన్న ఫ్రెంచ్ అమ్మాయి జోసెఫైన్ లోపలికి వచ్చింది. రాజేశ్వరిదేవికి

ఆమె వెనకనిలబడ్డ సుస్మితకి చేతులు జోడించి నమస్కారం పెట్టిందా అమ్మాయి.

ఆ అమ్మాయితో ఏ భాషలో మాట్లాడాలో తెలియక సుస్మితకేసి చూసింది రాజేశ్వరిదేవి.

"ఈ అమ్మాయి అనిరుధ్‌కి ఫ్రెంచ్ నేర్పిస్తోంది." అంది.

"అనిరుధ్‌కి ఒంట్లో బాలేదు మరో రెండు మూడు రోజుల వరకు విశ్రాంతి అవసరం" అని జోసెఫైన్‌కి ఆంగ్లంలో చెప్పింది సుస్మిత.

"అనిరుధ్‌కి ఒంట్లో బాలేదా! చూడవచ్చా" అడిగింది జోసెఫైన్.

తలపంకించి ఆమెను లోపలికి వెళ్ళనిచ్చింది సుస్మిత.

అనిరుధ్‌తో మాట్లాడి రెండు నిమిషాల్లో వెనక్కి వచ్చింది జోసెఫైన్.

"అనిరుధ్ నన్నుండమంటున్నాడు మేడమ్. మీకు అభ్యంతరం లేకపోతే—" అని ఆగింది.

"బట్ హీనీడ్స్ రెస్ట్" అంది సుస్మిత.

"మీకాభయం అనవసరం? చిన్నపిల్లలకి ఫ్రెంచ్ భాష ఆడుతూ పాడుతూ సరదాగా నేర్పిస్తాను నేను. నాకివాళ వేరేపనికూడా ఏమీలేదు. అబ్బాయికి తోడుగా ఉండకలను నేను. వాళ్ళనాన్నగారు కూడా ఊరులో లేరటకదా!" అంది జోసెఫైన్

......

అనిరుధ్ దగ్గర జోసెఫైన్ ఉండటానికి రాజేశ్వరిదేవిని ఒప్పించి, క్లినిక్‌కి వెళతానంటూ బయల్దేరింది సుస్మిత. కారుస్టార్టుచేసుకుని రోడ్డు మలుపు తిరిగాక ఎంతో రిలీఫ్ అనిపించిందామెకు.

అదృష్టవసాత్తు ఆ ఫ్రెంచ్ అమ్మాయి వచ్చిందికాబట్టి తనువెంటనే రాజేశ్వరిదేవికి జవాబు చెప్పకుండా తప్పించుకోకలిగింది.

పవన్‌తో పెళ్ళి.

సామాన్యమయిన నిర్ణయంకాదది.

తల్లిమాట కాదనలేక ఒకవేళ పవన్ ఒప్పుకున్నా ...ఇన్నాళ్ళయినా స్నిగ్ధని మరవలేని అతడు తనని మనస్ఫూర్తిగా స్వీకరించగలడా.

అనిరుధ్ తనని తల్లి స్థానంలో చూడకలడా.

ఇవన్నీ ఎలా ఉన్నా...రాజేశ్వరిదేవి మాటేమిటి? సైకియాట్రిస్ట్‌గా తనకు బాగాతెలుసు రాజేశ్వరిదేవికి విచిత్రమైన ఒక కాంప్లెక్స్ ఉంది. కొడుకు ప్రపంచంలోని ఏ స్త్రీకి దగ్గర కాకూడదని కోరుకుంటుంది. అందుకేకదా స్నిగ్ధని పరాయిదానిగానే చూస్తూ వచ్చింది. ఎంతగా కుమిలి పోయేది స్నిగ్ధ.

స్నిగ్ధ చనిపోయినప్పట్నించి రాజేశ్వరిదేవి కోడలులేని అత్త... అందుకే గుణవంతురాలు...

ఒకవేళ అనాలోచితంగా తనీ పెళ్ళికి ఒప్పుకుని ఆమెకు కోడల యితే—నేపథ్యంలో దాగిన అసలు ప్రవృత్తి మళ్ళీ వెలికి వచ్చే అవ కాశంలేదా?...

నో...తను మరో స్నిగ్ధ కాకూడదు.

పవన్‌తో ఈ సంగతులన్నీ వివరంగా చర్చించకుండా అంతపెద్ద రిస్క్ తీసుకోకూడదు. పవన్ వచ్చేవరకు రాజేశ్వరిదేవిని కల్సుకోకపోవ డమే మంచిది.

"ఇవాళసాయంత్రం క్లినిక్‌లో పనిపూర్తి చేసుకుని ఇంటికెళ్ళి పోవాలి...అనిరుధ్‌ని చూసుకోవడానికి అక్కడ జోసెఫైన్ ఉంది కదా" అనుకుంటూ గేరుమార్చి స్పీడు పెంచింది డాక్టర్ సుస్మిత.

......

డాక్టర్ సుస్మిత వెళ్ళాక అనిరుధ్‌తో కబుర్లుచెప్తూ గడిపింది జోసెఫైన్...

అంతరంగలో భయంకరమైన దావానలంచెలరేగుతుంటేఅనిరుధ్‌తో ఎప్పటిలా మాట్లాడలేకపోతోంది ఆ అమ్మాయి.

"జోసెఫైన్ ఎందుకలా ఉన్నావ్? నీ కొక్కడా ఒంట్లోబాగాలేదా" అడిగాడు అనిరుధ్ ఆమెకేసి పరిశీలనగా చూస్తూ.

"ఏంలేదు బాగానేఉన్నానే—" అంది జోసెఫైన్ నవ్వు తెచ్చి పెట్టుకుంటూ.

సూర్యుడు అస్తమించాక ఏ క్షణమయినా కరకింకగ సంకేతం

M.J.B.

అందవచ్చు జోసెఫైన్‌కి ఆ తర్వాత ఒక్కక్షణంకూడా వృధాచేయడానికి ఉండదు. ఎటువంటి సంకోచం లేకుండా కరకింకర ఆజ్ఞ శిరసావహించి ఆ పూర్వ దేవుడి మన్ననలు పొందాలి జాప్యంచేసినా...

సందేహాలకు తావిచ్చినా ఆరసాతల నాయకుడి క్రోదాగ్నికి మసయి పోతుంది జోసెఫైన్.

రాత్రి ఎనిమిది గంటలు దాటినా డాక్టర్ సుస్మిత రాకపోయేసరికి రాజేశ్వరిదేవి కంగారుపడిపోతూ జోసెఫైన్ దగ్గరకు వచ్చింది.

"నీ కభ్యంతరంలేకపోతే ఇవాళరాత్రికి ఇక్కడే పడుకుంటావా? డాక్టర్ సుస్మిత వస్తానని ఎందుకో రాలేదు" అంది వచ్చీరాని ఆంగ్లంలో

"అలాగే" అని తలూపింది జోసెఫైన్.

ఆమెకు తెలుసు...

కరకింకర మనోరథానికి ఆటంకాలుండవు....ఆ రాత్రి...

డాక్టర్ సుస్మిత రావాలనుకున్నా రాలేదు ఆ ఇంటికి.

......

డైనింగ్ రూంలో జోసెఫైన్‌తో కూర్చుని భోంచేసి లేచాడు అనిరుధ్. వాష్‌బేసిన్‌లో చేతులు కడుక్కుని.

"జోసెఫైన్...నాకు నిద్రవస్తోంది పడుకుంటాను" అంటూ బెడ్ రూంకేసి నడిచాడు.

"మందులు వేసుకున్నావ్రా?" అడిగింది రాజేశ్వరిదేవి కంచాలు జరిపేస్తూ.

"ఆఁ"అని నిర్లక్ష్యంగా సమాధానంచెప్పి వెళ్ళిపోయాడు అనిరుధ్.

కాసేపయ్యాక రాజేశ్వరిదేవికూడా పని ముగించుకుని తన గదిలోకి వెళ్తూ—

"నువ్వాగదిలో పడుకో సరేనా?" అంటూ గెస్టురూంకేసి చూపించింది జోసెఫైన్‌కి.

తల పంకించి హాల్లోనే కూర్చుండిపోయింది ఆ ఫ్రెంచ్ అమ్మాయి.

అనిరుధ్ గదిలో లైటు ఆరిపోయాక అసహనంగా రాజేశ్వరిదేవి గది కిటికీకేసి చూస్తూ కూర్చుందామె. రాజేశ్వరిదేవి ఇంకా నిద్రపోలేదు.

ఆమె మెలకువగా ఉన్నంతసేపు తను ఏమీ చేయకూడదు...అలా అరగంటసేపు చూస్తూ కూర్చున్నా లైటు ఆర్పలేదు రాజేశ్వరిదేవి।

కాత్యాయని చెప్పినగడువు మరో గంటలో పూర్తవుతుంది।... ఈలోగా తనకు సంకేతంకూడా అందుతుంది।...టైం గడుస్తుంటే ఆమెలో ఆత్రుత ఎక్కువయిపోతోంది।

ఇక ఉండబట్టలేక రాజేశ్వరిదేవి గదికేసి నడచి లోపలికి తొంగి చూసింది. మంచంమీద గాఢనిద్రలో ఉంది రాజేశ్వరిదేవి. తేలిగ్గా ఊపిరి పీల్చుకుని గదిలోకివెళ్ళి లైటార్పి బయటకు వచ్చింది జోసెఫైన్.

మండువాలోకి వచ్చి నిలబడి తలపైకెత్తి ఆకాశంలోకి చూసింది జోసెఫైన్.

అంతలో.

ఎక్కడ్నించి వచ్చిందోఏమో?! చాటంత గబ్బిలం ఒకటి 'కీచు' మంటూ ఆమె భుజానికి తట్టుకుని పైకి ఎగసింది।...ఆమెచుట్టూ ప్రదక్షిణంచేసి మరుక్షణమే చీకట్లో మాయమయింది.

అదే సంకేతం। దానికోసమే అంతసేపు ఎదురుచూసింది।

ఇక కాలాయాపన పనికిరాదు...

మెరుపులా అక్కడ్నించి కదలి వీధి తలుపు గడియ తీసేసింది జోసెఫైన్. పని పూర్తయ్యాక తను ఒక్క క్షణంకూడా ఆ ఇంట్లో ఉండకూడదు।...గడియ తీయడానికికూడా అపుడు వ్యవధి ఉండకపోవచ్చు.

గడియ తీసిన వెంటనే గెస్టురూంలోకి వెళ్ళింది జోసెఫైన్.

గెస్టురూంలోకి వెళ్ళి ఠక్కున ఆగిపోయిందామె।

ఏమయింది!? టేబిల్‌మీద పెట్టిన తన బ్యాగ్ ఏది?

కంగారుగా...టేబిల్‌కిందా, మంచంకిందా ... బ్యాగ్‌కోసం వెతికింది జోసెఫైన్।...కానీ, బ్యాగ్ జాడలేదు.

బ్యాగ్‌లోనే ఉంది కాత్యాయని తనకిచ్చిన కొడవలి.

ఏమయిపోయింది? ఇప్పుడా కొడవలి లేకపోతే ఎలా?...

ఒకవేళ?

సాయంత్రం అనిరుధ్ గదిలోకి వెళ్ళినపుడు పొరపాటున అక్కడ

పెట్టి మరచిపోయిందా? ఏమో!?

స్వరున వెనక్కి తిరిగి హాల్లోంచి అనిరుధ్ గదిలోకి వెళ్ళింది జోసెఫైన్. బెడ్‌లైట్ వెలుగులో మంచంమీద దుప్పటి కప్పుకుని పడుకున్న అనిరుధ్ ఆకారం అస్పష్టంగా కనబడిందామెకు...చప్పుడు చేయకుండా గదిలో తనబ్యాగ్ కోసం వెతకసాగింది జోసెఫైన్. బ్యాగ్ కనబడక చెమటలు పట్టేసాయి ఆమెకు!...కాత్యాయని పెట్టిన గడువుకి సరిగ్గా పది నిమిషాలే మిగిలాయి. కానీ...తన దగ్గర కరకింకర ఆయుధం లేదు.

ఏం చేయాలిపుడు?

ఆరాటపడుతూ గదిమధ్యన నిలబడిపోయిందామె.

అప్పుడు...

చటుక్కున గదిలో లైటు వెలిగింది!

ఉలిక్కిపడింది జోసెఫైన్.

స్విచ్‌బోర్డుదగ్గర సన్నగా నవ్వుతూ నిలబడి ఉన్నాడు అనిరుధ్! వాడిచేతిలో మెరుస్తోంది...కరకింకర కొడవలి.

"జోసెఫైన్! దీనికోసమేనా వెతుకుతున్నావు?" అన్నాడు అనిరుధ్ ఆమె కళ్ళలోకి చూస్తూ.

ఆశ్చర్యంలోంచి తేరుకోలేక వెనక్కితిరిగి మంచంకేసి చూసింది జోసెఫైన్.

మంచం మధ్యన తలగడాలు వరుసగాపెట్టి వాటిమీద దుప్పటి కప్పిఉంది.

అంటే!

తనాగదిలోకి వస్తుందని అనిరుధ్‌కి ముందే తెలుసా?

తన పథకం ఏమిటో పసిగట్టాడా ఈ క్రూరవాడు.

"జోసెఫైన్!" మళ్ళీ పిలిచాడు అనిరుద్.

నెమ్మదిగా తిరిగి చూసింది జోసెఫైన్. కానీ...గొంతెండిపోయి నోటమాటరాలేదు ఆమెకు!...అనిరుద్‌కేసి బ్లాంక్‌గా చూస్తూ నిలబడిపోయింది.

"తీసుకో జోసెపెన్—ఇది నీదేకదా?" అన్నాడు అనిరుధ్.

జోసెఫైన్ ఆలోచనలు సాగడంలేదు। యాంత్రికంగా ఒకొక్క అడుగులేసుకుంటూ ముందుకెళ్ళింది...వొణుకుతున్న చేతులతో అనిరుధ్ అందించిన కొడవలి తీసుకుంది.

ఆమెను పూర్తిగా అర్థం చేసుకుంటున్నట్టు...

ఆమె చరిత్ర ఏమిటో తనకు తెలిసినట్టు...జాలిగా చూసాడామెను,

ఆ చూపులకి తట్టుకోలేకపోయింది జోసెఫైన్। అనిర్వచనీయమయిన ఆవేదనతో కృంగిపోయింది ఆమె మనసు.

"జోసెఫైన్।...బాధపడకు ఏది చేయడానికి వచ్చావో ఆ పని పూర్తి చెయి." అన్నాడు అనిరుద్.

అప్పుడు వినబడింది జోసెఫైన్‌కి దూరంగా ఎక్కడ్నించో నగారానాదం।

నగారానాదం వింటున్న జోసెఫైన్‌కి ఇంటిబయట కారు వచ్చి ఆగిన శబ్దం వినబడలేదు.

నగారానాదంతో ఆమె మస్తిష్కం మార్మ్రోగుతుంటే క్రమంగా కొడవలి పట్టుకున్న చేతిలో కదలిక వచ్చింది। నెమ్మదిగా చెయి పైకెత్తింది।

తన కుడిచెయి ముందుకి చాపి ఆమెకేసి చిరునవ్వు నవ్వాడు అనిరుధ్...నీక్కావలసింది నువ్వు తీసుకెళ్ళు అంటున్నట్టు చూసాడు అనిరుధ్.

నన్ను హింసపెట్టినా...అవిటివాడిని చేసినా ఫర్వాలేదు...నీకు రవ్వంత ఆనందాన్ని ఇవ్వకలిగితే నాకంతే చాలు అంటున్నాయి ఆ చూపులు.

అనుతాపంతో నిండిపోయింది జోసెఫైన్ మనసు.

ఓ జీసస్।...ఓ గాడ్।

ఏడేళ్ళ తర్వాత అనుకోనివిధంగా తన దైవాన్ని తలచుకుంది జోసెఫైన్.

కొడవలి పట్టుకున్న చెయి ఎత్తినట్టే ఉంది కానీ...జోసెఫైన్ శరీరంలోని శక్తంతా హరించుకుని పోయినట్టుంది.

నిస్సహాయంగా ఎదురుగా ఉన్న అనిరుద్‌కేసి చూస్తూ నిలబడితే...

అంతవరకూ ఆమెకు వినిపిస్తున్న నగారానాదం హోరు సన్నగిల్లింది.

అప్పుడు మెదలింది ఆమె మనసులో లీలగా ఒక ఆలోచన... ఆ కుర్రవాడు సామాన్యుడుకాదు! కారణ జన్ముడు మెరుస్తున్న వాడి కళ్ళలోని తేజస్సు ఇహలోకానికి సంబంధించింది కాదు.

అందుకేనేమో...భీష్మినాయక్ ఈ ఘోరం తలపెట్టాడు!

"జోసెఫైన్!...నువ్వు మంచిదానివే! పారిస్‌లో నీ తమ్ముడు బాబీ ఉన్నాడన్నావుకదా? వాడిదగ్గర కెళ్ళు." అన్నాడు అనిరుద్ నిలబడ్డ చోటునించి కదలకుండా.

ఆ మాటలు వినగానే దుఃఖః పెల్లుబికి...ఆర్తనాదంలా ఆమెనించి వెలువడింది ఒక కేక.

అంతర్మథనంతో ఆమె తల్లడిల్లుతున్నపుడు.

దబేలున ఆ గది తలుపులు తోసుకుంటూ లోపలికి వచ్చాడు పవన్!

తన ప్రాణానికి ప్రాణమయిన అనిరుద్‌కి రెండే రెండడుగుల దూరంలో కొడవలి పైకెత్తి పట్టుకుని నిలబడ్డ జోసెఫైన్‌ని చూసి నిశ్చేష్టుడయ్యాడు ఒక్కక్షణం.

ఆ ఒక్కక్షణంలోనే అతడికి ఏడేళ్ళకితం ఉస్మానియా హాస్పిటల్ బర్న్స్ వార్డులో...ఆయా వేషంలో వచ్చి స్నిగ్ధని అమానుషంగా గాయపరచిన దుర్మార్గుడు గుర్తుకొచ్చాడు. అంతే!...

"యూ బిచ్!" అంటూ ఒక్క ఉదుటున జోసెఫైన్‌మీద పడ్డాడు.

పవన్ ఆ అమ్మాయి చెయి పట్టుకుని మెలి వేయబోతుండగా వాళ్ళిద్దరి మధ్యకు వచ్చేసాడు చిన్నారి అనిరుద్.

"డాడీ!...వొదిలేయి...లీవ్‌హర్." అని బిగ్గరగా అరవసాగాడు.

ఆ పెనుగులాటలో జోసెఫైన్ చేతిలోని కొడవలి అనిరుద్‌కి ఎక్కడ తగుల్తుందోనని పవన్ భయపడ్డంతో అతడిపట్టు కొంచెం సడలింది.

అతడ్ని వెనక్కి ఒక్క తోపు తోసి బయటకు పరుగుతీసింది జోసెఫైన్.

"ఆగు" అంటూ అనిరుద్‌ని పక్కకు తోసేస్తూ పవన్‌కూడా

బయటకు పరుగెట్టాడు.

"డాడీ! ప్లీజ్. జోసెఫైన్‌ని వొదిలేయ్" అని వెనుకనించి అనిరుద్ అరుస్తున్నా వినకుండా జోసెఫైన్‌ని వెంబడిస్తూ కాంపౌండు లోంచి గేటుకేసి పరుగెట్టాడు పవన్.

గేటుదగ్గర ఒకే ఒకక్షణం ఆగాడు...జోసెఫైన్ ఎటు వెళ్ళిందో చూడ్డానికి.

వీధి మలుపుదగ్గర వేగంగా సాగిపోతున్న ఆ ఫ్రెంచ్ అమ్మాయి ఆకారం కనబడి అటుకేసి కదలబోయాడు పవన్...

కానీ...

అంతలో వెనకనించి బరువయిన కర్ర ఒకటి విసురుగా అతడి తలమీద పడింది.

విపరీతమయిన ఆ బాధను తట్టుకోలేక ముందుకు ఒరిగాడు పవన్.

కళ్ళముందు చీకట్లు కమ్ముకుంటుంటే తనని పడగొట్టినదెవరో చూడటానికి ప్రయత్నించాడు...

నుదుటిమీద కాసంత బొట్టు...తెల్లచీర...ఇట్టే కనబడి అదృశ్య మయింది.

## 33

దుర్భరమయిన తలపోటుతో కళ్ళు తెరచి చూసాడు పవన్.

బెడ్‌రూం కిటికీలోంచి ఏటవాలుగా ఎండపడ్తోంది బాగా పొద్దెక్కింది.

నెమ్మదిగా లేచి కూర్చుంటుంటే క్రితంరాత్రి జరిగింది మెరపులా గుర్తుకొచ్చింది అతడికి.

రోడ్డుమీద పడిపోయిన తను ఇంట్లోకి ఎలా వచ్చేసాడు?...

గుర్తు చేసుకొనడానికి ప్రయత్నిస్తే లీలగా గుర్తుకొచ్చింది...

అరుపులు విని రాజేశ్వరిదేవి లేచివచ్చి...పక్కింటివాళ్ళ సహాయంతోతనని ఇంట్లోకి చేర్చిందని!...ఆ తర్వాత ఎవరో డాక్టర్ ఐసాక్‌ని పిలిపించి తలకి తగిలిన దెబ్బకి మందుకూడా రాసారు.

......

అంతలో తలుపు తోసుకుని గదిలోకి వచ్చాడు అనిరుద్.

"గుడ్‌మార్నింగ్ డాడీ! ఎలా ఉంది ఇప్పుడు నీకు?" అడిగాడు దగ్గరకి వస్తూ.

సమాధానం చెప్పబోయి అనిరుద్ తలకి కట్టినకట్టు చూసి ఉలిక్కిపడ్డాడు పవన్.

"బబ్లూ! ఏమిటిది? ఆ రాక్షసి చేసినపనా ఇది?" అడిగాడు అనిరుద్‌ని దగ్గరకి తీసుకుంటూ.

"లేదు డాడీ. జోసెఫైన్ నన్నేమీ చేయలేదు."

"మరయితే ఈ కట్టేవిటి?"

అనిరుద్ సమాధానం చెప్పబోయేంతలో కాఫీగ్లాసు పట్టుకుని గదిలోకి వచ్చింది రాజేశ్వరిదేవి.

"నేను చెప్తానురా కన్నా...వీడున్నాడు చూడు. వీడి మూలంగానే జరుగుతోంది అరిష్టం మనింట్లో. నాకు మనశ్శాంతిలేకుండా చేస్తున్నాడు" అని రాగాలు తీసి మొదలెట్టింది.

నెమ్మదిగా అక్కడ్నించి బయటకి కదిలాడు అనిరుద్.

"అసలేం జరిగిందో చెప్పమ్మా...ఆ అమ్మాయి జోసెఫైన్ మనింట్లో ఎందుకుంది? ఏమిటిదంతా కొంచెం అసహనంగా అడిగాడు పవన్.

తన ధోరణిలో జరిగిందంతా చెప్పింది రాజేశ్వరిదేవి.

రోజు రోజుకి విచిత్రంగా మారుతున్న అనిరుద్ ప్రవర్తన గురించి తలచుకుంటే బాధతో మనసు బరువెక్కుతోంది.

కానీ...

ఇప్పుడు ఆలోచించవలసింది దానిగురించి కాదు.

ఒక పథకం ప్రకారం ఇంట్లోకి ప్రవేశించి అనిరుద్‌ని అటాక్ చేయాలనుకున్న జోసెఫైన్ గురించి.

పైగా ఆ అమ్మాయి ఒంటరిగాలేదు. ఇంటిబయట తన వెనకనించి దెబ్బ కొట్టింది ఆమె స్నేహితులే.

తన కుటుంబాన్ని నాశనం చేయాలనుకుంటున్న అజ్ఞాత శత్రు

లెవరయి ఉంటారు?

ఈ మిస్టరీని వెంటనే చేదించకపోతే స్నిగ్ధని కోల్పోయినట్టు—అనిరుద్‌ని కూడా?... నో! అలా జరక్కూడదు.

భయంకరమయిన ఆ ఆలోచనను పక్కకుతోసేస్తూ చటుక్కున లేచి నిలబడ్డాడు పవన్.

"ఎక్కడికిరా?" అడిగింది రాజేశ్వరిదేవి.

సమాధానం చెప్పకుండా బాత్‌రూంకేసి నడిచాడు పవన్.

"ఒరేయ్ కన్నా ఇవాళ ఆఫీస్‌కి సెలవుపెట్టరా!" అని అతడ్ని ఆపాలని చూసింది.

"లేదమ్మా...నన్ను ఆపకు!" అంటూ గబగబ రెడీఅయి బయల్దేరాడు పవన్.

కారు స్టార్టుచేసి బయల్దేరబోతుంటే పోర్టికోలో నిలబడ్డ అనిరుద్ దగ్గరకు వచ్చాడు.

"డాడీ...డూ యూ లవ్‌మీ?"

బ్రేక్ నొక్కిపట్టి అనిరుద్‌కేసి ప్రేమగా చూసాడు పవన్.

"అదేవిటి బబ్లూ! నువ్వంటే నాకు చాలా ఇష్టం! తెలియదానీకు!" అన్నాడు.

అయితే ఒకరూటిస్తావా?"

"ఏమిటది?"

"...జోసెఫైన్‌ని ఆపవద్దు...ఫ్రాన్స్‌లో వాళ్ళ తమ్ముడు బాబీ ఉన్నాడు. ప్లీజ్! నా కోసం! జోసెఫైన్‌ని వెళ్ళిపోనీ!" అర్థిస్తున్నట్టు అన్నాడు అనిరుద్.

అనిరుద్‌ని చాలా ప్రశ్నలడగాలనిఉంది పవన్‌కి...కానీ టైంలేదు.

"ఓకే బబ్లూ!...చూద్దాం!" అనేసి కారు ముందుకి పోనిచ్చాడు...

......

డిప్యూటీ కమీషనర్ ఆఫ్ పోలీస్...మిశ్రా ఫోన్‌లో కంట్రోల్ రూం వాళ్ళకి ఆదేశాలిస్తుంటే అతడి ఎదురుగా కుర్చీలో కూర్చునిఉన్నాడు పవన్.

ఫోన్ పెట్టేసి పవన్‌కేసి తిరిగాడు మిశ్రా.

"ఆ ఫ్రెంచ్ అమ్మాయికోసం గాలించమని ఇన్‌స్ట్రక్షన్స్ ఇచ్చా నండీ...లెటఅజ్‌సీ! ఎయిర్‌పోర్టుకో, రైల్వేస్టేషన్‌లో హైవేమీద మావాళ్లు ఆ అమ్మాయికోసం నిఘావేసి ఉంటారు వై. డబ్ల్యూ. సి. యే హాస్టల్ గేటుదగ్గర సివిల్ డ్రెస్‌లో మా ఆఫీసర్లు ఇద్దరు నిలబడ్డారు" ఒకవేళ ఆ అమ్మాయి ఇంకా సిటీలోనే ఉందంటే తప్పకుండా పట్టుబడుతుంది!" అని ఆగాడు మిశ్రా.

"ఆ అమ్మాయి హాస్టల్‌కి వెళుతుందంటారా?" అడిగాడు పవన్.

"నో! వెళుతుందని నేను కూడా అనుకోవడంలేదు. ఎందుకయినా మంచిదని ఆ ఏర్పాటు కూడా చేయించాను. ఇవాళ కనక ఆ అమ్మాయి గురించి ఎటువంటి ఇన్ఫరమేషన్ దొరక్కపోతే సెర్చ్‌వారెంట్ ఇష్యూ చేయించి ఆ అమ్మాయిగది సోదా చేయిస్తాను." అన్నాడు డి. సి. పి మిశ్రా.

"థాంక్యూ! మీకు చాలా శ్రమ..." అని పవన్ ఏదో అనబో తుంటే చెయిపైకెత్తి ఆపాడు డి.సి.పి. మిశ్రా.

"ఇందులో శ్రమ ఏమీలేదు పవన్‌గారూ! నా డ్యూటీ నేను చేస్తు న్నాను" అన్నాడు.

అంతలో ఆర్డర్లీ ఇద్దరికీ కాఫీ తెచ్చి టేబిల్‌మీద పెట్టాడు.

కాఫీ తాగుతూ కొంచెం రిలాక్స్ అయి మిశ్రాకేసి చూసాడు పవన్.

డి.సి పి. మిశ్రా గురించి...అంత పోలీస్ ఆఫీసర్‌గా అతడి సామర్థ్యం గురించి వినడమే కానీ అతడ్ని కలుసుకోవడం అదే మొదటి సారి! ఆఫీసురూంలోకి రాగానే మిశ్రా మాట్లాడిన పద్ధతి చూసి మంచి అభి ప్రాయం ఏర్పడింది పవన్‌కి. క్రితంరాత్రి జరిగిన సంఘటన గురించి జూబ్లీహిల్స్ పోలీస్‌స్టేషన్‌లో రిపోర్టు నమోదు చేయించి మిశ్రా ఆఫీసుకి వచ్చాడు తను. జరిగింది టూకీగా తెలుసుకుని వెంటనే డైనమిక్‌గా ఆక్షన్ తీసుకున్నాడు మిశ్రా. తనని వేధిస్తున్న సమస్యకు పరిష్కార మార్గం మిశ్రా చూపించగలడని ఎందుకో అనిపించింది పవన్‌కి.

"ఓ కే మిస్టర్ పవన్. ఇప్పుడు చెప్పండి మీరిందాక చెప్తానన్న బ్యాక్‌గ్రౌండ్!..." అన్నాడు మిశ్రా కాఫీ కప్పు పక్కకిజరిపేస్తూ.

"వివరంగా చెప్పాలంటే మీరు కొంత టైం ఇవ్వవలసి ఉంటుంది. ఇది క్లుప్తంగా చెప్పగలిగే విషయంకాదు? నేను చెప్పేది విచిత్రంగా ఉంటుంది।..." అని ఆగాడు పవన్.

"ఏడేళ్ళక్రితం ఖండాలాలో ఓ ఫ్రెంచ్ అమ్మాయి ఎవరో వచ్చి అటాక్ చేసిం దంటేనే తెలుస్తోంది దీనివెనక విచిత్రమయిన కథఏదయినా ఉంటుందని... మొదట్నుంచి ఏదీదాచకుండా చెప్పండి!" అని కళ్ళుమూసుకుని కుర్చీలో వెనక్కివాలి కూర్చున్నాడు డి.సి.పి. మిశ్రా.

నెమ్మదిగా ఒక్కొక్క విషయం చెప్పసాగాడు పవన్.

స్నిగ్ధతో పెళ్ళయి హనీమూన్‌కి ఖండాలా వెళ్తుంటే దారిలో కారా గడం దగ్గర్నుంచి మొదలెట్టి...ఆర్కియాలజిస్టుగా కరకింకర గురించి తను చేసిన పరిశోధనలు...చివరికి గ్యాస్ సిలిండర్ ప్రేలుడులో స్నిగ్ధ పూర్తిగా కాలిపోవడం...ఉస్మానియాలో ఆయా వేషంలో వచ్చిన ఆగంత కుడు స్నిగ్ధ చెయి నరికేయడం...ఏదీ దాచకుండా చెప్పాడు.

అతడి మాటలకి ఎక్కడా అడ్డురాకుండా వింటున్న మిశ్రా స్నిగ్ధ దుర్మరణం గురించి విని చటుక్కున లేచి కూర్చున్నాడు.

"వైట్ ఎ మినిట్ మిస్టర్ పవన్!...ఇది జరిగి ఏడేళ్ళవుతోంది కదూ?...ఐ థింక్...మీ మిసెస్ కేసు ఇంకా క్లోజ్ చేయలేదు మాడిపార్టు మెంట్‌వాళ్లు!" అన్నాడు.

మిశ్రాకేసి ఆశ్చర్యపోయి చూసాడు పవన్.

"...గ్యాస్‌ప్రేలుడు ప్రమాదవశాత్తు జరిగిందని ఫైలు క్లోజ్‌చేసే స్తారే?..." అన్నాడు.

"కానీ...ఆమె చెయినరికేసి పారిపోయిన ఆ దుర్మార్గుడి జాడ తెలియలేదుకదా పైగా ఆ మధ్య ఇంటర్‌పోల్‌నుంచి మాకొక ఇంక్వైరీ వచ్చింది...మనదేశంలో విచ్‌కల్ట్ వాళ్ళ ఆక్టివిటీ ఎలా ఉందో తెలియ చేయమని. నేననుకోవడం...దాని గురించే మళ్ళీ ఇన్వెస్టిగేషన్ మొదలెట్టి నట్టున్నారు." అన్నాడు డి.సి.పి మిశ్రా.

"బట్! విచ్‌కల్ట్...?" ఆగాడు పవన్ సందేహంగా.

"అవును మిస్టర్ పవన్ ఏడేళ్ళక్రితం జరిగిన ఆ దుస్సంఘటన

గురించి అందరూ మరచిపోయినా మా వాళ్ళు మరచిపోయినట్టులేదు. దానికీ...మనదేశంలో రహస్యంగా సాగుతున్న విచ్ కల్ట్ ఆక్టివిటీకి ఏదో సంబంధం ఉందనే అనుకుంటున్నారు...నన్నడిగితే మీ అబ్బాయిమీద జరిగిన దాడికూడా అలాంటిదే నంటాను ... నన్నడిగితేఅయినా ఆ విగ్రహం గురించి క్షుణ్ణంగా స్టడీచేసారన్న మీకేదీని గురించి ఎక్కువగా తెలిసుండాలే?" అన్నాడు మిశ్రా.

"నా స్టడీలో కరకింకరని ఆరాధించే వాళ్లు ఇలాంటి దారుణాలు చేసేవారని తెలిసినమాట వాస్తవమే! కానీ ... ఈ విషయాలను గురించి మీ డిపార్టుమెంటువాళ్ళు అంతగా పట్టించుకోరేమో అనుకున్నాను. అందుకే నా అనుమానం బయటపెట్టలేదిన్నాళ్ళు ... కానీ ఒకటి చెప్పండి ఈ రోజుల్లో కూడా నిజంగానే విచ్ కల్ట్ ఉందంటారా? ఒక విగ్రహానికి శక్తులేవో ఆపాదించి దానికోసం ఇంత మూఢంగా ప్రవర్తించే వారుంటారా?" అడిగాడు పవన్.

అతడి మాటలు విని అదోలా నవ్వాడు మిశ్రా.

"మూఢ విశ్వాసాల గురించి మీకు తెలియందేముంది? ఈరోజుల్లో కూడా సతీసహగమనం పేరిట సజీవ దహనం జరగడంలేదా? మనం మారమండీ...శతాబ్దాలు దొర్లిపోతున్నా మనం ఇలాగే ఉంటాం!"

మిశ్రా మాటలు విని తలపంకించాడు పవన్!

"ఇంతకీ స్నిగ్ధ కేసు టేకప్ చేసిందెవరూ? నేనాయన్ని కలుసుకోవచ్చా?" అడిగాడు.

"ఇది చాలా కాన్ఫిడెంషియల్ ఇన్వెస్టిగేషన్ నాక్కూడా వివరాలు సరిగ్గా తెలియవు. స్పెషల్ బ్రాంచ్ వాళ్ళు హేండిల్ చేస్తున్నారనివిన్నాను. ఎనీవే వాళ్ళకి అభ్యంతరం లేకపోతే మిమ్మల్ని పరిచయంచేస్తాను మీరిచ్చే ఇన్ఫర్మేషన్ వాళ్ళకి చాలా పనికొస్తుంది." అన్నాడు మిశ్రా.

సంభాషణ ముగించి అతడిదగ్గర సెలవుతీసుకుని బయటకి నడిచాడు పవన్.

......

ఇంటిదగ్గర కారు దిగుతూ రోడ్డుకి ఒక పక్కగా నిలిపిన రెండు కార్లకేసి ఆశ్చర్యంగా చూసాడు పవన్.

అందులో తెల్ల ఫియట్ కారు డాక్టర్ సుస్మితది...రెండవది ప్రొఫెసర్ ఆత్మారాంది.

పవన్ డ్రాయింగ్ హాల్లోకి రాగానే అంతవరకు డాక్టర్ సుస్మిత మాట్లాడుతున్న ప్రొఫెసర్ ఆత్మ లేచి ముందుకు వచ్చారు.

"మీ కోసం అరగంటనించి ఎదురు చూస్తున్నాం!..." అన్నాడు.

"పోలీస్ కమీషనర్ ఆఫీసుకి వెళ్ళి వస్తున్నాను" అన్నాడు పవన్ సోఫాలో వాలిపోతూ.

ప్రొఫెసర్ ఆత్మ తల పంకించాడు.

"ఆ అమ్మాయి జాడ తెలిసిందా?" అడిగింది సుస్మిత.

"లేదు-ప్రయత్నిస్తున్నారు" అన్నాడు పవన్ ముక్తసరిగా.

ప్రొఫెసర్ ఆత్మ గొంతు సవరించుకున్నాడు.

"ఇందాకట్నించి నేనూ, డాక్టర్ సుస్మితగారు మీ అబ్బాయి గురించే చర్చించుకుంటున్నాం మా ఇద్దరి అభిప్రాయాలు" అని అతనేదో అనబోతుంటే చికాగ్గా అతడి మాటలకి అడ్డు వచ్చాడు పవన్.

"ప్రొఫెసర్ ఆత్మా...ఇది అనిరుద్ మానసిక శక్తులను గురించి చర్చలు పెట్టుకునే సమయంకాదు. నిన్న రాత్రి ఆ అమ్మాయి మావాడి మీద దాడిచేసింది? సమయానికి నేను వచ్చి ఉండకపోతే వాడి ప్రాణాలే పోయేవి? ప్లీజ్...మీ డిస్కషన్స్ ఆపండి! ప్రాక్టికల్‌గా నా కేదయినా సహాయం చేయగలిగితే చేయండి అంతే!" అన్నాడు నిర్మొహమాటంగా.

కొంచెం ఆగి జవాబిచ్చాడు ఆత్మ.

"పవన్! నేనూ ఆ ప్రయత్నంలోనే ఉన్నాను. మీకభ్యంతరం లేకపోతే అనిరుద్‌తో ఒక చిన్న ప్రయోగం చేద్దామనుకుంటున్నాను."

"ప్రయోగమేమిటి?" చురుగ్గా ఆత్మకేసిచూసి అడిగాడు పవన్.

డాక్టర్ సుస్మిత ముందుకి జరిగి కూర్చుని చెప్పింది.

"మొన్నరాత్రి అనిరుద్ ఒంటరిగా శ్మశానంలోకి వెళ్ళి...స్నిగ్ధ ఆత్మతో మాట్లాడానని చెప్తున్నాడు. అది నిజమేనని నమ్ముతున్నారు ప్రొఫెసర్ ఆత్మ ఇప్పుడు సియోంగ్స్‌చేసి అనిరుద్‌ని అందరి సమక్షంలో స్నిగ్ధతో మాట్లాడిస్తానంటున్నారు."

ఆ మాటలు విని మతిపోయినట్టయింది పవన్‌కి. ప్రొఫెసర్ ఆత్మ కేసి అపనమ్మకంగా చూసాడు.

"ఏమిటి మీరంటోంది?" అనిమాత్రం అడగకలిగాడు.

"అవును పవన్‌గారూ—అనిరుద్ గురించి నేను ఏర్పర్చుకున్న అభిప్రాయాలు రోజు రోజుకి బలపడుతున్నాయి. శ్మశానంలో సమాధి మీద పడుకుని తన తల్లితో మాట్లాడానని అనిరుద్ చెప్తుంటే సైకియాట్రిస్టుగా డాక్టర్ సుస్మితగారు నాతో ఏకీభవించటంలేదు. అనిరుద్‌కి డెల్యూషన్స్ వస్తున్నాయని అంటున్నారు. అలాగే ఈ విషయాల గురించి ఎన్నడూ పట్టించుకోని మీరు లోతుగా ఆలోచించకుండా ఇదంతా నాన్సెన్స్ అని కొట్టిపారేయవచ్చు...కానీ ప్లీజ్ నాకొక అవకాశం ఇచ్చి చూడండి. మీ సమస్యలకి పరిష్కారం దొరకవచ్చు!" అన్నాడు ఆత్మ ఎంతో నెమ్మదిగా.

"పరిష్కారమా?"

"అవును! మీ శ్రీమతిగారి మరణానికి...నిన్నరాత్రి అనిరుద్‌పై జరిగిన దాడికి చాలా దగ్గర సంబంధం ఉంది. స్నిగ్ధగారి మరణం ఏ పరిస్థితుల్లో సంభవించిందో తెలుసుకోకలిగితే జోసెఫైన్‌ని ఎవరు పంపించారో ఎందుకు పంపించారో తెలుసుకోవచ్చుకదా?...అందుకే ఇవాళ రాత్రి పదకొండు గంటలకి ఇక్కడే...మీ ఇంట్లోనే సియోంగ్స్ ఏర్పాటు చేద్దామనుకుంటున్నాను" అన్నాడు ఆత్మ.

అంతలో అక్కడికి అనిరుద్ పరుగున వచ్చాడు.

"డాడీ...చూడు! ఆంటీ నాకోసం ఎన్ని కామిక్స్ తెచ్చిపెట్టిందో" అన్నాడు చేతిలోని రంగురంగుల బొమ్మల పుస్తకాలు చూపించి.

"గుడ్! లోపలికెళ్ళి చదువుకో!" అని వాడిని లోపలికి పంపించేసాడు పవన్.

ముక్కు పచ్చలారని ఈ పసివాడిమీద ఒకరు హత్యాప్రయత్నం చేస్తే...మరొకరు వాడిలో ఏవో శక్తులున్నాయంటూ ప్రయోగాలు తలపెడుతున్నాడు!? హౌస్ట్రేంజ్.

"పవన్‌గారూ! మీరేమీ చెప్పలేదు!" అన్నాడు ప్రొఫెసర్ ఆత్మ మళ్ళీ.

పవన్ కొంచెం ఆలోచించాడు ప్రొఫెసర్ ఆత్మ చెప్పినట్టు సియోంగ్స్ ప్రయోగం ఫలిస్తే...స్నిగ్ధ గురించి సమాచారం అందుతుంది. ఆ సమాచారంతో జోసెఫైన్ జాడకూడా తెలుసుకోవచ్చేమో।...కానీ ఇలాంటివి అన్నీ 'ఫ్రాడ్స్'అని లోగడ విన్నాడు తను.

ఒకవేళ...రాత్రి చేయాలంటున్న ప్రయోగం ఫలించకపోతే?...తన కుటుంబ వ్యవహారాల్లో అతిగా జోక్యం చేసుకుంటున్న ప్రొఫెసర్ ఆత్మ మళ్ళీ మొహం చూపించడు। దట్స్ఇట్। ఏ విధంగా చూసినా ఇందులో నష్టమేమీలేదు.

"ఓ.కే। ప్రొఫెసర్ ఆత్మ। అలాగేచేసి చూద్దాం. నేను చేయ వలసిందేమయినా ఉందా?" అడిగాడు పవన్.

"రాత్రి పదిగంటలకల్లా ఇక్కడుంటాను నేను అప్పుడు చెప్తాను మీరందరూ ఏం చేయాలో." అన్నాడు ఆత్మ.

"అందరూ అంటే?"

"మీరూ...డాక్టర్ సుస్మిత...మీ తల్లిగారు."

......

చెప్పిన ప్రకారం రాత్రి పది గంటలకి వచ్చేసాడు ప్రొఫెసర్ ఆత్మ। మరో అయిదు నిమిషాల్లో డాక్టర్ సుస్మితకూడా వచ్చిందక్కడికి.

"సియోంగ్స్ మీ బెడ్‌రూంలో చేద్దాం...అరగంటలో అక్కడ కొన్ని ఏర్పాట్లు పూర్తి చేస్తాను"అని పవన్ అనుమతితో అతడి బెడ్‌రూం లోకి వెళ్ళాడు ప్రొఫెసర్ ఆత్మ.

ఇరవయి నిమిషాల తర్వాత బయటకి వచ్చి అందరినీ లోపలికి పిలిచాడు.

పవన్ చెయిపట్టుకుని ఆపింది రాజేశ్వరిదేవి.

"ఏమిట్రాకన్నా ఇదంతా।...నాకు భయంగా ఉంది।"

"భయందేనికమ్మా?" అని ఆమెకు ధైర్యం చెప్పి బెడ్‌రూంలోకి నడిచాడు పవన్.

అప్పుడే స్నానం ముగించిన అనిరుద్ ప్రొఫెసర్ ఆత్మ ఆదేశాల ప్రకారం తెల్లలాల్చీ పైజమా వేసుకుని వచ్చాడక్కడికి.

అదేదో ఆటకి సిద్ధమవుతున్నట్టుగా హుషారుగా ఉన్నాడు.

"అంకుల్ నేను రెడీ!" అన్నాడు.

"గుడ్‌బాయ్!" అంటూ లోపలికి రావడానికి దారిచ్చాడు ఆత్మ.

గదిలో ఏర్పాట్లను విస్మయంతో చూసారందరూ.

బీరువాలు, మంచం పక్కకి జరిపేసి గదిమధ్యన పెద్ద ముగ్గు ఒకటి వేసి ఉంది. ఆ ముగ్గు మధ్య గుండ్రంగా అయిదు కుర్చీలు అమర్చి ఉన్నాయి.

గదిలో ఒకపక్కగా పెట్టిన చిన్న మట్టి కుండలోంచి సాంబ్రాణి పొగలు పైకి లేస్తున్నాయి.

అనిరుద్‌ని దగ్గరకి తీసుకుని అందరికీ వినబడేలా చెప్పాడు ఆత్మ.

"అనిరుద్ బాబూ! ఇది నీ కోసం మేమందరం కలిసి చేస్తున్న పని మమ్మీతో మాట్లాడ్డానికి నువ్వు ఎక్కడికో వెళ్ళక్కర్లేదు...ఇక్కడే మాట్లాడుకోవచ్చు! మనమందరం మనసులో ఆలోచనలు ఏవీ పెట్టుకోకుండా నిర్భయంగా ఈ కుర్చీల్లో కూర్చుంటాం. ఒకళ్ళ చేతులు మరొకరు వొదులుగా పట్టుకుని ఒక గొలుసులా కూర్చోవాలి! ఎట్టి పరిస్థితిలోను చేతులు వొదిలిపెట్టకూడదు. చేతులు వొదిలిపెట్టినా...భయపడిపోయినా సిట్టింగ్స్ భంగమవుతుంది. సరేనా?" అని అందరికేసి చూసాడు ప్రొఫెసర్ ఆత్మ.

అందరూ కూర్చున్నాక లైట్ ఆర్పేసి ఖాళీగా ఉన్న కుర్చీలో కూర్చున్నాడు తను.

కుర్చీలో కూర్చుని తనతో తెచ్చిన టేప్‌రికార్డర్ స్విచ్ నొక్కాడు. సన్నగా వాద్య సంగీతం ప్రారంభమయింది. అలాంటి విచిత్రమయిన సంగీతం అంతకుముందెపుడూ వినలేదు పవన్. టిబెట్టు దేశం బౌద్ధమత మోనాస్టరీస్‌కి సంబంధించిన సంగీతంలా ఉంది.

అందరూ మౌనంగా ఆత్మ చెప్పినట్లు చేతులు పట్టుకున్నారు.

పవన్‌కి సుస్మితకి మధ్యన కూర్చున్న అనిరుద్ వాళ్ళిద్దరి చేతులు పట్టుకుని కళ్ళు మూసుకున్నాడు.

పదినిమిషాలసేపు...ఎవరూ కదల్లేదు...

ఏమీజరగలేదు.

సంగీతం అలాగే కొనసాగుతోంది.

కానీ అనిరుద్ ఆ సంగీతం పట్టించుకోవడంలేదు. అతడి మనసు అక్కడలేదు.

మాటిమాటికి శ్మశానంలోని తనతల్లి సమాధి గుర్తు కొస్తోంది...

మమ్మీతో ఇక్కడ మాట్లాడ కలడాతను?

కానీ...

మమ్మీరావాలి!...

మమ్మీతో మాట్లాడాలి మళ్ళీ. రాకపోతే డాడీకి తన మాటలమీద నమ్మకం పోతుంది.

ఎప్పుడు పిలిచినా వస్తానంది కదా! మరి రాదేం?

కళ్ళుమూసుకుని మళ్ళీ మళ్ళీ పిలిచాడామెను...

అప్పుడు వినిపించింది అనిరుద్‌కి

చిరుగంటల సవ్వడి!...దానికి తోడుగా సోకింది మత్తెక్కించే పరిమళం! ఛాతీనిండా ఆ పరిమళం పీల్చుకుంటూ...నిద్ర!...నిద్రలోకి జారుకోవాలని ఉంది.

"అంకుల్!...మమ్మీ...ఇక్కడుంది!..." అని మాత్రం అనగలిగాడు...ట్రాన్స్‌లో ఉన్న వాడిలా.

అలా అంటుంటే అనిరుధ్ చెయిపట్టుకున్న పవన్‌కి సన్నగా షాక్ లాంటిది తగిలింది.

"అనిరుద్...నా ప్రశ్నలకి జవాబు అడగుతావా మీ మమ్మీని?" అడిగాడు ఆత్మ మృదువుగా...

అనిరుద్ పలకలేదు.

"అనిరుద్" పిలిచాడు ఆత్మ మళ్ళీ—

అయినా జవాబివ్వలేదు.

కొంచెం కంగారుగా చీకట్లో అనిరుద్‌కేసి ఓరగా చూసాడు పవన్.

ఆశ్చర్యం!

నోట్లోంచి తెల్లటి పొగలాంటిదేదో వెలువడుతుంటే తలముందుకు

...డు...అనిరుద్.

...మిటా పొగ? తెల్లటి రిబ్బనులా ముందుకి సాగుతోంది. ఏమిటది?

అంతలో...విచిత్రమయిన నవ్వొకటి వినబడింది.

ఆనవ్వు అనిరుద్ కూర్చున్నవైపునించే వినవస్తోంది కానీ...

...అది అనిరుద్ నవ్వు మాత్రం కాదు.

అనిరుద్ నోట్లోంచి వెలువడుతున్న పొగ మరికొంచెం ముందుకి సాగి గాలిలో ఒక పల్చటి ఆకారంలా మారసాగింది.

పవన్ మిగతావాళ్ళకేసి చూసాడు.

ఆ ఆకారాన్ని మిగతావాళ్ళు గమనించినట్టులేదు.

మళ్ళీ ఆ నవ్వు వినబడింది ఆ నవ్వులో గుండెల్ని పిండేసే బాధ మిళితమయి ఉంది.

ఎవరిదానవ్వు? స్నిగ్ధా?

ప్రొఫెసర్ ఆత్మ అడిగాడపుడు "ఎవరు నువ్వు" అని.

నవ్వు ఠక్కున ఆగిపోయింది.

"నేనెవరినో తెలియదా నీకు? అనిరుద్ బాబాకి తెలుసే."

ఆ పలుకు అనిరుధ్‌ది కాదు.

అంటే స్నిగ్ధ ఆత్మ అనిరుద్ ద్వారా కాకుండా నేరుగా మాట్లాడుతోందా?

ఒళ్ళు జలదరించింది పవన్‌కి.

తన స్నిగ్ధ...నిజంగానే ఉందా అక్కడ?

లేక...ఇదంతా ఏదయినా ట్రిక్కా.

ప్రొఫెసర్ ఆత్మ అడిగాడు మళ్ళీ...

"నువ్వు నువ్వేనని నాకెలా తెలుస్తుంది?"

అనిరుద్ నించి వెంటనే జవాబు రాలేదు...

అందరూ ఊపిరి బిగబట్టుకుని కూర్చున్నారు. అంతలో ఇల్లంతా మారు మ్రోగేలా నవ్వింది విచిత్రమయిన ఆ కంఠం.

"ఏం? నేను నేనేనని...ఆమెకు కూడా తెలియదా? నేనుబతికున్నంతకాలం స్నేహం నటించి నా చావుకే కారణమయిన ఆ రాకాసి ఇంకా

గుర్తుపట్టలేదా నన్ను." అందా కంఠం కరుగ్గా.

అంతే...

పవన్ చెయి వొదిలిపెట్టేసి... హిస్టీరియా వచ్చినదానిలా బిగ్గరగా అరవసాగింది రాజేశ్వరిదేవి.

## 34

సియాంగ్స్‌లో...విచిత్రమయిన ఆ కంఠస్వరం విని రాజేశ్వరిదేవి విహ్వాలమవ్వడంతో...

ఆ అయిదుగురి మధ్య ఏర్పడిన అద్భుతమయిన వర్తులం తెగి పోయింది ప్రొఫెసర్ ఆత్మ లేచివెళ్ళి లైట్ స్విచ్ నొక్కాడు.

రాజేశ్వరిదేవి తల అటూ ఇటూ ఊపుతూ ఏడుస్తుంటే ఆమె భుజం చుట్టూ చెయివేసి లేపాడు పవన్...నెమ్మదిగా ఆమెను అక్కడినించి తీసు కెళ్ళాడు.

రాజేశ్వరిదేవిని ఓదార్చి ఆమె గదిలో పడుకోబెట్టి పది నిముషాల్లో తిరిగి వచ్చాడు పవన్.

తన గదిలోకి రాగానే మంచంమీద పడుకున్న అనిరుద్‌ని చూసి కంగారుగా ముందుకి నడిచాడతను.

"బబ్లూ?..." పిలిచాడు ఆర్ద్రంగా.

నీరసంగా అతడికేసి చూసి మళ్ళీ కళ్ళు మూసుకున్నాడు అనిరుద్

"ఏమయింది బబ్లూకి?" అడిగాడు పవన్ అక్కడే నిలబడ్డ ప్రొఫె సర్ ఆత్మకేసి తిరిగి.

"నథింగ్ టు వర్రీ! అనిరుద్ కొంచెం అలసిపోయాడు అంతే!... ఇలాంటి సియాంగ్స్‌లో ఇది సహజమే!...రెండు మూడు గంటలు రెస్టు తీసుకుంటే చాలు నార్మల్ అవుతాడు." అన్నాడు ఆత్మ.

తలపట్టుకుని అక్కడే కూర్చుండిపోయాడు పవన్.

అతడి ఆలోచనలు పరిపరి విధాలుగా పోతున్నాయి.

అరగంట క్రితం...

ప్రొఫెసర్ ఆత్మ ప్రతిపాదించిన ప్రయోగంలో అయిష్టంగానే

భాగం పంచుకున్నాడతను.

ప్రొఫెసర్ ఆత్మ ప్రయత్నాలు ఫలించకూడదనే కోరుకుంది. తన మనసు...అదంతా ఫ్రాడ్ అని చూపించగలిగితే రోజు రోజుకీ ఫాంటసీ లోకి వెళ్ళిపోతున్న అనిరుద్‌ని మళ్ళీ వాస్తవ ప్రపంచంలోకి తీసుకు రావచ్చనిపించింది.

కానీ...

అనూహ్యమయినది జరిగింది.

చీకట్లో...బబ్లూ నోట్లోంచి రిబ్బనులా బయటకి సాగిన పల్చటి పొగ...తన భ్రమకాదు.

ప్రొఫెసర్ ఆత్మ తరచూ చెప్పే ఎక్టోప్లాసమ్ అంటే అదేనేమో.

అంతలో ప్రొఫెసర్ ఆత్మ మళ్ళీ మాట్లాడ్డంతో పవన్ ఆలోచనలకి అంతరాయం కలిగింది.

"పవన్‌గారూ!...మీ అమ్మగారు అలా భయపడిపోయి సర్కిల్‌ని త్రుంచి ఉండకపోయిఉంటే సియోంగ్స్ నిర్విఘ్నంగానే సాగి ఉండేది! నిజానికి నేను ఊహించిన దానికంటే చక్కగా ప్రారంభమయింది ఈ ప్రయోగం. ఎంతో అనుభవం ఉన్న 'మీడియంలా' అనిరుద్ తన తల్లి ఆత్మని ఆకర్షించకలిగాడు. సియోంగ్స్ మరికాసేపు మనం కొనసాగించి ఉంటే స్నిగ్ధగురించి చాలా విషయాలు తెలిసిఉండేవి..." అని ఆగాడు ప్రొఫెసర్ ఆత్మ.

పవన్ సమాధానం చెప్పకుండా అతడికేసిచూస్తూకూర్చున్నాడు... అతడి మౌనాన్ని మరోలా అర్థంచేసుకున్నాడు ఆత్మ.

"మీ కుటుంబంవిషయాల్లో హద్దులుమీరి జోక్యం కలుగ చేసుకుంటు న్నానని మీ సమస్యలకి పరిష్కారం చూపిస్తాననిచెప్పి...ఇలాంటి ప్రయో గాలతో వేధిస్తున్నానని అనుకుంటున్నారా?...అలా అయితే..."

ప్రొఫెసర్ ఆత్మని పూర్తిగా మాట్లాడ నివ్వలేదు పవన్–

"నో ప్రొఫెసర్ ఆత్మ! అలాంటిదేమీ లేదు! ... మీ ప్రయోగాలు నా మేధస్సుకి అందడంలేదు...నిజమే! కానీ...ఇందాక ఆ కంఠస్వరం విన్నాక...సియోంగ్స్ మళ్ళీ చేయాలని...వీలైతే స్నిగ్ధతో...మాట్లాడా లని ఉంది!" అన్నాడు చెమ్మగిల్లిన కళ్ళతో.

పవన్ మొహంలోని భావాలు చూసి స్నేహంగా అతడి భుజంమీద చెయిపెట్టాడు ప్రొఫెసర్ ఆత్మ.

"ష్యూర్! పవన్‌గారూ! ... రెండురోజులాగి మరోసారి ప్రయత్నిద్దాం?..." అన్నాడు.

"ఇందులో...అనిరుద్‌కి ఎటువంటి ప్రమాదం ఉండదుకదా!?" అడిగాడు పవన్ సందేహంగా.

తల అడ్డంగా తిప్పాడు ప్రొఫెసర్ ఆత్మ.

"అనిరుద్‌కి ఎటువంటి ప్రమాదం జరగదని హామీ ఇస్తాను నేను! అనిరుద్ ప్రాణాలకి నా ప్రాణం అడ్డం!"

......

రాత్రి ఒంటిగంటకి డోర్ బెల్ మోగితే మెలకువ వచ్చింది పవన్‌కి. నెమ్మదిగా లేచి వెళ్ళేంతలో మరోసారి మోగింది డోర్‌బెల్.

అంత రాత్రివేళ ఎవరు వచ్చి ఉంటారా అనుకుంటూ వెళ్ళి తలుపు గడియ తీసాడు పవన్.

ఎదురుగా నిలబడ్డ పోలీస్ ఇన్‌స్పెక్టర్‌ని ఆశ్చర్యంగా చూసాడతను.

"పవన్‌కుమార్‌గారు?..." అడిగాడు సబ్ ఇన్‌స్పెక్టర్.

అవునన్నట్టు తలూపాడు పవన్.

"డి.సి.పి. మిశ్రాగారు మిమ్మల్ని అర్జెంటుగా కంట్రోల్‌రూంకి రమ్మన్నారు."

"ఎందుకు?" అడిగాడు పవన్.

"ఫ్రెంచ్ అమ్మాయి జాడ తెలిసిందనుకుంటాను" అన్నాడు సబ్ ఇన్‌స్పెక్టర్.

ఆ మాట వినగానే నిద్రమత్తు వొదిలిపోయింది పవన్‌కి.

"మీరు బయల్దేరండి-మరో పదినిమిషాల్లో రెడీ అయివస్తాను నేను" అన్నాడు.

"ఓ.కె...త్వరగా వచ్చేస్తారు కదా!" అంటూ వెనక్కి తిరిగి గేటు బయట నిలబెట్టిన మోటర్‌సైకిల్ స్టార్ట్ చేసుకుని వెళ్ళిపోయాడు సబ్ ఇన్‌స్పెక్టర్.

......

మరో పదిహేను నిమిషాల్లో తనకారులో కంట్రోల్‌రూంకి చేరు కున్నాడు పవన్.

కంట్రోల్‌రూంలోపలికి వెళ్ళనవసరం లేకుండానే కాంపౌండులోనే ఎదురొచ్చాడు డి.సి.పి. మిశ్రా.

"రండి పవన్‌గారూ? మీకోసమే ఎదురు చూస్తున్నాను!" అంటూ పవన్‌ని పోలీస్ జీపుకేసి తీసుకెళ్ళాడు.

"ఎక్కడికెళ్ళాలి?" అడిగాడు పవన్ సంగతేవిటో అర్థంకాక.

"చెప్తాను పదండి" అని జీపులో కూర్చోమని సైగచేసాడు మిశ్రా.

పవన్ కూర్చున్నాక అతడి పక్కనే కూర్చున్నాడతను.

డ్రైవర్ జీపు స్టార్ట్‌చేసి వేగంగా ముందుకి పోనిచ్చాడు.

జీపు మెహిదీపట్నంకేసి వెళ్తుంటే డి.సి.పి. మిశ్రా వైర్‌లెస్ సెట్‌లో బిజీగా ఏదో మాట్లాడ్తూ కూర్చున్నాడు.

అతడ్ని డిస్టర్బ్ చేయకుండా బయటకి చూస్తూ కూర్చున్నాడు పవన్.

దర్గా దాటుతుంటే...వాళ్ళ రాకకోసమే ఎదురు చూస్తున్న ఇద్దరు ఇన్‌స్పెక్టర్లు మోటార్ బైక్స్‌మీద జీపుకి తోడయ్యారు.

"ఇక్కడికి దగ్గర్లోనే ఉందనుకుంటాను ఆ లోకేషన్" అన్నాడు మిశ్రా...అతడి మాటలబట్టి ఏదో అనుమానం వచ్చింది పవన్‌కి...ఏదో అడగబోయేంతలో ఒక మట్టి రోడ్డు దగ్గరాగింది జీపు. అక్కడ నిలబడ్డ అంబులెన్సు చూసి పవన్ అనుమానం బలపడింది.

జీపుదిగి మౌనంగా డి.సి.పి.ని అనుసరిస్తూ మట్టిరోడ్డులో నడిచాడ తను. ఆ గతుకులరోడ్డు పైన యాభై గజాలు నడిచాక...ఇన్స్‌పెక్టర్లు ఇద్దరూ టార్చ్‌లైటువేసి దారి చూపిస్తుంటే...ఎడమవైపు గుబురుగా పెరిగి ఉన్న తుమ్మచెట్ల మధ్యనించి సన్నటి కాలిబాటలో నడిచారందరూ.

"జాగ్రత్తగా రండి..." అని హెచ్చరిస్తూ ముందుకి కదిలాడు డి.సి.పి. మిశ్రా.

అలా అయిదునిమిషాలు నడిచాక ఒక మైదానంలోకిచేరారు వాళ్ళు.

తుమ్మచెట్లు తోసుకుంటూ ఇవతలికి వచ్చిన పవన్ ఆశ్చర్య పోయాడు. టార్చిలైట్లు వెలిగించి పట్టుకుని ఆ మైదానంలో దేనికోసమో గాలిస్తున్నారు పోలీస్ ఆఫీసర్లు కొందరు. మరిద్దరు పెద్దసైజు కుక్కలు మూడింటిని ఛైనువేసి పట్టుకుని నిలబడ్డారు.

ఏమవుతోందిక్కడ?

అపుడు కనిపించింది పవన్‌కి...మైదానం నడుమ వెల్లకిలా పడున్న ఆకారం ఒకటి!!

మృతదేహం!

పక్కనే నిలబడ్డ ఫోటోగ్రాఫర్ల చేతుల్లోని కెమెరా ఫ్లాష్ బల్బులు జిగేలుమంటుంటే తెలిసింది...అది ఫ్రెంచ్ అమ్మాయి జోసెఫైన్ మృత దేహమని!!

శరీరంమీద నూలుపోగయినా లేకుండా పడున్న జోసెఫైన్‌కేసి చూడలేక తలతిప్పుకున్నాడు పవన్.

"ఓ గాడ్!" అన్నాడు నడకవేగం తగ్గించేసి.

"రండి! మీరే ఆ అమ్మాయిని గుర్తుపట్టాలి!" అని పిలిచాడు డి. సి. పి.

నెమ్మదిగా ముందుకి నడిచి మృతదేహం దగ్గరకి చేరాడు పవన్. ఫ్లాష్‌లైట్లు ఉండి ఉండి మెరుస్తుంటే తెల్లటి ఆమె శరీరం మరింత తెల్లగా కనిపిస్తోంది! గోధుమరంగు జుట్టు చెదిరి మొహంమీద పడ్తుంటే...కళ్ళు నిర్జీవంగా ఆకాశంకేసి చూస్తున్నాయి.

"అనుమానంలేదు... ఆమె జోసెఫైనే!" ... అంటూ అప్రయత్నంగా ఆమె చేతికేసి చూసి అదిరిపడ్డాడు పవన్!

జోసెఫైన్ అరచెయి నరికి వేసారెవరో!?

అప్పటిదాకా మైదానంలో అటూ ఇటూ తిరుగుతున్న పోలీస్ ఆఫీసర్లుకూడా అక్కడికి వచ్చి చేరారు.

"సర్ ఇది చూసారా?" అని ఒక ఆఫీసరు నేలమీద పడున్న జోసెఫైన్ ఛాతీమీద పొట్టమీద టార్చిలైట్ వేసి చూపించాడు.

డి.సి.పి. మిశ్రాతోపాటు పవన్‌కూడా రెండడుగులు ముందుకివేసి

పరిశీలనగా చూసాడు.

జోసెఫైన్ వక్షోజాల కిందనించి నాభిదాకా విచిత్రమయిన గుర్తు లేవో ఉన్నాయి! ఎండిన రక్తం చూస్తుంటే ఆ గుర్తులు పదునైన కత్తితో ఎవరో చెక్కి ఉంటారనిపించింది పవన్‌కి.

"పవన్! ఈ గుర్తులు ఆర్కియాలజిస్టుగా మీకేమయినా అర్ధమవు తున్నాయా?" అడిగాడు మిశ్రా.

ఒక్క క్షణం ఆగి సందేహంగా జవాబిచ్చాడు పవన్.

"పాతకాలంనాటి శాసనాలలా ఉన్నాయి!...కొంచెం స్టడీచేస్తే వాటి అర్ధమేవిటో కనిపెట్టవచ్చు."

"అయితే రేపు మీకు వీటి ఫోటోలు ఎన్‌లార్జ్ చేయించిపంపిస్తాను. మీ స్టడీలో ఏదయినా క్లూ దొరుకుతుందేమో చూద్దాం!" అన్నాడు మిశ్రా.

అంతలో అక్కడికి మరో పోలీస్ ఆఫీసరు వచ్చి మిశ్రాకి సెల్యూట్ చేసాడు.

"సర్! పరిసరాలన్నీ గాలించేసాము. ఈ అమ్మాయి విడిచిన బట్టలు ఎక్కడా దొరకలేదు!" అన్నాడు.

"స్ట్రేంజ్! మైన్ రోడ్డు దగ్గర్నించి ఇక్కడిదాకా ఈ అమ్మాయి ఒంటరిగా నడచివచ్చినట్టు ఫుట్‌ప్రింట్స్ వల్ల తెలుస్తోంది అంటున్నారు... డాగ్ స్క్వాడ్ వాళ్ళకికూడా అంతకంటే లీడ్ దొరకడం లేదు! నగ్నంగా ఆమె ఇక్కడికి నడచి వచ్చిందంటే నమ్మశక్యంగాలేదు." అని ఒక్క క్షణం ఆగి మళ్ళీ ఇన్స్‌పెక్టర్ కేసి తిరిగాడు మిశ్రా.

"సరిగ్గా వెతికారా మీరందరూ? ఎటువంటి ఆధారం లేదా ఈ మిస్టరీకి?" అడిగాడు చురుగ్గా.

"ఉందిసర్! ప్లీజ్ నాతోరండి" అని ఉత్సాహంగా మైదానం అవతలి వైపున్న గుట్టకేసి దారితీసాడు ఇన్‌స్పెక్టర్.

అతడ్ని అనుసరించి బయల్దేరారు మిశ్రా, పవన్.

గుట్టదగ్గర ఎనిమిదడుగుల ఎత్తున్న ఒక బండ దగ్గరాగి దానిమీద టార్చ్‌లైటు వేసాడు ఇన్స్‌పెక్టర్.

ఆ బండమీద ..ఎర్రటి సిరాతో...

ఏసుక్రీస్తు శిలువ గీసారెవరో,
సిరాకాదది రక్తం॥

"దీనిగురించి ఏమనుకోవాలో అర్థంకావడంలేదు సర్." అన్నాడు ఇన్స్‌పెక్టర్.

అతడిచేతిలోంచి టార్చిలైట్ తీసుకుని శిలువ బొమ్మని పరిశీలించి ఆ బండచుట్టూ ఒకసారి తిరిగివచ్చి అన్నాడు మిశ్రా.

"నా అనుమానం కరెక్టే! ఇది జోసెఫైన్ గీసిన బొమ్మ! ఆ విచ్ కల్ట్ వాళ్ళు చెయినరికేసాక...తన రక్తంతో ఈ బొమ్మ గీసింది! చని పోయేముందు విచ్‌కల్ట్ వాళ్ళతో తన సంబంధం పెంచుకుని మళ్ళీ తను నమ్మిన దైవాన్ని ఆరాధించేందుకు ఆ అమ్మాయి ఇలా చేసుంటుంది!... అయినా, ఆమె ఇక్కడికి ఎలా వచ్చి చేరిందో తెలియడంలేదు! ఎనీవే... డెడ్‌బాడీని పోస్ట్‌మార్టమ్‌కి పంపించండి!...ఇవాళ రాత్రి ఇద్దరు కానిస్టే బుల్స్‌ని ఇక్కడ కాపలా పెట్టండి!" అని ఇన్స్‌పెక్టర్‌కి ఆదేశాలిచ్చి అక్కడ్నించి కదిలాడు డి.సి.పి మిశ్రా.

అతడితోపాటు జీపులోవచ్చి కూర్చున్నాడు పవన్. జీపు స్టార్ట్ అయ్యాక నెమ్మదిగా మాట్లాడాడు మిశ్రా.

"పవన్‌గారూ! ఈ మర్డర్ మిస్టరీ పరిశోధిస్తే. చాలా విషయాలు బయటపడతాయి...ఇవాళపొద్దున వై డబ్ల్యూ.సి యేహాస్టల్ సెక్రటరీనికల్సు కున్నాం. జోసెఫైన్ రూంలో ఆ అమ్మాయి సామానులన్నీ సోదా చేయిం చినా ఎటువంటి ఆధారాలు దొరకలేదు! చివరికి ఆ అమ్మాయి పాస్‌పోర్టు కూడాలేదు! హాస్టల్ రిజిష్టర్‌లో నమోదుచేసిన వివరాలనుబట్టి ఢిల్లీలో ఫ్రాన్స్ కాన్సులేట్ వాళ్ళని ఇన్‌ఫర్మేషన్ పంపమని ఇవాళే మెసేజ్ పంపి చాం—" అని ఆగాడు.

"అసలు జోసెఫైన్ మృతదేహం. ఇక్కడుందని ఎలా తెలిసింది మీకు?" అడిగాడు పవన్.

"సాయంత్రం ఆరుగంటల ప్రాంతాల్లో ఇట్నుంచివెళ్తున్న గొర్రెల కాపరి ఒకతను చూసివచ్చి పోలీస్‌స్టేషన్‌లో రిపోర్టు చేసాడట!" అన్నాడు మిశ్రా యధాలాపంగా.

"జోసెపైన్‌ని చంపినవాళ్లు ఆమె శరీరాన్ని ఎక్కడయినా దాచేసి ఉండవచ్చు...లేదా పాతిపెట్టి ఉండవచ్చు!" అని ఏదో అనబోయాడు పవన్...అతడి మాటల్ని సగంలోనే అందుకున్నాడు మిశ్రా.

"కానీ...అలా చేయలేదు! ఆమెను ఈ మైదానంలోకితెచ్చి శరీరం మీద ఆ గుర్తులు చెక్కి వొదిలిపెట్టి పోయారు!...విచ్‌కల్ట్ వాళ్ళ రిచువల్స్ చాలా విచిత్రంగా ఉంటాయి పవన్‌గారు! అని ముగించాడు...

......

జోసెపైన్ చనిపోయి రెండు రోజులయింది...

ఆ రోజు రాత్రి సియోంగ్స్ చేయడానికి మళ్ళీ వచ్చాడు ప్రొఫెసర్ ఆత్మ.

ఈసారి అతడితో పూర్తిగా సహకరించి గదిలో ఏర్పాట్లు చేసాడు పవన్.

సియోంగ్స్ ప్రారంభించే టైంకి డాక్టర్ సుస్మిత వచ్చింది కానీ రాజేశ్వరిదేవి మాత్రం వర్తులంలో కూర్చోనని నిక్కచ్చిగా చెప్పేసింది.

రాజేశ్వరిదేవి సియోంగ్స్‌లో పాల్గొనడంలేదని కొంచెం నిరుత్సాహపడ్డాడు ప్రొఫెసర్ ఆత్మ.

"ఆవిడ కూడా పాల్గొంటే బావుంటుంది...మొదటిసారి సియోంగ్స్‌లో కూర్చున్న వ్యక్తులు అదే వరుసలో కూర్చుంటేనే ఇందులో ఫలితాలు బావుంటాయి...సరే...ఏంచేస్తాం? బలవంతంగా ఆవిడ్ని కూర్చోమనడం కూడా సబబుకాదు" అని రాజేశ్వరిదేవి కోసం ఉంచిన కుర్చీ జరిపేసాడు.

సియోంగ్స్ ప్రారంభమయింది.

పదిహేను నిమిషాలు...ఇరవై నిమిషాలు ...అరగంట!

ప్రొఫెసర్ ఆత్మ టేప్‌రికార్డరులో పెట్టిన టిబెట్టు సంగీతం కొనసాగుతూనే ఉంది—

చీకట్లో అందరూ నిశ్శబ్దంగా...ఈసారి ఏం జరుగుతుందోనని ఆతురతగా కూర్చున్నారు...

కానీ ఏమీ జరగలేదు!

పవన్ కొంచెం అసహనంగా కదిలాడు కుర్చీలో...

ఓరగా అనిరుద్‌కేసి చూసాడు!

వాడిలో ఎటువంటి మార్పులేదు!...ఏమయింది ఈసారి! ప్రొఫెసర్ ఆత్మ చెప్పినట్టు అందరూ కూర్చోక పోవడం వల్ల రావడం లేదా... స్నిగ్ధ?!

క్రితంసారి నిజంగానే వచ్చింది స్నిగ్ధ!?...

తనకే ఆశ్చర్యంగా ఉన్నాయా ఆలోచనలు?...అన్ని విషయాలని ఎంతో సైంటిఫిక్‌గా పరిశీలించి కాని ఏ నిర్ణయానికి రాని తానేమిటిలా ఆలోచిస్తున్నాడు?!

స్నిగ్ధ మరణం తర్వాత దుర్భరమైన సంక్షోభానికి గురవడమే చాలదన్నట్టు—ఇప్పుడు అనిరుద్ ప్రాణాలకి కూడా అపాయం ఉందని తెలుసుకుని మనస్థయిర్యాన్ని కోల్పోతున్నాడా తను? అందుకే ఇలాంటి ప్రయోగాలలో ఏదైనా మిరకిల్ జరిగి తన సమస్యలకి అద్భుతమైన పరిష్కారం దొరుకుతుందనుకుంటున్నాడా?

ఏమో!?

అలా అనుకుంటూ మళ్ళీ అనిరుద్‌కేసి దృష్టిసారించాడు పవన్.

అనిరుద్ ముందుకి ఒరిగిపోయి ఉన్నాడు అప్పటికే వాడినోట్లోంచి సన్నగా బయటకి వస్తోంది తెల్లటి పొగ!...వర్తులం నడుమ చేరుకుంటున్న ఆ పొగ ఉన్నట్టుండి వాయుగుండంలో చిక్కుకున్నట్టు నిటారుగా పైకెగిసింది.

చూస్తున్నంతలోనే పల్చటి ఆ పొగ ఒక ఆకారాన్ని సంతరించుకుంది!...అయిదున్నర అడుగులు పొడవున్న ఆ ఆకారం...ఒక స్త్రీదని తెలుస్తూనేఉంది.

స్నిగ్ధ!! స్నిగ్ధ!! స్నిగ్ధ!!!

పవన్ గుండె వేగంగా కొట్టుకోసాగింది!

గొంతుకలో పట్టేసినట్టయి కళ్ళనీళ్లు తిరిగాయి అతడికి...

ముందుకువొంగి స్నిగ్ధ ఆకారాన్ని తాకాలనే—కోరికని బలవంతంగా అణచుకున్నాడతను.

గదిలో నవ్వొకటి ప్రతిధ్వనించింది ఉన్నట్టుండి.

సరిగ్గా ఆ సమయానికి—అనిరుద్‌ని పట్టుకున్న చేతి నరాలకి సన్నగా షాకు తగిలినట్టుజివ్వుమంది పవన్‌కి—అయితే అలాంటిది ఏదో జరుగుతుందని ముందే ఊహించిన అతడు చెయి వొదిలిపెట్టలేదు—

అప్పుడడిగాడు ఆత్మ...

"నిన్నిలా మాటిమాటికి మా మధ్యకి ఆహ్వానిస్తున్నందుకు నీకు ఇబ్బందిగా లేదుకదా?"

నవ్వాగింది...

"అనిరుద్ బాబా దగ్గరకి రావడానికి ఇబ్బందా?" వచ్చింది జవాబు।

"అని- ద్ ప్రాణాలు తీయడానికి కొంతమంది ప్రయత్నిస్తున్నారు తెలుసానీకు?" అడిగాడు ప్రొఫెసర్ ఆత్మ గంభీరంగా—

"మూర్ఖులు।—అనిరుద్ బాబాని తాకలేరు వాళ్ళు।" పలికింది ఆ కంఠస్వరం.

క్రితంసారి ఆ పలుకు అనిరుద్ వైపునించి వస్తున్నట్టనిపించింది. కానీ ఈసారి వర్తులం మధ్యన నిలబడ్డ ఆకారమే మాట్లాడుతున్నట్టుండి।

"నీ చెయి నరికేసింది వాళ్ళేకదూ?" అడిగాడు ఆత్మ మళ్ళీ.

వెంటనే జవాబురాలేదు...సన్నగా ఏడుపు మొదలెట్టిందో ఆకారం। గుండెల్ని పట్టి పిండేసేట్టుగా ఉందా ఏడుపు।

"వాళ్ళే।...కానీ...అప్పటికే నా శక్తినంతా హరించేసింది కదా ఆ కిరాతకి...కాత్యాయని।..." అందా కంఠం ఏడుపు ఆపుతూ.

కాసేపాగి అడిగాడు ఆత్మ.

"అయితే...నీ చావుకి కారణం...కాత్యాయనా?"

"కాదు..." స్పష్టంగా వచ్చింది సమాధానం.

"మరి? ప్రమాదవశాత్తు జరిగింది కదూ? ఆ ప్రేలుడు?"

"కాదు।"

"మరెలా జరిగింది?" అడిగాడు ఆత్మ.

"తెలుసుకుని ఏం చేస్తారు? నా చావుకి కారణమయిన వారిని శిక్షిస్తావా?" ఎదురు ప్రశ్న వచ్చింది.

"నీ మాటలమీద నమ్మకం కుదిరితే తప్పకుండా శిక్షపడేట్టు చేస్తాం!...చెప్పు...! మేమంతా నీ మంచి కోరేవాళ్ళమే."

"అబద్ధం!" కోపంగా అరిచిందా కంఠ స్వరం!...

"ఏం?"...అడిగాడు ప్రొఫెసర్ ఆత్మ ఎంతో మృదువుగా.

"నేను ఎన్ని సేవలు చేసినా...ఎంత మంచిగా ప్రవర్తించినా నన్ను ఆదరించక...అనిరుధ్ బాబాని పుట్టకముందునించేద్వేషించిన మనిషి మీ మనిషే కదా!...అనిరుధ్ బాబా నాన్నగారు ఆ మనిషిని శిక్షిస్తారా?"

ఆ మాటలు విన్న పవన్ నోరెండిపోయింది!...స్నిగ్ధ ఎవరిగురించి మాట్లాడ్తోందో అర్థం చేసుకొనడం ఈసారి కష్టమనిపించలేదు...అయినా తన అనుమానం నిజంకాకూడదనే ఆశ.

"ఎ...ఎవరా మనిషి?" మొట్టమొదటిసారిగా నోరువిప్పి అడిగాడా ప్రశ్న.

సమాధానంగా నవ్వు ప్రారంభమయింది...! ఆ నవ్వు అలా కొనసాగుతుండగానే ఆ ఆకారం తలుపుకేసి చెయి చూపించింది.

అంతవరకూ దగ్గరకేసి ఉన్న ఆ గది తలుపు భళ్ళున తెరచుకుంది!

గది బయట అంతవరకూ నక్కి నిలబడి లోపల జరుగుతున్నదేమిటో వింటున్న రాజేశ్వరిదేవి నాలుగడుగులు వెనక్కివేసి బిగ్గరగా అరవసాగింది.

"ఒరేయ్ కన్నా...నన్ను చంపేస్తుందిరా అది!...నా దగ్గరకి రానీకురా!...ఒరేయ్!..." అంటూ డ్రాయింగ్ రూంలో కుర్చీలు తోసుకుంటూ వెనక్కి పరుగెట్టిందామె.

అప్రయత్నంగా అందరూ చేతులు వొదిలిపెట్టేసారు.

వర్తులం తెగిపోయింది.

## 35

ఆ రోజురాత్రి...ఉరుములతో వర్షం ప్రారంభమయింది.

అసలే కలత నిద్రలో ఉన్న పవన్‌కి మెలకువ వచ్చేసింది. గదిలో చీకటిగా ఉంది! ఫ్యాన్‌కూడా నిలచిపోయిఉంది.

కరెంటు పోయిందని అర్థంచేసుకుని నెమ్మదిగా లేచివెళ్ళి స్టడీ టేబిల్ మీదున్న టార్చ్‌లైట్ అందుకున్నాడు పవన్.

అనిరుద్ గదిలో కాండిల్ వెలిగించి పెట్టాలనుకుంటూ తలుపు తెరచుకుని హాల్లోకి నడిచాడు.

మండువాలో పెద్దమోతతో కురుస్తోంది వర్షం। మరో రెండుమూడు గంటలవరకు తగ్గే సూచనలు లేవనిపించింది పవన్‌కి...అంటే ఈరాత్రికి లైట్లుకూడా ఉండవన్నమాట.

టార్చ్‌లైట్ వెలిగించి పట్టుకుని అనిరుద్ గదిలోకి వెళ్ళాడు పవన్.

గదిమధ్యకి వచ్చి ఠక్కున ఆగిపోయాడతను.

మంచంమీద అనిరుద్ లేడు!!

పరుపు పరిచింది పరిచినట్టే ఉంది।...అంటే?

"బబ్లూ!" బిగ్గరగా అరచి గదిలో అటూ ఇటూ టార్చ్‌లైట్‌వేసి చూసాడు పవన్.

అనిరుద్ ఎక్కడాలేడు.

కంగారుగా ఇల్లంతా అనిరుద్‌కోసం వెతికేసాడు పవన్.

ఏదో అనుమానం వచ్చి వీధి తలుపుకేసి నడిచాడతను. బారలా తెరచిపెట్టిఉన్నాయి తలుపులు.

ఓ గాడ్!...

ఇంతరాత్రివేళ...ఈ గాలివానలో ఎక్కడికి వెళ్ళిఉంటాడు బబ్లూ!

జోసెఫైన్ అనుచరులెవరయినా...ఒకవేళ?

నో!...అలా జరగడానికి వీల్లేదు।

వీధి తలుపులోంచి ఇంట్లోకి కొడుతున్న జల్లు పవన్ బట్టల్ని తడి పేస్తోంది...అయినా కదలకుండా అక్కడే నిలబడిపోయాడు కాసేపు.

వెంటనే వెళ్ళి డి.సి.పి. మిత్రాకి ఈ సంగతి చెప్పాలా? అని ఆలో చిస్తూ వెనక్కితిరిగివెళ్ళి కారు తాళాలు తెచ్చుకున్నాడు.

రాజేశ్వరిదేవిని నిద్రలేపి ఆమెను కంగారు పెట్టడం మంచిదికాదని పించింది పవన్‌కి...హాల్లోని బీర్వాలోంచి రైన్‌కోట్ తీసి వేసుకుని చప్పుడు కాకుండా వీధి తలుపుకి బయటనించి గడియవేసి బయల్దేరాడతను.

......

కారు స్టార్ట్ చేసుకుని గేటు బయటకి నడిపిస్తుంటే వర్షం ఉధృతం మరింత పెరిగింది!...వీధి దీపాలుకూడా వెలగడంలేదు. కారు లైట్ల వెలుగులో దారి సరిగ్గా కనబడక ఎంతో జాగ్రత్తగా డ్రైవ్ చేయసాగాడు పవన్.

ఇంత రాత్రివేళ డి.సి.పి. మిశ్రా ఇంటికెళ్ళి అతడ్ని డిస్టర్బ్ చేయడం తనకేమాత్రం ఇష్టంలేదు!...అయినా మరో మార్గం లేదు.

జూబ్లీ హిల్స్ మలుపు తిరిగి రోడ్డు నెం 3 కేసి వెళ్ళబోతూ ఏదో ఆలోచన వచ్చి కారు బ్రేక్ వేసాడు పవన్.

ఒకవేళ అనిరుద్...స్నిగ్ధతో మాట్లాడాలని మళ్ళీ శ్మశానానికి వెళ్ళాడేమో!...అవును! అంతే అయ్యుండాలి!

అంతవరకూ ఆ ఆలోచన తనకెందుకు స్ఫురించలేదా అనుకుంటూ వెంటనే కారుని శ్మశానంకేసి మళ్ళించాడు పవన్.

శ్మశానం గేటులోంచి నెమ్మదిగా లోపలికి పోనిచ్చాడు కారుని గతుకుల దారిలో కొంతవరకే వెళ్ళకలిగాడు. హెడ్‌లైట్లు ఆన్‌లోనే పెట్టి టార్చ్‌లైటు పట్టుకుని దిగి వర్షంలో నడిచాడు పవన్.

బురదలో కాలు జారకుండా జాగ్రత్తగా ముందుకి నడుస్తూ స్నిగ్ధ సమాధికేసి టార్చ్‌లైటు వేసాడు.

తళుక్కుమని రెండు కళ్ళు ఎర్రగా మెరిసాయి ఆ వెలుగులో!...

ఏమిటది!...

నల్లకుక్క! డాక్టర్ ఐసాక్ కుక్క....! అంటే తప్పకుండా అనిరుద్‌కూడా అక్కడే ఉండి ఉండాలి! మరింత దగ్గరకి నడిచాడు పవన్. సమాధిమీద నిటారుగా నిలబడ్డ కుక్క ఏ మాత్రం కదల్లేదు!

అప్పుడు కనిపించింది పవన్‌కి సీజర్ కాళ్ళమధ్య కుప్పలాపడున్న అనిరుద్ ఆకారం—!

"బబ్లూ!" అంటూ ముందుకి పరుగెత్తాడు పవన్.

అంతవరకూ అనిరుద్ తడవకుండా వాడికి గొడుగులా నిలబడ్డ సీజర్ నెమ్మదిగా పక్కకు తప్పుకుంది.

అనిరుద్‌ని చేతుల్లోకి తీసుకుని పవన్ గబగబ శ్మశానంలోంచి బయటకి నడుస్తుంటే ముద్దగా తడిసిన సీజర్ అతన్ని అనుసరించింది.

......

ఆ రాత్రంతా కుండపోతగా వర్షం కురుస్తూనే ఉంది.

ఉదయం తొమ్మిది గంటలకి వర్షం తగ్గుమొహం పట్టింది...కానీ ఆకాశంలో నల్లటి మేఘాలు ఇంకా అలాగే ఉన్నాయి.

రాత్రి శ్మశానంలో తడిసిన అనిరుద్ ఒళ్ళు వెచ్చగా అనిపించి వాడిని లేచి తిరగనివ్వలేదు పవన్. మంచంమీద రగ్గు కప్పి పడుకోబెట్టి వాడి పక్కనే కూర్చుని నెమ్మదిగా ఒకొక్కమాట అడిగి తెలుసు కుంటున్నాడు.

అనిరుద్ మాటలు ముందు ఎంతో ఆసక్తిగా విన్న పవన్ మొహంలో భావాలు క్రమంగా మారిపోయాయి॥

అనర్గళంగా మాట్లాడుతున్న అనిరుద్‌ని మధ్యలో ఆపి వాడిని నిరుత్సాహ పరచడం ఎందుకని అలాగే కూర్చున్నాడు పవన్...

అంతలో డోర్ బెల్ మోగడంతో లేచి వెళ్ళి తలుపుతీసాడు.

నీళ్ళుకారుతున్న గొడుగు మూసేసి లోపలికి వచ్చిన ప్రొఫెసర్ ఆత్మారాంని డ్రాయింగ్ హాల్లోకి తీసుకెళ్ళాడు పవన్.

"మీ కోసమే ఎదురుచూస్తున్నాను" అన్నాడు పవన్...ప్రొఫె సర్ ఆత్మ కూర్చున్నాక...

"ప్రొఫెసర్ ఆత్మా!...నిన్న రాత్రి సియోంగ్స్‌లో జరిగిన సంఘ టన గురించి మీరేమనుకుంటున్నారు?" అడిగాడు పవన్ ఒక్కక్షణం ఆగి.

సోఫాలో కొంచెం ఇబ్బందిగా కదిలి అటూ ఇటూ చూసాడు ప్రొఫెసర్ ఆత్మ.

"మీ అమ్మగారు లేచారా?...!?" అడిగాడు.

ప్రొఫెసర్ ఆత్మ సంకోచిస్తున్నది దేని గురించో అర్థమయింది పవన్‌కి.

"అమ్మ పూజగదిలో ఉంది. మన మాటలు ఆవిడకి వినబడవు! మీరు ఫ్రీగా మాట్లాడండి" అన్నాడు

అయినా వెంటనే మాట్లాడలేకపోయాడు ప్రొఫెసర్ ఆత్మ.

"మీతో ఈ విషయం ఎలా మాట్లాడాలో అర్థంకావడంలేదు పవన్ గారూ!...మనం చేసిన రెండు సియాంగ్స్ ప్రయోగాల్లోనూ స్నిగ్ధగారి మరణప్రసక్తి వచ్చింది...రెండు సార్లు కూడా..." అని సందేహిస్తూ ఆగిపోయాడు మళ్ళీ.

"ఆగిపోయారేం? చెప్పండి! రెండు సార్లు కూడా స్నిగ్ధ మరణానికి కారణం మా అమ్మగారేనన్న సమాచారం అందింది అంతేకదూ?" అడిగాడు పవన్.

అవునన్నట్టు తలూపాడు ప్రొఫెసర్ ఆత్మ.

"అది నిజమే అయ్యుంటుందని మీరు నమ్ముతున్నారా?" సూటిగా అడిగాడు పవన్.

"మీరలా అడిగితే ఏమని సమాధానం చెప్పకలను నేను?...స్నిగ్ధ గారిని మీరు ప్రేమించి పెళ్ళాడారు. ఆవిడంటే మీకు ప్రాణం! అలాగే మీ అమ్మగారంటే కూడా మీకు ఎనలేని అభిమానం అన్నసంగతి నాకు తెలుసు! అందుకే...వాళ్ళిద్దరిమధ్య అంతటి వైరం ఉండేదంటే మీమనసు అంగీకరించలేకపోతోంది! అయినా...మనకు పూర్తి సమాచారం ఇంకా అందలేదు! తన చావుకి కారణం రాజేశ్వరిదేవి అన్నట్టు చెప్తోందేకాని... తనని ఆమే చంపింది అని చెప్పటంలేదు స్నిగ్ధ ఆత్మ!" అన్నాడు ప్రొఫెసర్.

"అయితే నిన్నరాత్రి...అంతకుముందు రోజురాత్రి మనకు వినిపించింది నిస్సందేహంగా స్నిగ్ధ మాటలేనంటారా? నిజంగానే స్నిగ్ధఅపుడు మనమధ్యన ఉందంటారా?" అడిగాడు పవన్.

"ఈ సియాంగ్స్‌లో రెండు థియరీస్ ఉన్నాయండీ! నేను ఇదివరకే చెప్పాను మీకు. ఆవిధంగా అందరూ కూర్చుని చనిపోయిన వ్యక్తి గురించి తలచుకుంటే సైకిక్‌పవర్స్ ఉన్న వ్యక్తిని చనిపోయిన వ్యక్తి ఆత్మ ఆవహించి...అతనిద్వారా మనతో మాట్లాడుతుందంటారు కొందరు! రెండవది ఆత్మ నిజంగా రాకపోయినా...చనిపోయిన వ్యక్తి ఆలోచనా తరంగాలను ట్యూన్ చేసిన వారికి నిజంగానే ఆవ్యక్తితో మాట్లాడుతున్న అను

భూతి కలుగుతుంది!...అంటే సబ్‌కాంషస్‌ద్వారా చనిపోయిన వ్యక్తి గత స్మృతులని, ఆలోచనలని ఆవేదనలని గ్రహించగలగడం!...నేను రెండవ థియరీనే నమ్ముతాను!...ఏది ఏమయినా మనకు అందే సమాచారం నమ్మదగినదే!" అన్నాడు ఆత్మ.

అతడి మాటలకు ఎక్కడా అడ్డు చెప్పకుండా విన్నాడు పవన్.

"అనిరుద్ మాట్లాడే మాటలంటే అంత నమ్మకముందా మీకు?" అదోలా నవ్వి అడిగాడు చివరికి...

"అనిరుద్‌లో అభివృద్ధి చెందుతున్న అసాధారణమయిన మానసిక శక్తులంటే నమ్మకముంది నాకు!..."

"అనిరుద్ పొరపాటుపడి లేదా...ఏదో ఊహించుకుని ఇలా మాట్లాడుతున్నాడేమో!...ఇన్నాళ్ళు మనం అనిరుద్‌లో "సూపర్ న్యాచురల్" శక్తులున్నాయని పొరబడ్డామేమో? అడిగాడు పవన్.

"నో! ఇంపాజిబుల్, మీ బాబు గురించి నా అంచనా నూటికి నూరుపాళ్ళు కరెక్ట్!...ప్రస్తుతం మీవాడికి...స్నిగ్ధగారి ఆత్మకి చక్కటి 'రాపోర్ట్' ఏర్పడిందని నాఅభిప్రాయం బాబుద్వారా మిమ్మల్ని వేధిస్తున్న ప్రశ్నలన్నింటికి..." అని ప్రొఫెసర్ ఆత్మ ఏదో అనబోతుంటే అసహనంగా చెయి పైకెత్తాడు పవన్.

"స్టాప్ ఇట్ ప్రొఫెసర్!! అలాంటిదేమీలేదని నాకిప్పుడే తెలిసింది! అన్నాడు కొంచెం చికాగ్గా...

ప్రొఫెసర్ ఆత్మకి పవన్ ధోరణి అర్థంకాలేదు...

ఏం జరిగింది? అన్నట్టు చూసాడు పవన్‌కేసి...

క్రితంరాత్రి వర్షంలో అనిరుద్ శ్మశానానికి వెళ్ళిన ఉదంతం క్లుప్తంగా చెప్పాడు పవన్.

"ఇవాళ ఉదయం నిద్రలేచినప్పట్నుంచి అనర్గళంగా మాట్లాడుతూనే ఉన్నాడు అనిరుద్!...రాత్రి శ్మశానంలో తల్లితో తను మాట్లాడిన మాటలు వివరంగా చెపుతున్నాడు!" అని ఆగాడు పవన్.

"ఐసీ!...ఏమంటున్నాడు?" అడిగాడు ఆత్మ ఆసక్తిగా...

"మీరే వెళ్ళి అడగండి! నేను చెప్పడందేనికి?" అన్నాడు పవన్

నిర్లక్ష్యంగా...

సందేహిస్తూ లేచి వెళ్ళాడు ప్రొఫెసర్!...

......

పది నిముషాలు అనిరుద్‌తో కబుర్లుచెప్పి మళ్ళీ బయటకి వచ్చాడు ఆత్మ.

"మీ అనుమానం ఏమిటో నాకర్థంకావటంలేదు పవన్‌గారు! నిన్న రాత్రి శ్మశానానికి వెళ్ళి స్నిగ్ధ గారి ఆత్మతో మళ్ళీ మాట్లాడాడు మీ బాబు ఇక్కడ మనం చేస్తున్న సియాంగ్స్ తనకి సంతృప్తికరంగా లేవట!... స్నిగ్ధ తన చిన్ననాటి కబుర్లు చెప్పిందట బాబుకి!—ఇందులో మీకు నచ్చనిదేముంది?" అడిగాడు సిన్సియర్‌గా.

"నచ్చడం నచ్చకపోవడంకాదు ప్రొఫెసర్! బబ్లూ మాట్లాడుతున్న వన్నీ అర్థం పర్థం లేని మాటలు! అంతా ట్రాష్! ఏదో ఊహించుకుని మాట్లాడుతున్నాడు. వాడు చెపుతున్నట్టు స్నిగ్ధ పల్లెటూరి వాతావరణంలో పెరగలేదు ఎప్పుడూ—చిన్నపుడు చెరువుపక్కన గుడిదగ్గరఆడుకునేదని వాళ్ళ నాన్నగారితో సంతకెళ్ళేదని—ఇంకా ఏవేవో చెపుతున్నాడు!... స్నిగ్ధ అలా ఎన్నడూలేదని నాకు బాగాతెలుసు! స్నిగ్ధ సిటీ వాతావరణం లోనే పుట్టిపెరిగింది. ఇన్నాళ్ళు స్నిగ్ధడైరీలోని విషయాలు చదివితనకు తోచి నట్టుఏదో మాట్లాడేవాడుబబ్లూ—ఇపుడు తనకు తెలియనివిషయాల గురించి మాట్లాడుతుంటే అసలు సంగతి తెలిసిపోయింది నాకు!" అన్నాడు పవన్.

ప్రొఫెసర్ ఆత్మ ఏదో ఆలోచిస్తూ మౌనంగా ఉండిపోయాడు.

"బబ్లూ మాటలని ఆధారంగా చేసుకుని అనవసరంగా అమ్మ గురించి లేనిపోని అనుమానాలు పెంచుకున్నాను! వాడి మాటలు విని అమ్మ కూడా కంగారుపడిపోతోంది. అని ఆపాడు పవన్.

"పవన్‌గారూ? నేను మీ అమ్మగారిని దోషిగా నిరూపించడానికి ఈ ప్రయోగాలు చేయలేదు! నన్ను సరిగ్గా అర్థంచేసుకోండి! అనిరుద్ అంటున్నవన్నీ ఇమాజినేషన్ అని మీరు అనుకున్నా వాడిమీద జరిగిన హత్యాప్రయత్నం ఇమాజినేషన్ కాదు కదా!...ఏడేళ్ళక్రితం మీ శ్రీమతి గారి మరణంకూడా వాస్తవమే! వీటివెనక మనం అర్థంచేసుకోలేకపోతున్న

రహస్యం ఏదో ఉంది! అదేవిటో తెలుసుకుని మీకు సహాయ పడాలన్నదే నా అభిలాష!...దయచేసి నాతో మరికొన్ని రోజులు సహకరించండి తప్పకుండా ఏదోఒక 'క్లూ' దొరక్కపోదు!" అన్నాడు ప్రొఫెసర్ ఆత్మ.

తల అడ్డంగా తిప్పాడు పవన్.

"నాకయితే ఆ నమ్మకంలేదు ప్రొఫెసర్—పోలీస్ డిపార్టుమెంట్ సహకారంతో ఆ జోసెఫైన్ ఎవరో ఆమెను ఎవరు పంపించారో కనుక్కోడానికి నా ప్రయత్నాలేవో నేను చేస్తున్నాను. మీ ప్రయోగాలు ఏవో మీరు చేసుకోండి అనిరుద్‌కి ఎటువంటి అపాయం లేనంతవరకు నాకు అభ్యంతరం లేదు" అన్నాడు.

ఆ మాత్రమయినా ఒప్పుకున్నందుకు రిలీఫ్‌గా మొహంపెట్టి లేచి నిలబడ్డాడు ప్రొఫెసర్ ఆత్మ.

"థ్యాంక్స్ పవన్‌గారూ? మీవాడికి ఎటువంటి ఆపద రానివ్వనని మరోసారి మాటిస్తున్నాను—అంతేకాదు నా ప్రయోగాలు ఫలించడంలేదని నాకు అనిపించిన మరుక్షణం నేను దీనికి ఒక ఫుల్‌స్టాప్ పెట్టేస్తాను!" అన్నాడు పవన్‌తో కరచాలనం చేస్తూ.

"అన్నట్టు—రేపు నేను అర్జెంటుగా అదిలాబాద్‌కి టూర్ వెళుతున్నాను—" అన్నాడు పవన్ కూడా లేచినిలబడుతూ.

కొంచెం కంగారుగా అతడికేసి చూసాడు ఆత్మ—

"ఈ పరిస్థితిలో అనిరుద్‌ని ఒంటరిగా వొదిలిపెట్టి వెళతారా?" అడిగాడు.

"లేదు!—ఇక వాడ్ని వొంటరిగా వొదిలిపెట్టను. నాతో అదిలాబాద్‌కి తీసుకెళుతున్నాను." అన్నాడు పవన్.

......

మర్నాడు పవన్‌తో అదిలాబాద్ టూర్ వెళ్ళడానికి ఆనందంగా ఒప్పుకున్నాడు అనిరుద్.

ఉదయం అయిదింటికే ఆఫీసు జీపులో ఆదిలాబాద్‌కి బయల్దేరారిద్దరూ—

దారి పొడుగూతా ఎంతో ఉత్సాహంగా మాట్లాడాడు అనిరుద్.

ఆర్కియాలజీ డిపార్టుమెంటు వాళ్ళు చేసే పరిశోధనల గురించి...అడవుల్లో చేసే తవ్వకాలను గురించి పవన్‌ని రకరకాల ప్రశ్నలు అడిగాడు. అనిరుధ్ కనబరుస్తున్నది ఏడేళ్ళ పిల్లవాడికి ఉండవలసిన సహజమయిన ఆసక్తి. ఆ వయసులో ఉండే పిల్లలు తమకు తెలియని విషయాలగురించి అలాగే గుచ్చి గుచ్చి నార్మల్‌గా ప్రశ్నలడుగుతుంటారు!...అనిరుధ్ ఎప్పటికీ అలాగే ఉండకలిగితే బావుంటుందనిపించింది పవన్‌కి.

ఆదిలాబాద్‌కి చేరుకునేప్పటికి మధ్యాహ్నం పన్నెండున్నర అయింది. డిపార్టుమెంటువాళ్ళు ఏర్పాటు చేసిన గెస్టుహౌస్‌లో భోంచేసాక అడవుల్లో తవ్వకాలు చేయిస్తున్న స్పాట్‌కి వెళ్ళడానికి రెడీ అయ్యాడు పవన్. కానీ...అంతలో జూనియర్ ఆఫీసర్ ఒకతను వచ్చి తవ్వకాలు ఇంకా మొదలెట్టలేదని చెప్పాడు.

"ఏమయిందీ?" అడిగాడు పవన్ చికాగ్గా.

"మళ్ళీ లేబర్ సమస్య వచ్చిపడింది సార్? ఇవాళ సాయంత్రానికి కొత్త కూలీ మనుషుల్ని ఏర్పాటు చేయిస్తాను. రేపొద్దునే తవ్వకాలు మొదలెట్టవచ్చు!" అన్నాడతను.

తల పంకించి అతడ్ని పంపించేస్తూ అన్నాడు పవన్.

"ఇవ్వాళ పనేంలేదంటున్నారుకాబట్టి నేను ఆసిఫాబాద్ వెళ్ళి నా పర్సనల్ పనొకటి చూసుకుని వస్తాను."

......

డ్రైవరు జీపు నడుపుతుంటే అనిరుద్‌ని ఒళ్ళో కూర్చోబెట్టుకున్నాడు పవన్.

"డాడీ ... ఆసిఫాబాద్ కెందుకెళ్తున్నాం మనం?" అడిగాడు అనిరుధ్.

"బామ్మకి ఈమధ్య ఒంట్లో బావుండటంలేదుకదా...తన దగ్గరుండటానికి నమ్మకమున్న పనిపిల్ల ఎవరూ దొరకటంలేదు!...చాలారోజుల క్రితం మనింట్లో ఒక అమ్మాయి పనిచేసేది. ఆ అమ్మాయిది ఆసిఫాబాదు...మళ్ళీ ఆమెను పిలుచుకుని వెళ్దాం అనుకుంటున్నాను" అన్నాడు పవన్.

"ఆ అమ్మాయి పేరేవిటి దాదీ?" అడిగాడు అనిరుద్ జీపులోంచి బయటకి చూస్తూ.

"మస్తానమ్మ!"

ఎందుకో...ఆసిఫాబాదు చేరుకుంటుంటే అనిరుద్ మౌనం వహించాడు. ఏదో ఆలోచిస్తున్నవాడిలా శూన్యంలోకి చూస్తూ కూర్చున్నాడు! వాడిలో ఉన్నట్లుండి వచ్చిన మార్పు గమనించి మళ్ళీ మాటల్లో పెట్టడానికి ప్రయత్నించాడు పవన్. కానీ...అనిరుద్ కళ్ళు మూసుకుని పవన్ ఒడిలో ఒదిగిపోయి కూర్చున్నాడు.

ఆసిఫాబాదులో మస్తానమ్మ ఇల్లెక్కడో తెలుసుకోడానికి గంటన్నర సేపు జీపులో తిరిగారు వాళ్ళిద్దరూ...అంతచిన్న ఊరిలో మస్తానమ్మని వెతకడం కష్టమవుతుందని ఊహించని పవన్‌కి ఎవరూ సరిఅయిన సమాచారం ఇవ్వకపోయేసరికి చికాకనిపించింది.

ఇక లాభంలేదనుకుని ఆదిలాబాదుకి తిరిగివెళ్ళిపోదామనుకుంటుంటే టీ కొట్టుదగ్గర బీడీ కాల్చుకుంటూ కూర్చున్న ముస్లిం వృద్ధుడు కంట బడ్డాడు పవన్‌కి.

అతడ్ని అడిగితే సరైన సమాచారం దొరుకుతుందనిపించింది ఎందుకో.

"డ్రైవర్ జీపు ఆపు" అన్నాడు చటుక్కున.

టీ కొట్టుపక్కన జీపు ఆపాడు డ్రైవరు.

జీపుదిగి వృద్ధుడి దగ్గరకి నడిచాడు పవన్.

"మీది ఈ ఊరేనా?"

అతడికేసి ఆశ్చర్యంగా చూసి తలూపాడు ఆ ముసలాయన.

"ఇక్కడ మస్తానమ్మ ఇల్లెక్కడో తెలుసా మీకు?"

"మస్తానమ్మా?"

"అం! నల్లగా పొడుగ్గా ఉంటుంది! జట్కా నడిపే బాషా మనవరాలు."

తలపంకించి జవాబిచ్చాడు.

"ఆ అమ్మాయా? వాళ్ళతాత చనిపోయాక హైదరాబాదుకెళ్ళి

పోయిందికదా! ఎవరింట్లోనో కొలువు కుదుర్చుకుంది!...అప్పట్నించి అక్కడే ఉంటోంది"

అతడి మాటలు విని ఆశ్చర్యపోయాడు పవన్!

"అదేవిటి! ఆ అమ్మాయి మా ఇంట్లోనే పనిచేసేది...ఏడేళ్ళ క్రితం పనిమానేసి వెళ్ళిపోయింది! మళ్ళీ ఇక్కడికి రాలేదని మీకు బాగా తెలుసా?"

"లేదుబాబూ! వస్తే నాకు తెలియదా? నాకు వాళ్ళతాత బాషా బాగా తెలుసు" అన్నాడా వృద్ధుడు.

నెమ్మదిగా అక్కడ్నించి కదిలి మళ్ళీ జీపు ఎక్కి కూర్చున్నాడు పవన్. మస్తానమ్మ జాడ తెలియలేదు!...హైదరాబాదునించి ఎటు వెళ్ళి పోయిందో ఏమో!

డ్రైవర్ జీపు రివర్స్ చేసుకుని బయల్దేశాడు.

మస్తానమ్మ గురించే ఆలోచిస్తున్న పవన్ సడన్‌గా జీపు ఆగిపోవ డంతో ఉలిక్కిపడ్డాడు.

"ఏమయింది?" అడిగాడు డ్రైవర్‌ని.

"టైర్ పంక్చర్ అయ్యింది సార్—" అన్నాడు డ్రైవర్ కిందికి దిగుతూ.

అనిరుధ్‌తోపాటు పవన్‌కూడా కిందికి దిగాడు.

డ్రైవర్ టైర్ మార్చే ప్రయత్నంలో ఉంటే రోడ్డుపక్కన చెట్టు దగ్గర నిలబడ్డారు పవన్, అనిరుద్.

సూర్యాస్తమయం కావస్తోంది ... పక్షులు గూళ్ళకి చేరుకుంటు న్నాయి.

రివ్వున వీస్తున్నగాలికి మొహంమీద పడ్తున్న జుట్టు సవరించు కుంటూ ఎటో చూస్తూ నిలబడ్డాడు అనిరుద్.

"బబ్లూ ఏం చూస్తున్నావ్?" అడిగాడు పవన్.

పొలానికి అవతలవైపు కనిపిస్తున్న గుడిసేసి కన్నార్పకుండా చూస్తున్నాడు అనిరుద్.

"అక్కడికి వెళ్దామా బబ్లూ!" అడిగాడు పవన్.

అవునని తెలూపి పొలంలోంచి అటుకేసి పరుగుతీసాడు అనిరుద్.

"బబ్లూ ఆగు...నేనూ వస్తాను..." అంటూ గబగబ అనిరుద్ని అనుసరించాడు పవన్.

అదొక పాడు బడినగుడి!...గుడిపక్కనే చెరువు ఒకటుంది!... చెరువుగట్టుమీద మాసినబట్టలు వేసుకుని ముగ్గురు అమ్మాయిలు ఆడు కుంటున్నారు.

గుడిమెట్ల దగ్గరే ఆగిపోయిన అనిరుద్ ఆ పిల్లలకేసే చూస్తు న్నాడు-! సర్వసాధారణమయిన ఆ దృశ్యంచూసి బబ్లూ అలా ఎందుకు నిలబడిపోయాడో అర్ధంకాలేదు పవన్కి.

"ఏమయింది బబ్లూ" అంటూ భుజంచుట్టూ చెయివేసి అడిగాడు.

అతడికేసి మెరుస్తున్న కళ్ళతో చూసాడు అనిరుద్.

"ఇక్కడే డాడీ!...మమ్మీ చిన్నపుడు ఇక్కడికే వచ్చి ఆడు కునేది!...ఈ గుడి దగ్గరే...ఈ చెరువుగట్టు దగ్గరే!..." అన్నాడు.

"ఏమిటి బబ్లూ నువ్వంటోంది!?"

"అవును డాడీ! మొన్న రాత్రి మమ్మీ సమాధిమీద పడుకుంటే తన చిన్నప్పటి కబుర్లు అన్నీ చెప్పింది నాకు."

అనిరుధ్ మాటలు వింటున్న పవన్ మస్తిష్కంలో...

"ఫ్లాష్"లా...ఒక ఆలోచన వచ్చింది.

స్నిగ్ధ ఆ ఊరికి ఎన్నడూ రాలేదని తనకు బాగా తెలుసు! అయినా అనిరుద్ మాటలు మరోలా ఉన్నాయి!

ప్రొఫెసర్ అత్త చెప్పినట్టు అనిరుద్లో నిజంగానే అతీంద్రియ శక్తులున్నాయి అనుకుంటే...

దీని గురించి ఏమనుకోవాలి? ఈ మాటలకర్ధం ఏమిటి?

సమాధిమీద పడుకున్న అనిరుద్ మాట్లాడింది...స్నిగ్ధతోనా?

సిమోంగ్స్లో వర్తులం మధ్యన కనిపించిన రూపం స్నిగ్ధదేనా?... స్నిగ్ధదికాకపోతే...మరి ఎవరిది?

ఓ గాడ్!....

ఏడేళ్ళకితం వచ్చి ఉండవలసిన అనుమానం ఇది.

చటుక్కున అనిరుద్‌ని ఎత్తుకుని గబగబ జీపుకేసి పరుగు తీసాడు పవన్.

అప్పుడే టైర్‌మార్చినట్లు బిగిస్తున్నాడు డ్రైవర్.

"డ్రైవర్! క్విక్...వెంటనే హైదరాబాదుకెళ్ళాలి..." అన్నాడు పవన్ జీపు ఎక్కుతూ.

......

# 36

"వ్హాట్! సమాధి తవ్వించి ఏడేళ్ళక్రితం ఖననంచేసిన మీ శ్రీమతి గారి శరీరం ఎక్స్‌హ్యూమ్ చేయించాలా!" అడిగాడు మిశ్రా తనఎదురుగా కూర్చున్న పవన్‌కేసి విచిత్రంగా చూస్తూ.

అవునన్నట్టు తలూపి చెప్పాడు పవన్.

"మీరుతలచుకుంటే అదేమంత పెద్దపనికాదు!"

పవన్‌కేసి చూస్తూ నెమ్మదిగా మాట్లాడాడు డి.సి.పి. మిశ్రా—

"సమాధి తవ్వించి పరిశోధన మొదలెట్టినా మనక్కావలసిన సమాచారం దొరక్కపోవచ్చు పవన్‌గారూ! సమాధిలోంచి వెలికితీసిన పుర్రె ఫొటోలు తీసి వాటిని మీ శ్రీమతిగారి ఫోటోలతో పోల్చి...అది ఆవిడదో కాదో తెలుసుకోవచ్చు. అయితే ఈ పద్ధతితో సరయిన రిజల్టు వస్తుందని గ్యారెంటీలేదు! అని ఆగాడతను.

"లండన్‌నుంచి మెడికల్ ఇలస్ట్రేటర్ రిచర్డ్‌నీవ్‌ని పిలిపిస్తే?" అడిగాడు పవన్ చటుక్కున.

"రిచర్డ్‌నీవ్‌నా! అతడిగురించి మీకెలా తెలుసు?" ఆశ్చర్యంగా అడిగాడు మిశ్రా.

"ఏడేళ్ళక్రితం లండన్‌కి వెళ్ళినపుడు ఒక కాన్ఫరెన్స్‌లో కలిసానాయన్ని. కొన్నివేల సంవత్సరాలక్రితం చనిపోయిన వ్యక్తుల పుర్రెలను రీకంస్ట్రక్ట్‌చేసి ఆ వ్యక్తి ఆకారాన్ని అచ్చుగుద్దినట్టు తయారుచేయగలిగిన మేధావి అతను" అన్నాడు పవన్.

అతడి మాటలు విని తల అడ్డంగా తిప్పాడు డి.సి.పి. మిశ్రా.

"మీ ఆరాటం నేను అర్థంచేసుకోగలను!...కానీ ఉన్నఫళంగా

లండన్‌నించి ఎక్స్‌పర్ట్‌ని పిలిపించడం ఖర్చుతో కూడినపని!...పైగా మనం పిలవగానే పనులుమానుకుని అతడు వెంటనే వస్తాడని నమ్మకం కూడాలేదు!" అన్నాడు.

"అతను వస్తానంటే మీకభ్యంతరం ఉండదు కదా?" అడిగాడు పవన్...

"అభ్యంతరం ఎందుకుంటుంది?"

మిశ్రా అలా అనగానే ఎంతో రిలీఫ్‌తో చెప్పాడు పవన్.

"థాంక్యూ మిశ్రాగారూ...నిన్నరాత్రి రిచర్డ్‌సీవ్‌తో ఫోన్‌లో మాట్లాడి నా సమస్యలు విడమర్చి చెప్పాను...అతను ఇవాళ బయల్దేరి రేపు సాయంత్రానికల్లా హైదరాబాద్‌లో ఉంటాడు!"

"గ్రేట్!" అని పవన్‌లోని పట్టుదలని మెచ్చుకోలుగా చూసాడు మిశ్రా.

......

రిచర్డ్‌సీవ్‌ని రిసీవ్ చేసుకోవడానికి ఎయిర్‌పోర్టుకి బయల్దేరుతుంటే ప్రొఫెసర్ ఆత్మ గేటు దగ్గర ఎదురు వచ్చాడు.

జరిగిందంతా క్లుప్తంగా చెప్పాడతనికి పవన్.

అంతా విని ఆనందంగా కరచాలనం చేసాడు ప్రొఫెసర్.

"ఫంటాస్టిక్! అయితే అనిరుద్ ఇన్నాళ్ళూ తల్లితో మాట్లాడుతున్నాడనుకుని ఆ అమ్మాయితో మాట్లాడాడన్న మాట! అందుకే వాడి మాటలు మనకు అర్థం పర్థం లేనివిగా తోచాయి! ఇప్పటి కయినా నమ్ముతారా మీవాడు సామాన్యుడు కాడని?...అసలు నన్నడిగితే మీరిపుడు సమాధి తవ్వించే పని మానేసి...స్నిగ్ధగారు ఎక్కడున్నారో తెలుసుకునే ప్రయత్నం చేయడం అవసరం!" అన్నాడు ఆత్మ ఎంతో ఎక్సయిట్ అయిపోతూ.

పవన్‌లో ఆత్మ ఆశించిన ప్రతిస్పందన కనబడలేదు.

"లేదు ప్రొఫెసర్! నిర్వివాదమయిన ఆధారాలు లేనిదే ఒక్క అడుగుకూడా ముందుకి వేయదలుచుకోలేదు నేను" అన్నాడు పొడిగా.

పవన్ కారుకేసి కదులుతుంటే అడిగాడు ఆత్మ...

"అనిరుద్‌కి మీరు సమాధి తవ్విస్తున్నట్టు చెప్పారా?"

"లేదు।...ఒకవేళ సమాధిలోంచి వెలికి తీసిన అస్తికలు స్నిగ్ధవే నని తేలితే వాడి మానసిక పరిస్థితి ఎలాఉంటుందో ఊహించి, చెప్పలేదు। బబ్లూలో ఏవో అద్భుత శక్తులున్నాయనీ వాడు మహా మేధావి అనీ... స్థితప్రజ్ఞుడనీ మీరనుకుంటుండవచ్చు...కానీ నా దృష్టిలో బబ్లూ ఏడేళ్ళ పసివాడు ఆ విషయం మరచిపోతే ఎలా? వాడిలేత మనసుతో ఆడుకోవడం నాకేమాత్రం ఇష్టంలేదు." అనికారెక్కి కూర్చున్నాడు పవన్.

పవన్ కారు స్టార్టుచేసుకుని వెళ్ళాక కాసేపు ఏదో ఆలోచనలో పడి పోయాడు ప్రొఫెసర్ ఆత్మ.

పవన్ సాధించాలనుకుంటున్నది రొటీన్ ఇన్‌వెస్టిగేషన్‌తో సాధ్య పడుతుందా?

అనిరుద్।...అవును...అనిరుధ్‌కే ఈ సమస్యను పరిష్కరించే సామర్థ్యం ఉంది.

అనిరుద్‌లోని అసాధారణమయిన శక్తులకి...తన విజ్ఞానాన్ని జోడించి..." 'అక్కల్టిజమ్'లో ఇంతవరకూ ఎవరూ చేపట్టని సాధనలతో స్నిగ్ధ జాడతెలుసుకోవాలి।...అజ్ఞాత శత్రువుల్ని ఎదుర్కోవాలి।

ఒక నిర్ణయానికి వచ్చి...నెమ్మదిగా ఇంట్లోకి నడిచాడు ప్రొఫెసర్ ఆత్మ.

......

ఆరాత్రి...శ్మశానవాటికలో...

డి.సి.పి. మిశ్రా పర్యవేక్షణలో తవ్వకం ప్రారంభమయింది... ఎందుకో అక్కడ నిలబడలేక పక్కకు జరిగాడు పవన్.

ఆర్కియాలజిస్టుగా గతంలో తను ఎన్నో తవ్వకాలు చేయించాడు. తవ్వకాల్లో ఎన్నోసార్లు పాతకాలంనాటి సమాధులు బయటపడేవి। అవి 'రాకాసి గుళ్ళ'ని కూలీవాళ్ళు భయపడితే—వాళ్ళ మూఢ నమ్మకాల్ని వమ్ము చేయడానికి తనే గునపం పట్టుకుని సమాధులు తవ్వి అందులోని అస్తికలు బయటకు తీసేవాడు। కానీ...ఇప్పుడు? శ్మశానంలోని సమాధి తవ్విస్తుంటే మనసులో విచిత్రమయిన ఆలోచనలు చోటుచేసుకుంటు

న్నాయి।

మరిచెట్టుకానుకుని కళ్ళుమూసుకున్నాడు పవన్.

ఎన్నో రోజుల తర్వాత భగవంతుడ్ని తలచుకున్నాడు।

"నేను చేయిస్తున్న ఈ పని తప్పో ఒప్పో తెలియదు। భగవంతుడా।...సమాధిలోని అస్తికలు ఎవరివయినా...ఆ వ్యక్తి ఆత్మకి శాంతి ప్రసాదించు।"

......

ఇటు శ్మశానంలో...

సమాధిలోని అస్తికలు జాగ్రత్తగా బయటకి తీస్తుంటే

అటు జూబ్లీహిల్స్ ఇంట్లో...

ఎంతో ఉత్సాహంగా ప్రొఫెసర్ ఆత్మ చెప్పిన ఏర్పాట్లు పూర్తి చేస్తున్నాడు చిన్నారి అనిరుద్।

గది నలుమూలలా వొలచిన వెల్లుల్లి వెదజల్లి...గదిమధ్యన పింగాణీ గిన్నెలో ఆత్మా ఇచ్చిన పెట్లుప్పు ద్రావకం పోసిపెట్టాడు।అవన్నీ గదిలో ఉంటే అదిభౌతిక శక్తులు ఏవీదరికి రావట।।

బామ్మ నిద్రపోయింది।...డాడీ కూడా ఇంట్లోలేడు।।

ఇక తను ఏటువంటి అంతరాయంలేకుండా ప్రొఫెసర్ అంకుల్ చెప్పిన ప్రయోగం మొదలెట్టవచ్చు।?

ప్రయోగం మొదలెట్టడానికి ఉరకలు వేస్తోంది వాడి మనసు.

అవునుమరి।...

ప్రొఫెసర్ ఆత్మా ఇన్నాళ్ళూ చేయించిన ప్రయోగాలన్నీ ఒక ఎత్తయితే...ఆరోజు చేయిస్తున్న ప్రయోగం మరో ఎత్తు।।

లైట్ ఆర్పి... మంచంకేసి కదిలాడు అనిరుద్...

......

శ్మశానంలో...అస్తికలు వెలికితీసాక రిచర్డుసీవ్ అన్నాడు.

"ఈ స్కల్‌కి క్యాస్టింగ్ చేసి రికంస్ట్రక్టు చేస్తాను...ఎంత కాదన్నా ఈ పని పూర్తి చేయడానికి నాలుగు రోజులుపడ్తుంది."

"రిచర్డ్।...ప్లీజ్। ఇది ఎమర్జన్సీ...నాకంత టైంలేదు। నాకివాళ్టికి

వాళే మీ రిపోర్టు కావాలి!" అని మొండిగా పట్టు పట్టాడు పవన్.

"నో! ఇంపాసిబుల్! ఇది క్షణాలమీద జరిగే పనికాదు! నిజానికి నాలుగురోజులుకూడా సరిపోవు! చాలా నెమ్మదిగా...జాగ్రత్తగా చేయవలసిన పనిది!" అన్నాడు రిచర్డ్ సీవ్.

ఒక్కక్షణం ఆలోచించి మళ్ళీ అడిగాడు పవన్.

"రిచర్డ్! మీరు మొత్తం మొహం ఎలా ఉండేదో మోడల్ తయారు చేయడానికి అంత టైం పట్టవచ్చునేమో...కానీ మీ అనుభవం చాలా గొప్పది! ఈ పుర్రెని పరిశీలించి మీ లెక్కలప్రకారం...ఈ వ్యక్తి బతికున్నపుడు ఎలా ఉండేదో బొమ్మ గీసి చూపలేరా?"

పవన్ ఆత్రుత అర్థం చేసుకున్నాడు రిచర్డుసీవ్-

"నేనింతవరకూ అలా ఎన్నడూ చేయలేదు. కానీ మీ కోసం ప్రయత్నించి చూస్తాను...రేపు పొద్దున పది గంటలకల్లా" అని అతనంటుండగా మధ్యలో ఆపేసాడు పవన్.

"నో...రేపుపొద్దునదాకా కాదు రిచర్డ్...దయచేసి శ్రమ అనుకోకుండా వెంటనే మొదలెట్టండి మీ అనాలిసిస్!" అన్నాడు.

సరే అన్నట్టు భుజాలెగరేసి ముందుకి నడిచాడు ఆ ఎక్స్‌పర్ట్!

స్కల్‌ని పరిశీలించడానికి ఫోరెన్సిక్ ల్యాబ్‌లో ఏర్పాట్లు చేయించాడు డి.సి.పి. మిశ్రా.

లోపలగదిలో రిచర్డుసీవ్ తన పని చేస్తుంటే అసహనంగా సిగరెట్లు కాలుస్తూ బయట నిలబడ్డాడు పవన్.

రాత్రి ఒంటిగంటన్నరకి బయటకి వచ్చాడతను.

"మిస్టర్ పవన్!...మీరడిగారు కదా అని ఈ పనికి ఒప్పుకున్నాను...స్కల్ ఆకారాన్నిబట్టి నాకు తోచినట్టు ఒక బొమ్మ గీసాను. కానీ, నాకే సంతృప్తికరంగాలేదు!...నేను చెప్పినమాట వినండి. రెగ్యులర్ పద్ధతిలో రీ కంస్ట్రక్షన్ చేస్తాను...కొంచెం ఆలస్యం అయినా కరెక్టు రిజల్టు వస్తుంది!" అన్నాడు.

"మీరు గీసిన బొమ్మ చూడవచ్చా?" అని అతడి సమాధానం కోసం ఎదురుచూడకుండానే లోపలికి నడిచాడు పవన్.

గదిలో స్టాండుకి వేలాడుతున్న బొమ్మనుచూసి అద్దిరిపోయాడు పవన్.

......

మంచంమీద కళ్ళు మూసుకుని పడుకున్న అనిరుద్ తనువు వింత అనుభూతితో పులకరించింది! ... వాడి లేత పెదాలమీద చిరునవ్వు మెదిలింది.

శరీరం ఎంతో తేలికయిపోతున్నట్టు...గాలిలో తేలిపోతున్నట్టు గమ్మత్తయిన ఫీలింగ్!

అంతకు ముందెన్నడూ అలా అనిపించలేదు...! ఎంతో హాయిగా ఉందా వింత అనుభూతి.

నెమ్మదిగా కళ్ళు తెరచి చూసాడు అనిరుద్.

ఆశ్చర్యం!!

ఏమిటిది?

తను పడుకునిలేడు! నిలబడి వున్నాడా?...లేదు...గాలిలో తేలుతున్నాడు!! మంచం పక్కనే ఉన్నాడు...!

మరి...

మంచంమీద వెల్లకిలా పడుకున్నది ఎవరూ?

తనే!...అదికూడా తనే! రెండూ తనే!

ఏమిటిదంతా!...కలకంటున్నాడా తను?—

లేక...ప్రొఫెసర్ అంకుల్ చెప్పినట్టు ... నిజంగానే సూక్ష్మ శరీరంతో బయటికి వచ్చేసాడా తను!

అవును! అదే అయ్యుండాలి.

ప్రొఫెసర్ అంకుల్ చెప్పినట్టు తన సూక్ష్మ శరీరానికి మంచం మీద నిద్రపోతున్నట్టు పడుకున్న శరీరానికి మధ్య "అంబిలికల్ కార్డ్" తెల్లగా మెరుస్తోంది!...ఆ శరీరం బొడ్డు దగ్గర్నించి తనదాకా తీగలా సాగివస్తోంది అది!...తను బతికే ఉన్నాడని చెప్పడానికి అది నిదర్శన మట! చనిపోయినవారికి మామూలు శరీరం ఉండదుకాబట్టి వాళ్ళకు "అంబిలికల్ కార్డ్" ఉండదట!...అది ఉన్నంతవరకూ తనకేం భయం

లేదు! ఎక్కడికి వెళ్ళినా కోరుకోగానే రెప్పపాటులో తిరిగివచ్చి మామూలు శరీరంలోకి చేరుకోవచ్చు.

మంచంమీద పడుకున్న తన ఆకారంకేసి విస్మయంగా చూస్తూ మరికాసేపు నిలబడిపోయాడు అనిరుద్.

ప్రొఫెసర్ అంకుల్ ఉపదేశాలు మరోసారి గుర్తుకి తెచ్చుకున్నాడు అనిరుద్.

"అస్ట్రిల్ బాడీతో నువ్వు ఎక్కడికయినా వెళ్ళకలవు. నీకు పూర్తి స్వేచ్ఛ ఉంటుంది! ఎక్కడికి వెళ్ళాలన్నా క్షణాల్లో...నీ ఆలోచనా తరంగాల వేగంతో వెళ్ళిపోకలవు!...అస్ట్రిల్ బాడీలో ఉండే నీకు అడ్డం కులుకూడా ఉండవు...ఈ ప్రపంచంలోని వస్తువులేవీ నీకు అడ్డురావు! అలాగే వాటిని నువ్వు ముట్టుకోలేవు!"

ఆ మాటలు గుర్తురాగానే ఎనలేని ఉత్సాహం వచ్చింది అనిరుద్‌కి! వెంటనే అక్కడ్నించి బయటకివెళ్ళి...ప్రపంచమంతా చూసేయాలని పించింది.

కానీ...ఎలా? ప్రొఫెసర్ అంకుల్ చెప్పినట్టు తను సూక్ష్మ శరీరంతో స్వేచ్ఛగా విహరించవచ్చేమో కానీ...ఒక నిర్దిష్టమయిన ప్రదేశానికి వెళ్ళాలంటే...ఆ ప్రదేశం తను అంతకుముందు చూసినదే అయ్యుండాలి. కనీసం ఆ ప్రదేశం ఫోటో అయినా చూసి ఉండాలి.

లేదా—సూక్ష్మ మండలాలకి చెందిన ఆత్మ ఏదయినా వచ్చి తనకు మార్గం చూపించాలి! తనకు 'గైడ్'గా రావాలి!

అప్పుడు వినబడింది...అనిరుద్‌కి ఎవరిదో ఏడుపు!

గుండెలవిసిపోయేలా ఏడుస్తున్నారెవరో!

ఎవరది! ఎవరయి ఉంటారు...ఇంత రాత్రివేళ?

నెమ్మదిగా తలుపుకేసి కదిలాడు అనిరుద్

తలుపు గడియ తీయబోయాడు...

కానీ...చేతికి గడియ తగల్లేదు!

గడియలోంచి—తలుపులోంచి చెయి బయటకి వెళ్ళిపోయింది.

ఆశ్చర్యంగా రెండు చేతులూ తలుపులోంచి బయటకి పెట్టేసి

అటూఇటూ ఆడించాడు...గడియవేసిఉన్న ఆ తలుపు అసలు అక్కడ లేనేలేనట్టుగా ఉంది.

ఒకేఒక్క క్షణం సందేహించి ముందుకి నడిచాడు అనిరుద్.

తలుపులోంచి...ప్రవహిస్తున్నట్టు బయటకి...హాల్లోకి వచ్చి నిలబడ్డాడు! ప్రొఫెసర్ అంకుల్ చెప్పింది ఇదేకదా! అలాగే జరుగుతోంది. అ ఏడుపు ఇంకా వినిపిస్తూనే ఉంది.

మెట్ల కింద గదిలోంచి వినవస్తోంది.

అటుకేసి 'తేలి' వెళ్ళాడు అనిరుద్. తనగది తలుపులోంచి బయటకి వచ్చినట్టుగానే...మెట్ల కింద గది తలుపుల్లోంచి లోపలికి వెళ్ళాడు.

గది మధ్యన—జుట్టు విరబోసుకుని కూర్చుని ఉంది నల్లటి ఓ అమ్మాయి...

వెక్కి వెక్కి ఏడుస్తోందామె...! అనిరుధ్‌కేసి దీనంగా చూసిందా పిల్ల! నల్లటి మొహంలో ఆమె కళ్ళు తళుక్కుమన్నాయి.

"అనిరుద్‌బాబా...!!" అంది ఆ పిల్ల అనిరుధ్‌కేసి చూస్తూ.

ఆ పిలుపు వినగానే ఇట్టే గుర్తు పట్టేసాడు అనిరుధ్!

"మస్తానమ్మా—ఎందుకు ఏడుస్తున్నావ్?" అడిగాడు.

"పాపిష్టిదాన్ని...నాకు విముక్తిలేదు అనిరుద్‌బాబా?" అని మళ్ళీ ఏడుపు మొదలెట్టింది.

ఆమెను ఎలా ఓదార్చాలో తెలియక మౌనంగా కూర్చున్నాడు అనిరుద్.

"బతికున్నన్నాళ్ళూ—మూర్ఖంగా సిఫిలి అమల్‌తో చెలగాటమాడి మా గురువాజ్ఞనే ధిక్కరించాను. సైతానుతో చేతులు కలిపి అపవిత్రమయిన పనులు చేసాను. మీ అమ్మ కడుపులో పెరుగుతున్నది నువ్వని ఊహించలేక ఆమె గర్భాన్నే వమ్ము చేయాలనుకున్న కిరాతకిని...!

మస్తానమ్మ బాధను చూడలేకపోయాడు అనిరుధ్. జాలితో నిండిపోయింది వాడి మనసు.

"బాధపడకు మస్తానమ్మా! నువ్వంటే మాకెవరికీ కోపంలేదు. మా మమ్మీని నేనింతవరకూ చూడలేదు కానీ—మమ్మీకికూడా నువ్వంటే చాలా

ఇష్టముండేదట ఎన్నోసార్లు నీ ప్రాణాలకి తెగించి మమ్మల్నందర్నీ కాపాడవట కదా." అన్నాడు—

ఏడుపు ఆపి తెల్లటి పలువరసతో చిన్నగా నవ్వింది మస్తానమ్మ।

"నేను తలపెట్టిన పనులు ఎలాంటివో అర్థం చేసుకున్నాక నాపాప భారం కొంత తగ్గించుకోవడానికి—నువ్వెవరివో అర్థమయ్యాక నాకు చేతనయినదేదో చేసాను।—నిన్ను కాపాడకలిగానే కానీ—స్నిగ్ధమ్మని 'వాళ్ళ' బారినుంచి రక్షించలేక పోయాను."

ఆమాటవినగానే చటుక్కున అడిగాడు అనిరుద్.

"మమ్మీ—మా మమ్మీ బతికేఉందా? ఎక్కడుంది?"

తలూపి తనధోరణిలోనే మాట్లాడింది మస్తానమ్మ—సూక్ష్మశరీరంలో కనిపిస్తున్న మస్తానమ్మ.

"నా తప్పు తెలుసుకున్నాక మా బాబాక్షమాపణలు కోరుకోవడానికి ఇల్లు వొదిలిపెట్టి బయల్దేరిపోయాను—కానీ దారంతా నీ ఆలోచనలే—। మా ఊరికి బయల్దేరినదాన్ని బస్సుదిగి మళ్ళీ వెనక్కి వచ్చేసాను—అప్పుడు—మీ అమ్మ—స్నిగ్ధమ్మ... ఒంటరిగా నిన్ను పెట్టుకుని ఉంది। నేను తిరిగి వచ్చేసానని ఎంతో సంబరపడిపోయిందామె. కానీ—ఆసంతోషం ఎంతోసేపు నిలవలేదు—ఆ సాయంత్రం—అసుర సంధ్యవేళ—ఎలా వచ్చేసిందో కానీ—తిన్నగా ఇంట్లోకే వచ్చేసిందా రాకాసి। కాత్యాయని॥

స్నిగ్ధమ్మ పైన...నీపైన నికృష్టమయిన మాయాజాలంచేసి... నిన్ను నాశనంచేసి స్నిగ్ధమ్మని తీసుకెళ్ళడానికి ఎవరో ప్రయత్నిస్తున్నారని నాకుముందే తెలుసు। కాత్యాయని వాళ్ళమనిషేనని తెలిసి ఉక్రోషం వచ్చిందినాకు...॥ కోపంపట్టలేక నాకు తెలిసిన విద్య ఉపయోగించాను. కాత్యాయని చుట్టూ అగ్నిగోళం సృష్టించి చాలాసేపు ఆపేసాను ఆమెను.. కానీ...అంతలో దాని నాయకుడు భీష్తినాయక్ వచ్చేసాడు॥...కాత్యాయనిని నా అదుపులో తెచ్చుకునే ప్రయత్నంలో ఉన్న నాకు భీష్తినాయక్ విసిరిన కుంభీనస యంత్రం అగుపడలేదు॥ ఆ యంత్రం...నేను వేసుకుని కూర్చున్న ముగ్గుని దాటుకుంటూ నన్ను చుట్టుముట్టింది। ఏమయిందో

ఏమో!...ఉన్నట్టుండి...నా శక్తులన్నీ హరించుకుని పోయాయి వట్టి వయ్యాయి!!...ఇకచేసేదిలేక నీ ఉయ్యాలదగ్గర నా దగ్గర మిగిలిపోయిన ఒకే ఒక ఆయుధం...మా బాబా ఇచ్చిన తాయత్తు...పట్టుకుని నిలబడ్డాను నీ దగ్గరకి రాలేకపోయారా దుష్టులు! స్నిగ్ధమ్మని మాత్రం తమ వశం చేసుకొని తీసుకెళ్ళిపోయారు!" అని ఆగింది మస్తానమ్మ—

ఆ ఉదంతం విని చలించిపోయాడు అనిరుద్...జరిగిందంతా కళ్ళకు కట్టినట్టు అగుపడింది.

"అంటే...మమ్మీ ఇంకా వాళ్ళదగ్గరే ఉందా?...ఎవరువాళ్లు?..." అడిగాడు అనిరుధ్ ఏడుపు ఆపుకుంటూ...

"పరమనీచులు!...కరకింకర భక్తులు! ఈ సృష్టి విధ్వంసానికి పూనుకున్న రాక్షసులు!..." అంది మస్తానమ్మ కోపంగా ఊగిపోతూ...

"నన్ను మా మమ్మీ దగ్గరకు తీసుకెళ్ళకలవా మస్తానమ్మా?" సూటిగా అడిగాడు అనిరుద్...

కంగారుగా అతడికేసి చూసింది మస్తానమ్మ.

"వొద్దు అనిరుద్ బాబా!...ఆ ఒక్కటి అడక్కు!"

నీరసపడిపోయాడు అనిరుద్...

"అంతేనా మస్తానమ్మా!...నేనంటే అంత ఇష్టమంటున్నావు... నాకోసం ఈమాత్రం చేయలేవా...?"

"...నువ్వంటే ఇష్టం కాబట్టే నిన్ను ఆపదల్లో పడేయలేకపోతున్నాను..." అంది మస్తానమ్మ—

"నాకే ఆపదారాదు!—నేనెలాగయినా మా మమ్మీని చూడాలి అంతే!" అన్నాడు మొండిగా—

వాడికేసి చాలాసేపు చూస్తూ కూర్చుండిపోయింది మస్తానమ్మ! చివరికి ఏదో నిర్ణయానికి వచ్చినట్టు తల పంకించింది.

"ఆ విధాత కోరికలేమిటో ఎవరికీ అంతుచిక్కవు! సృష్టివినాశనానికి తలపెడుతున్న కొమ్ములుతిరిగిన ఆ దుష్టమంత్రగాళ్ళను ఎదుర్కొడానికి లేగదూడలాంటి ఈ పసివాడా! ప్రభునిర్ణయం అదే అయితే అభ్యంతరం చెప్పేందుకు నేనెవరిని?—నాకు తెలుసు నేను రాకపోయినా మీ

అమ్మని వెతుక్కుంటూ నువ్వు వొంటరిగానైనా వెళ్ళిపోతావు! సరే— అనిరుద్ బాబా—నాకు చేతనయిన సహాయం చేస్తాను నేను! ఈ పని చేయడానికే ప్రభువు నన్నిన్నాళ్ళూ ఇలా అట్టిపెట్టేసాడేమో!—కానీ— ఒక్కమాట అనిరుద్‌బాబా! నీకింకా చాలా విషయాలు తెలియవు! ఏ మాత్రం ప్రమాదం గోచరించినా—నామాటవిని వెనక్కి వచ్చేయాలి నువ్వు!" అని ముగించింది మస్తానమ్మ.

......

మస్తానమ్మ చెయి పట్టుకుని హుషారుగా ఇంటి బయటకి వచ్చి నిలబడ్డాడు అనిరుద్.

సుపరిచితమయిన ఆ పరిసరాలు ఎందుకో కొత్తగా కనిపించాయి అనిరుద్‌కి—గాలిలోని వింతపరిమళం నాసికా పుటాలకి తాకింది!! లేత నీలంరంగు కాంతిలో కాలనీలోని ఇళ్ళన్నీ స్పష్టంగా కనబడుతున్నాయి!

"సూక్ష్మ ప్రపంచంలో విహరించే వారికి చీకటి ఉండదు! అస్ట్రల్ లైట్‌లో అవి కనిపిస్తాయి!" అన్న ప్రొఫెసర్ అంకుల్ మాటలు గుర్తొచ్చాయి.

"ఇక్కడ్నించి మమ్మీ దగ్గరికి ఎలా వెళ్తాం?" అడిగాడు అనిరుద్.

అలా అడుగుతుండగానే ఒక అద్భుతం జరిగింది!!!

మస్తానమ్మతోపాటు గాలిలో పైకి ఎగిరాడు అనిరుద్!!

అలా పైకి—ఇంకా పైకి ఎగిరిపోతుంటే ఉక్కిరి బిక్కిరి అయిపోయాడు అనిరుద్. కాలనీలోని ఇళ్ళన్నీ బొమ్మరిళ్ళలా కనిపిస్తుంటే ఒక్కక్షణం భయమేసింది! కానీ అంతలో ప్రొఫెసర్ ఆత్మ ఉపదేశం గుర్తుకొచ్చి సర్దుకున్నాడు!—

సూక్ష్మ శరీరంలో పయనిస్తున్నపుడు మనసులో సంశయాలు, భయాలు, సంకోచాలు ఉండకూడదు. వాటికి తావిస్తే మరుక్షణం భౌతిక శరీరంలోకి వచ్చి చేరవలసి ఉంటుంది.

"అనిరుద్‌బాబా! ముందు ఈ సూక్ష్మ మండలాల్లో ఎలా విహరించాలో నేర్చుకో! నీకది పెద్దవిషయంకాదని తెలుసునాకు—ఒక్కటిమాత్రం గుర్తుంచుకో—మన గమనం నీ ఆలోచనల మీదే ఆధారపడుతుంది!

నువ్వు ఎంత వేగంగా కావాలంటే అంత వేగంగా పయనించకలవు—"
అంది మస్తానమ్మ—

"అయితే నన్ను వెంటనే మా అమ్మదగ్గరకి తీసుకెళ్ళు!" అన్నాడు.

అంతే!!! అలా అన్నాడో లేదో—

చూస్తుండగానే కొన్ని వందల మైళ్ళు ప్రయాణం చేసారిద్దరూ!!

ఒకచోటకువచ్చి గాలిలో తేలుతున్నట్టుగా ఆగిపోయారు!

అది అనిరుద్ ఎన్నడూ చూడని ప్రదేశం!—

ఎత్తయిన కొండలను చుట్టుకుని ఉన్నట్టున్న రోడ్డు పైన కార్లూ బస్సులూ నెమ్మదిగా కదులుతున్నాయి.

ఆకాశంలోని నక్షత్రాలన్నింటినీ తన వొడిలోకి తీసుకున్నట్టు కొండలనడుమ—ఒక ప్రదేశంలో ఎన్నో లైట్లు వెలుగుతున్నాయి!—ఆ పట్టణంలో అందమయిన కాటేజీలు—బంగళాలు—హోటళ్ళు ఎన్నో ఎన్నెన్నో!

"ఆగిపోయావేం?" అడిగాడు అనిరుద్.

"నేనింతకంటే ముందుకి తీసుకెళ్ళను అనిరుద్‌బాబా. ఈ వాతావరణంలో నీకీడుకోరే దుష్టశక్తులు విహరిస్తున్నాయి. మనం ముందుకెళితే ప్రమాదం ఉంటుందనిపిస్తోంది—మీమమ్మీ— అదిగో ఆ ఎత్తయిన భవనంలో ఉన్నట్టు నాకుతెలుసు—కానీ ఇవాళ మనం ముందుకెళ్ళవద్దు." అంది మస్తానమ్మ.

అంతవరకూ వచ్చి తిరిగివెళ్ళడం ఏమిటి అనిపించింది అనిరుద్‌కి

తటాలున ఆ భవనంకేసి కదిలాడు—

వెనకనించి మస్తానమ్మ వారిస్తున్నా వినిపించుకోలేదు—

అంతలో ఎత్తయిన ఆ భవనంలోంచి కారుమబ్బుల్లా కొన్ని ఆకారాలు వెలికి వచ్చాయి!!

చూస్తుండగానే భయంకరమయిన ఆ ఆకారాలు అనిరుద్‌ని చుట్టుముట్టేసాయి!!

వాడికి సహాయపడే పరిస్థితిలో లేదు మస్తానమ్మ!

చిన్నారి అనిరుద్‌మీద ప్రారంభమయింది.

సైకిక్ అటాక్!!!

## 37

ఫోరెన్సిక్ ల్యాబ్‌నించి నెమ్మదిగా కారు డ్రైవ్ చేసుకుంటూ ఇంటి కేసి బయల్దేరిన పవన్ ఆలోచనలు పరిపరి విధాలుగా పోతున్నాయి.

పక్కసీటులో గాలికి రెపరెపలాడుతున్న బొమ్మ లండన్‌నించి వచ్చిన రిచర్డ్‌సీవ్ గీసినది.

అనుమానంలేదు! అది మస్తానమ్మ బొమ్మే!

చనిపోయింది స్నిగ్ధకాదని తేలింది కాబట్టి సంతోషించాలా? లేక... ఇన్నేళ్ళుగా ఈ విషయం గ్రహించలేకపోయిన తన అవివేకానికి బాధ పడాలా?

ఆలోచనల్లో పడిపోయి యాంత్రికంగా కారు డ్రైవ్ చేసుకుంటూ ఇంటిదాకా వచ్చేసాడు పవన్!

ఇంటి గేటుదగ్గర అడ్డంగా పార్కుచేసి ఉన్న నల్ల అంబాసిడర్ కారుకేసి ఆశ్చర్యంగా చూసాడతను!...

ఇంత రాత్రివేళ ప్రొఫెసర్ ఆత్మా వచ్చాడంటే?...అనిరుద్‌కి ఏదయినా? ఓ గాడ్!

విసురుగా కారులోంచి దిగి ఇంట్లోకి పరుగెట్టాడు పవన్...ఎక్కడా ఆగకుండా తిన్నగా ... లైటు వెలుగుతున్న అనిరుద్ బెడ్‌రూంలోకి వెళ్ళాడు.

అక్కడి పరిస్థితిచూసి నిశ్చేష్టుడయిపోయాడు పవన్!

మంచంపక్కన ప్రొఫెసర్ ఆత్మా నిలబడి ఉంటే...

మంచంమీద పడుకున్న అనిరుద్...ఎగిరెగిరి పడ్తున్నాడు!

అదృశ్య వ్యక్తులెవరో చుట్టుముట్టి హింసిస్తున్నట్టు అటూఇటూ ఊగిపోతున్నాడు!

జరుగుతున్నదేవిటో అర్థంచేసుకునేంతలో...

ఛెళ్ళు...ఛెళ్ళు! మోతతో మారుమ్రోగిందా గది!

ఏమిటిది!...అనిరుద్‌ని కొరడా పెట్టి ఎవరో కొడ్తున్నారు!

కొరడా కానీ...కొడ్తున్న వ్యక్తులుకానీ కనబడటంలేదు! అయినా అనిరుద్ తెల్లటి వొంటిమీద ఎర్రటి చారలు ఏర్పడ్తున్నాయి!

ఇక ఆగలేకపోయాడు పవన్.

"బబ్లూ! మైసన్,...!" అంటూ అమాంతంగా ముందుకి నడిచాడు కానీ....

"ప్లీజ్! ఈ పని నాకు వొదిలిపెట్టండి!" అంటూ అతడ్ని మధ్యలోనే ఆపేసాడు ప్రొఫెసర్ ఆత్మ!

పవన్‌ని వెనక్కి జరిపేసి...అనిరుద్ మంచంచుట్టూ తిరుగుతూ గాలిలో దేనికోసమో వెతుకుతున్నవాడిలా గది కలయచూసాడు ప్రొఫెసర్ ఆత్మ.

అంతలోనే అనిరుద్ మంచంమీద కూర్చుని...వాడి నుదిటిమీద ప్రేమగా నిమురుతూ ఎంతో మృదువుగా మాట్లాడాడు ఆత్మ.

"అనిరుద్!...నిన్నెవరూ ఏమీ చేయలేరు! నీకు కనిపిస్తున్న ఆకారాలు అ దుష్టులు సృష్టించిన ఆది భౌతికాలు! సూక్ష్మ శరీరంలో విహరిస్తున్న నువ్వు...ఆ శక్తుల్ని నీ మనోశక్తితో మటుమాయం చేయ కలవు! కానీ...ఇవాళ కాదు...ఇవేళ్టికి తిరిగివచ్చేయి! రిలాక్స్ అనిరుద్! కమ్ బ్యాక్."

అతడి మాటల ప్రభావమో...మరేమోకానీ ... అంతవరకూ తల్లడిల్లిపోయిన అనిరుద్ క్రమంగా రిలాక్స్ కాసాగాడు.

ప్రొఫెసర్ ఆత్మ తనమాటలు అలాగే కొనసాగించాడు! హిప్న టిస్ట్‌లా మంద్రస్థాయిలో అతడు మాట్లాడ్తుంటే...అనిరుద్ సొమ్మసిల్లి పడుకున్నాడు. అలా పడుకుని కాసేపటికి నిద్రలోకి జారుకున్నాడు.

అంతవరకూ విస్మయంగా చూస్తున్న పవన్ ముందుకి కదిలాడు.

"ప్రొఫెసర్! ఏమిటిదంతా?"

మొహానికి పట్టిన చెమటలు తుడుచుకుంటూ లేచివచ్చాడు ప్రొఫెసర్ ఆత్మ.

"అక్కల్ట్ సైన్స్‌లో విశిష్టమయిన ప్రయోగం ఇది! అస్ట్రల్

జర్నీ। స్నిగ్ధగారి ఆచూకి తెలుసుకోవడానికి ఇంతకంటే మంచిమార్గంలేదు. సాయంత్రం మీరు వెళ్ళాక అనిరుద్‌కి జరిగిందేవిటో చెప్పాను. ఇన్నాళ్ళుగా తను పొరపాటున మస్తానమ్మతో మాట్లాడ్తూ వచ్చాడని...ఇప్పుడు ఆ మస్తానమ్మ సహకారంతోనే స్నిగ్ధ జాడ తెలుసుకోవలసి ఉంటుందని చక్కగా అర్థం చేసుకున్నాడు అనిరుద్।" అని ఆగాడు ఆత్మ.

అతడికేసి చురుగ్గా చూసాడు పవన్.

"ఎన్ని ప్రయోగాలు చేసినా అనిరుధ్‌కి ఎటువంటి ఆపదా రానివ్వనని మాటిచ్చారు...మరి ఏమిటిదంతా?" అంటూ అనిరుధ్ శరీరంమీద ఏర్పడిన ఎర్రటి చారలను చూపించాడు.

ఒక్కక్షణం ఆగి జవాబిచ్చాడు ప్రొఫెసర్.

"ఇవేళ్టి ప్రయోగంలో ఇలాంటి పరిణామాలుంటాయని ఊహించకపోవడం నా పొరపాటే। అనిరుధ్ సూక్ష్మ మండలాల్లో విహరించి వస్తాడని మాత్రమే అనుకున్నాను...కానీ అనిరుధ్‌కి స్నిగ్ధ ఆచూకి తెలిసిపోయి ఉండాలి। అందుకే "విచ్‌కల్ట్" వాళ్ళు ఇలా అటాక్ చేసారు।"

"అయితే సాయంత్రంనించి మీరిక్కడే ఉన్నారా?" అడిగాడు పవన్.

"లేదు। అనిరుధ్‌ని ఈ ప్రయోగం చేయమని చెప్పి ఇంటికెళ్ళిపోయాను. కానీ నాకెందుకో నిద్రపట్టలేదు. నాకు తెలిసిన ఇ. ఎస్. పి. పద్ధతులతో జరుగుతున్నదేవిటో అర్థంచేసుకోకలిగాను। ... అందుకే వెంటనే బయల్దేరివచ్చి అనిరుధ్‌ని తిరిగి భౌతిక శరీరంలోకి వచ్చి చేరమని సజెషన్స్ ఇచ్చాను।" అని ఆపాడు ప్రొఫెసర్ ఆత్మ.

అతడికేసి అదోలా చూసాడు పవన్.

సూక్ష్మ శరీరం। విచ్‌కల్ట్।। సైకిక్ అటాక్।...ఇలాంటి విషయాల గురించి ఇంతవరకూ సైన్సు నిర్దిష్టమయిన అభిప్రాయాన్ని వెల్లడి చేయలేదు। అయినా ఇవన్నీ వాస్తవాలు అన్నట్టు చాలా నార్మల్‌గా మాట్లాడ్తున్న ఆత్మ గురించి ఏమనుకోవాలి।?

"ప్రొఫెసర్...ఇంతవరకూ జరిగింది చాలు। ఈ సబ్జెక్ట్ గురించి ఇన్ని విషయాలు తెలిసిఉన్న మీకుకూడా అనిరుధ్‌ని కాపాడలేకపోయారు"

అన్నాడు పవన్.

చిన్నగా నవ్వి చెప్పాడు ఆత్మ—

"మీరలా అనుకోవడంలో తప్పులేదు!...కానీ నామాట నమ్మండి! అనిరుధ్ శరీరంమీద ఏర్పడ్డ ఈ గుర్తులు మరో రెండుమూడు గంటల్లో పూర్తిగా మాయమయిపోతాయి! అనిరుధ్ లేచాక వాడికి మరికొన్ని మెళకువలు నేర్పిస్తాను నేను!ఇకముందు ఇలాంటి ప్రమాదాలు సంభవించవు... ఇక అనిరుధ్ మనకందించే సమాచారంతో"

అతడి మాటలకు అడ్డువచ్చాడు పవన్.

"నో...ప్రొఫెసర్! అనిరుధ్‌ని ఎటువంటి రిస్కులోనూ ఉంచదలచుకోలేదు నేను! స్నిగ్ధ గురించి నాకు వొదిలిపెట్టేయండి! మీరుమాత్రం అనిరుధ్ జోలికి రాకుండా మమ్మల్ని ఇలా బతకనిస్తే అంతేచాలు!... ప్లీజ్!" అని చేతులు జోడించి నమస్కారం పెట్టాడు పవన్.

ఏదో చెప్పాలని నోరు తెరచి ఆగిపోయాడు ఆత్మ. చేతులు జోడించి నిలబడ్డ పవన్‌కేసి జాలిగాచూసి నెమ్మదిగా అక్కడ్నించి కదిలాడు.

......

మర్నాడు మధ్యాహ్నం డాక్టర్ సుస్మిత ఇంటికెళ్ళాడు పవన్.

"మిమ్మల్ని రిక్వెస్టు చేయడానికి వచ్చాను—నేను అర్జెంటు పని మీద బొంబాయి వెళ్ళవలసి ఉంది. కొన్నాళ్ళపాటు అనిరుధ్‌ని మీ ఇంట్లో ఉంచుకుంటారా?—అనిరుధ్‌ని చూసుకోవడానికి ఇంటిదగ్గర ఎవరూలేరు!" అన్నాడు సోఫాలో కూర్చుని.

"అదేవిటి—మీ అమ్మగారూ?" అడిగింది సుస్మిత ఆశ్చర్యంగా.

"లేదు—ఇవాళపొద్దున కాకినాడలో వాళ్ళ తమ్ముడింటికి వెళ్ళిపోయింది—ఇక ఇప్పట్లో తిరిగిరాదేమో?" అన్నాడు పవన్.

"ఏమయిందీ?—ఎనీప్రాబ్లెమ్?" అడిగింది సుస్మిత.

"ఏడేళ్ళక్రితం జరిగిన గ్యాస్ సిలిండర్ ప్రమాదానికి మా అమ్మే కారణమని సియోంగ్స్‌లో ఆ కంఠం పలికినప్పట్నించి మనమందరం ఆమెను అనుమానిస్తున్నామని ఊహించుకుంటోంది!— ఎంతగా సర్దిచెప్ప

దానికి ప్రయత్నించినా అర్థంచేసుకోకుండా వెళ్ళిపోయింది" భారంగా చెప్పాడు పవన్.

"కానీ ఆరోజు—స్నిగ్ధ చనిపోయినపుడు మీ అమ్మగారు—" అని సుస్మిత ఏదో చెప్పబోతుంటే మధ్యలోనే ఆపేసాడు పవన్.

"నో! అసలు ఆరోజు గ్యాస్ ప్రేలుడులో చనిపోయింది స్నిగ్ధ కాదు!!"

ఒక్కక్షణం అతడికేసి అర్థంకానట్టు చూసింది సుస్మిత.

"వ్వాట్! స్నిగ్ధ బతికేవుందా!" సంభ్రమాశ్చర్యాలతో అడిగింది.

నెమ్మదిగా తలూపి...సుస్మితకి తెలియని విశేషాలు వివరంగా చెప్పాడు పవన్.

క్రితం రాత్రి అనిరుద్ చేసిన ప్రయోగం గురించికూడా చెప్పాడు. అదివిని అప్సెట్ అయిపోయింది సుస్మిత.

"అనిరుద్‌ని డాక్టర్ దగ్గరకి తీసుకువెళ్ళలేదా?" అడిగింది.

"లేదు...ప్రొఫెసర్ ఆత్మా చెప్పినట్టు...నిజంగానే ఆ చారలు వాటంతటవే మాయమయ్యాయి! సుస్మితగారూ! నాకయితే ఇదంతా చాలా విచిత్రంగావుంది! కానీ...ఇప్పుడు ఇలాంటి విషయాలనుగురించి ఆలోచిస్తూ కూర్చోవడానికి టైంలేదు! అలా అని అనిరుద్‌ని ఇలాంటి రిస్కులో పడేయడం కూడా ఇష్టంలేదు. అందుకే నేను బొంబాయి వెళ్ళినపుడు అనిరుద్‌ని మీదగ్గర వొదిలిపెట్టాలనుకుంటున్నాను." అన్నాడు పవన్.

అతడ్ని పూర్తిగా అర్థంచేసుకున్నదానిలా చిరునవ్వు నవ్వింది సుస్మిత.

"డోంట్ వర్రీ! మీరు తిరిగి వచ్చేంతవరకూ అనిరుద్ పూచీ నాది ఇంతకీ బొంబాయి ఎందుకెళుతున్నారు? డిపార్టుమెంట్ పనిమీదా?"

కాసేపు ఆలోచించి జవాబిచ్చాడు పవన్...

"...మీకు స్నిగ్ధకి బెస్ట్ ఫ్రెండ్!...మీదగ్గర దాచడం దేనికి... నేను బొంబాయి వెళుతున్నది స్నిగ్ధ గురించి తెలుసుకోవడానికే! ఖండాలాలో 'విచ్‌కల్ట్' వాళ్ళ సమావేశం అవుతున్నట్టు డి.సి పి. మిశ్రా గారికి ఏదో సమాచారం అందిందట! నేనూ స్నిగ్ధా ఖండాలా వెళ్ళినప్పటి నించే

మా సమస్యలు మొదలయ్యాయి. ఈ కథకు ముగింపు కూడా అక్కడే జరుగుతుందేమో! అందుకే మళ్ళీ అక్కడికే వెళుతున్నాను!" అని లేచి నిలబడ్డాడు.

సుస్మిత కూడా లేచింది.

"...తప్పకుండా వెళ్ళిరండి! స్నిగ్ధ మీకు కనబడుతుందని...మీ కథ సుఖాంతం అవుతుందనిపిస్తోంది నాకు! బెస్ట్ ఆఫ్ లక్ టు యూ!" అని అతడ్ని సాగనంపింది.

పవన్ వెళ్ళాక ఆలోచనలో పడి పోయింది డాక్టర్ సుస్మిత.

స్నిగ్ధ బతికేఉందని...ఆమెను వెతుక్కుంటూ బయలు దేరుతున్నాడు పవన్...అతడికి తను బెస్ట్ఆఫ్లక్ కూడా చెప్పింది!...కానీ...

తనకుతెలుసు...తనకుమాత్రమే తెలుసు...

పవన్ అన్వేషణ ఫలించకూడదని...

వికలమయిన తన మనసు కోరుకుంటోందని!

......

ఆ రోజురాత్రి...

బొంబాయి విమానాశ్రయానికి పవన్ని రిసీవ్ చేసుకోవడానికి శ్యాంసుందర్ వచ్చాడు.

"నువ్వడిగినట్టు ఖండాలాలో హనీమూన్ కాటేజ్ బుకింగ్ చేసాను. ఇవాళ మా ఇంట్లో రెస్టుతీసుకుని రేపుపొద్దునే వెళ్ళువుగాని." అన్నాడతను.

"లేదు...శ్యాం...నేను వెంటనే వెళ్ళాలి!...నీ కారిస్తే ఇట్నించే వెళ్ళిపోతాను" అన్నాడు పవన్.

బాల్యమిత్రుడయిన పవన్ పట్టుదల సంగతి బాగా తెలుసు శ్యాంసుందర్కి.

మాటలు పొడిగించకుండా కారు తాళాలు అతడి చేతిలో పెట్టాడు.

"థాంక్యూ శ్యాం..." అని పార్కింగ్ కేసి నడిచాడు పవన్.

......

న్యూబొంబే దాటి ఖండాలాకేసి కారు డ్రైవ్ చేస్తుంటే గత స్మృతులతో బరువెక్కింది పవన్ మనస్సు.

దాదాపు ఎనిమిదేళ్ళక్రితం...శ్యామసుందర్ కారులోనే వెళ్ళాడతను ఖండాలాకి...కానీ అపుడు తనతో తన ప్రేయసి...తన జీవితభాగస్వామి స్నిగ్ధ కూడా ఉంది.

...దారిపొడుగునా స్నిగ్ధతో ఆరోజు మాట్లాడిన మాటలు గుర్తుకు వస్తున్నాయి పవన్‌కి.

ఆలోచిస్తున్న కొద్దీ...గతంలోకే వెళ్ళిపోయింది అతడి మనసు.

అప్పుడే తన పెళ్ళయినట్టు...ఖండాలాకి స్నిగ్ధతో హనీమూన్‌కి వెళుతున్నట్టు ఫీలయ్యాడు. కారులో తన పక్క సీటులో స్నిగ్ధ కూర్చుని ఓరగా తనకేసి చూస్తున్నట్టే ఉంది.

కాలప్రవాహం వెనక్కి మళ్ళి...

స్నిగ్ధతో తను పంచుకున్న మధుర ఘట్టాలు తన జీవితంలోకి తిరిగివస్తే!?

ఏదయినా అద్భుతంజరిగి...గత ఏడేళ్ళుగా తను అనుభవించిన నరకం...ఏదో పీడకల అని తెలిస్తే ఎంత బావుణ్ను!

విచిత్రమయిన ఆ ఆలోచనకి పరవశించిపోయింది అతడి మనసు.

అంతలో...

వేగంగా ఎదురొస్తున్న ఒక టూరిస్టు బస్సుని గమనించి స్టీరింగు ఎడమవైపుకి తిప్పాడు పవన్.

గతుకుల రోడ్డులో సడన్‌బ్రేక్‌వేసి ఆపడంతో ఉన్నట్టుండి ఇంజిన్ ఆఫ్ అయిపోయింది!...రెండు మూడు సార్లు సెల్ఫ్‌లాగి చూసాడు... అయినా కారు స్టార్టుకాలేదు!

ఏమయిందీ?

నెమ్మదిగా కారుదిగి బోనెట్‌తీసాడు పవన్.

దట్టంగా పొగలు పైకిలేచాయి.

"స్నిగ్ధా! ... రేడియేటర్‌లో నీళ్ళన్నీ ఇగిరిపోయాయి... ఈ అడవిలో నీళ్ళెక్కడ దొరుకుతాయి?" అప్రయత్నంగా అన్నాడు పవన్.

ఓ గాడ్! ఎవరితో మాట్లాడుతున్నాడతను? స్నిగ్ధతోనా?

ఎనిమిదేళ్ళక్రితం ఖండాలాకి వెళ్తున్నపుడు ఇలాగే కారాగిపోయి

రేడియేటర్‌లోంచి ఇలాగే ఆవిరి పైకిలేచింది। గతస్మృతుల్లో తేలివస్తున్న తను పరధ్యానంగా అలా అనేసాడు అంతే.

తల విదిలించుకుని...పరిసరాలు చూసాడు పవన్.

చీకటి...చుట్టూ చీకటి—।

ఈ చీకటిలో తనెక్కడున్నాడో అర్థంకావడంలేదు... కారు రేడియేటర్‌లో పోయడానికి నీళ్ళెక్కడ దొరుకుతాయి?

ఇక్కడ దగ్గర్లో చెరువొకటి ఉంది.

ఉలిక్కిపడి చుట్టూ చూసాడు పవన్.

స్నిగ్ధా? — నో — అక్కడ స్నిగ్ధలేదు।—తను వొంటరిగా ఉన్నాడు—

హా ఫన్నీ—తనేమిటి మరీ ఇంత పరధ్యానంగా ఉన్నాడు?

కానీ—

ఆ రోజు—స్నిగ్ధ చెప్తేనేకదా తనకుతెలిసింది దగ్గర్లో చెరువున్నట్టు ......

గబగబ డిక్కీతీసి అందులోంచి పెట్రోల్ క్యాన్ తీసుకుని నీళ్ళకోసం బయల్దేరబోయి—చటుక్కున ఆగిపోయాడు పవన్.

ఏమయింది తనకీరోజు?...ఇంత అనాలోచితంగా ప్రవర్తిస్తున్నాడేమిటి?

స్నిగ్ధ ఆనాడు చెప్పినమాటలు గుర్తుకురాగానే నీళ్ళకోసం బయల్దేరడంఏమిటి?...కారులో నీళ్లు ఇగిరిపోయి ఆగినంతమాత్రాన—అప్పటిలాగే అక్కడే—అదే స్పాట్‌లో ఆగిందనుకుంటున్నాడా తను. హౌ స్టూపిడ్.

అప్రయత్నంగా రోడ్డు ఎడమవైపుకి దృష్టిసారించాడు పవన్. చీకట్లో స్పష్టంగా కనబడటంలేదు.

కానీ...

అటువైపున్నది—బంజరు పొలమే.

పొలంమధ్యన దేవదారు వృక్షంకూడా అదే.

తను సరిగ్గా అదేచోట నిలబడి ఉన్నాడు.

---

ఖండాలాదారిలో పవన్ కారాగిపోయినపుడు—

హైదరాబాదులో—

ప్రొఫెసర్ ఆత్మ ఫోన్‌లో డాక్టర్ సుస్మితతో మాట్లాడుతున్నాడు.

"మీరనవసరంగా కంగారుపడుతున్నారు ప్రొఫెసర్ ఆత్మా। ఇవాళరాత్రి అలాంటిదేమీ జరగదు. అనిరుద్ హాయిగా నిద్రపోతున్నాడు। డిస్టర్బ్‌కాకుండా నిద్రపోవాలని ఇందాకే సెడేటివ్ ఇంజెక్షన్ చేసాను" అంది సుస్మిత ఫోనులో।

ఆ మాట వినగానే ఉలిక్కిపడ్డాడు ఆత్మ।...ఇలాంటి పరిస్థితుల్లో నిద్రకి ఇంజెక్షన్ చేసింది సుస్మిత। ఇప్పుడు అనిరుద్ పైన సైకిక్ అటాక్ జరిగితే। సూక్ష్మశరీరంలో విహరించడం నేర్చిన అనిరుద్ భౌతిక శరీరం లోకి ఎలా తిరిగి వస్తాడు।

"ఎంత పొరపాటుచేసారు డాక్టర్ సుస్మిత।" అన్నాడు ఆత్మ।...

కానీ అప్పటికే ఫోన్ డిస్కనెక్ట్ చేసింది సుస్మిత।

ఇక ఒక్కక్షణం కూడా వృథా చేయటానికి లేదు। వెంటనే సుస్మిత ఇంటికెళ్ళి అనిరుద్‌ని కాపాడాలి।

ఎట్టిపరిస్థితుల్లోనూ అనిరుధ్ నిద్రపోకూడదు।

...సుస్మిత తనని అక్కడికి రావద్దని స్పష్టంగా చెప్పింది... అయినా తప్పదు? తనా ఇంటికి వెళ్ళాలి...అనిరుధ్‌కోసం।

గబగబ తయారయి బయల్దేరాడు ప్రొఫెసర్ ఆత్మ।

కానీ...

అతను ఆ రాత్రి అనిరుద్‌ని చేరుకోలేకపోయాడు।

పోర్టికోలో కారెక్కబోతుంటే...పొదల్లో అతడికోసమే పొంచి ఉన్న ముగ్గురు వ్యక్తులు అతడిమీద దాడిచేసారు.

ఇద్దరు వ్యక్తులు అతడిచేతులు విరిచి పట్టుకుంటే...వాళ్ళ నాయకుడిలా ఉన్న మూడవవ్యక్తి...అతడినోట్లో...బలవంతంగా...ఘాటైన ద్రావకం పోసేసాడు।

ఆత్మ ముక్కూ నోరూ నొక్కిపట్టేసి అతడా ద్రావకం మింగేట్లు

చేసాడావ్యక్తి...

క్షణాల్లో... మెదడంతా మొద్దుబారినట్టయి... స్పృహతప్పాడు ప్రొఫెసర్ ఆత్మ...

అతడిమీద దాడిచేసిన కరకింకర భక్తులకు తెలుసు... ఆ ద్రావకం ప్రభావం!

ఆ ద్రావకం తాగిన వాడెవడూ మళ్ళీ స్పృహలోకి రాడు...! ఆయుష్షు ఉన్నంతకాలం 'కోమా'లో ఉండి...పోతాడు!

......

ఖండాలా హనీమూన్ కాటేజిలో పడుకున్న పవన్‌కి నిద్రపట్టలేదు హనీమూన్‌కి వచ్చినప్పుడు ఆ కాటేజీలో స్నిగ్ధతో పంచుకున్న మధుర ఘడియలు మాటిమాటికి గుర్తుకువచ్చి అతడి మనసుని కలవరపెట్టేస్తున్నాయి!...

అతడి... ఆలోచనలకి తగ్గట్టుగానే ఉంది బయట వాతావరణం.

ఉండి... ఉండి ఆకాశం ఉరుముతుంటే అప్పుడే ప్రారంభమయింది పెద్దగాలివాన!... క్షణక్షణానికి గాలి ఉధృతం ఎక్కువయిపోతుంటే కాటేజీ తలుపులు కిటికీలు గడగడలాడుతున్నాయి.

రౌండు బెడ్‌మీద పడుకున్న పవన్ అసహనంగా లేచికూర్చున్నాడు.

అంతలో ఎక్కడో ఫెళఫెళమని పిడుగుపడింది.... తక్కున కాటేజీలోని లైట్లు ఆరిపోయాయి.

మంచం మీదనుంచిలేచి బయటకి నడిచాడు పవన్.

కాటేజి వరండాలోకి వచ్చి నిలబడి ఆకాశంకేసి చూసాడు...వర్షం ఇప్పట్లో తగ్గే సూచనలు కనబడలేదు.

వరండా రైలింగ్‌మీద స్థంభానికి ఆనుకుని కూర్చుండిపోయాడతను. వర్షం జల్లుకొడుతుంటే ఒకవైపు నుంచి అతడి బట్టలు తడిసిపోతున్నా ఖాతరుచేయకుండా కూర్చున్నాడు! అక్కడ్నించి లేచివెళ్ళాలని లేదతనికి వర్షంలోకిచూస్తూ అలాగే ఉండాలనిఉంది. లోపలికెళ్ళాలంటే బద్ధకంగా ఉంది.

పరధ్యానంగా... గేటుకేసి చూసి ఉలిక్కిపడ్డాడు పవన్. చెట్ల

నీడల్లో ఏదో కదలిక కనబడిందతనికి

కళ్ళు చిన్నవిచేసి ఆ కదలికను పరిశీలనగా చూసాడు...అంతలో ఎర్రటి మెరుపొకటి మెరిసింది ఆకాశంలో...ఆ క్షణంలో కనిపించిందత నికి పొదలపక్కన ఒదిగిపోయి నిలబడివున్న ఆకారం—స్త్రీ ఆకారం—

ఎవరదీ?—

అప్రయత్నంగాలేచి వర్షంలోకి నడిచాడు పవన్—

పొదలకి కొంతదూరంలో ఆగి అడిగాడు పవన్...

"ఎవరూ?"

సమాధానం చెప్పకుండా నిశ్చలంగా నిలబడిందామె—

పవన్ గుండె వేగం పెరిగింది।—తను ఊహిస్తున్నది నిజమేనా?

రెండడుగులు ముందుకు వచ్చిందామె నెమ్మదిగా—

మెరుపులకాంతిలో ఆమె మొహం స్పష్టంగా కనబడింది—

నిశ్చేష్టుడయిపోయాడు పవన్।—

స్నిగ్ధ!!

స్నిగ్ధ!!!

అనిర్వచనీయమైన భావాలతో నిండిపోయిందతడి మనసు—ఆ ఉద్వేగాన్ని భరించలేక నోటమాటరాలేదు.

ఇది కలకాదు—

స్నిగ్ధ—తనెదురుగా నిలబడిఉంది।—తన స్నిగ్ధ!

రివ్వున వీస్తున్న గాలికి ఊపిరి సల్పలేకపోతున్నా—కుండపోత వర్షానికి ముద్దగా తడిసిపోతున్నా కదలకుండా అలాగే నిలబడి పోయా రిద్దరూ—

నెమ్మదిగా ముందుకువచ్చి పవన్ భుజంమీద చెయివేసి కళ్ళలోకి చూసింది స్నిగ్ధ—

ఆ చూపులు అర్థమయి—ఆమె భుజంచుట్టూ చెయివేసి నెమ్మదిగా కాటేజికేసి నడిపించాడు పవన్.

చీకటిగా ఉన్న కాటేజీలో తడుముకుంటూ వెళ్ళి టేబిల్‌మీదున్న మైనం వొత్తి వెలిగించాడు—

మైనంవొత్తి కాంతిలో స్నిగ్ధకేసి చూసాడతను.
ముద్దగా తడిచిపోయి—గదిమధ్యనే నిలబడి ఉందామె—
ఏడేళ్ళలో ఏమీమారలేదు స్నిగ్ధ—పైగా...
ఇంకా అందంగా తయారయింది.

స్నిగ్ధని ఎన్నో ప్రశ్నలడగాల్సి ఉంది – కానీ అకస్మాత్తుగా – వచ్చేయడంతో అంటీ క్లైయిమాక్స్‌గా తనంతట తాను ఎలా అడగాలో – ఏమని అడగాలో అర్థంకావడంలేదు పవన్‌కి–

"స్నిగ్ధా–" పిలిచాడతను ఆర్ద్రంగా–

నెమ్మదిగా దగ్గరకు వచ్చిందామె. మళ్ళీ ఏదో అనబోయాడు పవన్. చూపుడువేలు నాజూగ్గా అతడి పెదాలకి అన్చి–ఏమీ అడగవద్దని తలూపింది స్నిగ్ధ–

తడిసిన అతడి జుట్టులోకి వేళ్ళుపోనిచ్చి మృదువుగా అంది–
"నన్నిపుడేమీ అడగవద్దు–అన్నీ వివరంగా రేపు చెప్తాను–"
అలా అంటూ అతడ్ని తన దగ్గరకు లాక్కుంది–

ఆమె స్పర్శకి వివశుడయ్యాడు పవన్–రెండు చేతులు ఆమె చుట్టూ పోనిచ్చి కౌగిట్లో పొదివి పట్టుకున్నాడు–

తలపైకెత్తి పెదాలందించింది స్నిగ్ధ–

ఆమెను గట్టిగా ముద్దెట్టుకుంటూ–ఆమె ఒళ్లు తడిమితడిమి చూసాడు పవన్–

ముద్దగా తడిసిన ఆమె బట్టలు–ఒక్కొక్కటి విప్పేసి–మెత్తటి కార్పెట్ మీద పడుకుని ఆమెను తనమీదకు లాక్కున్నాడు.

ఏడేళ్ళుగా అనుభవించిన ఎడబాటు కన్నీళ్ళ రూపంలో ప్రవహించి పోతుంటే స్నిగ్ధను మరింత దగ్గరకు లాక్కున్నాడు పవన్ –

అతడికేసి మత్తుగా వాలిపోతున్న కళ్ళతో చూసింది స్నిగ్ధ...
ఆమెను ఒదిలిపెట్టాలనిలేదు పవన్‌కి...

ఒదిలిపెడితే...మళ్ళీ ఆమెను పోగొట్టుకోవలసి వస్తుందేమోనని చిన్న పిల్లాడిలా భయపడ్డాడతను.

స్నిగ్ధను పూర్తిగా దగ్గరయిపోతుంటే...

ఉన్నట్టుండి ఆమె ధోరణిలో ఏదో మార్పు గోచరించింది పవన్‌కి.

కౌగిట్లోఉన్న స్నిగ్ధ దూరంగా వెళ్ళిపోతున్నట్టు అనిపించింది... ఎందుకో! క్రమ క్రమంగా...

ఆమె పెదాలమీద నవ్వు మాయమయి...

కళ్ళలోని అనురాగం తొలగిపోయి

ఆమె మొహం కఠినంగా మారింది...

చటుక్కున అతడ్ని పక్కకి తోసేస్తూ లేచి నిలబడిందామె... ఉన్నట్టుండి ఎందుకలా చేస్తోందో అర్థంకాక పవన్ కూడా లేవబోయాడు.

కానీ...నీరసంవచ్చి కార్పెట్‌మీద వెల్లకిలా పడిపోయాడు.

మళ్ళీ లేవబోయాడతను!...ఏమయిందోఏమో కానీ...శక్తి హరించుకునిపోయి అతడి శరీరం...ఒక్క అంగుళమయినా కదల్లేదు!

అతడి అవస్థచూసి పకపక నవ్విందామె!...

జుట్టు విరబోసుకుని నగ్నంగా నిలబడి ఉన్నది...స్నిగ్ధకాదు!... స్నిగ్ధ కానేకాదు!...నో! నో!!

మరి?...ఎవర్ని?...ఏమిటీమాయాజాలం!?

"మూర్ఖుడా! నువ్వు వెతుక్కుంటూ వచ్చిన స్నిగ్ధ ఏనాడో మా మనిషైపోయింది! మరో జాముగడిస్తే...మా మూర్ధాభిషుక్తుడికి పట్టపురాణీ అవుతుంది! మా ప్రయత్నాలకి ఆటంకం కలిగించడానికి వచ్చిన నీకు ఇదే శిక్ష...మా ఉత్సవం పూర్తయ్యేంతవరకూ ఇలాగేపడుండు..." అని అక్కడ్నించి కదిలింది కాత్యాయని!

అచేతనుడిగా...ఆమె వెళ్ళినవైపు చూస్తూ పడుకున్నాడు పవన్...

బల్లమీద నిలబెట్టిన మైనంవొత్తి గాలికిరెపరెపలాడి ఆరిపోయింది.

పవన్ మనసులో కూడా మళ్ళీ చీకట్లు అలుముకున్నాయి.

## 38

ఖండాలాలో వర్షం తగ్గుమొహం పడ్తోంది.

అయినా-బయట వాతావరణంతో సంబంధంలేకుండా కరకింకర ఆలయంలో ఉత్సవాలు జోరుగాసాగుతున్నాయి.

జాముగడిస్తే...భక్తులకి కోరిన వరాలిచ్చి నిద్రలోకి జారుకుంటాడు

రసాతల రారాజు...కరకింకర!

ఆ తర్వాత...నూట ఇరవై యొక్క సంవత్సరాలు ఆకుంభీనసుడికి నిద్రాభంగం కలగకుండా ఆలయాలు మూసివేస్తారు.

విశాలమైన ఆలయంలో నగారానాదానికి తగ్గట్టుగా నాట్యం చేస్తున్న భక్తులకు...మూర్ధాభిషిక్తుడు భీష్తినాయక్ మరికొంచెం సేపట్లో అక్కడికి రానున్నాడని కబురందింది.

భక్తుల ఉత్సాహం మరింత పెరిగింది.

కరకింకరను ప్రసన్నం చేసుకోవాలంటే...ముందు ఆ ఉద్భృతికి విధాయకుడైన భీష్తినాయక్‌కి దాసోహం పలకాలి. అతడి చేతులమీదుగానే ఆ రాత్రి కార్యక్రమాలు జరుగుతాయి.

అయితే...అక్కడికి భీష్తినాయక్ ఒంటరిగా రావడంలేదని... అతనితోపాటు అతని ఇష్ట సఖి శిఖామణి కూడా వస్తుందని అక్కడున్న భక్తుల్లో కొందరికి మాత్రమే తెలుసు.

శిఖామణి అసలు పేరు స్నిగ్ధ అని...

ఉత్సవాలు పర్యవేక్షిస్తున్న కాత్యాయనికి మాత్రమే తెలుసు.

......

ఖండాలా పొలిమేరలో ఉన్న ఎత్తయిన భవనం బటాటా వాలా మాన్షన్! ఆ భవనంలో...

విశాలమయిన స్నానాలగది.

పాలరాతి తొట్టిలో స్నానం చేస్తోందామె...

తొట్టిచుట్టూ నిలబడ్డ నలుగురు పరిచారికలు నీళ్ళలో రక్తగన్నేరు పువ్వులు తుంచివేస్తూ ఆమె వొళ్ళు రుద్దుతుంటే...ఏటవాలుగా అమర్చిన అద్దంలో తన ప్రతిబింబాన్ని చూస్తూ పడుకుంది...

శిఖామణిగా మారిన...స్నిగ్ధ!

పాలరాతితొట్టి రంగులో కలిసిపోయినట్టుంది తన శరీర ఛాయ మునుపటికంటే మరింత అందంగా తయారయింది తను.

భీష్తినాయక్ తేజోవీక్షణాలు తనమీదున్నంతవరకూ తన యవ్వనం చెక్కుచెదరదు.

పరిచారికలు అందించిన సుగంధతైలం వొంటికి పూసుకుంటూ వక్షోజాల కిందున్న ఎర్రటి గుర్తుమీద రుద్దుకుంది స్నిగ్ధ.

ఏడేళ్ళక్రితం— నిరర్ధకమైన తన పాత జీవితానికి స్వస్తిచెప్పి భీష్తినాయక్ సన్నిధికి చేరినపుడు కాత్యాయని పెట్టిన గుర్తది! అప్పుడే తనకో కొత్తపేరు పెట్టారు.

తన జన్మకు పరమావధి ఏమిటో ఆరోజునించే తెలుసుకుంది.

తొట్టిస్నానం ముగించుకుని లేస్తుంటే...గదిలోకి వచ్చాడు భీష్తి నాయక్!

ఆరున్నర అడుగులు పొడవుండి బలిష్టమయిన శరీరంకల భీష్తి నాయక్ నెమ్మదిగా తనకేసి వస్తుంటే తన్మయత్వంతో చూస్తూ నిలబడింది స్నిగ్ధ.

నల్లటి వొత్తయిన గిరిజాలు, గుబురుగా పెరిగిన గెడ్డంలో కలిసి పోయి అతడి మొహం మరింత విశాలంగా ఉన్నట్టు కనిపిస్తోంది.

స్నిగ్ధ సరసన వచ్చి నిలబడ్డాడు ఆ ఉద్దండకాయుడు...అతడి పక్కన ఆమె చిన్న బొమ్మలా ఉంది.

ఆమె భుజాలమీద బరువుగాచేతులువేసాడు భీష్తినాయక్ అది చూసి సరసర అక్కడ్నించి వెళ్ళిపోయారు పరిచారికలు.

"శిఖామణీ! ఏడేళ్ళక్రితం నా దగ్గరకొచ్చి నిన్నే నా ఇష్టసఖిగా ఎందుకు ఎన్నుకున్నానో అడిగావు—గుర్తుందా? ఆ ప్రశ్నకు ఈరోజు సమాధానందొరుకుతుంది నీకు!"

అతడికేసి తలెత్తి ఆసక్తిగా చూసింది స్నిగ్ధ!

"కరకింకర ఆలయాన్ని నీఅంతట నువ్వే వెతుక్కుంటూ వచ్చిన నాడే నాకు తెలిసిపోయింది!...పూర్వజన్మల్లో నాతోపాటు కరకింకర ఉపాసనలు చేసిన శిఖామణివి నువ్వేనని! నీమనసు అట్టడుగు పొరల్లోదాగిన ఆ స్మృతులే నిన్ను నాకేసి ఆకర్షింపచేసాయి...శిఖామణీ! నా కళ్ళలోకి చూస్తూ కరకింకర ధ్యానంచెయి— మన బంధం ఏనాటిదో నీకే గుర్తొస్తుంది!" అన్నాడు భీష్తినాయక్.

అతడి కళ్ళలో మంత్రముగ్ధలా చూస్తూనిలబడ్డ స్నిగ్ధ పరిసరాలు

మరచింది!...ఎదురుగా నిలబడ్డ భీక్షీనాయక్ మంచు బొమ్మలా కరిగి పోతున్నట్టనిపించింది—వింత దృశ్యాలు, అద్భుతఘట్టాలు కళ్ళముందు మెదిలాయి!

ఎన్నడూచూడని ప్రదేశాలలో—తెలియని వ్యక్తులను తను కాశిస్తున్నట్టుగా కనిపించింది.

అంతలోనే అడవుల్లోంచి గుర్రపుస్వారీచేస్తూ భీక్షీనాయక్‌తో ఎక్కడికో వెళ్తున్నట్టు అగుపించింది.

ఒక గుట్టదగ్గర గుర్రాలు దిగారిద్దరూ!...

గుట్టమీద రాజమహలులాంటి రోమనుకట్టడం! లేతాకుపచ్చరంగులో ఎత్తయినగోడలు-నగిషీచేసిన ద్వారాలు! గాజు కిటికీలు! కిటికీ దగ్గర నిలబడి చిరునవ్వుతో తమకు స్వాగతం పలుకుతున్నదెవరోకాదు తన స్నేహితురాలు కాత్యాయని!

తనకోసం భీక్షీనాయక్ కట్టించిన ఆ భవనంలో ఒక ప్రత్యేకత ఉంది. అది కూడా తెలుసు తనకి! భవనంలో కరకింకర ఆలయం ఉంది. ఆ ఆలయానికి వెళ్ళేదారి కరకింకర భక్తులకి మాత్రమే తెలుసు!

బాజీరావు సైనికులు కూడా ఆ ఆలయిం దారికనిపెట్టలేక పోయారు! ఒకసారి భవనంమీదదాడి చేసినపుడు-మెట్లుదిగి ఉత్తరం వైపున్న చీకటి కొట్లోకి వెళ్ళి, అక్కడ కరకింకర విగ్రహం కనిపించక మొహాలు వేలాడేసుకుని వెళ్ళిపోయారు ఆ దద్దమ్మలు!

కళ్ళముందు కనిపిస్తున్న ఆ దృశ్యాలు చూసి కిలకిల నవ్వసాగింది స్నిగ్ధ!

అంతలో మరో దృశ్యం అగుపించింది!...కరకింకర విగ్రహం ముందు తను మోకరిల్లి ఉన్నపుడు ఆరుమాసాల శిశువునిఎత్తుకునివచ్చింది కాత్యాయని!...మిహిర్‌ఉట్టి చేసిన సవాలు నందుకుని నిర్దాక్షిణ్యంగా ఆ శిశువు చెయి నరికేసి కరకింకర నైవేద్యం పెట్టింది తను!...శిశువు శరీరంలోంచి కారుతున్న రక్తంలో భక్తులు ఎగబడి చేతులుతడుపుకుంటున్నారు.

ఆ ఘట్టం చూసి తట్టుకోలేక బిగ్గరగా ఏడ్చేసింది స్నిగ్ధ!

"శిఖామణీ!" ఆమె భుజాలు పట్టి ఊపేసాడు భీక్షీనాయక్.

ఉలిక్కిపడింది స్నిగ్ధ!...మంత్రశక్తితో భీక్షీనాయక్ తనలోని

పూర్వజన్మ స్మృతులని మేల్కొలిపాడని తెలుస్తూనేఉన్నా...ఏడుపుఆగడం లేదు స్నిగ్ధకి।

"శిఖామణీ? ఇప్పుడర్థమయిందా నువ్వెవ్వరివో?। కరకింకర మహిమతో ఈ జన్మలో కూడా నువ్వు నాకు దక్కావు।...మరికాసేపట్లో కరకింకర భక్తులకు వరాలిచ్చి నిద్రకు ఉపక్రమిస్తాడు। ఆతర్వాత ఈ ప్రపంచం మన గుప్పిట్లో ఉంటుంది. యుగయుగాలుగా మనల్ని మ్లేచ్ఛులు అన్నవారిని కాలరాసి రూపుమాపుదాం మనం। ఉత్సవాలనంతరం ఆలయ ప్రాంగంలో నిన్ను నాదాన్ని చేసుకుని నా సామ్రాజ్యానికి పట్టపురాణీని చేద్దామనుకుంటున్నాను...కానీ...నీలో కొంతమార్పు అవసరం ఉంది।" అని ఆగాడు భీష్మినాయక్.

ఏడుపు ఆపి—కళ్ళు తుడుచుకుంటూ అంది స్నిగ్ధ...

"నీకోసం ఏదయినా చేస్తాను నేను।"

"పూర్వజన్మలో నువ్వు అవిటివాడిగా చేసిన క్షుద్రాడు మళ్ళీ నీ కడుపున పుట్టాడు। నీ మమకారాన్ని ఏరిపారేసి వాడిని చంపేబాధ్యతనీదే।"

నెమ్మదిగా తలూపింది స్నిగ్ధ.

కాసేపాగి ఇద్దరూ కరకింకర ఆలయానికి బయల్దేరారు.

......

డాక్టర్ సుస్మిత ఇచ్చిన ఇంజెక్షన్ ప్రభావానికి నిద్రలోకి జారుకున్న అనిరుద్...ఒకరాత్రివేళ...

సూక్ష్మశరీరంతో వెలికి తేలివచ్చి...గదిలో ఒక మూలన బాధపడుతూ నిలబడి ఉన్న మస్తానమ్మకేసి చూసాడు।—

"ఏమయింది మస్తానమ్మా। ఎందుకలా ఉన్నావ్?" అడిగాడు.

ఎలా చెప్పాలో అర్థం కావడంలేదు అనిరుద్‌బాబా।...ఆ మాయలాడి కాత్యాయని వేసిన కనుకట్టు మంత్రానికి నిర్వీర్యుడైనట్టు పడి ఉన్నాడు మీ నాన్న। మరోవైపు మీ అమ్మని తన తుచ్ఛ సమూహంలో కలుపుకునే ప్రయత్నంలో ఉన్నాడు ఆ పాపిష్టి భీష్మినాయక్।" అనిఆగిందిమస్తానమ్మ.

"మస్తానమ్మా। మనం ఏమీచేయలేమా?" అడిగాడు అనిరుద్ కలవరపడిపోతూ.

"ఇదేమంత సులభమయిన పనికాదు। నీ పోరాటం ఒక వ్యక్తితో

కాదు! ప్రపంచం నలుమూలలనించి వచ్చి చేరిన క్షుద్ర మాంత్రికుల సమూహంతో అని మరువకు!...పైగా మరికొంచెం సేపట్లో వారి మహా యాగం పూర్తవుతుంది! వేలిమిచల్లారేసరికి వారి శక్తి నూరింతలవుతుందని మా గురువు చెప్పాడు!...కాబట్టి నీ తల్లిదండ్రుల్లో ఏ ఒక్కరినే కాపాడుకోవచ్చు! ఈ సమరంలో నీ శక్తి పూర్తిగా హరించుకునిపోయే అవకాశం ఉంది. ఇద్దరినీ కాపాడేందుకు పోతే ఏ ఒక్కరూ దక్కకపోవచ్చు!" అంది మస్తానమ్మ.

కాసేపు సమాధానం చెప్పకుండా నిలబడిపోయి ఆ తర్వాత నెమ్మదిగా అన్నాడు అనిరుద్...

"మస్తానమ్మా! అమ్మనే కాపాడుకుంటాను."

అనిరుద్ సమాధానం విని చిన్నగా నవ్వింది మస్తానమ్మ.

"అమ్మ అంటే అంత ప్రేమా?" అడిగింది

"నువ్వు చెప్పిందినిజమయితే నాన్న ప్రాణాలుపోతాయి కానీ అమ్మ వాళ్ళలో కలిసిపోతే జన్మజన్మలకి అమ్మ ఆత్మకి విముక్తి ఉండదు!" అన్నాడు అనిరుద్.

ఆ మాటలు ఏడేళ్ళ పిల్లవాడివికావని వాడిలోని దివ్య సంస్కారమే అలా మాట్లాడిస్తోందని అర్థమయి...అనిరుద్ చేతులందుకుని కళ్ళకు అద్దుకుంది మస్తానమ్మ!

"నువ్వు కారణ జన్ముడివి అనిరుద్ బాబా!" అంది.

"పదవెళ్దాం!" అన్నాడు అనిరుద్

చేతులు విడిచిపెట్టకుండా ఇద్దరూ రివ్వున ఎగిరారు గాలిలోకి!... క్షణాల్లో ఆ పరిసరాలు దాటి...

మనోవేగంతో...ఖండాలాకి వెళ్ళే దారిలో గుట్టమీదున్న పాడుబడ్డ భవనంకేసివెళ్ళి...రెండు వందల గజాల దూరంలో ఆగిపోయారు.

పాడుబడిన భవనంలోంచి పైకిలేస్తున్న కారు మేఘాలను చూపించి. అవి దుష్టభావ తరంగాలనీ భవనంలోపల జరుగుతున్న నికృష్టయాగ ఫలితంగా అలా పైకి ఎగసి వస్తున్నాయని చెప్పింది మస్తానమ్మ!

కారుమేగాలు కనబడినట్టే...సూక్ష్మ శరీరంలో తేలుతున్న అనిరుద్‌కి...భవనం మెట్లదగ్గర కాపలాకాస్తున్న నాలుగు నల్లటి తోడేళ్ళూ...

వాటితోపాటు పచార్లుచేస్తున్న కింపురుషులు...కిన్నరులు కూడా అగుపిం చారు। క్రితంరోజు తనని కొరడాలతో కొట్టి హింసించింది వాళ్ళే।

ముందుకి కదలబోయిన అనిరుద్‌ని ఆపేసింది మస్తానమ్మ.

"అనిరుద్‌బాబా నేను ఈ పరిధి దాటి నీతోరాలేను...కానీ నాకు చేతనైన సహాయం చేస్తాను।" అంటూ అనిరుద్ నడుంచుట్టూ రెండడుగుల దూరంలో గుండ్రంగా ఒకగీత గీసింది। చూస్తుండగానే నీలం రంగు కాంతిని సంతరించుకుందా గీత।

"గురువాజ్ఞతో నీ చుట్టూ సృష్టించిన ఈ కుండలి నిన్ను కాపాడు తుంది। నీ కగుపిస్తున్న తోడేళ్లు...కిన్నరులు భీష్మినాయక్ నీ తల్లికి కాపలాగా సృష్టించిన ఆధిభౌతికాలు। వాటిని రూపుమాపడం నీకేమంత పెద్ద పనికాదు।—ఒకానొకప్పుడు నేను సృష్టించిన ఖబీస్ శక్తినే నీలో ఆవాహనం చేసుకున్నవాడివి।" అని గుర్తు చేసింది మస్తానమ్మ.

సమాధానం చెప్పకుండా ఆలోచనలో పడిపోయాడు అనిరుద్. భవనం బయట కాపలాకాస్తున్న ఆధిభౌతికాన్ని ఆవాహనం చేసుకుని లోపలికి వెళ్ళకలిగినా ప్రయోజనం ఏమిటి?? సూక్ష్మశరీరంలో ఉండి తనేం చేయకలడు?

అమాటే అడిగాడు మస్తానమ్మని—

"భవనంలోపలికి వెళ్ళాకే ప్రారంభమవుతుంది నీ అసలు పరీక్ష। మీ అమ్మ అగుపించగానే ఉద్వేగాలకు తావివ్వక మనసు నిలకడతో ఆమె చుట్టూ ఏముందో గమనించు। ఆమె బొడ్డుని చుట్టుకున్నట్టున్న కాంతి తీగలు నీకంటికి తప్పకుండా కనిపిస్తాయి। అవి—భీష్మినాయక్ నుదుటి దాకా సాగి ఉంటాయి." అని ఆగింది మస్తానమ్మ.

"ఏమిటా కాంతితీగలు?" అడిగాడు అనిరుద్.

"ఏ ఇద్దరు వ్యక్తులమధ్య చక్కటి అవగాహన ఏర్పడినా ఇలాంటి బంధనం ఏర్పడుతుంది। సన్నిహితులకి అందుకే మాటలు కలవడం—ఒకరి ఆలోచనలు ఒకరికి తెలిసిపోవడం వంటివి జరుగుతుంటుంది—కానీ భీష్మినాయక్‌కీ మీ తల్లికీ మధ్య ఏర్పడింది సామాన్యమయిన బంధనంకాదు. అసురసంకెల। కొన్ని జన్మలుగా బలపడుతున్న ఆ అసుర సంకెలని త్రుంచేయి అనిరుద్‌బాబా। దాన్ని ఛేదిస్తేనే భీష్మినాయక్ దుష్ట ప్రభావం

నించి బయటపడుతుంది మీ అమ్మ! వెళ్ళు అనిరుద్‌బాబా! నీ ప్రయత్నం తప్పకుండా ఫలిస్తుందనే అనిపిస్తోంది నాకు!" అంది మస్తానమ్మ.

తన భౌతిక శరీరం నిద్రమత్తు ఇంజెక్షన్ ప్రభావంలో ఉందని మరచిపోయాడు అనిరుద్. ఒకవేళ తన ప్రయత్నం ఫలించక పోతే వెంటనే భౌతిక శరీరంలోకి వెళ్ళి చేరలేదని ఆలోచన రాలేదు అనిరుద్‌కి!!

క్రితంరోజులాంటి పరిస్థితి ఏర్పడితే తనను కాపాడేందుకు ప్రొఫెసర్ ఆత్మ లేదన్న సంగతి కూడా తెలియదు అనిరుద్‌కి!

మస్తానమ్మ చెప్పిన అసుర సంకెలని ఎలా ఛేదించాలో అడక్కుండానే—స్వరున ముందుకి కదిలాడు!

అతడిరాకను గమనించి తోడేళ్లు కోరలు చూపిస్తూ లేచాయి.—కింపురుషులు కొరడాలు ఝళిపిస్తూ ముందుకి వచ్చారు!

వాటికేసి జాలిగా చూసి...

మనస్ఫూర్తిగా...తనకేసి రమ్మంటున్నట్టుగా...చేతులు చాచి నిలబడ్డాడు అనిరుద్....

......

కరకింకర ఆలయంలో పారవశ్యంతో నాట్యంచేస్తున్నారు భక్తులు!

అంతలో తన ఆసనంపైనించి లేచి నిలబడ్డాడు భీష్తినాయక్

"హోయియా...హో యియా...హూ!"అనిబిగ్గరగా మంత్రోచ్చారణ మొదలెట్టాడు.

ఠక్కున నాట్యమాపేసి ప్రతిమల్లా నిలబడిపోయారందరూ! నగారానాదం కూడా ఆగిపోయింది.

అక్కడకు చేరిన నూటాయాభై మంది మాంత్రికులకీ భీష్తినాయక్ పిలుపుకర్థమేమిటో తెలుసు!

మరి కొంచెంసేపట్లో కరకింకరన్నిద్రకుపక్రమిస్తాడు!...ఈలోగానే వరాలడగాలి! తొమ్మిదేళ్ళుగా చేస్తున్న ఉపాసనలకు ప్రతిఫలం అడగాలి!

తను చేపట్టిన మహాయాగం నిర్విఘ్నంగా సాగి చివరిదశకు చేరుకుందని గర్వంగా నవ్వుతూ పక్కన కూర్చున్న స్నిగ్ధకేసి చూసాడు భీష్తినాయక్.

కోడాల కోడాల కొడుకు పెళ్ళామ

కానీ...అంతలోనే అతడి మొహంమీద చిరునవ్వుమాయమయ్యింది.

స్నిగ్ధ ఎటో శూన్యంలోకి చూస్తూ కూర్చుని ఉంది!...

"శిఖామణీ!" పిలిచాడు భీష్మినాయక్ ఆమెభుజాలుపట్టుకునిఊపుతూ?

స్నిగ్ధలో ప్రతిస్పందన కనబడక...పళ్లు పటపటలాడించి కోపంతో ఊగిపోయాడతను!...

శత్రువు తన పరిధిలోకి చొచ్చుకుని వచ్చేసాడని, స్నిగ్ధని తన నుండి వేరుచేయడానికి ప్రయత్నిస్తున్నాడని అర్థమయిందతనికి!...ఇక తనే స్వయంగా రంగబయలులోకి వెళ్ళకతప్పదు అనుకుంటూ ఆసనంలో కూర్చుండిపోయి కళ్ళుమూసుకున్నాడు భీష్మినాయక్!

భీష్మినాయక్ పరిస్థితి చూసి భక్తులలో కలకలం బయలుదేరింది... పైగా కరకింకర అరమోడ్పు కళ్ళలోంచి ఆకుపచ్చరంగు కాంతి వెలువడు తోంది!...అంటే క్షణాల్లో కరకింకర నిద్రకుపక్రమిస్తాడు!

మెరుపులా ముందుకు వచ్చి భీష్మినాయక్ ఆసనం పక్కన నిలబ డింది కాత్యాయని!...

"కరకింకర ఉపాసకులారా? మూర్ధాభిషిక్తుడు మన వ్యూహంలోకి చొచ్చుకుని రావాలనుకుంటున్న ఒకరిని రూపుమాపడానికి సూక్ష్మమండ లానికి వెళ్ళాడు!...అయినా మీ కార్యక్రమం ఆపనవసరంలేదు. కరకిం కరను ఒక్కొక్కరంటూ వరాలడగండి! ఈ మూహూర్తం దాటిపోతే ఏమవుతుందో తెలుసు మీకు" అంది బిగ్గరగా!

భక్తులందరూ కరకింకర విగ్రహం చుట్టూ మోకరిల్లి ...స్వార్థపర మయిన...నీచాతినీచమయిన కోరికలు కోరుకోసాగారు! భీష్మినాయక్ ఆదే శాలకు కట్టుబడి ఉంటామని కూడా శపథం తీసుకున్నారు వాళ్ళు!

కరకింకర కళ్లు పూర్తిగా మూసుకునిపోతున్నాయి! అయినా భీష్మి నాయక్ లేవలేదు!

మహామాంత్రికుల్లో అగ్రగతస్సరుడైన భీష్మినాయక్ చిటికెలో ఆ అర్భకుడిని చిత్తుచేసి వస్తాడనుకుంది కాత్యాయని!...కానీ ఎంతకీ అతను లేవకపోయేసరికి కంగారు పుట్టిందామెలో!!

భక్తులందరినీ తోసుకుంటూ వెళ్ళి కరకింకర విగ్రహం ముందు మోకరిల్లింది.

"రసాతలరాజా! ఇన్నేళ్లుగా నీకు చేసిన సేవలకు ఒకే ఒక వరం చాలు నాకు! నా ప్రియనాయకుడినే ధిక్కరిస్తున్న ఆ క్రూరవాడు అనిరుద్‌ని నాశనంచేసే శక్తి ప్రసాదించు ప్రభూ!" అంది

సరిగ్గా అపుడు ఆలయం మూలన పెద్ద శబ్దమయి దుమ్ముపైకి లేచింది! ఫెళఫెళమని శబ్దంచేసుకుంటూ పెద్ద స్తంభం ఒకటి కూలింది!... దానికితోడు ప్రకంపనం లాంటిది ప్రారంభమయి ఆలయంగోడలు బీటలు పడసాగాయి! అంటే?

కరకింకర నిద్రకుపక్రమించాడు!

నూటఇరవై ఒక్క సంవత్సరాలు కొనసాగే నిద్ర అది!

అందుకే...ఆలయం తనంతట తానే మూతబడి పోతోంది!

విషయం అర్థంచేసుకున్న భక్తులు బిలబిలకుంటూ బయటకి పరుగెట్టారు! కాత్యాయని ఆదేశాలతో నలుగురు భక్తులు నిస్తేజంగా పడున్న భీష్మీనాయక్‌ని భుజాలమీద ఎత్తుకుని అక్కడ్నించి కదిలారు!

అంతవరకూ నిశ్చలంగా కూర్చున్న స్నిగ్ధ ఉన్నట్టుండి లేచి కరకింకర విగ్రహంకేసి వెళ్ళింది! సన్నటి గీతలా కరకింకర కళ్ళలోంచి ఆకుపచ్చరంగు కాంతి ఇంకా కనబడుతూనే ఉంది! అంటే? కరకింకర ఇంకా మెలకువగానే ఉన్నాడన్నమాట! తను కూడావరం అడగచ్చునా?

అప్రయత్నంగా ఆమె పెదాలు కదిలాయి...

"కరకింకరా! నా ఆత్మ నీకంకితం చేస్తాను. నీ ప్రతి కోరికా తీరుస్తాను!...కానీ నా అనిరుద్‌ని కాపాడుకునే శక్తి నాకివ్వు" అంది!

అలా ఎందుకడిగిందో ఆమెకేతెలియదు.

అంతలో పెద్దమోతతో దూలం ఒకటికూలి ఆమె పక్కనపడింది. అదిరిపడి అక్కడ్నించి పరుగుతీసింది స్నిగ్ధ!

కానీ...కూలిపోతున్న గోడలు ...పెద్దగా అరుస్తూ పరుగులు తీస్తున్న భక్తులు మధ్యనించి ఎటువెళ్ళాలి?

అంతలో ఆమెకెలాగో గుర్తుకువచ్చింది! చీకటిసందు!

కరకింకర విగ్రహం వెనకనుంచి చీకటిసందులో పరుగుతీసింది స్నిగ్ధ! అందులోంచి వెళితే ఒక తలుపుంటుంది...బయటకు వెళ్ళేందుకు అదే అడ్డదారి!

చీకట్లో తడబడుతున్న అడుగులతో వెళితే మసకమసకగా కన ఐడింది తలుపు! తలుపు తెరవబోయింది స్నిగ్ధ...

కానీ...ఎటునించి వచ్చాయో ఏమో!...

ఈగలు ముసిరినట్టు గబ్బిలాలు చుట్టుముట్టాయి ఆమెను! ఒకటో రెండో కాదు! వందల సంఖ్యలో 'కీచుకీచు' మంటూ గబ్బిలాలు వచ్చేస్తు న్నాయి...దానికితోడు తలుపు ఎంత లాగినా తెరచుకోవడంలేదు. కళ్లు మూసుకుంది స్నిగ్ధ.

ఇక లాభంలేదు. గబ్బిలాలు తన రక్తం పీల్చేస్తాయి.

బిగ్గరగా అరచి కిందకు ఒరిగిందామె.

మొహంమీద వేడిగా ఎండపడుతుంటే కళ్ళు తెరచింది స్నిగ్ధ... కళ్లు చెదరిపోతుంటే చుట్టూ కలయచూసింది.

గబ్బిలాలేవీ?

ఎక్కడుంది తను? బయటకి ఎలా వచ్చింది?

పాడుపడిన భవనానికి వెళ్ళే మెట్లమీద పడుంది తను...భుజానికి కెమెరా ఒకటి వేలాడుతోంది.

వెనక్కి తిరిగి...బంజరు పొలంలోంచి రోడ్డుకేసి చూసింది స్ని

దూరంగా రోడ్డుమీద నిలబెట్టినకారు అక్కడ్నించి చిన్నబొమ్మలా కనబడుతోంది.

అంతలో భుజంమీద ఎవరిదో చెయి పడింది.

పవన్! తన భర్త పవన్.

అలా తన పక్కన పవన్‌ని చూడగానే ఎంతో రిలీఫ్ అనిపించింది ఆమెకు.

"పవన్!...ఈ భవనంలో ఏదో అద్భుతం ఉంది. లోపల ఒక ఆలయం ఉంది. కరకింకర ఆలయం! పవన్ నేను జోక్ చేయడంలేదు. కావాలంటే ఈ కెమెరా క్లిక్‌చేసి చూడు. సరిగ్గా క్లిక్ చేస్తునపుడు వ్యూ ఫైండర్‌లో భవనం మరోలా కనిపిస్తుంది."

గబగబ మాట్లాడుతున్న తన భార్యకేసి దిగ్భ్రమంగా చూసాగ పవన్....

హైదరాబాదులో...

ఇలియాన్ జ్యోత్స్న.

అనిరుద్ పడుకున్న గదిలోకి పాలగ్లాసుతో వెళుతూ

"గుడ్‌మార్నింగ్ అనిరుద్!" అంది డాక్టర్ సుస్మిత...

కానీ మంచంమీద అనిరుద్‌లేడు.

కంగారుగా గదంతా కలయచూసింది సుస్మిత...గది కిటికీ త-

పులు తునాతునకలై నేలమీద పడున్నాయి కిటికీఊచలు ఊడిపోయాయి!

గుండెలయ తప్పినట్టయింది సుస్మితకి! ఏమయింది ఆ గదిలో?

ఉదుట్న కిటికీదగ్గరకెళ్ళి కింద గార్డన్‌లోకి తొంగి చూసింది.

...వొళ్ళంతా రక్తం కారుతూ...పొదల మధ్య పడున్నాడు చిన్నారి

అనిరుద్.

బిగ్గరగా అరుస్తూ...కిందికి పరుగెట్టింది సుస్మిత...ఇంటి వెనక

వైపున్న పొదల మధ్య పడున్న అనిరుద్‌ని చేరుకుని.

"బాబూ అనిరుద్" అంటూ వాడి నుదుటిమీద చెయివేసి చూసింది

చేతికి చల్లగా తగిలింది వొళ్లు.

అప్రయత్నంగా చెయి పట్టుకుని పల్స్ చూసింది.

పల్స్‌లేదు. గుండెమీద చెయిపెట్టి చూస్తే ఆగి ఆగి అస్పష్టంగా

...కొట్టుకుంటోంది.

అంతే...బిగ్గరగా ఏడ్చేసింది సుస్మిత.

పవన్ అప్పచెప్పిన చిన్న బాధ్యత సరిగ్గా నిర్వర్తించలేకపోయింది

తను...

"ఓగాడ్? హి ఈజ్ డైయింగ్. హెల్ప్! హెల్ప్" గొంతు చించుకుని

అరిచింది సుస్మిత పిచ్చిదానిలా.

"అయ్యో... ఏమిటిది. ఏమయిపోతోంది." అనుకుంటూ అని-

రుద్ కనురెప్పలు పైకి జరిపి చూసింది సుస్మిత.

నేరుగా కళ్ళలోకి వెలుతురు పడితే కనుపాప చిన్నదయిపోతుంది

ఎవరికయినా.

అలా చిన్నదికాక డయలేటెడ్‌గానే ఉంటే జీవం లేనట్టే లెక్క.

కళ్ళలో నేరుగా ఎండపడుతున్నా అనిరుద్ కనుపాపలో మార్పు

ు.

అంటే??

ILIYAS JYOTSNA

# KODALA KODALA KODUKU PELLAMA




నవజ్యోతి పబ్లికేషన్స్
ఏలూరు రోడ్ విజయవాడ2